# కళ ఎందుకు?

( సాంఘిక నవల )

రచయిత్రి

శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ




ప్రకాశకులు :

ముప్పాళ్ళ సీతారామస్వామి పబ్లికేషన్స్

ఎన్. ఎ. డి. (P. O.) విశాఖపట్నం - 9

ప్రథమ ముద్రణ
డిసెంబరు—1967.

కళ ఎందుకు?
ప్రచురణ నెం—12

ముఖచిత్రం:
శ్రీ బాపు

వెల:
రూ. 6-00

రచనాకాలం — 1967

(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికనుంచి పునర్ముద్రితం)
సంపాదకులకు మా కృతజ్ఞతలు

ముద్రణ
ది గుంటూరుజిల్లా కో-ఆపరేటివ్ ప్రింటింగ్ వర్క్సు లిమిటెడ్., తెనాలి—2

సమర్పితం

స్నేహ హృదయనీ
మధుర గాయనీ

పద్మశ్రీ
శ్రీమతి భానుమతీ
ప్రియ సోదరీ !

ఈ చిన్ని బహూకృతి
స్వీకరించు
ధన్యురాలిని !

— రంగనాయకమ్మ

# ఆముఖం

జీవితం అనాదీ అనంతం.

సాహిత్యం కూడా అంతే.

ఎప్పుడు ఎలా ఆరంభమైనదో ఖచ్చితంగా తెలియదు.

ఏవో ఊహాపోహలు చేసేవారు చేస్తూనే ఉంటారు.

కొందరు కమ్మని కథల్లితే కొందరు గుండెలు జల్లు మనిపించే వాస్తవాంశాలను వెలికి తీస్తుంటారు.

ఆదికావ్యం రామాయణమే అనుకుంటే అందుకేదో ఆదీ అదీ ఉంటుంది.

కాని హఠాత్తుగా అలా ఓ గుండె జలదరింపు ఆ కావ్యానికి శ్రీకారంచుట్టినదేమోకాని, సర్వం అప్పుడే మొదలైన దనగలమా?

అంతకు ముందేనాడో కవిత్వ మున్నది, కళ లున్నవి.

మనిషి కూడా అలాగే ఏదో ఒకనాడు ఆవిర్భవించాడన్నా నమ్మ లేము.

అతనెన్నెన్ని అవతారా లెత్తాడో ఏమో!

కాని మనిషితోపాటు కవిత్వం, సంగీతం, చిత్రకళా అన్నీ వెను వెంటనే కావచ్చు, కాస్త ముందూ వెనుకా కావచ్చు – అవతరించాయనే

చెప్పుకోవాలి.

ఎక్కడో ఏ త్రవ్వకాలలోనో ఎప్పటెప్పటి కళాఖండాలో వెలు వడుతున్నవి.

ఏ మూల ఏ గుహలోనో ఏ అపూర్వచిత్రమో దర్శన మిస్తున్నది.

అలాగే అనుక్రమంగా, అనాదిగా అనేకం పాటలూ పదాలూ వస్తూనే ఉన్నవి.

ఏ భాషలో నయితేనేం, ఏ ఖండంలో, ఏ భాగంలోనయితేనేం మానవుడు కళాజీవిగానే ఆవిర్భవించాడు.

కళాశీలిగానే బ్రతుకు గడుపు తున్నాడు.

కళావికసనంతోనే అతని నాగరికతా, సంస్కారం పెనవేసుకొని వి స్తరిల్లుతున్నవి.

అతని హృదయం కళలను పెంచుతున్నది. కళలు వాని మనసును సునిశితం చేస్తున్నవి.

తన భావోల్బణాన్ని ఆతను కళలలో దాచుతుంటున్నాడు. తన ఊహాపోహలను వానిలో నిక్షిప్తం చేసుకుంటున్నాడు.

ప్రకృతి మానసపుత్రు డాతను. కావుననే ప్రకృతిని తన ప్రవృత్తిలో ప్రతిబింబింప జేసుకున్నాడు.

ప్రకృతిలోని రంగుల కతని మనసు ప్రఫుల్లమై మరికొన్ని రంగులతో చెంగావులు పొయించుకున్నది.

కోయిల కూతలు, తుమ్మెదల ఝంకారాలు, కపోతాల కలకూజితాలు, మృగరాజ గర్జనలు ఒకటేమిటి వింటున్న ప్రతిసవ్వడిలోనూ వానికెన్నెన్ని సంగీతాలు వినవచ్చినవో !

ఆ సహజసంగీత సాగరానికొక చెలియలికట్ట నిర్మించుకొని తన పుడిసెడు నీటిని తాను తీసుకొని అందులోనే అనేక రాగప్రస్తారాలను

మేళవించుకున్నాడు, వింగడించుకున్నాడు.

ప్రకృతిలోని రంగులు, రూపురేఖలు, కలరవాలు, అతనిలో కలరవం కల్పించినా, కమ్మదనం ఊరించినా తదుద్బుద్ధ భావనా బలతను కళలలో కూరుకున్నాడు.

కావుననే కళలు కేవలం ప్రకృతికి అనుకరణాలు కావు, ప్రతిధ్వనులు కావు, ప్రతి బింబాలు కావు,

ఒక విధంగా ప్రకృతినీ, మనిషినీ సమన్వయపరచుకొని, వానిలో సముజ్జీవనంపొంది, వానికొక కొత్తరంగునూ, రుచినీ, వాసననూ కల్పించి కళ లొక నూతన ప్రపంచాన్ని ఆవిష్కరించినవి.

సహజంగా ప్రకృతి పురుషుల సంఘర్షణ, సమన్వయం, సమాహార్యం కళలలో కానవస్తుంది.

కావుననే అవి మనిషి మనసుకు ఉద్దీప్తిని కల్పిస్తాయి. ఒకవిధమైన ఊపునూ, ఊగునూ చేకూరుస్తాయి,

మరి ఆ మానవుడు కేవలం కళలకోసమే కళలను సృష్టించుకొనలేదన్నది తేటతెల్లమే కదా ?

ఒక విధంగా తనకూ ప్రకృతికీ నడుమ సేతువులుగా ఒకప్పుడు, తనకూ తన తోడివారికీ మధ్య వంతెనలుగా మరొకప్పుడు, తనకూ తన మనసుకూ ఒకలంకెగా ఇంకొకప్పుడు కళల నాతడు వెలార్చుకున్నాడు.

కళ ఎందుకు ?

జీవితానికే. ముమ్మాటికీ జీవితానికే.

కళ కళకోసం ఎలాగూకాదు. ఔనని కొందరొకప్పు డేవో సిద్ధాంతాభాసాలను కల్పింపజూచినా అవి నిలువలేదు.

అయితే ప్రయోజనమన్నది ప్రత్యక్షంగా అప్పటికప్పుడు కానవచ్చేది కాకపోవచ్చు.

ఒకవిధమైన ఆర్ద్రతను, ఒకవిధమైన మాలిమిని, ఒకవిధమైన రక్తిని మనసులో ఉద్బుద్ధం చేయగల కళలు ఆవిధంగా పరోక్షంగా ఒక ఉదాత్తసంస్కార సముత్పత్తికి మూలకందా లవుతున్నవి.

అవెంతగా ఆపని నిర్వర్తించగలిగితే అంతగా వానికి సార్థక్యం.

అపూర్వ సౌందర్య రంజితమైన సూర్యోదయాన్ని చిత్రించిన చిత్రమైనా, ఆ ఉదయం తనలో పులకింపజేసిన భావలవాన్ని చెప్పే కవిత్వమైనా, అంతకంటె వివరంగా అందులో కొన్ని మనసులలో, వారి బ్రదుకులలో, వాని మలుపులలో కలిగించిన 'వేదురులనో' ఆనందాలనో విప్పిచెప్పేకథలు, నవలలు అయినా అప్పటికప్పుడు ప్రత్యక్షంగా మనకేదో ప్రయోజనం చేకూర్చిపెట్టని మాట నిజమే.

కాని మీ మనసు నవి పరిపక్వం చేస్తాయి. మీలో ఒక ఆర్ద్రతను పరిప్లావితం చేస్తాయి. మీలోని అనుభూతుల కొక రూపమిస్తాయి. వానికి పునర్జీవన మందిస్తాయి.

అలా మిమ్మ కొంత పెరిగేలా చేస్తాయి.

ఆ కళలలో విభిన్నత లున్నవి. వాని ప్రక్రియాలలో విభేదము లున్నవి. వాని వ్యక్తీకరణంలో తేడాలున్నవి. అవి మీలో రేపే అనుభవ శకలాలలోనూ ఆ విభిన్నతా లేశం ఆవంత కన్పించినా అబ్బురం కాదు.

కానీ అంతర్యంలో అవన్నీ ఒకటే.

లయప్రధానమై వెల్లివిరిసిన నృత్యం, నాట్యం వేరు.

భావప్రధానమై అల్లుకొనిపోయే సంగీతం వేరు.

భావ లయసంబద్ధమై విరియబారుతున్న కవిత వేరు.

అంతకంటె కొంత వస్తు ప్రధానమై విడిగి విప్పారే గద్యరచనలు వేరు.

ఆ విభేదం ప్రక్రియలకు సంబంధించినది.

అనుభూతి ప్రకంపన ప్రాబల్యంలో వాని వైవిధ్యం ఆయా వ్యక్తు లనుబట్టి కాస్త భేదించినా భేదించవచ్చును.

కాని మొత్తంమీద అన్నీ జీవితంలో పుట్టినవే. జీవితానికి చేదోడు వాదోడు కల్పించేవే.

కళ ఎందుకనే ప్రశ్నకు కవి ఇచ్చే జవాబు ద్విపదలో సరిపెట్టు కొనవచ్చును. కథలో ఆ జవాబు కొన్ని పుటలకు పరిమితం కావచ్చును. నృత్యగేయాదులలో ఆ జవాబు పరోక్షంగా పది పలుకులలో పలికించ వచ్చును. నవలలో అది సహజంగా కొంత కండపట్టించుకొని, మరింత చేవా జీవం చిక్కించుకొని ఆ సమాధానం సముద్బుద్ధం కావాలి.

కళకొక ఉదాత్తస్ఫూర్తినిచ్చే లక్ష్యశుద్ధిని చేకూర్చి ఒక కొన్ని జీవితాల మలుపులను అవలంబించేసుకొని ఈ "కళ ఎందుకు ?" అన్న నవల తన ప్రశ్నకు తాను సమాధానం చెప్తున్నది.

జీవితం బహుముఖమైనది. వైవిధ్య సంభరితమైనది. దానికొక సమగ్రత, సమన్వితరీతి, సముదాత్తస్థితి చేకూరినప్పుడే ఆనందస్ఫూర్తి.

అందుకై కళలో అవో తోడ్పడునవే గాని వానికవే సమారాధ్యాలు కావు.

ఈ సంగతిని బహు సున్నితంగా సునిశితంగా చిత్రించిన దీ నవల,

ఆ సంగతినేదో ఉపన్యాస పరంపరగా, అందుకే అల్లినజల్లు కథగా కాక అందులో అనుస్యూతమై భాసమానమయ్యేరీతిగా మలచుకొనడంలో రచయిత్రి విజయం సాధించింది.

మోహినిపాత్ర ఇందులో సమగ్రసుందర జీవిక కొక ప్రతీక. పద్మిని అందలి సమన్వయసాధనలో ఓడిపోయినకృషికి ప్రతిబింబం.

మోహినిముందు గోపాల్ మొదలైన వారి పాత్రలు నిస్తేజము లైనవి. అందుకు రచయిత్రికున్న మోహిని మీద పక్షపాతంకాక, ఒక

పాత్రను నిండుగా చిత్రించవలెనన్న ఆస్థ కారణం అనుకుంటాను.

ఇందులో సంగీతం, నృత్యం, చిత్రలేఖనం ప్రధానపాత్ర వహించినవి, వానికి కొన్ని ఆలంబనా లెలాగూ కావలె గనుక మిగతవి వానిలో చేరుకొన్నవి.

మరి వీని గూర్చిన రచయిత్రి భావాలూ అవీ సహజంగా అక్కడక్కడా ప్రకటిస్తాలైనవి.

వాటిలో కొన్నిటితో నేను ఏకీభవింపవచ్చును. కొన్నిటితో ఏకీభవింపలేక పోవచ్చును.

మాట వరుసకు సంగీతంలో కర్ణాట బాణీనిగూర్చి నవలా కర్త్రికి కొంత సరిఅయిన భావమే ఉన్నది. కాని అదొక సర్వసమగ్ర సుందర సముదగ్ర ప్రక్రియ. దాని నర్థంచేసుకొని, అవగతంచేసుకొని, అందులో లీనమై అంతర సమన్వయసాధనం చేసుకునేందుకు కొంత సంస్కారం అవసరం.

అదంతా అర్థంచేసుకున్నా ఎందుకో కాస్త బెరుకు బెరుకుగానే సమర్థనం చేసుకున్నట్టు కనబడుతుంది.

రాగం పల్లవి తానం ఒకానొక సంగీత ప్రస్తారమేకాదు, అదో భావ ప్రస్తారం.

రాగం త్వరలోనే ముగించి పాట ఎత్తుకొన్నదని, నిజమే కొంత శాస్త్రానికి ప్రాధాన్యం హెచ్చించక లాలిత్యానికి ఇస్తే మంచిదేననీ ఇలాంటి ఛాయామాత్ర జ్ఞాపికలద్వారా కొంత లలితసంగీతమేదో త్వరగా మనసును రంజింపజేస్తున్నదన్న అజ్ఞాత భావలవమేదో రచయిత్రి మానసాంతరంలో ఉన్నదనుకొంటాను.

అది సరికాదని నాభావం, అందుకు తగిన సంస్కారం చేకూర్చుకుంటే అంత ఆనందపాథోధిలో మిమ్ము ఓలలాడించగల మరొక

ప్రక్రియ కానరాదు.

అంత 'అపాలజటిక్' గా మన కర్ణాట సంగీతాన్ని మనం సమర్థించుకో జూడ నవసరంలేదు.

అదొక కళావారాశి. అందులో మునిగి తేలగల ధైర్యాన్ని, అలవాటును సమకూర్చుకోవడం మనవంతు.

మరి చిత్రకళ అనుకరణప్రాయం ఎంతమాత్రం కాదన్న మాటతో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను.

ఆ కళనుగూర్చిన ఇందలి సంవాదా లెంతో ఉదాత్తంగా ఉన్నవనుకుంటున్నాను.

జీవిత సమగ్రతకు కళ లెంత అవసరమో, అలాగే కళలసార్థకతకు సంతృప్తజీవనం అవసరం. అలాగా ?

అప్రయత్నంగా నాలోలోపల ఈ ప్రశ్న ప్రబుద్ధ మవుతున్నది.

కాని కళకుగా జీవితం భగ్నం చేసుకోనక్కరలేదంటే నా కాక్షేపణలేదు. కాని ఒకప్పుడు జీవితం సంతృప్తం సమగ్రం కాకపోవచ్చు.

అయినా ఆ జీవి కళలలో ఒక అపూర్వ సుందర సుమనోహర మానసిక సంతృప్తిని కల్పించుకొన వచ్చునేమో ?

ఔనని, కాదని కావలసినంత చర్చ ఇందులో అనుస్యూతమై ఉన్నది. ఔనన్నవేపే త్రాసు మొగ్గుతున్నది.

మరి ఈ అంతరసిద్ధాంత విచికిత్స అలాఉంచి, అవెన్ని ఉన్నా అంతతోనే మంచి నవల అవుతుందా అని ఎవరో అడిగే అవకాశం ఉంది.

ఇదంతా కేవలం అందలి జీవనాడి పరిశీలనం మాత్రమే.

అదలా ఉంచి ఇందలి జీవిత వివరణం గమనిస్తే బహు చక్కని పరిశీలనం మనస్తత్వ విచికిత్సా, సూక్ష్మజీవనగతి పర్యవేక్షణం ఇందులో తలమునకలుగా ఉన్నవి.

కథ కట్టడంలో నిండుదనమున్నది. కథ చెప్పడంలో నాజూకు తనం ఉన్నది. భావాల నలా సులువుగా సునాయాసంగా వెదజల్లుతూ వాటికై కథ విస్తరిస్తున్నదన్న భావం రానీకుండా చెప్పుకొనిపోగల రీతి వైశిష్ట్యం ఉన్నది.

ఈ కథాకథనం ఏ గాలికబుర్లుగానో కాక, ఒక లక్ష్యవివేచనకు, వివరణకు వినియోగించడంతో పూవునకు తావి అబ్బినట్లైనది.

అటు భావపరిమళం, ఇటు వస్తుసత్త్వం రెండూ సమపాళ్ళలో కలగలిసి ఒక విచిత్రస్ఫూర్తిని మనలో ప్రబుద్ధం చేస్తున్నవి.

ఇదొక చక్కటి నవల. కమ్మని నవల. మంచి నవల.

ఇదీ చదవగానే నాకు అనిపించిన భావం.

శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ నన్నీ నవల ఆముఖంగా నాల్గుమాటలు వ్రాయమని కోరినప్పుడు ఏనాటి అనుభవమో మనసున మెదలినది.

పన్నెండేళ్ళో పదుమూడేళ్ళో సరిగా జ్ఞాపకంలేదు. "పల్లెటూరు" అన్న ఓచిన్న నవలిక ప్రచురణార్థం ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికకు వచ్చినది.

దానిని చదువుతుండగా అందలి నిరాడంబరతా, పరిసర పరిశీలనా పాటవం, సహజంగా నన్ను ముగ్ధుని చేసినవి. ఇదో ఒక మంచి నవలా రచయిత్రి గరిడీలో ఇప్పుడిప్పుడే దిగినది. త్వరలో తెనుగులు కొక కొత్త రచయిత్రి దొరకనున్నది — ఇలాంటి భావాలేవేవో తలసూపినవి.

అప్పుడీమెగారిపేరు మరొక ఇంటిపేర బరగుతున్నట్లు గుర్తు.

మరి సహజంగా ఆ తర్వాత కరపరంపరగా నవలలు వ్రాస్తూ పేరుతెచ్చుకొన్న ఈ రచయిత్రి రచనా ప్రాగల్భ్యాన్ని అలా ఒక కంట కనిపెడుతూనే వస్తున్నాను.

ఒక రచన చదివితే ఉస్సురుమని నిట్టూర్చి అలాపడవేసి మరో పని చూచుకో బుద్ధిపుడితే అవి మంచిదికాదన్న మాట.

ఒక రచన చదివి ముగించినా నిన్నది వేటాడాలి. నీ మనసు నది పూర్తిగా అలముకోవాలి. నిన్నలా నిశ్చలంగా కూర్చుండనివ్వకుండా నములుకొని తినాలి.

అలాంటి ప్రపంచ సాహిత్యంలోని మహారచన లెన్నో ఉన్నవి. నవల లెన్నో ఉన్నవి.

ఉన్న ప్రక్రియలలో నవలదే నేడు పైచేయిగా కానవస్తున్నది.

అదొక ప్రపంచం. అందులో ఎన్ని మెలికలైనా తిరుగవచ్చును. ఎందరు పాత్రలనైనా ప్రవేశపెట్టవచ్చును. ఎన్ని సంఘటనలనైనా మేళవించవచ్చును. ఎన్ని వ్యాఖ్యలనైనా చేయవచ్చును.

కాని అలాంటి సర్వసమగ్ర నవలా స్వరూపం తెనుగులో ఇంకా రూపు కట్టుకొన లేదేమో ?

కాని అందుకు తగిన మహాకృషి ఏదో జరుగుతున్నది. ఆ కృషి సఫలీకృత మవుతున్న సూచనలు కానవస్తున్నవి.

అలాంటి విశాలవిస్తృత ప్రాతిపదికపై ఒక సువిశాల సమాజ ఖండాన్ని, ఒక సురుచిర ప్రవృత్తుల విన్యాసాన్ని విసురుగా చూపగల విశిష్ట యత్నం సోదరి రంగనాయకమ్మ కలంలోనుంచి వెలువడగలదన్న ఆశ నాకు ప్రగాఢంగా ఉన్నది.

ఆ ఆశకు ఊపిరిపోస్తూన్నది ఈ నవల "కళ ఎందుకు ?"

ఇప్పటికే పేరందుకున్న ఈ రచయిత్రి ఇన్ని నవలల తర్వాతి నవలకు పరిచయవాక్యా లవసరం లేదు.

కాని ఆమెకు నామాటల మీదున్న అర్ద్రభావమేదో ఇలా వ్రాయమనడానికి కారణమై ఉంటుంది.

అదే నన్నీమాటలు పలికించింది. అనవరత కార్య ప్రవణతలో ఇంత తీరిక చేసుకొనే వీలు కల్పించినదీ అదే.

తెనుగు మనుగడలోని ముగ్ధ మనోహరతను వెలార్చే మహా కావ్యంగా మరోనవలను త్వరలో సోదరి రచించి నా మాటలను సార్థక పరచగలదన్నదే నా ఆశా, ఆశంసా.

105 డాక్టర్ బెసెంట్ రోడ్డు
మదరాసు _ 5

—విశ్వం
27_10_67

# కళ ఎందుకు?

థియేటర్ ప్రేక్షకులతో క్రిక్కిరిసి కోలాహలంగావుంది. బంగారు రంగుజలతారు అంచు తెర రంగస్థలానికి నిండుగా కప్పబడివుంది. మృదంగం - వయోలిను - వీణా - మొదలయిన వాద్యాల శృతులు తెరలోంచి ప్రేక్షకుల్ని పూరిస్తున్నాయి. భరతనాట్య ప్రదర్శనకోసం ప్రేక్షకులంతా కాంక్షాహృదయాలతో నిరీక్షిస్తూ కూర్చుని వున్నారు.

ఒక్కసారి మృదంగం తకిటిట తదికిట శబ్దాలతో ప్రేక్షకుల్ని హుషారు చేసింది. వయొలిన్ సుతారంగా రాగాలాపన అందుకొంది. వీణ మధురంగా ఝుంకారం సాగించింది. తాళాలు ఘల్ ఘల్ మంటూ కదలాడుతోంటే... తెర రెండుగా చీలి పక్కలకు తప్పుకొంది.

రంగస్థలానికి వెనుక ఎత్తుగా తాండవనాట్యం చేస్తోన్న నటరాజ విగ్రహం అమర్చబడివుంది. నటరాజు పాదాల చెంత ఇద్దరు నర్తకీమణులు-ముగ్ధ మనోహర లావణ్యవతులు-అంజలి పట్టి నిలబడి వున్నారు.

తెల్లని పరికిణీలు! తెల తెల్లని పావడాలు! జరీ అంచుల ఎరుపు వందనాలు! మొలలకు దిగువగా జారవిడచిన పేవన

కుచ్చిళ్ళు! పిరుదుల క్రిందికి వ్రేలాడుతోన్న వాలు జడలు! వాటి చివర నల్లని పట్టుబంతులు! శరీరాల నిండా ఆభరణాలు! ఆకర్షణీయమైన అంగసౌష్ఠవాలతో – అలంకారాలతో – మనోహరమైన రూపలావణ్యాలతో – చిరునవ్వులతో – సౌందర్యారాసులై గోచరించారా నాట్యకత్తెలు.

క్షీరసాగరంలోని లక్ష్మీదేవిలా మెరిసిపోతోంది పద్మిని. దర్పణంలోని ప్రతిరూపంగా ప్రకాశిస్తోంది మోహిని. గురువు రామశాస్త్రి నృత్యవేదికకు కుడివైపున నిలబడి చేతుల్లో తాళాలు మోయిస్తూ పాడటం ప్రారంభించాడు.

"తా తై తై తా
లా తై తై తా
తతైయ్యతక! తకదిక్ తక!
తరికిట తక! థళంగ్ తక!

శిలా ప్రతిమలలో జీవం వచ్చినట్టు నాట్యకత్తెలలో చైతన్యం కలిగింది. సమభంగిమలో వుండి – తామర తూళ్ళ వంటి హస్తాలు ముందుకు చాచి పతాక ముద్రలు చూపుతూ అలరింపు నాట్యం ప్రారంభించారు.

శిరస్సులపైన హస్తాలు జోడించారు–దైవానికి, ముఖ పద్మాలకు ముందుగా ముకుళించారు–గురువుగారికి, హృదయాలకు ఎదురుగా నమస్కరించారు – సభాసదులకు. అటుపైన గురువుగారి పాటకూ రాగతాళలయలకూ సరిపడే విధంగా, శిరస్సు, కంఠాలు, కన్నులూ – కదిలిస్తూ–పద్మాలవంటి పాదాలతో శబ్దాలు పలికిస్తూ తన్మయత్వంతో అభినయించసాగారు. దైవాలంకరణా రంగపూజా అభినయించి అలరింపు ఆడి ముగించే

సరికి ఓంకార నాదంతో ప్రతిధ్వనించిన ఆ సంగీతానికి సభా సదుల అంతరంగాలు భక్తిభావాలతో పునీత మయ్యాయి. ప్రేక్షకుల చిరునవ్వులు చంద్రకిరణాలై సోకగా నర్తకీనుల ముఖాలు కలువలై వికసించాయి. గురువు తాళాలు కదిలిస్తూ శ్రావ్యమైన స్వరంతో—జతిస్వరం పాడడం ప్రారంభించగానే నాట్యకత్తెలు ఉత్సాహంతో నాట్యం సాగించారు. జతిస్వరా లను పాదాలతో స్పష్టంగా పలికిస్తూన్న కౌశల్యానికీ - సంగీత మాధుర్యానికీ ప్రేక్షకులు సమ్మోహితులై ఝల్లు ఝల్లు మనే హృదయాలతో చూడసాగారు.

తదుపరి శబ్దనృత్యం సాగింది.

" బాలగోపాల పాలయమాం,

భక్తవత్సల కృపాజలధేవాం..."

అంటూ భైరవిరాగంతో కీర్తన ఎత్తుకున్నాడు గురువు. సము యోచిత హస్తముద్రలతో అంగవిన్యాసంతో - కీర్తనలోని పదాలకు - వివిధార్థాలు గోచరించే విధంగా అభినయం జరిగింది. బాలగోపాలుణ్ణి - చిన్నారి కృష్ణుణ్ణి అనేక రూపా లలో దర్శించి ముగ్ధులయ్యారు ప్రేక్షకులు.

విరామంకోసం తెరపడింది.

వయొలిన్ సున్నితంగా మోహనరాగాలాపన సాగి స్తొంటే ప్రేక్షకులు రసహృదయాలతో ఉత్తేజితులై వింటూ కూర్చున్నారు తెరలేచే వరకూ.

మృదంగపు దరువులూ - వీణ ఝంకారాలూ - గజ్జెల ఘల్లుఘల్లుల మధ్య తాళాలు మ్రోయిస్తూ గురువు శంకరా భరణరాగంతో—

"వనజాక్షిరో ! వాని సరసకు రమ్మనె..."

అంటూ పదవర్ణం ఎత్తుకున్నాడు. పద్మిని ఒక్కర్తే వేదికమీద నిలబడి నృత్యాభినయం సాగించింది.

"ఈ మారుని పెత నే సయింపతరమ ?
దురుసుగ అరవిరిశరములు గురియగ నా తరమ ?
ఈ మలయ మారుతము...
చిలుకల కలకల..."

—అనుకున్న సమయానికి సంకేత స్థలానికి ప్రియుడు రానందున విరహతాపానికి ఓర్వలేని ప్రౌఢ విరహోత్కంఠితయై చింతిస్తోంది.

ప్రియుడు సరసన లేని అదను చూచుకొని కొంటె విలుకాడు ప్రేయసి మీదికి వాడివాడి పూలబాణాలు గుప్పిస్తున్నాడు. చల్లని పిల్లగాలులు మెల్లమెల్లగా వీస్తున్నాయి. వాటికితోడై చిలుకల జంటలు కలకలారావాలతో మతి పోగొడుతున్నాయి. మనోహరమైన ప్రకృతిచేత అతిగా బాధింపబడుతోన్న ఆ నాయిక—

"ఏలనే ఇటుల చలమునాపై
తెలుపమనవె !
ఏమి నేరముననే చేసినాననుచు
ఇంతపంతము సాధించినట్లాయె !"

అంటూ దీనంగా చెలికత్తెకు చెప్పుకుంటోంది. వెనకపాట పాడుతోన్న గురువే చెలికత్తెగా తోడ్పడుతున్నాడు. తన బాధ నంతా వెల్లడించి పంతంపట్టిన ప్రియుణ్ని వెంటబెట్టుకు రమ్మని నాయిక జాలిగా వేడుకుంటోంది.

"ఇంక నాపై దయవచ్చి నన్నేలితే
పచ్చవిల్కాడెట్లు వచ్చునే ? చెలియ !"

అంటూ కొండంత ఆశాభావం వెల్లడిస్తోంది.

నాయికతోపాటు ప్రేక్షకులుకూడా - వాడిగా తగులుతున్న పూలబాణాల్ని, చల్లచల్లగా సోకుతోన్న మలయమారుతాన్ని కర్ణమధురంగా వినవస్తున్న చిలుకల పలుకుల్ని అనుభవిస్తూ చిత్రమైన మన్మథ తాపానికి లోనయ్యారు. నాయిక మనస్సులో రేకెత్తుతోన్న విరహాన్ని - ప్రియుడిపట్ల గల అనురాగాన్ని హస్త ముద్రలతో ఆంగికాభినయంతో విరహోత్కంఠితను సాంగోపాంగంగా పోషించి ప్రేక్షకుల్ని తన్మయుల్ని చేసింది పద్మిని.

ఆమె విరహావ్యథచూసి కలవరపడ్డ ప్రేక్షకులు — చివరికామె ఆశాభావాన్ని గ్రహించి కుదుట పడ్డారు. ఉత్సాహంతో పురకలు వేస్తున్న ప్రేక్షకులమధ్య కూర్చుని నర్తకి పద్మినిని తదేకంగా చూస్తున్నాడు ఒక యువకుడు - గోపాల్. అతని మొహంలో కించిత్తు అసంతృప్తి చిందులాడింది. అందరిలా తానుకూడా వుత్సాహం తెచ్చుకుని నాట్యవేదిక మీదికి దృష్టిసారించాడు.

పద్మిని కృష్ణుడుగానూ, మోహిని గోపికగానూ రంగస్థలం మీదికి వచ్చారు. ఆనందభైరవి రాగంలో గురువు పాడటం ప్రారంభించాడు.

"మధురా నగరిలో చల్లనమ్మబోదు
దారివిడువుము కృష్ణా ! కృష్ణా !"

గోపస్త్రీ మధురానగరికి చల్లకడవ తీసుకుపోతుంది.

కొంటె కృష్ణుడు గోపికకు దారిలో అడ్డు నిలిచాడు. పాపం గోపిక దారి యిమ్మని బ్రతిమిలాడుతోంది. పెంకి కృష్ణుడు వినలేదు సరిగదా కొంగు పట్టుకున్నాడు. కృష్ణుడిపంతం గోపికకు తెలియనిది కాదు. ఏదో వాగ్దానం చేస్తేగాని వదలి పెట్టడు. అందుకని—

"మాపటి వేళకు తప్పక వచ్చెద
పట్టకు కొంగు గట్టిగాను కృష్ణా!"

అంటూ కోపంనటిస్తూ కొంగులాక్కుంది. చిలిపికృష్ణుడు సరాగాలకు దిగాడు. కొంగు వదలి గోపిక చేతినే పట్టుకున్నాడు.

గోపిక సిగ్గుతో చితికిపోయింది. కోపంతో ఉడికి పోయింది. ఎవరైనా చూస్తారన్న భయంతో సతమతమై పోయింది. అన్ని భావాలూ మేళవించి—

"కొసరి కొసరి నాతో సరసములాడకు
రాజమార్గమిది కృష్ణా!
వ్రజ వనితలు నను చేరవత్తురిక
విడువిడు నాచేయి కృష్ణా!"

అంటూ బ్రతిమిలాడుకుంటూనే కోపంగా చెయ్యి విదిలించు కొంది.

"మధురానగరిలో
చల్లనమ్మబోదు..."

అంటూ హొయలు ఒలకబోస్తూ వెళ్ళిపోయింది.

గోపికా కృష్ణుల ప్రణయ కలహాన్ని చూసి ధన్యులైన ప్రేక్షకులు ఒకరి మొహాలు ఒకరు చూసుకొని చిరునవ్వులు

నవ్వుతున్నారు. గోపాల్ మొహంలో రేకెత్తిన అసంతృప్తి మరికొంత స్ఫుటంగా ముద్రపడింది.

తర్వాత మోహిని ప్రత్యేకాభినయంగా కస్తూరి తిలకం శ్లోకాన్ని చేసింది. గురువు కంఠస్వరం సుశ్రావ్యమై గంభీరమై నృత్యమందిరమంతా మార్మోగింది.

"కస్తూరీ తిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుంకరే కంకణం
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠేచ ముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః"

నర్తకి ఎట్టెదుట సాక్షాత్తూ శ్రీకృష్ణభగవానుడే నిల్చివున్నట్టుగా తోచింది ప్రేక్షకులకు. ప్రకాశవంతమైన ఫాల భాగాన కస్తూరి తిలకం ధరించి-వక్షస్థలంమీద కౌస్తుభ మణితో-నాసిక చివర సరికొత్తముత్యంతో-అరచేతిలో వేణువు పట్టి-చేతులకు కంకణాలు ధరించి-శరీరమంతా మంచి గంధం పూతలతో-కంఠంలో ముత్యాలమాల అలంకరించుకుని-గోపికా స్త్రీల మధ్య విరాజిల్లుతోన్న శ్రీకృష్ణభగవానుడు ప్రేక్షకు లందరికీ సాక్షాత్కరించాడు. భక్తిపారవశ్యంతో అందరూ సుదీర్ఘంగా నిట్టూర్చారు.

చిట్టచివర నర్తకీమణులు యిద్దరూ కలిసి 'తిల్లాన' అభినయించారు.

......దీంతో నారె నాదిర ది ర నా
తత్తైత-తది గిణం తోం
తది గిణం తోం
తది గిణం తోం

మృదంగం ముక్తాయింపు పల్కింది. వేదిక మీదికి తెర నిండుగా కప్పబడింది. కరతాళ ధ్వనులతో థియేటరు మార్మోగిపోయింది. మృదుమధుర స్వప్నం నుంచి మేల్కొన్నట్టు లేచారు ప్రేక్షకులు.

అలంకరణ గది సందడిగా వుంది. రంగస్థలంమీంచి వాయిద్యాలన్నీ గది మధ్యకు చేరాయి. పద్మినీ మోహినీ అలంకారాలు విప్పదీస్తూ అద్దంముందు కూచుని వున్నారు.

గురువు రామశాస్త్రి లోపలికి వచ్చాడు. ఆయన మొహం ప్రశాంతంగా వుంది—"చక్కగా చేశారు మీరిద్దరూ. మోహిని ఆఖరి శ్లోకం అద్భుతంగా చేసింది" అన్నాడు సంతృప్తి ప్రకటిస్తూ.

"అంతా మీ అభిమానమే మాస్టారూ!" అంది పద్మిని వినయంగా.

మోహిని మాత్రం అసంతృప్తి వెల్లడించింది— "ఏళ్ళతరబడి కొత్తవాళ్ళలాగా చిన్నచిన్న ఐటమ్స్ చేస్తున్నాం. ఇంకా పెద్దవాళ్ళమై అందరిలోనూ బాగా పేరు తెచ్చుకునేది ఎప్పుడు మాస్టారూ?"

"బావుందమ్మా! ఇదేం కంగారుపడి నేర్చేసుకునే విద్య అనుకున్నావా? ఒక్కో మెట్టూ ఎక్కి పైకి వెళ్ళాలిగానీ ఒక్కసారే మేడమీదికి ఎగరటం సాధ్యం అవుతుందా? సహనం వుండాలి." మాస్టారి మందలింపుతో మోహిని తల దించుకుని నించుంది.

"నువ్వు చెప్పమ్మా పద్మినీ! ఇవ్వాళ ప్రోగ్రాం ఎంత రక్తికట్టిందో గ్రహించలేదా? ప్రేక్షకులంతా ఎంతో రస

హృదయాలతో చూసి సంతోషించారు. మీ ఇద్దర్నీ ఎంతో మెచ్చుకున్నట్టు కన్పించారు." అంటూ రామశాస్త్రి పెద్ద శిష్యురాల్ని సంజాయిషీ అడిగాడు

"అబ్బే! మీరేమీ అనుకోకండి మాస్టారూ! అదంతా మోహినికి కూడా తెలుసు. తొందర తొందరగా నాట్యం అంతా నేర్చుకోవాలనే కోరిక తప్పితే మరేం లేదు."

"అవునమ్మా! మీ ఇద్దరూ పేరు ప్రఖ్యాతులు ఆర్జిస్తే ఆ గొప్ప నాదికాదా? నా శక్తికొద్దీ మీకు నేర్పుతున్నాను. మోహిని అంత చిన్నబుచ్చుకోవటం బావుండా చెప్పు?"

మోహినికి మాస్టార్ని చూస్తోంటే చాలా జాలేసింది— "అది కాదు మాస్టారూ! ఈమధ్య నాలుగైదు ప్రోగ్రామ్స్ నుంచీ ఒకే ఐటమ్స్ చేస్తున్నాం. అందుకని నేనలాఅన్నాను. నాకేం కోపం రాలేదండి!" అంటూ చిరునవ్వు నవ్వింది.

శిష్యురాలు కోపం పోగొట్టుకుని మాట్లాడటంతోనే రామశాస్త్రి మనస్సు తేలికపడింది. శిష్యులందరిలోకి మోహిని అంటే ఆయనకి ప్రత్యేకమైన అభిమానం! కారణం ఆ శిష్యురాలి తెలివితేటలూ విద్యా కాంక్షానూ. మోహినికి హృదయపూర్వకంగా నాట్య విద్య నేర్పుతూ ఎంతో సంతోషం పొందుతూంటాడు. ఎప్పటికైనా ఆ శిష్యురాలివల్లనే తనకు కీర్తి వస్తుందని విశ్వసిస్తూ వుంటాడాయన.

మోహినికేసి వాత్సల్యపూరితంగా చూస్తూ-"నువ్వు పిచ్చిపిచ్చి శంకలు పెట్టుకుంటావుగానీ మీరిద్దరూ కాలికి గజ్జెకట్టి ఏది చేసినా ఎలా చేసినా చూస్తారు ప్రేక్షకులు. అందుకు సందేహంలేదు." అంటూ నొక్కి చెప్పాడు-"సరే!

మీరన్నీ సర్దుకోండి. నేను టాక్సీ పిలిపిస్తాను. చాలా రాత్రయింది." అంటూ ఆయన గదిలోంచి వెళ్ళిపోయాడు.

పద్మిని హేండ్ బాగ్‌లోంచి వాచీ తీసి చేతికి కట్టుకొంటూ - "తొమ్మిది దాటింది మోహినీ!" అంది.

"తాతయ్యే వస్తానన్నాడక్కయ్యా! రానేలేదు, మనం ఇంకా ఆలస్యంచేస్తే కంగారు పడుతూ వుంటాడు." అంటూ మోహిని బట్టలన్నీ మడతలుపెట్టి సూట్‌కేస్‌లో పెట్టి రుమాలుతో మోహం తుడుచుకొంది.

"కళామూర్తులకు నా అభినందనలు," అక్కచెల్లెళ్ళిద్దరూ ఆశ్చర్యంగా గుమ్మం కేసి చూచారు. గోపాల్ - నల్లటి నలుపు - నలిగిన బట్టలు - సామాన్యమైన రూపురేఖలు - సున్నితమైన చూపులు. ముఖమంతా ప్రకాశవంత మయ్యేలా చిరునవ్వు నవ్వుతూ - చేతులు జోడించి —

—"నమస్తే !" అన్నాడు.

నర్తకమణులు కూడా చిరునవ్వులతో ప్రతినమస్కారాలు చేశారు.

గోపాల్ అలాగే మందహాసం చేస్తూ- "మీగురించి చాలాసార్లు విన్నాను. అదృష్టవశాత్తూ ఇవ్వాళ మీ నాట్యం కూడా చూడగలిగాను. గురువుగారన్నట్లు అంత రసహృదయుణ్ణి కాకపోయినా మీ నాట్యచాతుర్యాన్ని చూసి చాలా ఆనందించాను" అన్నాడు.

కొత్త యువకుడు - అంత నిరాడంబరంగా అంత నూటిగా మాట్లాడుతోంటే - పైగా ప్రశంసిస్తోంటే - అక్కచెల్లెళ్ళిద్దరూ కొంచెం సిగ్గువడ్డారు. ఎర్రని లేతపెదవులు విడిల్పి

చిరునవ్వు నవ్వుతూ మాట్లాడింది పద్మిని - "ప్రేక్షకులంతా మీలా మెచ్చుకుంటే మేము తరించినట్టే."

"మిమ్మల్ని తరింప జెయ్యడానికి కాకపోయినా ప్రేక్షకులు తమ అనుభూతులు వెల్లడి చెయ్యకుండా దాచుకోరు. అందరూ ప్రదర్శన గురించి మెచ్చుకొంటూనే వెళ్ళారు."

అక్కచెల్లెళ్ళ మొహాలలో ఆనందం చిందులాడింది. గోపాల్ మళ్ళా అన్నాడు- "నేను కొన్ని సంవత్సరాలుగా ఇంత శాస్త్రీయమైన నృత్యప్రదర్శనం చూడలేదు. ముఖ్యంగా "అలరింపు" "జతి స్వరాలకు" మీరు చేసిన నృత్తం ఎంతో శాస్త్రబద్ధంగా వుంది. చాలామంది స్వంత పద్ధతులతో ఎబ్బెట్టుగా చేస్తారు."

"లేదండీ! మేమింకా బాల్యావస్థలోనే ఉన్నాం. ఏమైనా లోపాలున్నా వుండచ్చు."

"అవును. నేనూ అదే అనుకున్నాను. మీరింకా శ్రద్ధ వడితే వుత్కృష్టమైన నాట్యకళను కరతలామలకం చేసుకోవచ్చును. ఆశక్తి సామర్థ్యాలు మీకున్నాయి."

ఆతని మాటలు కుతూహలం రేకెత్తించాయి. గోపాల్ పద్మిని కేసి చూస్తూ అన్నాడు "శబ్ద నృత్యంలో మీరు చూపించిన అంగవిన్యాసం చాలా ప్రశంసనీయంగా వుందండీ "బాల గోపాలా!" అన్న పదాన్ని గురువుగారు వల్లెవేస్తొంటే మీరు చూపించిన సంచారి భావాలు-వాహ్! అమోఘం!

బాలగోపాలుడే కాదు వెన్న దొంగిలించే కృష్ణుడు-గోపికల వస్త్రాలు ఎత్తుకుపోయే కృష్ణుడు-బృందావనంలో విహరించే కృష్ణుడు-కాళీయుణ్ణి మర్దించిన కృష్ణుడు - పూతనని సంహరిం

చిన కృష్ణుడు - గోవర్ధనగిరి గోటితో మీటిన కృష్ణుడు - రాధా సమేతుడైన కృష్ణుడు - అబ్బ ఎన్నెన్ని రూపాలు గోచరించా యనుకున్నారు ! మీరిద్దరూ అభినయించిన భంగిమల్ని చూస్తుంటే దేవాలయాల మీద శిల్పాలు గుర్తుకు వచ్చాయి నాకు."

అక్క-చెల్లెళ్ళిద్దరూ విస్మయంగా వింటూ వింటున్నారు.

"కానీ...వనజాక్షిరో అన్న మీ పదవర్ణానికి మీ అభి నయం—" సూటిగా పద్మిని ముఖంలోకి చూస్తూ క్షమాపణ కోరాడు గోపాల్ — "ప్లీజ్ ! ఏమీ అనుకోరుగా ? నా అభి ప్రాయం చెప్పకుండా వుండలేక పోతున్నాను."

పద్మిని నవ్వుతూ అంది —"మీరేమీ శంకించకండి. మీ అభిప్రాయం ఖచ్చితంగా చెప్పండి."

మోహినికూడా అంది—"అసలు మీరిలా మాట్లాడు తోంటేనే మాకు చాలా సంతోషంగా వుంది. మానాట్యం చూస్తోంటే మీకెలా తోచిందో నిర్మొహమాటంగా చెప్తే కదా మాలోటుపాట్లు మాకు తెలుస్తాయి !"

"థాంక్స్ ! ఆ మాత్రం ధైర్యం చెప్పారు. నా విమ ర్శని మీరు అపార్థం చేసుకుంటారేమోనని అనుమానం కలి గింది."

"పోనీ యిప్పుడు చెప్పండి. పదవర్ణనానికి నాఅభినయం గురించి మీరేదో చెప్పబోయారుగా !" పద్మిని కుతూహలంగా అడిగింది.

"మిమ్మల్ని తప్పుపట్టటం నా అభిప్రాయం కాదు. ఆ పద వర్ణనానికి మీ అభినయం పూర్తిగా సరిపడలేదు."

ఆశ్చర్యంగా పద్మిని చెల్లెలికేసి చూసింది. అంతకన్నా ఆశ్చర్యంగా మోహిని గోపాల్ కేసి చూసింది.—"అసలా అభినయం జరుగుతోంటే ప్రేక్షకు లెంత నిశ్శబ్దంగా కూచున్నారో - ఎంత వుత్కంఠతో చూశారో మీరు గమనించ లేదా ?"

"నిజమే. ప్రేక్షకు లెంతో ముగ్ధులయ్యారు. కానీ లోతుగా తరచి చూడగలిగేవాళ్ళకి ఆ అభినయం అంత తృప్తి కలిగించదు."

"ఎందుకని ?"

"అభినయం అంతా గిరిగీచినట్టు శాస్త్రయుక్తంగానే నడిచింది. విరహోత్కంఠిత అయిన నాయిక విరహాన్ని మీరు అభినయించారే గానీ ఆ క్షణాల్లో అనుభవించ లేదు. విరహాన్ని ఓర్చుకోలేకపోతోన్న వేదనా... మన్మథ తాపానికి లొంగిపోతోన్న వివశత్వం- ప్రియుణ్ణి స్మరించుకోంటోన్న తన్మయత్వం- చెలికత్తెను బ్రతిమిలాడుతోన్న దైన్యం-ఆ భావాలన్నీ కేవలం హస్తముద్రలతోనూ అంగవిన్యాసంతోనూ ప్రదర్శించారు. ఆ అనుభూతులేవీ మీ మొహంలోగానీ కళ్ళలోగానీ కన్పించ లేదు. అసలు మీ హృదయంలోనే విరహవ్యథ రేకెత్తినట్లు- మన్మథతాపం పుట్టుకొచ్చినట్టు- అభినయించి వుంటే- ఎంతో సజీవంగా ఎంతో రసవంతంగా వుండేది. ఫీలింగ్స్ చూపించలేని యాక్షన్ రసహీనంగా కబంధ నాట్యంలాగా తోచింది నాకు."

అక్కచెల్లెళ్ళిద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూచుకున్నారు. ఇద్దరి మొహాలమీదా చిరునవ్వు మెరిసింది. నిజమే! అలాంటి విరహ

వ్యర్థ ఆ కన్నెపడుచు లిద్దరికి అనుభవమైనది కాదు, పద్మిని శాస్త్రబద్ధంగా చేసిన ఆ అభినయంలో రసభావం లేకపోతే లేకపోనూవచ్చును.

గోపాల్ విమర్శకి ఎంతో సిగ్గుపడుతూ పద్మిని అంది ... "కానీ ఆ పొరపాటు నాది కాదు. అలాంటి అనుభూతి వూహాలకి అందేది కాదుగా?"

గోపాల్ తళుక్కున మెరుస్తున్న చూపులతో విస్మయంగా తదేకంగా పద్మినిని చూశాడు... "కళాస్వాదకులు అనుభవజ్ఞులు కానవసరంలేదే! సహజత్వాన్ని పోషించలేకపోవటం లోపమేనని మీరు ఒప్పుకున్నప్పుడు దాన్ని సరిదిద్దుకోవడానికి ప్రయత్నిస్తానని చెప్తే నేను చాలా సంతోషిస్తాను."

"తప్పకుండా నా శక్తికొద్దీ ప్రయత్నిస్తాను" సంతోషంగా ఒప్పుకొంది పద్మిని.

"సరే! జావళీ అభినయం గురించి మీ అభిప్రాయం చెప్తారా?" మోహిని ఆసక్తిగా అడిగింది.

గోపాల్ అసంతృప్తిగానే చూశాడు.

"అదీ అంత సహజంగాలేదు. అసలు "మధురా నగరిలో...." చేస్తోన్నప్పుడు గోపిక మొహంలో వుండాల్సింది వుత్త చిలిపితనం మాత్రమే కాదు. దానితోపాటే కృష్ణుడిపట్ల అపారమైన అనురాగం గాంభీర్యం తొంగిచూస్తూ వుండాలి. "దారివిడువుము కృష్ణా!" "పట్టకు కొంగు గట్టిగాను" "విడు విడునా చేయి కృష్ణా!" అన్నప్పుడు గోపిక చేష్టలు ఎంతమాత్రం దురుసుగా వుండకూడదు. సాధారణంగా ప్రతివాళ్ళూ గోపిక హృదయాన్ని అర్థం చేసుకోకుండా ఇలాగే చేస్తూంటారు.

చూసేవాళ్లు కూడా తరిచి ఆలోచించకుండా మెచ్చుకొంటూ వుంటారు.

నిజానికి – గోపికకు కృష్ణుడు చేసే ఏ చిలిపితనమైనా యిష్టమే. తన దారికి అడ్డంగా నిలుచున్నా – కొంగు పట్టుకు లాగినా – ఇంకా చొరవతో చేయిపట్టుకు నొక్కినా–గోపిక మనసులో చాలా సంతోషిస్తూ వుంటుంది. కృష్ణుడు ఎప్పుడూ అలా తనతోనే సరసాలాడుతూ వుండిపోవాలని కలలు కంటుంది. పైకిమాత్రం స్త్రీ సహజమైన సిగ్గుతోనూ–బెట్టు సరితోనూ – ఎవ్వరైనా చూస్తారన్న బెదురుతోనూ – చల్ల అమ్మాల్సిన వేళ మించిపోయిందన్న భయంతోనూ–కృష్ణుడి చేష్టల్ని వారిస్తుంది వ్యతిరేకిస్తుంది. అందుచేత గోపిక మొదట చాలా గోముగా బ్రతిమిలాడుతూనే "దారి విడువుము కృష్ణా!" అని అడగాలి. కొంటె కృష్ణుడు మంకుతనం చేస్తాడు. కాబట్టి చిరుకోపం మాత్రం ప్రదర్శిస్తూ "కొసరికొసరి సరసాలాడవద్దని" హెచ్చరించాలి. అసలు కృష్ణుడు కొంగు వదిలేసి దూరంగా పోతే గోపిక భరించగలదా? అలాంటి ప్రేమ తపస్విని గోపిక కృష్ణుడి చేతిలోంచి కొంగు గట్టిగా లాక్కున్నట్టూ – చేతిని విసురుగా వదిలించుకున్నట్టూ – కోపం అభినయించటం సమంజసంగా వుంటుందా?"

మోహిని మాట్లాడలేకపోయింది. అక్కయ్య చేసిన లోపమే తనుకూడా చేసింది. ప్రేమలోనూ – భక్తిలోనూ – ప్రవేశమైనాలేని తను గోపిక తాలూకు పరిపూర్ణతని ఎలా ప్రదర్శించగలదు? ఇకమీదనైనా సహజమైన అభినయాన్ని సాధించాలి. సాధించితీరాలి.

నర్తకి మౌనమే అంగీకారంగా ఎంచి తృప్తిపడ్డాడు గోపాల్.

పద్మిని అప్రయత్నంగా అడిగింది—"మీ పేరు?"

"గోపాల్ !"

"గోపాల్ !" మనస్సులో వుచ్చరించుకొంది పద్మిని.

మోహిని నవ్వుతూ - "మీరింకేమైనా చెప్పాలంటే చెప్పండి! వినాలని కుతూహలంగా వుంది."

గోపాల్ కొంచెం సిగ్గుపడ్డాడు. "లేదండీ! నాకు తోచింది మాత్రం చెప్పాను."

"ఇప్పటికి మేము చాలా ప్రదర్శనలిచ్చాం! ఎంతో ప్రశంసించేవారేకానీ మా లోపాలు ఎత్తి చెప్పేవారు కనపడ లేదు. అసలు లోపాలు తెలుసుకుంటేకదా అభివృద్ధి సాధించేది!"

మోహిని మాటలనిండా కృతజ్ఞతాభావం ధ్వనించింది.

గోపాల్ ఆవేశంగా అన్నాడు - "ఇవ్వాళ మిమ్మల్ని కలుసు కుని మాట్లాడటం సాధ్యంకాకపోతే మీ అడ్రస్ సంపాదించి కేవు వుత్తరమైనా రాసితీర్తాను. నా భావాలు వెల్లడించకుండా మాత్రం నేను వుండలేను."

"మీరు నిజమైన కళాప్రియులు!" మోహిని అంది.

"మీకు నాట్యకళలో బాగా ప్రవేశం వుందను కుంటాను."

"అదేం లేదులెండి. శాస్త్ర చూసి తెలుసుకోగలగటం తప్పితే మరేంలేదు."

"పోనీ మీకు భరతనాట్యమంటే చాలా ఇష్టమా?"

గోపాల్ నవ్వాడు—"మీకు గాలి అంటే యిష్టమా? నీళ్ళు అంటే యిష్టమా? అని అడగండి. అలాంటి యిష్టం నాకు కళ అంటే, కళాకారులంటే."

"మీరేం చేస్తూంటారు?"

"పిచ్చిపిచ్చి బొమ్మలు గీస్తుంటాను."

పద్మిని నవ్వింది—"చిత్రకారులా? చాలా సంతోషం." అంతకుమించి సంభాషణ జరగలేదు.

"అమ్మా పద్మినీ! టాక్సీ రెడీగావుంది. మీరు వెళ్తారా? తాతగారు చూస్తూవుంటారు" అంటూ మాస్టారు రావటంతో అందరూ గదిలోంచి బయటికి నడిచారు.

పద్మిని బేగ్‌లోంచి విజిటింగ్ కార్డుతీసి గోపాల్‌కి యిచ్చింది.

"మీకేం అభ్యంతరం లేకపోతే ఓసారి మా ఇంటికి రాగలరా!"

"రాగలరా ఏమిటి! వచ్చితీరాలి" అంది మోహిని.

"థాంక్స్! తప్పకుండావస్తాను వీలుచూసుకుని."

పద్మిని టాక్సీసీట్లో కూర్చుని డోరుమీద చెయ్యి వేస్తూ—"మీకు వీలుచిక్కేసరికి రావాలన్న విషయం మర్చిపోరుగా!" అంది హాస్యంగా.

గోపాల్ చిరునవ్వుతోనే సమాధానం చెప్పాడు.

టాక్సీ కదిలింది. కనిపించేంతవరకూ చూసి కదిలాడు గోపాల్.

*        *        *

రాత్రి చల్లటి వేళ తారురోడ్డుమీద మెత్తగా పోతోంది టాక్సీ.

"అతను చాలా తెలివైనవాడు" పద్మిని.

"అలాగే కన్పించాడు మరి."

"అతని విమర్శ చూశావా ? ఎంత సున్నితంగా వుందో,"

"నిజమే."

"ప్రతి ప్రేక్షకుడూ యింత విమర్శనా జ్ఞానంతో ఆలోచిస్తే కళాకారుడు ఔన్నత్యాన్ని అందుకోటానికి ప్రయత్నిస్తాడుకదూ!"

"తప్పకుండా."

"ఏం ? ఎందుకంత ముభావంగా వున్నావు?"

"నే నొకటి ఆలోచిస్తున్నానక్కయ్యా! ఒక సామాన్య ప్రేక్షకుడికి తెలిసిన విషయం మన మేష్టారికి తెలియకపోయిందా? ప్రదర్శన బావుందన్నారేగానీ యిలాంటి లోపాలనుగురించి ఎప్పుడూ చెప్పలేదేం?"

"అవునుసుమా!" అన్నట్టు ఆశ్చర్యంగా చూసింది పద్మిని.

"రేపు మాష్టార్ని అడుగుతాను."

చెల్లెలి అభిప్రాయంతో ఏకీభవిస్తూ మౌనంగా వుండి పోయింది పద్మిని అరచేతిలో లయ వేసుకొంటూ.

*　　*　　*

కళానిలయం ముందు ఆగింది టాక్సీ. పోర్టికోలో లైటు వెలుగుతోంది. హారన్ వింటూ బలరామయ్య హాల్లోంచి

బయటికి వచ్చాడు దగ్గుతూ. పద్మిని గేటు తీసుకు వెళ్లా.

"తాతయ్యా! నిద్రింకా పడుకోలేదూ?" అంది ఆప్యాయంగా.

"లేదమ్మా! ఎలాగూ విశారువచ్చే వేళైందని చూస్తూ కూర్చున్నాను."

"నువ్వు వస్తానన్నావుగా తాతయ్యా! నీకోసం చాలా సేపు చూశాం" అంటూ వచ్చింది మోహిని.

"ఏం చేయను తల్లీ! మిరలా వెళ్ళాగో లేదో డాక్టరు గారు వచ్చారు. కొంచెం జ్వరంకూడా తగిలిందని ఓ యింజక్షన్ యిచ్చారు. విశ్రాంతిగా పడుకోమనిచెప్పి మరీ వెళ్ళారు. నీరసంతో కూర్చోలేనని రాలేదమ్మా!"

"అరె! చెప్పావు కాదేం? మరి పడుకోకుండా మాకోసం చూస్తూ కూర్చున్నావా!"

"ఫర్వాలేదమ్మా! ఇప్పుడే లేచి యిలావచ్చాను. ముందు మీరు భోజనాలు కానివ్వండి. పదండి."

"ఈ పూట నువ్వేం తిన్నావు?"

"రాత్రి సయించలేదు. కొంచెం పాలుతాగి వూరు కున్నాను. నా మాటకేం గానీ......నాగరాజూ!" అంటూ పిల్చాడు బలరామయ్య. నాగరాజు ఏళ్ళతరబడీ ఆ యింట పనిచేస్తోన్న నౌఖరు.

యాభై ఏళ్ళు దాటివుంటాయి. టాక్సీలోంచి సూట్ కేసు లోపలికి తెస్తోన్న నాగరాజు— "వేడి నీళ్ళు సిద్ధంగా వున్నాయి బాబూ!" అన్నాడు.

స్నానాలుచేసి మెత్తటి వాయిల్ చీరలు కట్టుకుని నిర్మలంగా భోజనాలకు కూర్చున్నారు అక్కచెల్లెళ్ళిద్దరూ.

భోజనాల బల్లదగ్గిర మనమరాళ్ళిద్దరిమధ్యా ఓకుర్చీలో కూర్చున్నాడు తాతగారు. రాజమ్మ అన్నాలు వడ్డిస్తూ—"గోంగూర పచ్చడి నువ్వు మరికొంచెం వేసుకోమ్మా మోహినీ! నీకు చాలా యిష్టంకదూ!" అంటూ మోహిని పళ్ళెంలో మరో గరిటెడు పచ్చడి వేసింది.

"అబ్బ! ఏమిటి రాజమ్మా నువ్వు? దేవతలకి కుంభాలు పెట్టినట్టు పెట్టావు." అంటూ విసుక్కుంది మోహిని. రాజమ్మ వడ్డించిందంతా జిహ్వాచాపల్యంకొద్దీ తింటే ఒక్కనెల రోజులకే అడ్డంగా పెరిగి ఆటకీ పాటకీ ఓనమస్కారం పెట్టాల్సిందే. ఎంత విసుక్కున్నా అలా కొసరి కొసరి తినిపిస్తూనే వుంటుంది రాజమ్మ.

రాజమ్మ వంటమనిషే కాదు, దూరపుచుట్టంకూడాను. చాలా కాలంగా బలరామయ్య కుటుంబాన్ని ఆదరాభిమానాలతో చూసుకుంటోంది. ఒకప్పుడు బలరామయ్యకీ ఆవిడకీ ఏదో సంబంధం వుందన్న రహస్యాన్ని అందరూ తర్కించినా చాలా కాలంగా ఆ విషయం మరుగుపడిపోయింది. పిల్లలిద్దరికీ కూడా చిన్నతనం నుంచీ ఆదరంగా పెంచిన రాజమ్మ రాజమ్మే గానీ మరేంకాదు. వయస్సు మళ్ళిన రాజమ్మ బలరామయ్య ఇంటినే తన ఇంటిగా భావిస్తూ తృప్తిగా కాలం వెళ్ళబుచ్చుతోంది.

"మోహినీ! ఇవ్వాళ ప్రదర్శన బాగా అయిందా?" బలరామయ్య ఆసక్తిగా అడిగాడు.

"బాగానే అయింది తాతయ్యా! కానీ..." అంటూ మనమరాళ్ళిద్దరూ పోటీ పడుతూ విశేషాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పారు.

మోహిని నవ్వుతో అంది — "అతను అక్కయ్యని మరీ ఘాటుగా విమర్శించాడు తాతయ్యా! అసలు అనుభూతే లేకుండా అభినయించిందన్నాడు."

"ఆహా! నిన్ను వదిలేశాడు కాబోలు. మోహిని గోపిక హృదయాన్ని అర్థమే చేసుకోలేదన్నాడు తాతయ్యా!" అంది పద్మిని.

బలరామయ్య బోసినోటితో నవ్వుతూ "ఎవరు విమర్శించినా ఎలా విమర్శించినా కోపం తెచ్చుకోకుండా శాంతంగా విని అర్థం చేసుకోవాలమ్మా! విమర్శలో మంచి కన్పిస్తే నిర్లక్ష్యం చెయ్యకుండా ఆచరించాలి. అప్పుడే ఏవిద్యలోనైనా పాండిత్యం సిద్ధిస్తుంది. లోపాలు సరిదిద్దుకుని పరిపూర్ణత సాధించగల్గుతారు" అంటూ బోధపర్చాడు.

"అందుకే కదూ తాతయ్యా అతగాడి విమర్శలన్నీ బుద్ధిగా విన్నాం" అంది పద్మిని నవ్వి.

బలరామయ్య మనమరాళ్ళిద్దర్నీ మార్చి మార్చి ఆప్యాయంగా చూసుకున్నాడు— "ఇలా మిమ్మల్ని చూస్తోంటే నా చిరకాల వాంఛితం తీరిపోయిందనిపిస్తుంది. ఏనాడో నా జీవితాశయంగా ఎంచుకున్నదాన్ని సాధించగలాను. నా చేతుల్లో వున్నంత వరకూ చేశాను. ఇక మీ భవిష్యత్తు గురించి మీరు స్వయంగా ఆలోచించుకోవాలి."

తాతయ్య మాటలు వింటూ బేలగా చూసింది పద్మిని—

"అదేమిటి తాతయ్యా! ఇప్పుడైతే మాత్రం నువ్వు లేకుండా మేమేం చెయ్యగలం?"

"అబ్బే! అలా అనుకోకూడదమ్మా! నేను నామ మాత్రంగావున్నా లేకపోయినా ధైర్యంగా నిలబడాలి మీరు. భవిష్యత్తంతా మీ స్వయంకృషిమీదే ఆధారపడివుంటుంది. మీరిద్దరూ నాట్యకళలో సాటిలేనివారుగా పేరుప్రఖ్యాతులు తెచ్చుకొంటే—నేను లేకపోయినా నా అంతరాత్మ సంతోషిస్తుంది."

తాతయ్య అంతరంగం తెలిసిందే అయినా ఆయన మాటలు కొత్తగా విన్పిస్తుంటే విస్మయంగా చూస్తూ కూర్చుంది మోహిని.

కొన్ని నిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి. "తాతయ్యా!" పళ్లెంలో చెయ్యికడుక్కుని లేస్తూ పద్మిని ఆతృతగా తాతయ్య కేసి చూసింది.

"ఏం తల్లీ?" మునివేళ్ళతో కన్నీటిబొట్లు విదిలించుకుంటూ పలికాడు బలరామయ్య.

అనునయంగా అడిగింది పద్మిని — "నీకు అమ్మ గుర్తు వస్తోంది కదూ తాతయ్యా?"

బలరామయ్య దీర్ఘంగా నిట్టూర్చాడు—"అవునమ్మా! అవును. మీ అమ్మగుర్తు వస్తోంది. వీణమీదపడి కన్నీళ్ళు కారుస్తున్న నాబాల గుర్తువస్తోందమ్మా! ఐనా కొత్తగాగుర్తు రావటం ఏమిటి? అమ్మని నేనెప్పుడు మర్చిపోగలిగాననీ!"

అక్కచెల్లెళ్ళిద్దరూ విచారంగా తాతయ్యకేసి చూస్తూ కూర్చున్నారు. అమ్మ కథ తాతయ్య చెప్పగా చిన్నతనం

నుంచీ కొన్ని వందలసార్లు వినివున్నారు. అయినా ఎప్పటికప్పుడే అదో పవిత్ర శ్రవణం.

*　*　*

బలరామయ్య చిన్నతనం నుంచీ కళాప్రియుడు! రస హృదయుడు! ఆయన కా వరాలు పుటకతోనే సిద్ధించాయి. కానీ స్వతహాగా ఏకళా అలవడలేదు. అర్ధాంగి లక్ష్మీదేవి వల్ల కూడా బలరాముడి కళాహృదయం పరవశించలేదు. ఒక్కగా నొక్క కూతురికి "కళాబాల" అని పేరు పెట్టుకున్నాడు. కళ పసితనం వదిలి బాల్యంలోకి వచ్చింది. ఏడేళ్ళకే తల్లి దండ్రుల ప్రేమాభిమానాల మధ్య అల్లారుముద్దుగా పెరగసాగింది.

శివాలయపు గర్భగుడిలో స్వామి ఎదట నృత్యవేదికల మీద ఎంతోమంది దేవదాసీలు ఎన్నోపర్యాయాలు పూజా నృత్యాలు చేస్తోంటే చూసి ఆనందించినవాడే బలరామయ్య. కానీ ఆ ఏట దేవీ నవరాత్రుల సందర్భంలో 'ఇందువదన' అనే దేవదాసి పొద్దుకో విధంగా ఆరాధన నృత్యాలుచేసి భక్తుల్ని తన్మయుల్ని చేసింది. ఆ శాస్త్రీయ నృత్యాలు దర్శించి నేత్రా నందంతోపాటు మానసికానందం కూడా అతిగా పొంది ముగ్ధుడయ్యాడు బలరామయ్య. ఆ నృత్యాలలోని ఆధ్యాత్మిక చింతనతో సాక్షాత్ భగవత్ స్వరూపాన్ని చూడగలిగాడు. ఇహమూ పరమూ సాధించిపెట్టే నాట్యకళకు మనస్ఫూర్తిగా జోహారు లర్పించాడు.

తిరుగులేని నిశ్చయంతో భార్య నుద్దేశిస్తూ అన్నాడు— "మన కళకు నాట్యం నేర్పిస్తాను లక్ష్మీ!"

వినరాని మాట విన్నంత విస్మయం పొందింది అర్ధాంగి.

భర్త ఆవేశాన్ని గుర్తించి అప్పటికి చల్లగా తప్పుకొంది. బలరాముడి కోరిక తాత్కాలికమై ఎగిరి గాలిలో కలిసిపోలేదు. ఏడేళ్ళ కళాబాలకు నాట్యవిద్యను నేర్పగలిగే గురువు కోసం అన్వేషణ సాగించాడు.

శుభముహూర్తం సమీపించింది.

కళాబాల చక్కగా అభ్యంగనస్నానంచేసి పట్టు పరికిణీ కట్టుకు వచ్చి చిన్నారి చేతులు జోడించి గురువుగారికి నమస్కారం చేసింది. గురువు మందహాసంతో శిష్యురాల్ని నఖశిఖ పర్యంతం పరీక్షించాడు.

కళాబాల బంగారు బొమ్మలావుంది.

సన్నటి చేతులు తామర తూళ్ళలావున్నాయి. పొడుగాటి చేతి వేళ్ళు బంగారుతీగల్లా వున్నాయి. పచ్చటిపాదాలు చిన్న చిన్న పద్మాల జంటలా వున్నాయి.

శిష్యురాల్ని చూసి గురువు సంతృప్తిగా తల పంకించాడు—

—"అమ్మాయి నాట్య కళకే వన్నెతెస్తుంది." అంటూ ఉయ్యోత్తి దీవించాడు.

కళకు "లై" అడవులూ—"తలై" అడవులతో నృత్యాభ్యాసం ప్రారంభమైంది. అడవులూ—హస్తముద్రలూ—పరిచిత మయ్యాయి. గణపతి వందన నాట్యం నేర్చింది. గజ్జె పూజకుకూడా సుముహూర్తం ఏర్పాటైంది.

శిష్యురాల్ని బియ్యపురాసిమీద నుంచోబెట్టి పసుపు పారాణి పూసిన పాదాలకు గురువు చిన్నారి గజ్జెల మాలలు కట్టి ఆశీంచాడు. కళాబాల వెండి పళ్ళెంతో పళ్ళుబట్టలూ

కర్పూర తాంబూలం, దక్షిణాదులూ భక్తితో గురువుగారికి సమర్పించి నమస్కరించి ఆశీస్సులు పొందింది.

కాళ్ళకు గజ్జెలుకట్టుకు గంతులు వెయ్యాలని ఎంతో కుతూహల పడింది కళ. కానీ ఆదినుంచీ లక్ష్మీదేవి అభీష్టం కుమార్తె నృత్యాభ్యాసానికి విరుద్ధంగావుంది.

"అయినింట పుట్టిన ఆడపిల్లకు నాట్యం నేర్పించటం ధర్మంగా వుంటుందా?" అంటూ భర్త ఉత్సాహంలో నీళ్ళుపోస్తూనే వచ్చింది.

"ఎంత నాట్యం నేర్చినా మాత్రం ఇల్లుదాటి బయటికి వెళ్తుందా మనపిల్ల? పదిమంది ఎదటా గజ్జెకట్టి ఆడటం కళావంతులకే గానీ మనకు తగునా? అంటూ దినదినం సతాయిస్తూనే వుంది,

భర్తకి అన్ని విషయాలలోనూ చేదోడు వాదోడుగా మసిలే లక్ష్మీదేవి కూతురినాట్యం గురించి మాత్రం తనకి కొద్ది విముఖత వెల్లడించింది. అయినా బలరామయ్య ఏ అభ్యంతరాన్ని లక్ష్యపెట్టలేదు.

ఆఖరికి గజ్జెపూజ ముగిసి గురువు వెళ్ళిపోయిన తర్వాత లక్ష్మీదేవి భర్తని నాలుగుమాట లడిగింది— "నాట్యం నేర్చుకుని ఆటలాడే మీకూతుర్ని ఏ పెద్దమనిషి పెళ్ళిచేసుకుంటాడో ఆలోచించారా? ముందు బాలకు మంచి సంబంధం కుదిర్చి పెళ్ళి చేసెయ్యండి. తర్వాత భర్తా - అత్తగారూ అంగీకరిస్తే ఎన్ని విద్యలయినా నేర్పించండి. నేను నోరుమూసుకుంటాను.

బలరామయ్య తెల్లబోయాడు. నిజమే ! సాంప్రదాయమైన కుటుంబాలలో నాట్యకళపట్ల అనాదరం - చిన్న

చూపూ - బలరామయ్య ఎరగనిదికాదు. పూర్వులు నాట్యకళ నెంతో పవిత్రంగా ఎంచి దైవారాధనకుకూడా అర్హత కలిగించారు. అయినా ఆ కళ పవిత్రతను అర్థంచేసుకోగలిగే వివేకం - విశాలత్వం ప్రజలలో కొరవడటం నిజంగా కళాభిమానుల దౌర్భాగ్యమే.

కళ నాట్యకళలో ఆరితేరినదై తీరుతుంది. కానీ అప్పుడు దాని వివాహం పెద్ద సమస్య కాకుండా వుంటుందా ? పోనీ కళ జీవితాంతం అవివాహితగానే వుండిపోతుందా ?

కూతురి భవిష్యత్తంతా అంధకారమయంగా తోచింది బలరామయ్యకి. లక్ష్మిది ఎంత ముందుచూపు! బిడ్డ జీవితంకోసం ఆరాటపడే ఆ కన్నతల్లిని ఇంకా నిర్లక్ష్యం చేయగలడా?

బలరామయ్య ధైర్యం ఉత్సాహం క్రమక్రమంగా సన్నగిలిపోయాయి. స్త్రీ జీవితంలో కళారాధనకి తావులేదన్న నిజాన్ని అర్థంచేసుకున్న మీదట కుమార్తె నాట్యాభ్యాసాన్ని మాన్పించలేకా కొనసాగించనూలేకా సతమతమయ్యాడు.

"పదిమంది పోయేదారినే మనమూ పోవాలి. ఇంటా వంటాలేని ఈ విద్యలు నేర్పిస్తే నా బిడ్డ బ్రతుకు కెంత నవ్వుల పాలౌతుందో నన్న భయంతో మగ్గిపోతున్నాను." అంటూ కన్నీళ్ళు పెట్టుకున్న భార్యను చూచి పూర్తిగా నిస్సహాయుడై పోయాడు బలరామయ్య.

గజ్జెపూజ అయిన మర్నాడు గురువు రానేలేదు. ఇక గురువు రాడని తెలుసుకున్న కళాబాల బిక్క మొహంతో బుగ్గల మీదుగా కన్నీళ్ళు కారుస్తూ దీనంగా తండ్రినిచూస్తూ నిలబడింది. ఎన్నడూ బిడ్డ కన్నీటిని చూడని కన్నతండ్రి

కూతుర్ని దగ్గరికి తీసుకుని వగిలిన గుండెలకి హత్తుకుని మూగ చూపులతో ఓదార్చాలని ప్రయత్నించాడు.

కూతురి దుఃఖాన్నీ భర్త నిరుత్సాహాన్నీ చూడలేని లక్ష్మీదేవి ఒకమాట అంది–"బాలకు సంగీతం నేర్పించండి. నేను అభ్యంతర పెట్టను. చూసినవాళ్ళుకూడా సంతోషిస్తారు."

గాఢాంధకారంలో ఓ మెరుపు మెరిసింది. ఆ వూహామాత్రానే బలరాముడి వేదనా హృదయం తక్షాంతి పొందింది. కుమార్తె చెంపమీద ముద్దుపెట్టుకొంటూ– "ఏడవకమ్మా! నీకు సంగీతం నేర్పిస్తాను" అన్నాడు వుత్సాహంగా. తండ్రిమాటలు అర్థం కాకపోయినా ఎంతో సంతోషంతో దుఃఖం మర్చిపోయింది కళ.

చక్కని బొబ్బిలి వీణ తెప్పించి కూతురికి ఇచ్చాడు బలరామయ్య. నిగనిగ లాడుతోన్న సరికొత్త వీణను చూడగానే సంభ్రమంతో పద్మంలా వికసించింది కళాబాల మొహం. నవ్వులు ఒలకబోస్తూ వీణ తీగల్ని వేళ్ళతో మీటిమీటి సంబరపడింది. వీణ వెదజల్లిన మధురస్వరాలు వింటూ పరవసించి పోయిం దా బాల హృదయం.

సంగీతాచార్యుడి శిష్యరికంలో క్రమం తప్పకుండా విద్యాసాధన చేసింది బాల సంవత్సరాలకొద్దీ.

"మన తల్లి అలా కూర్చొని వీణ వాయిస్తోంటే అపర సరస్వతిలా వుంది చూడండి" అంది లక్ష్మీదేవి అనేకసార్లు భర్తతో.

నిజంగానే బలరామయ్య కూడా కుమార్తె సంగీతారాధనలో గానసరస్వతిని దర్శించగలిగాడు.

కళాబాల దినదిన ప్రవర్థమాన మహాతోన్న యౌవ్వనంతో పాటు సరస్వతీ కటాక్షంతో గానసరస్వతి అయింది. బంగారు సెలాకలవంటి వేళ్ళతో వీణాతంత్రులు మీటుతూ కంఠం విప్పి గానంచేస్తోంటే ఆ మధుర సంగీతాస్వాదనతో తన్మయులై సర్వం విస్మరించేవారు తల్లిదండ్రులు.

"నీవంటి గాన సరస్వతిని కనగలిగిన మా తనువులు తరించాయి తల్లీ!" అన్న భావాలు తల్లిదండ్రుల కన్నుల్లో మెదులుతూ కళకు విస్పష్టంగా గోచరించేవి.

పున్నమి చందమామలా పరిపూర్ణ యౌవ్వనవతి అయిన కుమార్తెను సత్సంప్రదాయ కుటుంబంలోని యువకుడూ-విద్యావంతుడూ - అందగాడూ అయిన చంద్రశేఖరుడికి సమర్పించి-వైభవోపేతంగా వివాహంచేసి కన్యాదాన తృప్తి కూడా పొందారు బలరామయ్యా లక్ష్మి

పుట్టింటినీ - తల్లిదండ్రుల్నీ - స్నేహితుల్నీ - అందర్నీ వదిలి కళాబాల కన్నీటితో మేనా ఎక్కి అత్తవారింటికి ప్రయాణమైంది. వీణపెట్టెను మేనాలో తన సరసనే పెట్టించుకుని భద్ర పర్చుకొంది. మేనా కదిలి వెళ్ళగానే ఇల్లంతా బోసిపోయింది. అందరూ చైతన్యం గోల్పోయి ఎక్కడివాళ్ళక్కడ రాళ్ళమల్లె కూర్చుండిపోయారు.

ఒక్క నెలరోజులు దుర్భరంగా గడిచాయి. కళాబాల కలకల నవ్వులూ - వీణాతంత్రుల మధుర ఝుంకారాలూ లోపించిన ఆ ఇల్లు వల్లకాడులా మారిపోయింది.

సంగీతాస్వాదన కోసం ఒక్క బలరామయ్యే కాదు, ద్వారబంధాలూ - కవాటాలూ - గృహప్రాంగణం అంతా

నిశ్చలంగా - నిశ్శబ్దంగా - నిరీక్షిస్తున్నట్టు తోచింది. కళాబాల గానం ఆవరించిన పరిసరాలన్నీ నిస్పృహతో నిట్టూరుస్తోన్నట్టు గోచరించాయి.

కూతుర్ని చూడకుండా సంగీతం వినకుండా పూర్తిగా నెల రోజులు గడపగలిగిన బలరామయ్య అసహనంతో వెర్రి వాడయ్యాడు.

"అమ్మాయిని చూసివస్తాను లక్ష్మీ!" అంటూ అనుకున్న క్షణంలో లేచి ప్రయాణమయ్యాడు. తండ్రి రాక విన్న కళాబాల ఆనందాశ్రువులతో ఎదురువచ్చింది. క్షేమ సమాచారాలు ముగిసిన తర్వాత బలరామయ్య మనస్సులోమాట కాస్తా బయట పెట్టేశాడు—"అమ్మా! నీపాట వినాలనే నేను కట్టుబట్టలతో బయల్దేరి వచ్చేశాను. నువ్వు లేక ఈ నెల్లాళ్ళకే యిల్లంతా ఎడారిలా అయిపోయింది."

తండ్రి మాటలు విన్న కళ తల దించుకొంది.

"ఒక్కసారి వీణ వాయించుతల్లీ! నువ్వు పాడుతోంటే వినాలని ఎంతో కోరికగావుంది."

"నాన్నా!" కళ మొహమంతా కళావిహీనమైపోయింది. కన్నీళ్ళు కళ్ళలో చోటులేక చెక్కిళ్ళమీదుగా ధారలుకట్టాయి. గద్గదికమౌతోన్న గొంతు పెకలించుకొంటూ అంది కళ—"ఈ యింట్లో అడుగుపెట్టాక నా వీణ ఎలావుందో నేను చూడ లేదు నాన్నా!"

తెల్లబోయాడు బలరామయ్య—"అదేమిటమ్మా! వీణ ఏమైంది?"

కళ ఆవేదనాస్వరంతో చెప్పింది—"నన్ను మేనాలోంచి

దింపి ఈ గదిలోకి తీసుకువచ్చి కూర్చోబెట్టారు నాన్నా! అప్పుడు సిగ్గుతో వీణ గురించి నేనేమీ అడగలేదు. తర్వాత తెలిసింది; వీణపెట్టె సామానుగదిలో పెట్టించారని. నేనింత వరకూ వీణ తీసి చూడనే లేదు.”

బలరామయ్య అయోమయంగా కూతుర్ని చూశాడు— “పోనీ నువ్వయినా తెప్పించి నీ గదిలో పెట్టుకోవచ్చుగా అమ్మా?”

కళ నిస్తేజంగా నవ్వింది—“నేనంత ధైర్యం చెయ్యలేకపోయాను నాన్నా! అత్తయ్యగారికి నేను వీణ వాయించటం యిష్టంలేదని తెలిసింది.”

బలరామయ్య ప్రాన్పడి పోయాడు. ఎంతో సేపటికి శాంతంగా “నీకు సంగీతం నేర్పించింది మీ అత్తగారికోసం కాదమ్మా! నీకోసం, నిన్ను పొందగలిగే అదృష్టవంతుడి కోసం. అపర సరస్వతిలా నువ్వు వీణ వాయిస్తోంటే నా అల్లుడు సంతోషంతో...”

“నాన్నా!” తండ్రి వాగ్ధోరణికి అడ్డుపడుతూ మధుర స్మృతులన్నీ మాయమయ్యే నిజాన్ని వెల్లడించింది కళ— “వారికి కూడా యిష్టంలేదు నాన్నా! నేను వీణవాయిస్తానని తెలిసికూడా ఎన్నడూ వినాలని కుతూహల పడలేదు. ఒక్క పాటైనా పాడమని అడగలేదు. వీణ తెచ్చి ఈ గదిలో వుంచుకుంటానని నేనే అడిగితే ఆయన ఒప్పుకోలేదు—‘మా అమ్మ చెప్పినట్టు నడుచుకో బాలా!’ అన్నారు నాన్నా!” కళ దుఃఖం ఆపుకోవటానికి ప్రయత్నించకుండా వెక్కి వెక్కి ఏడ్చేసింది.

కళను చూస్తోంటే తండ్రి కడుపు చెరువై పోయింది— "భగవంతుడా!" అంటూ నెత్తిమీద చేతులు పెట్టుకున్నాడు.

కళ వీణ వాయించడం-సంగీతం పాడటం-ఈ యింట్లో ఎవ్వరికీ యిష్టం లేదా ? యిది యిల్లా ? వల్లకాడా ? వీళ్ళు మనుషులా? బండరాళ్ళా! "అయ్యో కళా! నీ కెంత ఘోరం చేశారు తల్లీ ? వేళ్ళుతరబడి కష్టించి సాధించిన నీ విద్య ఎలా విస్మరించావు తల్లీ ? బాధనంతా గుండెల్లో ఎంత గుప్తంగా దాచుకున్నావమ్మా!" అంతరాంతరాలలో ఆక్రోసించాడు బలరామయ్య.

కొంతసేపటికి తల యెత్తి కూతురు కేసి చూస్తూ— "అమ్మా! కళా! ఏమైనా సరే! నీ సంగీతం వినకుండా వెళ్ళను. ఒక్కసారి నీ వీణ వాయించి వినిపించమ్మా! వెళ్ళమ్మా! అధైర్యపడకు. వీణ తెప్పించు. నీ పాట విని మనస్సు తేలిక చేసుకొని నేను వెళ్ళిపోతాను."

"నాన్నా!" దుఃఖాన్ని అదుముకొంది కళ. కళ్ళు విశాలం చేసి తండ్రి కేసి చూసింది.—తన పాటకోసమే నాన్న యింతదూరం వచ్చాడా ? పట్టుదలతో తనకు సంగీతానుభవం కల్గించిన నాన్న తన పాట వింటానని అడుగుతున్నాడు. ఈ కళ ఇంకెవరికోసం ? నాన్న కోరిక తను తిరస్కరించగలదా ?

కళ నెమ్మదిగా గదిలోంచి బయటికి వెళ్ళిపోయింది. నౌకరుతో వీణపెట్టె పట్టించుకు వచ్చింది. ఆత్రుతగా పెట్లోంచి వీణ ఎత్తి వడిలో పెట్టుకొంది. కంగారుగా అంతా పరికించింది. తీగలన్నీ ఎప్పటిలా వున్నాయి. మెత్తని పైటకొంగుతో వీణా దండమూ కుండా తీగలూ—అన్నీ ఒత్తి తుడిచింది. మృదువుగా

సారణితీగ మీటింది. ఒక్కసారి చిరునవ్వు చిందిస్తూ తండ్రికేసి చూసింది. తంత్రులన్నీ శృతిచేసింది. ఉత్సాహంతో వీణ మెట్లమీద పైనుంచి కిందికి వేళ్ళు సారించింది. సంగీత బీజాక్షరాల ఆరోహణావరోహణ శబ్దాలు వింటుంటే బలరామయ్య శరీరమంతా పులకరించింది. తివాచీమీద కుమార్తెకి ఎదురుగ కూర్చుని వీణా వాదనం వినటానికి సిద్ధపడ్డాడు.

తండ్రికి ఎంతో యిష్టమైన కృతి—

"వాతాపి గణపతిం భజేహం"

ప్రారంభించింది కళ. హంసధ్వని రాగాల ఘన మధుర మధురంగా పరిసరాలంతా వ్యాపించసాగింది.

"భూతాది సంసేవిత చరణం
భూత భౌతిక ప్రపంచ భరణం
వీతరాగిణం వినుత యోగినం
విశ్వకారణం విఘ్న వారణం
వాతాపిగణపతిం భజేహం వారణాస్యం..."

వీణా సంగీతం సెలయేటి ప్రవాహంలా నిర్విరామంగా ప్రవహించసాగింది. బలరామయ్య దాహాపిపాసిలా సంగీత పానం చేస్తూ క్రమక్రమంగా వాస్తవాన్ని మరచి రసజగత్తులో లీనమై పోయాడు.

"మురారి ప్రముఖాది సేవితం
మూలాధార క్షేత్ర స్థితం..."

కళాబాల చేతి వేళ్ళు వీణ మెట్లమీద ఆరాటంతో పరుగు లెడుతున్నాయి. నిర్లిప్త నేత్రాలతో పరిసరాలు మరిచిన తన్మయత్వంతో పదేపదే చరణాన్ని వల్లెవేస్తూ మధురవాదన

సృష్టిస్తోంది - కళ వీణా తంత్రుల ఝుంకారం లోగిలి అంతా వ్యాపించింది. మధుర స్వరాలు అందరి చెవులకూ సోకసాగేయి. ఎక్కడివాళ్ళక్కడ విస్మయంతో మొహాలు చూసుకున్నారు.

కళాబాల గది తలుపులు తెరుచుకున్నాయి. కళ చేతి వేళ్ళు చలించాయి. అపశృతులు పలికాయి. సంగీత ప్రవాహం స్తంభించింది.

వీణ మూగవోయింది.

బలరామయ్య తృళ్ళిపడ్డాడు.

ఎదురుగా కళాబాల అత్తగారు తన అయిష్టాన్ని స్పష్టంగా ముఖకవళికల ద్వారా వెల్లడిస్తూ నిలబడి వుంది.

"నేను ! నేనే అక్కగారూ ! అమ్మాయిని వీణ వాయించమన్నాను." తడబడుతూ లేచి నిలబడ్డాడు బలరామయ్య—

"ఒక్కసారి విని వెళ్ళిపోదామని..."

రుద్రకాళి అవుతుందేమోనని భయపడ్డ విద్యాపురాలు అనునయంగానే రాని నవ్వు తెచ్చిపెట్టుకొంది— "నీకు తెలియందేముందయ్యా ! తాతలనాటినుంచీ మావంశమంతా పరువుప్రతిష్ఠలకి పెట్టింది పేరు. ఏనాడూ ఎవ్వరిచేతా వేలెత్తి చూపించుకోలేదు మేము. మా సాంప్రదాయాలన్నీ తెలిసేగా పిల్లనిచ్చి పెళ్ళిచేశావు!"

విభ్రాంతితో బలరామయ్యకు మాట పెగల్లేదు.

"సంసార్ల ఇళ్ళలో వాయిద్యాలూ సంగీతాలూ పనికి వస్తాయంటావా ? నువ్వే చెప్పు. అవి ఎవరికి రాణింపో వాళ్ళకి రాణిస్తాయి."

అప్పటికీ బలరామయ్య నోరు మెదపలేదు.

"ఏదో చిన్నతనంలో మీముచ్చటకొద్దీ నేర్పించు కున్నారు. పెళ్లయి అత్తవారింట కాపురం చేసుకుంటోన్న పిల్లని సంగీతాలవీ పాడుకోమనటం ఏం మర్యాద? నువ్వే ఆలో చించరాదూ? అత్తింటికోడలు లక్షణంగా ఇంటి పనులూ పెనిమిటి సేవా చేసుకోవాలిగానీ ఆటలూ పాటలూ సబబు కాదుసుమీ!" మాట్లాడుతోన్న కొద్దీ ఆవిడ గొంతు కాస్త స్థాయిలో పడింది - విసురుగా చేతులు తిప్పుకొంటూ బుగ్గలు నొక్కుకొంటూ అంది - "ఫలానా వారి కోడలు సంగీతాలవీ పాడుతుందని నలుగురూ నవ్వుతుంటే మేము సిగ్గుతో చితికి పోవాలి బలరామయ్యా! ఈనాటికి నీబిడ్డవచ్చి మా పరువు ప్రతిష్టలు బజారుకెక్కిస్తుందా?"

"అక్కగారూ!" అతి కష్టంమీద పెల్లుబికి వస్తోన్న దుఃఖమంతా తమాయించుకుంటూ ఆవేశపూరితంగా అన్నాడు బలరామయ్య - "నా బిడ్డవల్ల మీ వంశగౌరవం చెడిపోతుందని కలలో కూడా అనుకోకండి. కళ విద్యాబుద్ధులవల్ల మీ పరువు ప్రతిష్టలు పెరగాలి గాని రవ్వంత తరగవు. ఏదో అయింది. పోనీలెండి. సంగీతం పాడితే మీ కపకీర్తి వస్తుందనుకొంటే ఇక కళ వీణె వాయించదు. మీరు మాత్రం బాధపడకండి."

"నాన్నా!" హృదయం బ్రద్దలైనంత బాధతో బావురు మంది కళ.

బలరామయ్య కూతురుకేసి కన్నెత్తి చూడలేదు. వియ్యపురాలితో అనునయంగా అన్నాడు- "ఇక మీరేమీ తప్పుపట్టకండి అక్కగారూ! బాలమీదేమీ ద్వేషం పెట్టుకో

కండి. నాతల్లి ఏనాడో గుండె రాయిచేసుకొంది. నేనే బలవం తంచేసి వీణ వినిపించ మన్నాను. లేకపోతే బాల అంతసాహసం చెయ్యదు."

కళాబాల బొటబొటా కార్చిన కన్నీళ్ళు వీణాదండం మీాదపడి మెరిశాయి. కన్నీటి పొరలగుండా వీణ పదివీణలై నాట్యమాడింది.

"అత్తయ్యా !" తల ఎత్తి శృతి తప్పిన స్వరంతో పిల్చింది కళ—"ఈ వీణ మాత్రం నా గదిలోనే వుంచండి. మా నాన్న చెప్పినట్టే నేనెప్పుడూ వాయించను, నిజంగా వాయించను. ఊరికే వీణని చూసుకొంటూ వుంటాను. అంతే అంతే" అంటూ వీణమీాదపడి ఏడ్చింది. రెండు తీగలు తెగి అనునయంగా బాలచెంపలు తాకుతూపోయి దుఃఖభారంతో చుట్టుకు పోయాయి - అర్థంగాని ఆ శోకాలకు వినుబోతూ తండ్రీ కూతుళ్ళని వాళ్ళ ఖర్మానికి వదిలేసి మారుమాట లేకుండా వెళ్ళిపోయింది అత్తగారు.

*          *          *

"నావీణ నాగదిలోనే వుండనివ్వండి. ఎప్పుడూ వాయించను. ఊరికే చూసుకుంటాను అంతే" అంటూ వీణమీాదపడి వెక్కి వెక్కి ఏడుస్తున్న నా చిట్టితల్లి గుర్తువచ్చిందమ్మా !" అన్నాడు బలరామయ్య గాఢంగా నిట్టూరుస్తూ.

తాతయ్య బాధ గ్రహించిన మోహిని ఆవేశంగా అంది-"అమ్మ ఎంతో కష్టపడి సంగీతం నేర్చుకొంటే హాయిగా పాడుకోవడానికి ఒకరి అనుమతి ఏమిటి తాతయ్యా ? అమ్మ తన బాధంతా నీదగ్గిర వెళ్ళబోసుకుంటే తీరా నువ్వు చెయ్యా

ల్సింది అదా ? ఎప్పుడూ వీణ వాయించదని మాటయిచ్చి మరింత ఏడ్చేలా చేశావా ? అమ్మ సంగీతం పాడుకోడానికి మధ్యన వాళ్ళ పెత్తనమేమిటో అడగలేక పోయావా ?"

బలరామయ్య నిరాశగా నవ్వాడు - "లేదమ్మా ! మోహినీ ! నీకు తెలీదు. ఆ సంఘం ఆ కట్టుబాట్లు అలాంటివి. వాటినిమీరే సాహసం అప్పట్లో నాకు లేదు. భర్తకీ అత్తగారికీ ఇష్టంలేని పనులు చెయ్యగలిగే సాహసం ఏ ఆడపిల్లలకీ వుండేది కాదు. మీ అమ్మ తన బాధకొద్దీ ఏడ్చిందిగాని - "నీకేం ఫర్వాలేదు. మీ వాళ్ళమాట లక్ష్యపెట్టకు, నీకిష్టమైనట్టే చేసుకో" - అంటె కళకూడా ఒప్పుకొనేది కాదు. "సంగీతం కోసం భర్తని ధిక్కరించడం అంటే హాస్యాస్పదమైన విషయం నాన్నా !" అనేదే.

పద్మిని కలుగజేసుకొంటూ గతమంతా మరోసారి వినాలన్న కుతూహలంతో అడిగింది—"పోనీలే తాతయ్యా ! అసలు సంగతి చెప్పు. అప్పుడేమైంది ? మా అమ్మ నెలా ఓదార్చావు ?"

బలరామయ్య నిర్లిప్తంగా చూశాడు - "ఏం ఓదార్చానమ్మా ? నేనేం ఓదార్చగలను ? ఓదార్చితే ఉపశమించే దుఃఖమా అది ? అయినా నా శక్తికొద్దీ ఓదార్చి - 'దిగులు పడకమ్మా కళా ! సంతోషంగావుండు. ఈ జన్మకి ఇంతకన్నా ప్రాప్తంలేదనుకో, గుండె రాయిచేసుకో తల్లీ ! అందరి ఆడ వాళ్ళలాగే నువ్వుకూడా నీ భర్తకి నచ్చే విధంగా మసులుకో ! అంతకన్నా నేనేం చెప్పనమ్మా ? మనసులో దిగులు మాత్రం పెట్టుకోకు' అని ఎంతో చెప్పి వెంటనే బయల్దేరి యింటికి

వచ్చేశాను.'

సంగతంతా విని అమ్మమ్మ ఓ నిట్టూర్పు విడిచింది. "చూశారా ఎంత పొరపాటు చేశారో ?" అంది.

"ఏమిటి లక్ష్మీ ? నేనేం చేశాను ?" అంటూ కంగారు పడ్డాను.

"ఇంకేం చేయాలి ? బిడ్డ మనస్సులో పసితనంనుంచీ కళాభిమానం రేకెత్తించి చివరికి దాని బ్రతుకు అంధకారం చేశారు. వీణా సంగీతం అంటూ దానికే ఆనందం తెలియక పోతే అందరు ఆడపిల్లల్లాగ బాలకూడా నిశ్చింతగా సంతృప్తిగా కాపురం చేసుకొనేది కాదా ?" అంది.

"అప్పుడు తెలిసిందమ్మా నాపొరపాటేమిటో. నాట్యం అంటూ ఆశ చూపించబట్టే చివరికి కళ ఆనందంకోసం సంగీత మైనా నేర్పించవలసి వచ్చింది. కానీ ఆ కళానుభవం ఎంత వరకూ వీలౌతుందో ఆలోచించావా ? తీరా నాబిడ్డ ఆశలన్నీ అడియాసలౌతుంటే అడ్డుకో గలిగానా ? అల్లారు ముద్దుగా పెంచుకున్న కళాహృదయాన్ని పరువు ప్రతిష్టలకీ సంఘమర్యాద లకీ అప్పగించి నా దారిన నేను వచ్చేశానే ! ఇంత నిర్దయుణ్నీ- ఇంత బలహీనుణ్నీ - నేను కళారాధన గురించి ఎన్ను కన్ని కలలు కన్నాను ? అంటూ రోజుల తరబడీ బాధతో ఏడ్చానమ్మా !"

అప్పట్లో తాతయ్యకి కల్గిన పశ్చాత్తాపం గురించి వింటోన్నకొద్దీ జాలితో కళ్ళు చెమర్చుతాయి.

"నిజంగా అది నీకు మనస్ఫూర్తిగా కల్గిన పశ్చాత్తాపం కాదు తాతయ్యా ! ఆనాటి సంఘపు సంకుచితత్వాన్ని అర్థం

చేసుకున్నా - ఎదిరించలేక నీ బలహీనతని నువ్వు తిట్టిపోసు కున్నావు. అంతే" అంది మోహిని.

"నిజమేనమ్మా! అక్షరాలా అంతే. నన్ను నేను తిట్టి పోసుకుంటేనే కొంత సంతృప్తి కల్గేది. ఆ రోజుల్లో కూడా నాకు ఎన్నో పద్ధతులు నచ్చేవి కావు. అయినా ఏమీ చెయ్య లేని పిరికితనంతో పూరుకునేవాణ్ణి.

ఆ రోజుల్లో ఆడదాని అభిరుచులూ అభిప్రాయాలే కాదు ఆడదాని పంచప్రాణాలూ మగవాడి దయాధర్మాలమీద ఆధార పడివుండేవి" రేగుతోన్న ఆవేశంతో గొంతు కంపిస్తోంటే మళ్ళా అన్నాడు తాతయ్య. "ఒకటి వినండి నా కళ్ళ ఎదుటే నా కన్నబిడ్డని హత్య చేస్తోంటే నేను నోరువిప్పి మాట్లాడలేని దౌర్భాగ్యుణ్ణయిపోయాను. అంత ఘోరమైన దుస్థితి అనుభ వించాను."

"హత్య!...అవును హత్యే! లేకపోతే అమ్మ ఎందుకు చచ్చిపోతుంది?" అక్కా-చెల్లెళ్ళ మొహాల నిండా విచారరేఖలు అలుముకున్నాయి.

* * *

కళాబాల నిండు నెలలతో పుట్టింటికి ప్రయాణమైంది. వెళ్ళేప్పుడు వీణ కూడా వెంటబెట్టుకుపోవాలని ఆరాటపడింది. అక్కడ వున్నంత కాలం తనివితీరా వాయించుకోవాలనీ-తల్లి దండ్రులకు వినిపించాలనీ కలలుకంది. అప్పటికి వీణానాదం విని సంవత్సరంపైగా దాటింది.

తీరా మేనాలో వీణపెట్టించబోతే అత్తగారు మొహం చిట్లించుకొంది.

"మర్చిపోయినదానిని పూర్తిగా మర్చిపో, మళ్ళా అక్కడికి తీసుకుపోయి అలవాటు చేసుకోవటం ఎందుకూ?" అన్నాడు భర్త అయిష్టంగా.

కళ గదిలో కూర్చుని కుళ్ళికుళ్ళి ఏడ్చింది. వీణని వది లేసి వెళ్ళటానికి మనస్సు ఒప్పలేదు. కాళ్ళు సాగలేదు. ఎంతోసేపు కన్నీళ్ళతో వీణని చూస్తూ కూర్చుంది. చచ్చి పోయిన చంటిబిడ్డని కౌగలించుకున్నట్టు వీణని ఒడిలోకి తీసు కుని ముద్దుపెట్టుకుంది. పెట్టెలోంచి పట్టుచీర తీసి వీణమీద కప్పింది. రెండు చేతులూ జోడించి వీణకి నమస్కరించి తడబడుతోన్న అడుగులతో వెనక్కిచూడకుండా వెళ్ళి మేనాలో ఎక్కి కూర్చుంది.

మేనాలోంచి కూతురు దిగిన తర్వాతకూడా బల రామయ్య వీధి వాకిట్లోనే నిలబడ్డాడు ఎంతోసేపు మేనాలోకి తొంగిచూస్తే బోసిగా కన్పించింది.

వీణ సంగతి ఇంట్లో ఎవ్వరూ ఎత్తలేదు. ఒక్కపాట పాడమనికూడా తండ్రి అడగలేదు. అయినా కళ అంతా తల్లికి చెప్పి గుండెల్లో భారం దించుకుంది. పరమానందంతో పుట్టింట తిరుగుతూ తల్లిదండ్రులకి సంతోషం కల్గించింది.

భార్యని చూసి వెళదామనే కోరికతో బయల్దేరి వచ్చాడు చంద్రశేఖరం. భర్తరాకకు కళ చాలా ఆనందపడింది. శిశోదయ మైతే కన్నతండ్రి కూడా చూసుకుని వెళ్తాడని యింట్లో అందరూ ముచ్చటపడ్డారు.

ఆ రాత్రి కళకు ప్రసవ వేదన ప్రారంభమైంది. తల్లీ దండ్రీ నౌకర్లూ అందరూ మేలుకుని కంగారు పడుతూ ఎవరి జాగ

త్రిలో వాళ్ళు మునిగిపోయారు. ఎరకలసానులిద్దరు తెల్లవార్లూ గర్భవతికి పుపచర్యలు చేస్తూ కూర్చున్నారు. భళ్ళున తెల్లవారే సరికి కాన్పు సహజంగా జరగదన్న అనుమానం బయటపడింది. అసలే సుకుమారి. కళ శారీరక వ్యథకు ఓర్చుకోలేక స్పృహతప్పి పోయింది.

భార్య చెప్తోందంతా విని బలరామయ్య కాళ్ళూ చేతులూ ఆడక నిలబడిపోయాడు. తేరుకున్నవాడు తేరుకున్నట్టే డాక్టరు దగ్గిరికి పరిగెత్తాడు. డాక్టర్‌ని తీసుకుని యింట్లోకి వెళ్తోన్న మామగార్ని విస్మయంగా చూశాడు అల్లుడు—.

"ఆయనెందుకూ ?" అన్నాడు అయిష్టంతో.

బలరామయ్య తెల్లబోయాడు—"కళ తెలివిలేకుండా పడి పోయిందట. సులువుగా లేదని వాళ్ళమ్మ చెప్పింది. ప్రమాదంలో డాక్టరుగారు కలుగజేసుకోకపోతే..."

"వీల్లేదు" కర్కశంగా అన్నాడు చంద్రశేఖరం.

"నేను ఒప్పుకోను. నా భార్య శరీరంమీద పరాయి మొగవాడి నీడ పడినా నేను సహించను. డాక్టరుగార్ని వెళ్ళి పొమ్మని చెప్పండి."

వింటోన్న వాళ్ళంతా స్తంభించిపోయారు.

చంద్రశేఖరం మొహం చిట్లించుకున్నాడు.— "ఎందుకలా మొహాలు చూసుకుంటారు ? డాక్టరుగార్ని పంపించేసి జరగాల్సిందేదో ఆలోచించరాదూ ?"

బలరామయ్య కట్టలు తెంచుకుంటోన్న కోపాన్ని అదుపు చేసుకుంటూ ప్రాధేయపడ్డాడు—"బాబూ ! చంద్రశేఖరం ! కళ చావుబ్రతుకుల మధ్య పడివుంది."

"అయితే...!"

"నీకు తెలియనిదేముంది నాయనా! వైద్యుడు దేవుడితో సమానం అంటారు."

"ఎవరా అన్నది? నాకిష్టం లేదంటున్నానుగా? నా భార్య గురించి నాకులేని బాధ మీకేమిటి మధ్య? అంత చెయ్యాలంటే ఆలశ్యం లేకుండా వెళ్ళి ఎంత డబ్బయినా సరే ఆడ డాక్టర్‌ని తీసుకురండి" అతని కళ్ళు నిప్పులు కక్కాయి.

బలరామయ్య కళ్ళు గిర్రున నిండాయి.—

"అయ్యో! నేను డబ్బుకోసం వెనకాడుతున్నానా? నాబిడ్డ ప్రాణంకన్నా ఈ ఐశ్వర్యం ఎక్కువా నాకు? కానీ, నాయనా! ఆడ డాక్టరమ్మ ఎక్కడో బస్తీలో వుంటుంది. గుర్రం బండీ తప్పితే మరోటి దొరకదు మనకి. ఇప్పటికే విషమించి నట్టుంది అమ్మాయిస్థితి. ఇదంతా నీకు తెలియదా బాబూ?"

చంద్రశేఖరం మాట్లాడలేదు. స్తంభంమీద చెయ్యివేసి ఎటో చూస్తూ నించున్నాడు.

డాక్టర్ ఎందుకో నవ్వుకున్నాడు "బలరామయ్యగారూ! మీరు కంగారు పడకండి. వైద్యుడిగా నాకర్తవ్యం నేను పాటించి తీరుతాను. నన్ను కాదనే హక్కు రోగికి తప్పితే ఎవ్వరికీ లేదు." అంటూ నిర్లక్ష్యంగా అడుగు ముందుకు వేశాడు.

చంద్రశేఖరం నిప్పులు కక్కుతూ మామగారికేసి చూశాడు.

"సరే! మీ కూతుర్ని శాశ్వతంగా మీ యింట్లోనే పెట్టుకోండి" భూదేవి అదిరిపడేలా అడుగులు వేస్తూ ఇంటి ఆవరణ దాటిపోయాడు.

బలరామయ్య నిశ్చేష్టుడై నిలబడ్డాడు. లక్ష్మీదేవి దుఃఖం దిగమింగుకొంటూ డాక్టర్‌ని వెంటబెట్టుకుని పురిటిగది కేసి తీసుకుపోయింది.

కొంచెం తెలివితెచ్చుకుని బాధతో మూలుగుతూ పడుకునివున్న కళ గదిలో అడుగుపెట్టిన డాక్టర్‌నిచూసి భయంతో గజగజలాడింది. "వద్దు వద్దు అమ్మా!" అతి కష్టం మీద మోచేతి బలంతో లేచి కూర్చోవటానికి ప్రయత్నిస్తూ వణికిపోతోన్న గొంతుతో "డాక్టరుగార్ని తీసుకుపో అమ్మా! జన్మలో నా భర్త నా మొహం చూడరు. ఈ అవమానంతో నేను బ్రతకలేను ఇన్ను నవ్వులపాలు చెయ్యకమ్మా! ఈ పాడు ప్రాణాలు నాకు గొప్పకాదు" అంటూ కన్నీటితో డాక్టరుకేసి చూస్తూ "చేతులెత్తి నమస్కారం చేస్తాను డాక్టరుగారు! వెళ్ళిపొండి." అంటూ బాధతో పక్కమీదికి ఒరిగిపోయింది.

ప్రాణాలు పోతూన్న ఆపదలో సాక్షాత్తు దేవుడిలా ఆపద తప్పించగలిగే వైద్యుడి స్పర్శతో మానమర్యాదలు కలుషిత మైపోతాయని భ్రమించే మూర్ఖురాలా బాల ?

కాదని డాక్టరు గ్రహించాడు. అయినా అడుగు ముందుకు వేయలేకపోయాడు. తలదించుకుని గుమ్మందాటి వెళ్ళిపోయాడు.

రెండు చేతులూ నెత్తిన పెట్టుకుని కూలబడివున్న బలరామయ్యకి కర్తవ్యం బోధించాడు డాక్టరు.

"వెంటనే బయల్దేరండి బలరామయ్యగారు! లేడీ డాక్టర్‌ని తీసుకురండి. నేనో ఉత్తరం రాసియిస్తాను. అమ్మాయిని కదపటం మంచిది కాదు. ఇక ఆలస్యం చేయకండి"

అంటూ రెండు ముక్కలు ఉత్తరం రాసి యిచ్చాడు.

శక్తి కూడగట్టుకు లేచాడు బలరామయ్య. డాక్టరుకి నమస్కారం చేసి పంపించాడు.

వెంటనే బస్తీకి బయల్దేరాలి. అందుకు ఒక్కటే మార్గం. ఇంగ్లీషు దొర కారు అడగాలి. ముందు ఆయన దర్శనం సంపాదించాలి. కాళ్ళావేళ్ళావడి ప్రాధేయపడాలి. బస్తీకిపోయి డాక్టరమ్మను వెంటబెట్టుకు రావాలి. అంతవరకూ ఇంటిగడప త్రొక్కి ప్రయోజనం లేదు బయల్దేరాడు బలరామయ్య.

బస్తీనుంచి డాక్టరమ్మను తీసుకువచ్చేసరికి మధ్యాహ్నం దాటింది. మండుటెండలోకి చూస్తోంటే కళ్ళు బైర్లు కమ్మి గాఢాంధకారం నాట్యంచేస్తోంది వికృతంగా.

మోటారుకారు దూసుకువచ్చి యింటిముందు ఆగింది.

*　　*　　*

సుదీర్ఘంగా నిట్టూర్చాడు తాతయ్య. ఎప్పటికప్పుడే వుద్వేగం కల్గిస్తుం దా నిట్టూర్పు. తాతయ్య చెప్పబోయే భయంకరమైన నిజంకోసం స్తబ్దంగా కూర్చున్నారు మనమరాళ్ళిద్దరూ.

*　　*　　*

అంతా అయిపోయింది.

ప్రాణదాతగా ఎంచిన డాక్టరమ్మను వెంటబెట్టుకుని-అరచేతుల్లో ప్రాణాలతో-దడదడలాడే గుండెలతో-రెక్కలు కట్టుకుని పుట్టెడు ఆశతో వచ్చిన కన్నతండ్రి కేం తెలిసింది కళాబాల శాశ్వతంగా కన్నుమూసిందనీ, అశక్యమైన బాధతో-

జీవచ్ఛవమై పడివున్న స్థితిలో ఇద్దరు కవలల్ని భూదేవికి సమర్పించి మరీ కన్నుమూసిందిని?

కళాబాల - మానవత్వం లోపించిన ఈ పాడులోకం విడిచి - దయాదాక్షిణ్యాలు విస్మరించిన రాక్షసుల్ని విడిచి - దూరంగా - సుదూరంగా వెళ్ళిపోయింది.

సంకుచిత మానమర్యాదలకూ - మూర్ఖపు నీతి నియమాలకూ - అతీతంగా వెళ్ళిపోయింది.

కన్నతల్లిని కప్పివేసిన మృత్యుచ్ఛాయల శీతలత్వం సోకి భూమిమీద పడివున్న శిశుద్వయం ఆర్తనాదం చేసింది.

* * *

"అమ్మ చచ్చిపోయింది" అనుకుంటే పుట్టెడు దుఃఖం వస్తుంది అక్కచెల్లెళ్ళిద్దరికీ. అసలు అమ్మ ఎలావుంటుందో ఊహించటానికి కూడా అశక్యం అవుతుంది. పురుషపుంగవుడి మూర్ఖత్వం తాలూకు అంధకారమేదో దట్టంగా ఆవరించినట్టు తోచింది చాలా సేపు.

"తాతయ్యా!" పద్మిని తాతయ్య చెయ్యి గట్టిగా పట్టుకొంది-"మేము పుట్టకపోతే అమ్మ బ్రతికివుండేదికదూ?"

"అలా అనకమ్మా! బిడ్డల పుట్టుకే తల్లి మరణానికి కారణమైతే ఈసృష్టి ఎంతకాలం సాగుతుంది తల్లీ! మిమ్మాయిద్దర్ని చూసిన క్షణంలోనే కన్నబిడ్డ పోయిందన్న దుఃఖం కొంతవరకన్నా ఉపశమించింది."

మోహిని ఆశగా అంది—"అమ్మకి వెంటనే ఆపరేషన్ చేయిస్తే బ్రతికేది తాతయ్యా!"

"ఎలా చెప్పగలం తల్లీ? అమ్మ కారోజుతో లోకంతో

ఋణంతీరిపోయిందేమో ! ఆయిషు నిండుకొచ్చిందేమో ! అందుకే మీనాన్నకంత మూర్ఖత్వం ఆవరించిందేమో !"

"నాన్న !" మాటవిన్నప్పుడల్లా ఆ అక్కచెల్లెళ్ళ మనస్సులు జుగుప్సతో కుంచించుకుపోతాయి. దేవతలాంటి అమ్మను హింసించిన రాక్షసుడు నాన్న; సాటిప్రాణిని అమానుషంగా హత్యచేసిన హంతకుడు నాన్న.

ఇద్దరి మొహాలలోనూ తండ్రిపట్ల అంతులేని అసహ్యం వ్యక్తమైంది. బలరామయ్య ఓదార్పుగా అన్నాడు— "కానీ మీనాన్న... తర్వాత పశ్చాత్తాపంతో - దిగులుతో కుమిలి పోయాడమ్మా ! చేతులారా చేసుకున్న పాపంతో కుళ్ళిపోతూ మంచం పట్టాడు. తల్లి రెండోపెళ్ళికి ప్రయత్నాలు చెయ్యబోతే ససేమిరా పల్లకాదన్నాడు. మీ అమ్మమీద ప్రేమతో కృంగి కృశించి సంవత్సరం తిరగివచ్చేసరికి తనూ కన్నుమూశాడు."

అక్క చెల్లెళ్ళిద్దరూ మౌనంగా కూర్చున్నారు.

"మనుషులు తప్పులు చేస్తారు. అది తెలుసుకుని పశ్చాత్తాపపడేవాళ్ళని క్షమించటం మానవత్వం అవుతుంది."

రంగులు మారినట్టే పద్మిని మొహంలో తండ్రిపట్ల ద్వేషభావం మారి సానుభూతి అలుముకొంది — "పోనీ నాన్నయినా వుంటే ఎంతో బావుండేది !" అంది బాధగా.

ఏమో ! మోహినికి మాత్రం తండ్రిపట్ల ఎలాంటి సదభిప్రాయం కలగలేదు. తీరా పొరపాటు జరిగాక ఎంత దుర్మార్గుడైనా తెలుసుకుంటాడు. అందులో గొప్పతనం ఏముంది ?

"నాన్న బ్రతికివుంటే ఇప్పటికికూడా నేను క్షమించను తాతయ్యా !"

"పోనీలేమ్మా ఎవరి అభిప్రాయం వాళ్ళది. నాన్నకూడా అమ్మను వెదుక్కొంటూ వెళ్ళిపోయాడు. అదృష్టవంతుడే నేమో!"

"ఊ! తర్వాత చెప్పు తాతయ్యా!"

తర్వాత చెప్పటానికేముందీ?

నవమాసాలు మోసి కని అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేసుకున్న బిడ్డ తన కళ్ళఎదుటే ఘోరంగా బాధపడి దుర్మరణం పాలైతే ఏ కన్నతల్లి గుండె బద్దలుకాదూ? అయినా కూతురు అప్పగించిన పసికందుల్ని సాకేందుకే మరో నాలుగు సంవత్సరాలు వుదాసీనంగా గడిపింది లక్ష్మీదేవి. కూతురులేని వెల్తి గుండెల్ని శూన్యం చేస్తోంటే క్రమక్రమంగా ఆవిడ ఆరోగ్యం క్షీణిస్తూ వచ్చింది. ఎంత డబ్బు ఖర్చుచేసి ఎన్ని వైద్యాలు చేయించినా అర్ధాంగిని దక్కించుకోలేక పోయాడు బలరామయ్య. జీవితమంతా నీడలా నిలిచి తోడుగా బ్రతికిన యిల్లాలు భర్తనే ఒంటరివాణ్ణిచేసి కన్నబిడ్డని వెతుక్కొంటూ వెళ్ళిపోయింది.

కానీ బలరామయ్య శ్మశానంలోనే దుఃఖం వదిలిపెట్టేసి యింటికి వచ్చాడు.

కాళ్ళకు పెనవేసుకున్న పసివాళ్ళిద్దర్నీ పెంచుకోవడమే మహత్తర ధ్యేయంగా భావించాడు. మనమరాళ్ళ ఆటపాట లతో గతాన్ని విస్మరించాడు. పిల్లలిద్దరూ పెరిగి పెద్దవాళ్ళవు తోన్నకొద్దీ వాళ్ళిద్దరి భవిష్యత్తూ మహోన్నతంగా తీర్చిదిద్దా లన్న తలంపు గాఢంగా స్థిరపడింది.

అందరి ఆడపిల్లల్లానే తన మనుమరాళ్ళకుకూడా పెళ్ళిళ్లు

చేసి ఆ త్రింటి కాపురాలకు అంకితం చేయాలన్న ఆలోచన మహాభయంకరంగా తోచింది.

బలరామయ్య సర్వస్వతంత్రుడే. వారించటానికి లక్ష్మీదేవి లేదు. మనమరాళ్ళ భవిష్యత్తు తన యిష్టానుసారం నిర్ణయించలేడా?

తన అభిప్రాయాలన్నీ ఆచరణలో పెట్టాడు బలరామయ్య. పుట్టి పెరిగిన గడ్డమీద మమకారాన్ని చంపుకుని - బంధుబలగాన్ని దూరంచేసుకుని - మనమరాళ్ళని వెంటపెట్టుకుని ఒక మహానగరం చేరుకున్నాడు.

"కళానిలయం" కట్టించుకున్నాడు.

నగరవాసంలో స్థిరపడిపోయాడు. మనమరాళ్ళిద్దర్నీ విద్యార్జనలో ప్రవేశపెట్టాడు. పిల్లల్ని కంటికి రెప్పలా కాచి పెంచి అంతవాళ్ళని ఇంతవాళ్ళని చేశాడు.

పద్మిని పూర్తిగా తల్లి పోలిక. అడుగుతీసి అడుగు వేస్తే చాలు కళాబాల కదలినట్టే వుంటుంది.

చదువుతోపాటే నాట్యాభ్యాసంకూడా ప్రారంభించారు పిల్లలు. మొదట మొదట సవ్యంగా సాగకపోయినా కాలేజీ చదువులు ముగిసేనాటికి శాస్త్రీయ నాట్యకళను బాగా పరిచయం చేసుకున్నారు.

మోహినికి ప్రత్యేకంగా సంగీత కళ కూడా అలవడింది. అమ్మలాగే తనూ వీణవాయిస్తూ శ్రావ్యంగా పాటలు పాడాలని చిన్నతనంలోనే కోరిక కలిగింది. పద్మినికా అభిలాషలేదు. మోహిని ఒక్కతే సమర్థుడైన ఆచార్యుడి దగ్గర సంగీతాభ్యాసం చేసింది. ఒక స్థాయికి కూడా చేరుకోగలిగింది.

మనమరాళ్ళ అభిరుచులన్నిటికీ బలరామయ్యా సంతోషంగా దోహదం చేస్తూ వచ్చాడు.

* * *

సజల నేత్రాలతో చూసింది పద్మిని—"తాతయ్యా! అమ్మా నాన్న పోయారు. అమ్మమ్మ కూడా పోయింది. అంత చిన్నతనంనుంచీ నువ్వూ మమ్మల్ని పెంచావుగానీ లేకపోతే ఏమైపోయేవాళ్ళం?"

"ఏమీ కారమ్మా!" బలరామయ్య మొహమంతా వైరాగ్యభావం వ్యక్తమైంది — "అన్నిటికీ సర్వేశ్వరుడే వున్నాడు. ఏది ఎలా జరగాలో అలా జరుగుతోంది. ఆ ధైర్యం తెచ్చుకున్న తర్వాతే నేనూ ముందడుగు వెయ్యగలిగాను."

మౌనంగా కూర్చున్న మనుమరాళ్ళిద్దర్నీ చూశాడు బలరామయ్య— "అమ్మా! ఈ పాతకథంతా ఇప్పుడువింటే అప్పుడే మర్చిపోవాలి. మనస్సులో పెట్టుకు బాధపడితే మనం సాధించేదేమీ వుండదు. పాతజ్ఞాపకాలు తవ్వుకొంటూపోతే ఏదో శాంతి దొరుకుతుందని మీరు ఎన్నిసార్లు అడిగినా నేను కాదనకుండా చెప్తూ వుంటాను." అంటూ అనునయంగా మనుమరాళ్ళ మనసుల్లో విచారాన్ని తుడిచివెయ్యటానికి ప్రయత్నించాడు—"మీ ఇద్దర్నీ ఇలా చూసుకొంటోంటే నాకెంతో గర్వంగా వుంది. మీఅమ్మకన్నా - నాన్నకన్నా - అమ్మమ్మకన్నా నే నే ఎంతో అ[illegible] మీముద్దూ ముచ్చట్లు చూడగలుగుతున్నాను. అంతేగాదమ్మా! మీరింకా గొప్పకళాకారులై భారతదేశానికి ఎనలేని పేరుప్రఖ్యాతులు తెస్తారన్న ఆశతోనే ఈ వృద్ధాప్యాన్నింత సంతోషంగా గడుపు

తున్నాను." బోసినోటితో నవ్వుతోన్న తాతయ్యని చూస్తోంటే అక్కచెల్లెళ్ళకిద్దరికి దిగులుపోయి ధైర్యం కలిగింది.

"ఇప్పుడు అమ్మమ్మవుంటే మాయిద్దర్నీ చూసి ఏమంటుంది తాతయ్యా?" అంది పద్మిని.

"ఆడపిల్లలు చక్కగా వీణ వాయించుకోవాలిగాని తైతైయ్యని గంతులేస్తే ఏం బావుంటుంది ? అంటూంది కదూ తాతయ్యా?" మోహిని నవ్వింది.

బలరామయ్య చిరునవ్వునవ్వి లేస్తూ "చాలా పొద్దు పోయిందమ్మా! వెళ్ళి పడుకోండి" అన్నాడు.

"అవును తాతయ్యా! నువ్వు కూడా నిద్రపో."

తాతయ్య గదిలోకి వెళ్ళిపోయాక అక్కచెల్లెళ్ళిద్దరూ మేడమీదికి వెళ్ళారు.

*　　　*　　　*

సాయంత్రం వేళ. నీరెండ కిటికీ అద్దాలలోంచి తొంగి చూస్తోంది. చెదిరి గోడమీద పడుతోన్న సూర్యకిరణాలతో హాలంతా ప్రకాశిస్తోంది.

"అమ్మా పద్మా! నీకోసం ఎవరో వచ్చారు చూడమ్మా!" బయటికి వెళ్ళబోతున్న బలరామయ్య తిరిగి లోపలికి గుమ్మందగ్గరికి వెళ్ళి పిల్చాడు.

రాజమ్మతో ఆ పూట కూరల విషయం ముచ్చటిస్తోన్న పద్మిని— "వస్తున్నా తాతయ్యా!" అంటూ వంటగదిలోంచి యివతలికి వచ్చింది.

హాల్లోకి వచ్చి అతిథిని చూడగానే పద్మిని మొహం వికసించింది. నవ్వుతూ "నమస్తే" అంటూ చేతులు

జోడించింది - "కూర్చోండి. నిలబడే వున్నారేం?" అంటూ మర్యాదగా కుర్చీ చూపించింది.

"ఈయన మా తాతయ్య, బలరామయ్యగారు. మా తాతయ్య ఒక్క తాతయ్యే కాదు ... తల్లీ తండ్రీ తోడు నీడా గురువూ దైవం అన్నీ మా తాతయ్యేనండీ" అంటూ తాతగార్ని గురించి చెప్పి, మళ్లా తాతయ్య కేసి చూస్తూ— "ఈయన గోపాల్ గారనీ— ఆరోజు మా ప్రదర్శన చూసి బాగా విమర్శిస్తూ మాట్లాడారని చెప్పలేదూ? ఈయనే తాతయ్యా!" అంటూ పరిచయాలు చేసింది.

బలరామయ్యను చూస్తూ గోపాల్ సవినయంగా చేతులు కలుపుతూ "నమస్కారం తాతగారూ!" అన్నాడు నవ్వుతూ.

బలరామయ్య దీవించాడు — "నూరేళ్ళు జీవించు నాయనా! కూర్చో. నిలబడే వున్నావు" అంటూ సోఫాలో తన ప్రక్కనే చోటు చూపిస్తూ చేతికర్ర సోఫాకి తగిలించి తనూ కూర్చున్నాడు.

గోపాల్ బలరామయ్య ప్రక్కన కూర్చుంటూ సంశయంగా అన్నాడు– "నేనంతగా మీ అమ్మాయిన్నేం విమర్శించలేదండీ, కొంచెం నా అభిప్రాయం చెప్పానంతే."

"ఉత్తది తాతయ్యా! ఆ వేళ ఎంత ఘాటుగా మాట్లాడారనీ! 'మీ మొహం! మీకేం నాట్యం చేస్తారు?' అన్నంత నిర్లక్ష్యంగా మాట్లాడారు తాతయ్యా!"

గోపాల్ బిక్క మొహం వేశాడు.

పద్మిని నవ్వు ఆపుకొంటూ బుంగమూతి పెట్టింది. మనుమరాలి ఫిర్యాదు వింటూ బలరామయ్య బోసినోటితో

నవ్వుతూ—"నిర్మొహమాటంగా చేసే విమర్శ ఆదరణీయం అవుతుంది తల్లీ! అంత ధైర్యంగా విమర్శించేవాళ్ళకి కృతజ్ఞతలు చెప్పుకోవాలి."

"తాతయ్యా ఎప్పుడూ యింతే" అంటూ చిరుకోపం నటించింది పద్మిని—"సరే! అయితే కృతజ్ఞత లెలా చెప్పు కోవాలేమిటి? ఓ కప్పు టీ యిస్తే సరిపోతుందా?"

"సరిపోదుకదూ తాతగారూ!" అన్నట్టు చూశాడు గోపాల్. బలరామయ్య నవ్వి లేస్తూ "నువ్వు కాస్సేపు కూర్చుని వెళ్ళు బాబూ! నేను బయటికి వెళ్తాను" అన్నాడు.

"అదేమిటి తాతగారూ! ఒక్క నిముషం కూర్చోండి. మిమ్మల్ని చూస్తుంటే నాకెంతో ఆనందంగా వుంది. మీవంటి పెద్దవారి ప్రోత్సాహంతోనే మీ అమ్మాయిలు నాట్యకళ అలవర్చుకున్నారంటే వినటానికే ఎంతో గర్వంగా వుంది."

"నాదేముంది బాబూ! అమ్మాయిలిద్దరూ పట్టుదలతో కృషి చేస్తున్నారు. చదువూ సంగీతాలన్నీ చూసుకొంటూ వుత్సాహంకొద్దీ కష్టపడుతున్నారు."

"ఎంత ఉత్సాహం వున్నా పెద్దల సహకారం లేకుండా చిన్నవాళ్ళేం చెయ్యలేరు కదండీ తాతగారూ! అసలు కళలకే పవిత్రత పోయిం దీ రోజుల్లో. కళాకారుల్ని తేలిక దృష్టితో చూస్తోంది లోకం. ఇలాంటివన్నీ తెలిసిన మీ వంటి పెద్దల్లోనే కళారాధన మిగిలి వుండటం జన్మసంస్కారమే తాతగారూ! నిజంగా మీవంటి కళాహృదయులే ధన్యులు."

గోపాల్ మాటలు వింటూ బలరామయ్య తృప్తిగా నవ్వాడు. గోపాల్ తాతయ్యతో అంత పొందిగ్గా చక్కగా

మాట్లాడటం పద్మినికి కూడా చాలా సంతోషం కలిగించింది. ఒక్క క్షణం ఆగి అంది—"తాతయ్యా! నువ్వు బయటికి వెళ తావుగా ? నేను గోపాల్‌గార్ని పైకి తీసికెళతాను."

"అలాగేనమ్మా! తీసికెళ్ళు. ఇల్లంతా చూపించు. నేనలా బయటికి వెళతాను బాబూ! ఓగంట తిరిగి రాకపోతే బావుండదు." అంటూ చేతికర్ర తీసుకున్నాడు బలరామయ్య.

గోపాల్ మళ్ళా నమస్కారం చేశాడు.

లోపలికి వెళ్ళి రాజమ్మకి టీ సంగతి చెప్పి వచ్చింది పద్మిని—"రండి" అంటూ మధ్యగదిలోంచి మెట్లకేసి దారి తీసింది. గోపాల్ సరసన వయ్యారంగా మెట్లు ఎక్కసాగింది.

"మీరు నడుస్తోన్నా నాట్యం చేస్తోన్నట్టే వుంటుంది!" చమత్కరించాడు గోపాల్.

కిలకిలా నవ్వింది పద్మిని - "మీరు మాట్లాడుతోంటే పిసుక్కిస్తోన్నట్టు లేదూ?" అంది చిలిపిగా చూస్తూ. ఇద్దరూ నవ్వుకొంటూ పైకి వెళ్ళారు.

వరండాలోంచి హాలులోకి తీసుకెళ్ళింది పద్మిని. హాలంతా పెద్దపెద్ద పువ్వులపట్టా పరచివుంది. గోడలు లేతపసుపు రంగుతో ప్రకాశిస్తున్నాయి. హాలులో కుడి వైపున ఎత్తుగా చిన్న నటరాజ విగ్రహం వుంది. దిగువ మెత్తని తివాచీమీద మృదంగం వీణ తాళాలూ గజ్జెలూ వగైరా వాయిద్యాలన్నీ పెట్టి వున్నాయి.

గోపాల్ నటరాజ విగ్రహానికి సమీపంగా వెళ్ళి నిల బడ్డాడు. కొంతసేపటికి వెనక్కి తిరిగి హాలంతా చూశాడు. విశాలమైన గోడలమీద వివిధ నాట్యభంగిమల చిత్రాలు

అలంకరించి వున్నాయి. హాలుకి రెండువైపులావున్న గది గుమ్మాల తెరలు గాలిలోకి ఎగిరిపోవాలని రెపరెప లాడుతున్నాయి.

"రండి, నాగదిలో కూర్చుందాం" పద్మిని కుడివేపు గదికేసి నడిచింది. గుమ్మంలో నిలబడి గోపాల్ని ఆహ్వానించింది.

గదిలో టేబులూ- కుర్చీలూ- నిలువుటద్దం- పుస్తకాల బీరువా-గోడలనిండా అందమైన ప్రకృతి దృశ్యాల కేలండర్లూ- వర్ణచిత్రాలతో-గది చాలా ఆడంబరంగా అధునాతనంగావుంది. గోపాల్ కిటికీ దగ్గరకి వెళ్ళి నిలబడ్డాడు. కింది కాంపౌండంతా విస్పష్టంగా కన్పిస్తోంది. పూలమొక్కలన్నీ గాలికి తలలాడిస్తూ ఎండలో నిగనిగా మెరుస్తున్నాయి. అక్కడక్కడా పచ్చ గడ్డిమళ్ళు మెత్తటి తివాచీల్లాగ కన్పిస్తున్నాయి. మొక్కల మీద నుంచి పూలసువాసనలు మోసుకుంటూ వచ్చింది చల్లటిగాలి.

"అబ్బ! ఇక్కడెంత హాయిగా వుంది! గంటలతరబడీ నించోవచ్చు" ముగ్ధుడయ్యాడు గోపాల్.

"ఇంకా కాస్సేపు నించుంటే మీకు కవిత్వం వచ్చేలా వుంది" నవ్వింది పద్మిని.

గోపాల్ తల తిప్పి పద్మినికేసి చూశాడు. సామాన్యమైన గులాబీ రంగు చీరా-నల్లటి బ్లౌజూ-వేసుకున్న పద్మిని ఆనాడు రంగస్థలంమీద అలంకారాలతో వున్నప్పటికన్నా ఎంతో మనోహరంగా కన్పించింది. సంధ్యా దీపంలా వున్న తిలకం తెల్లటి మొహాన్ని మరింత కళావంతం చేస్తోంది. కాటుక

కళ్ళ చాటున మనోజ్ఞమైన దరహాసం తొంగిచూస్తోంది. మని షంతా అంతులేని ఆకర్షణతో పోతపోసినట్లు గోచరించింది. గోపాల్ నిర్మొహమాటంగా నిర్లజ్జగా పద్మినిని తదేకంగా చూస్తూ నించున్నాడు.

పద్మిని తికమకపడుతూ తల ఎత్తలేక సతమతమౌంది.

గోపాల్ తేరుకొంటూ అన్నాడు— "ఏమన్నారూ ! నాకు కవిత్వం వస్తుందా ? ఇలా కాస్సేపు మిమ్మల్ని చూస్తే కవిత్వం తప్పకుండా వస్తుంది."

పద్మిని సిగ్గుపడింది. మాట మారుస్తూ — "ముందు కూర్చోండి, అలా ఎంతసేపు నిలబడి వుంటారు ? మర్యాదలు సరిగ్గా చెయ్యలేదని వెళ్లేముందు..."

"విమర్శించను లెండి" నవ్వుతూ గోపాల్ ఒక పేము కుర్చీలో కూర్చున్నాడు— "అన్నట్టు మీ సిస్టర్ కనిపించ లేదేం?"

"మాష్టారి దగ్గరి కెళ్ళింది."

నాగరాజు ఫ్లాస్కుతో 'టీ' ఇచ్చి వెళ్ళాడు.

పద్మిని అల్మైరాలోంచి బిస్కట్లు తీసి ప్లేటులో పెట్టింది—"మీరు వస్తారని ముందు తెలియలేదు" అంటూ నిర్దోషిత్వం వెల్లడించుకొంది."

"తెలిస్తే యింకేంచేసేవారు ?"

"ఏంచేసేదాన్నో ఇప్పుడు నాకు తెలీదు, ఈ ఆతిథ్యానికి మాత్రం మన్నించాలి."

"మన్నించానులెండి" అంటూ గోపాల్ ఒక బిస్కెట్టు తీసి పద్మినికి అందించాడు.

"థాంక్స్" చిలిపిగా అంటూ బిస్కెట్టు అందుకొంది పద్మిని.

"అన్నట్టు ఆరోజు మీరలా విమర్శించారని మా మాస్టారితో చెప్పింది మోహిని."

"మాస్టారేమన్నారు?"

"చిన్నపిల్లలలో అలాంటి లోపాలు సహజమే. కాబట్టి వాటిగురించి తను అంతగా పట్టించుకోలేదన్నారు."

"అదేమిటి ?"

"అదే మాకూ నచ్చలేదు."

టీ తీసుకోవటం అయింది మాటల మధ్యా. గోపాల్ గోడలమీద ఫోటోలకేసి చూస్తూ మౌనంగా కూర్చున్నాడు.

"ఎందుకంత మౌనంగా కూర్చున్నారు? మాట్లాడరేం?"

"ఏం మాట్లాడమంటారు ?"

"నేను చెప్పనా ?" పద్మిని నవ్వింది.

"మా ప్రదర్శన చూసినప్పుడు ఎలా మాట్లాడారో అలా మాట్లాడండి."

"నేను అంత ఆవేశంగా మాట్లాడాలంటే మీరు మళ్ళా నాట్యం చేయాలి."

పద్మిని సిగ్గుతో చిరుకోపం అభినయిస్తూ- "అయితే మీ రెండుకు వచ్చినట్టు" అంది.

"మీరే రమ్మన్నారుగా ?"

"ఇన్నాళ్ళకా ?"

"ఏరోజుకారోజే రావాలని ప్రయత్నించాను. తీరిక చిక్కలేదు."

"పిచ్చిపిచ్చి బొమ్మలు గీస్తున్నారా!"

"అక్కరాలా ఆపన్నే!"

"హాయిగా ఓ కెమేరా కొనుక్కుని ఫొటోలు తీసుకో రాదూ? కష్టపడి బొమ్మలు గీసుకోకపోతేనేం?"

పద్మిని హాస్యం గ్రహించి నవ్వి వూరుకున్నాడు గోపాల్.

పద్మిని అడిగింది—"మీరు ఎక్కడ వుంటున్నారు ?"

"ఏం? ఈ మహానగరంలో నా ఒక్కడికీ చోటు లేదా?"

"పోనీ చెప్పకండి, మీ రెక్కడవుంటే నా కేం?"

"మరి ఎందు కడిగారు?"

పద్మిని జవాబు చెప్పలేదు—

గోపాల్ ఎవరు? ఎక్కడ వుంటున్నాడు? ఏం చదివాడు? ఏం చేస్తున్నాడు?—ఆ విషయాలన్నీ తెలుసుకోవాలని ఎంత కుతూహలం కల్గిందో అంతా మటుమాయమై పోయింది. చెంపకు చేయి చేర్చుకుని ప్రసన్నంగా గోపాల్‌కేసి చూస్తూ కూర్చుంది.

గోపాల్ శరీరం నల్లరాతితో మల్చినట్టు వుంది. ఆ నలుపు కాంతులీనుతూ నీడలు కన్పిస్తాయేమో నన్నంత భ్రమ కల్పిస్తోంది.

చూసినకొద్దీ చూడాలనిపించే అందం అతని విశాల నేత్రాలలో వుంది. కొనదేలి బలిష్ఠంగా నిలబడిన ముక్కు అతని అందాన్ని ఇనుమడింపచేస్తోంది. గాలికి రేగుతూవచ్చి జుట్టు అతని నుదురంతా ఆవరించుకొంటోంది.

అతన్ని చూస్తోన్నకొద్దీ పద్మిని మొహమంతా మందహాసం చిరుబులుతొక్కింది. మునివేళ్ళతో పెదవినొక్కుకుంటూ కూర్చుంది.

"ఏంలో మీరలా నవ్వేసుకోవటం ధర్మం కాదు. ఎంతైనా ఎదరగా ఓ అతిథి వున్నాడు."

"చెప్తే మీ రేం అనుకోరుగా?"

"నేను అనుకునే దాన్ని గురించి మీరలా ఆలోచించుకోవటం భావ్యమేనా ? సరే. చెప్పండి."

"ఆహా ! మ రేంలేదు. మీకు సరిగా సరిపోయే పేరు పెట్టారుకదా మీ పెద్దవాళ్ళనీ..." ఫక్కు మంటూ నవ్వేసింది పద్మిని.

గోపాల్‌కూడా నవ్వుతూ 'చాలా తెల్లగా వున్నాను కండడీ" అన్నాడు.

"నయం గోపాలుడు అన్నారు, శ్యామసుందరుడు అనలేదు" కొంటెగా అంది పద్మిని.

"పోనీ మీరలా పిలవండి! — అవతారపురుషు లందరూ నలుపేనండీ ! మీకు తెలీదేమో!" అన్నాడు గోపాల్.

"మీ శరీరచ్ఛాయ చూచుకుని గర్విస్తున్నారా ఏమిటి ?" అంది పద్మిని.

ఇద్దరూ నవ్వుకున్నారు.

పద్మిని లేచి పుస్తకాల బీరువాలోంచి ఆల్బమ్ తీసింది- "కొత్తవాళ్లెవరు వచ్చినా యివి చూపించటం నాకో సరదా" అంటూ తన కుర్చీ గోపాల్ దగ్గిరికి వేసుకుని ఆల్బమ్ ఒళ్లో పెట్టుకుని ఫొటోలు చూపించటం ప్రారంభించింది.

తన మనస్సుకి ఆహ్లాదం కల్గిస్తోన్న మంచిగంధం వాసన పద్మిని బట్టలమీదనుంచి వస్తోందని అప్పుడే అర్థమైంది గోపాల్‌కి.

గోపాల్ చూపులు పట్టించుకోకుండా అంది పద్మిని—

"ఈ ఫొటోలు చూపించే ముందు మీకో చిన్న కథ చెప్పాలి మా చిన్నప్పుడు ఓ ఫొటోగ్రాఫరు మా ఇంటికి వచ్చి అద్దె కోగది ఇమ్మని అడిగాడు. ఇల్లెక్కడా దొరకటం లేదని ప్రాధేయపడ్డాడు. అయినాసరే మా తాతయ్య ఒప్పుకో లేదు. అతను ఫొటోలు తీస్తాడని మాకు తెలిసి 'మన ఇంట్లో వుంచుకుందాం తాతయ్యా!' అంటూ పేచీపెట్టాం. తాతయ్య ఒప్పేసుకుని వీధి గదిలో వుండమని చెప్పాడు. ఆరోజే ఆ అబ్బాయి కెమేరా అదీ తెచ్చేసుకున్నాడు. మొట్టమొదట మా ఇద్దర్నీ ఓ ఫొటో తీశాడు. తర్వాత తాతయ్యని తీశాడు. తర్వాత రాజమ్మనీ-నాగరాజునీకూడా తీశాడు." నవ్వుతూ ఆ చిన్నితనం ఫొటోలు చూపించింది పద్మిని - "తాతయ్య అద్దె తీసుకునేవాడు కాదు. అందుకని నెల నెలా బోలెడు ఫొటోలు తీస్తూండేవా డతను. డాన్స్ నేర్చుకుంటోన్న కొత్తల్లో అయితే మరీ సరదాగా అనేక భంగిమలతో తీయించుకునే వాళ్ళం. ఆ ఫొటోగ్రాఫరు నాలుగు సంవత్సరాలు మా ఇంట్లోనే వుండిపోయాడు... ఇప్పటికీ మా ఫొటోల సరదా తీర

నేలేదు." అంటూ పేజీలు తిప్పుతూ రకరకాల ఫొటోలు చూపిస్తూ వివరాలు చెప్పింది పద్మిని. బుట్టబొమ్మ గౌనులు తొడుక్కొని కూర్చున్న అక్కచెల్లెళ్ళని చూస్తే నవ్వొచ్చింది గోపాల్‌కి.

ఆ చిన్నప్పటి ఫొటోలలో ఒకటి గోపాల్‌ని బాగా ఆకర్షించింది. అది పుత్తడి బొమ్మలాంటి పూర్ణమ్మగా వేషం కట్టుకుని అభినయిస్తోన్న దృశ్యం. పద్మిని నిజంగా పుత్తడి బొమ్మలావుంది. కొలనుగట్టున దుర్గబొమ్మ దగ్గిర దోసిలి నిండా పువ్వులు పట్టుకుని విచారంగా నిలబడివుంది పూర్ణమ్మగా పద్మిని.

"ఈ ఫీలింగ్ అద్భుతంగావుంది." అన్నాడు గోపాల్.

"సరే! సరే! ఇది చూడండి. ఈ ఫొటో మోహినీ నేనూ— ఆరంగేట్రం ప్రదర్శనంయిచ్చినప్పుడు. నిజంగా ఆరోజు చాలాగొప్పగా జరిగింది. చాల మంది పండితులూ, పెద్దలూ వచ్చి మమల్ని అభినందించారు. ఆశీర్వదించారు. తాతయ్య చాలాడబ్బు ఖర్చుచేసి పెద్ద విందు చేశాడు."

విందు దృశ్యాలన్నీ చూశాడు గోపాల్ ఆసక్తిగా.

"ఇవిగో ఈ ఫొటోలు చూడండి. మా కాలేజీలో ప్రదర్శనా లిచ్చినప్పటివి. కాలేజిలో ఏ ఫంక్షన్ జరిగినా సరే మమ్మల్ని డాన్స్‌చెయ్యమని స్టూడెంట్సూ లెక్చరర్సూ కూడా అడుగుతూండేవారు—అబ్బ! ఆరోజులే వేరండీ!"

గోపాల్ నవ్వుతూ అన్నాడు "అయితే మీకు కాలేజీ నిండా అభిమానులు వుండి వుండాలి."

"అదేగా నేను చెప్తోందీ! మా యిద్దరికీ బలే రెస్పెక్ట్ యిస్తోండేవారు. అసలు అభిమానులంటూ బయల్దేరింది మా కాలేజీలోనే - ఇదిగో ! ఈ ఫోటో చూడండి. యూత్ ఫెస్టివల్ కి ఢిల్లీ వెళ్ళినప్పుడు అధ్యక్షులు రాజేంద్రప్రసాద్ ముందు ప్రదర్శన యిచ్చాం. ఆయన మోహినికో బహుమతి కూడా ఇచ్చారు."

అధ్యక్షునికి కిరుప్రక్కలా భరతనాట్యాలంకారాలతో నించున్న పద్మినినీ, మోహినినీ చూశాడు గోపాల్.

"ఏవూళ్ళో ఏసభ జరిగినా — ఏ సందర్భం వచ్చినా ఎవరోవచ్చి ప్రోగ్రాం కావాలని అడగటం, కాలేజి ఎగగొట్టి మాష్టారుతో వెళ్ళి ప్రదర్శన యిచ్చిరావడం, ఒక్కో ప్రోగ్రాం యిచ్చినప్పుడల్లా మినిష్టర్స్ తోటీ- గవర్నర్స్ తోటీ - పెద్ద పెద్ద ఆఫీసర్లతోటీ పరిచయం కలుగుతూ వుండేది. ఒక్కసారి ప్రదర్శన చూసినవాళ్ళయినా యిప్పటికీ మమ్మల్ని మరచిపోకుండా అప్పుడప్పుడూ లెటర్సవీ రాస్తోంటారు. జవాబు లిస్తోంటాము." పద్మిని నవ్వుతూ అంది, "నిజానికి మా ప్రోగ్రాం ఒకసారి చూసినవాళ్ళు మరోసారి చూడాలని కుతూహల పడుతుంటారు. కానీ... ఈ పేరంతా గాలికి వచ్చిందేమో నన్పిస్తోందిప్పుడు."

"మీరిలా బాధపడితే ఆ రోజు మిమ్మల్నెందుకు విమర్శించానా అని పశ్చాత్తాప పడాల్సివస్తుంది నేను" గోపాల్ సీరియస్ గా అన్నాడు.

తర్వాత మోహిని వీణవాయిస్తూ తీయించుకొన్న ఫోటో చూశాడు గోపాల్.

"మీ సిస్టర్‌కి సంగీతం వచ్చునా ?"

"మీకు తెలీదూ?"

"నాకెలా తెలుస్తుంది?"

"ఎన్నోసార్లు రేడియో ప్రోగ్రామ్స్ కూడా యిచ్చిందే! కర్ణాటకంలో బాగా ప్రాక్టీస్ చేస్తోంది. లలితసంగీతం చక్కగా పాడుతుంది. మాయింట్లో కూడా మా సిస్టర్ పాటలు కొన్ని రికార్డు లున్నాయి."

"మీరూ పాడగలరా?"

"నేనా? బ్రతికించారు. పాడమని అడగలేదు."

"అడగాలనేగా?"

"ఏం? మీకు కాస్సేపు కూర్చుందామని లేదా ?"

"అలా అంటే ఎలా ! మీరుకూడా సంగీతం నేర్చుకోరాదూ."

"లేదండీ! నాకా ఇంటరెస్ట్‌లేదు, నన్ను కూడా ప్రాక్టీసు చెయ్యమని మామోహిని చంపుతోంది. "వరవీణా మృదుపాణీ" వరకూ వచ్చింది నా సంగీతం అతి కష్టంమీద."

"అబ్బే! అలాకాదు. ఏ నీలాంబరిలోనో—ఆనంద భైరవిలోనో—జోలపాటలైనా పాడుకోవాలిగదా!" చిలిపిగా చూశాడు గోపాల్.

"అయితే ముందు మోహనరాగం నేర్చుకుంటాను. తర్వాత జోలపాటల సంగతి చూద్దాం." అంది కొంటెగా పద్మిని.

కబుర్లతో నవ్వులతో ఆల్బమ్స్ చూడటం అయింది—"మా మోహిని గది చూపిస్తా రండి" అంటూ లేచింది పద్మిని. ఇద్దరూ హాల్లో ఎడమవైపు గదిలోకి వెళ్లారు.

మోహినిగది చాలా నిరాడంబరంగా వుంది ఓ మంచం — టేబులు - రెండు కుర్చీలూ తప్పితే మరోసామాను లేదు. ఆఖరికి కిటికీలకు కర్టెన్లుకూడా లేవు.

"మోహిని చాలా చిత్రమైన మనిషండీ! ఎంతసేపూ సంగీతం — నాట్యం — తప్పితే మరోధ్యాస వుండదు. శ్రమ తెలుసుకోదు. క్షణం వృధా చెయ్యదు. వీటికితోడు ఎం. ఏ. కి చదువుతానని పుస్తకాలన్నీ తెప్పించింది. అబ్బ? నేనంత బిజీగా వుండలేనండీ! హాయిగా కూర్చుని కథల పుస్తకాలు చదువుకొంటూ వుంటాను. చక్కటి రికార్డులు వేసుకుని వింటాను. లేకపోతే ఆకాశంకేసిచూస్తూ గంటలతరబడి కూర్చుంటాను. మోహిని నన్ను వెక్కిరిస్తూవుంటుంది—సింగారించుకుని తీరిగ్గా తిరుగుతానని."

ఇద్దరూ బాల్కనీలోకి వెళ్ళి కాస్సేపు నించున్నారు. బాగా చీకటి పడింది.

పద్మిని హాల్లో దీపంవేసి నటరాజుకి నమస్కరించింది. గోపాల్ నవ్వాడు.

"ఎందుకు నవ్వుతారు?"

"మీ భక్తిశ్రద్ధలకు."

"ఏం? భక్తికేం లోపం వచ్చింది?"

"అబ్బే అంత మాట నేననలేదండీ! సరే చాలా చీకటి పడింది. నేనిక వెళ్తాను."

"అప్పుడేనా?" నిరుత్సాహపడింది పద్మిని ... "మోహిని రానేలేదు"

"మరోసారి వస్తాను."

ఇద్దరూ హాల్లోంచి వరండాలోకి వెళ్ళారు. మెట్ల దగ్గరికి వెళ్ళేసరికి వాలుజడ ముందుకు వేసుకుని కూనిరాగం తీస్తూ లేడిలా గంతులువేస్తూ మెట్లెక్కి వస్తోన్న మోహిని కన్పించింది.

"హల్లో, మోహినీదేవి! నమస్తే!" అంటూ సంతోషంగా విష్ చేశాడు గోపాల్.

మోహిని తలెత్తి చూసింది- "ఓ! గోపాల్! నమస్తే!" అంటూ సంభ్రమంతో మెట్లెక్కి వచ్చింది. "ఎంతసేపైంది వచ్చి?"

"చాలాసేపైందండీ! వెళ్దామనే బయల్దేరాను."

"వెళ్ళొచ్చు రండి, రండి- కొంచెం టీ తీసుకోరూ!"

"అయిందండీ! రాగానే పద్మినీదేవి మర్యాదలన్నీ శ్రద్ధగా చేశారు."

"చేస్తే చేసింది లెండి. అక్కయ్య ఆతిథ్యం అది, మరి నా ఆతిథ్యం తీసుకోరూ? నాగరాజూ, టీ తీసుకురా!" అని చెప్పి హాల్లోకి నడిచింది మోహిని.

ముగ్గురూ బాల్కనీలో కూర్చున్నారు. "నువ్వొస్తావని ఇప్పటివరకూ ఎదురుచూశాం." అంది పద్మిని.

"మాష్టారు ఎక్కడికో వెళ్ళారు. వచ్చేవరకూ వుండి కిన్నెరసాని విషయం మాటాడి మరీ వచ్చాను."

"ఏమన్నారు?"

"కంపోజ్ చేస్తామన్నారు."

"విశ్వనాథ వారిదా? అయితే చాలా బావుంటుంది." అన్నాడు గోపాల్.

ముగ్గురూ కాసేపు కిన్నరసాని అలంకారాల గురించీ- రంగస్థలం గురించీ మాట్లాడుకున్నారు.

"మీ రెక్కడ వుంటున్నారు?" మోహిని గోపాల్ కేసి చూసింది.

"ఈ మహానగరంలో పాపం ఆయన ఒక్కరూ వుండ టానికి చోటు లేదని నీ వుద్దేశ్యమా?" అంది పద్మిని గాంభీర్యం నటిస్తూ.

"అదేమిటి? నీ కేం పైత్యం పుడుతోందా?"

"అబ్బె! ఈ పైత్యం నాది కాదు, ఆయనదే. నేనూ నీ లాగే అడిగితే ఆ పెద్దమనిషి వల్లించిన కవిత్వం అది" అంది పద్మిని నవ్వుతూ.

ఏమండీ! మీ అడ్రస్ ఇవ్వటానికి అభ్యంతరం ఏమిటి?" మోహిని గోపాల్‌ని ప్రశ్నార్థకంగా చూసింది — "ఎప్పుడైనా మా ప్రోగ్రాం అయితే మిమ్మల్ని కూడా తీసుకు వెళ్తాం. కొత్త ఐటమ్స్ మీరుచూసి మీ అభిప్రాయాలు చెప్తుండాలి."

"థాంక్స్! తప్పకుండా వస్తాను." అంటూ అడ్రసురాసి ఇచ్చాడు. "ఇది కేవలం ఉత్తరాలకే. సాధారణంగా పగలు రూమ్‌లో ఉండను. చీకటి పడితేగాని ఆఫీసునుంచి రాను."

"ఏ ఆఫీసులో పనిచేస్తున్నారు?"

"అచ్చాఫీసులో. ఆఫీసు టెలిఫోన్ నెంబరుకూడా రాశాను."

నాగరాజు 'టీ' తీసుకొచ్చాడు.

"ఎవరి ఆతిథ్యం బావుంది మీకు?" అంది హాస్యంగా మోహిని.

"సింపుల్‌గా మీ ఆతిథ్యమే బావుంది" పద్మిని కేసి కొంటెగా చూస్తూ జవాబుచెప్పాడు గోపాల్.

'టీ' అయ్యాక వెళ్తానని లేచాడు. అక్కచెల్లెళ్ళిద్దరూ క్రిందికివచ్చి గేటు వరకూ సాగనంపారు.

వెనక్కివస్తూ పద్మిని అంది—"చాలా మంచివాడు."

విస్మయంగా చూసింది మోహిని—"ఎలా తెలిసింది నీకు?"

పద్మిని చిరునవ్వు నవ్వింది—"ఎలా తెలియలేదు నీకు?" గోపాల్ నైతిక వర్తనంమీద ఎందుకో చాలా విశ్వాసం కల్గింది పద్మినికి.

*    *    *

పద్మినీవాళ్లతో కలిసి గోపాల్‌కూడా ఒకసారి ప్రయాణం చేశాడు.

అక్కడ నాట్యప్రదర్శనం - దేవీశ్లోకం, అష్టపదీ—కృష్ణ లీలాతరంగం - కొంచెం పెద్ద కార్యక్రమమే అయింది.

మోహిని కొత్త ఐటమ్, 'కిన్నెర నృత్యం' చేసింది. రంగస్థలాలంకరణ మనోహరంగా అమర్చబడింది. భద్రాద్రి దేవాలయం - శిలామయమైన పురుషాకృతీ - నీటివాగులోకి

కిన్నెర రూపం ప్రేక్షకులకు విశ్వనాథవారి కిన్నెర కథను చెప్పక చెప్తున్నాయి.

మోహిని కిన్నెరగా నాట్యవేదికమధ్య నిలబడింది. ఉల్లిపొరలలాంటి తెల్లని పరికిణీకుచ్చెళ్లు పాదాలమీదికి పారాడుతున్నాయి. భుజాలమీదుగా గాలిలోకి తేలియాడు తున్నాయి పాము కుబుసాలవంటి పొడుగాటి వాణీలు. దండల చుట్టూ వ్రేలాడుతున్న మంచిముత్యాల గుత్తులతో శరీరాన్ని అంటిపెట్టుకుంది పట్టురవిక. విరబోసిన జుత్తు విశాలంగా వెనక భాగమంతా వ్యాపిస్తూ పిరుదుల క్రిందికి వ్రేలాడుతోంది.

కిన్నెర ఉద్విగ్న హృదయంతో ప్రేక్షకుల ఎదుట నిలబడివుంది.

భర్తతో అన్యోన్యంగా కాపురం చేసుకుంటోన్న తెలుగు పడుచు కిన్నెర. సహజంగా తెలుగు సంసారాల్లో సాగే పోరాటం ఆ యింట్లోనూ వుంది. అత్తాకోడళ్ళ వైషమ్యాలతో సున్నిత హృదయిని కిన్నెర శోకమూర్తి అయింది. ఆమె హృదయం ప్రళయ సముద్రం అయింది. ఆ వేశంతో అడవుల వెంట పరుగులెత్తింది. న్యాయం విచారించలేని కిన్నెరభర్త-ఆందోళనతో భార్యను వెంటాడి కౌగలించుకున్నాడు. అభిమానవతి కిన్నెర భర్త కౌగిట్లోనే కరిగి నీరై వాగై ప్రవహించింది.

"నవ్వులు నురుగలుగా
పలుకులవి తరగలుగా
కన్నులు మీనులుగా"—ప్రవహించింది కిన్నెర.

"నిను కౌగిట నదిమిన నా

తనువు పులక లెత్తలేదు

...  ...  ...

ఇంతీ! నను శిక్షింపగ

నింకొక మార్గము లేదకొ."

— అంటూ అనురాగవతియైన భార్యకోసం వెక్కివెక్కి చివరి క్షణాలలో తన అసమర్థతకు పశ్చాత్తాపం చెంది-రసాకృతియై ప్రవహించిన భార్యను చూడలేక-కన్నులు మందగించి-కంఠము సన్నబడి-కాయము కొయ్యబారి-పాషాణం అయిపోయాడు కిన్నెర భర్త.

కిన్నెర దుఃఖ గాథను స్మరించుకున్న శోకరసావేగంతో నృత్యాభినయం ప్రారంభించింది మోహిని. గురువు సుశ్రావ్యంగా కవితాలాపన సాగించాడు.

కరిగింది కరిగింది

కరిగింది కరిగింది

కరిగి కిన్నెరసాని వరదలై పారింది

"కదిలింది కదిలింది

కదిలి కిన్నెరసాని వదుగుల్లు పోయింది.

కదలగా కదలగా

కాంతి కిన్నెరసాని

కదులు తెల్లని పూల నదివోలె కదిలింది

నడవగా నడవగా

నాతి కిన్నెరసాని

తొడిమ యూడిన పూవు పడతిలా తోచింది

సతి రాయిగా మారి

పడియున్న చోటునే
పడతి కిన్నెరసాని విడలేక తిరిగింది
వెలది కిన్నెరసాని గలగలా తిరిగింది
తను వీడితే ఓర్చు
కొనలేడు కాబోలు
బ్రతికుండగా యింత
ప్రణయమ్ము కలదంచు
తెలిసితే యింకెంత
చెలిమి యుండేదంచు
తలపోసి తలపోసి..."

—తన తొందరపాటుతో ప్రేమధనుడైన పతికి శాశ్వతంగా దూరమైనందుకు అమితంగా వ్యథ చెందింది కిన్నెర. ఏ ఉపాయం చేతనైనా తాను మళ్ళీ మనిషినై పోవాలని ఆవలేనంత కోరికతో విలపిస్తూ—

"మాటి మాటికి మాద్రి
గుట్టగా పడియున్న
తన నీటుకాణ్ణి
చేతుల కౌగలిస్తుంది.
పలకవా యని మ్రోల
పడి పల్కరిస్తుంది
పతి గుట్టపై తాను
వాలి ఏడుస్తుంది."

—ఎంత ఏడ్చినా ఉపాయం తోచని కిన్నెర—

"ఓ నాధ! ఓ నాధ!
నాకుమల్లే నీవు

నదివోలె పారరా !
జలముగా యిద్దరము
కలిసి పోదామురా !
కెరటాలు కెరటాలు
కౌగలిద్దామురా !"

—అంటూ ప్రార్థించింది.

"నీయందు తప్పింక
నేను చెయ్యను లేర,
ఆనపెట్టితి వేని
అడుగుదాటును లేర—"

—అంటూ వాగ్దానాలు చేసింది.

దాంపత్య జీవితంలో మధురక్షణాలన్నీ గుర్తు చేసుకుంటూ వలవలా ఏడ్చింది. భర్తని ఎంత పిల్చినా లాభం లేదని తెలిసి–"పిలిచింది... పిలిచింది పిలుచుటా పేసింది" —తన కింక ప్రాప్తం లేదనుకుని జలదేవతలు వచ్చి బలవంత పెడుతోన్నట్టు — ముందు ముందుకు సాగింది.

"సాగింది సాగింది
జాలుగా పారింది
జలజలా పొంగింది
బిల బిలా నడిచింది"

కిన్నెర నడకలన్నీ రాగతాళ లయానుగుణంగా రసావేశంతో సహజంగా అభినయించింది మోహిని. ప్రేక్షకులంతా బరువెక్కిన గుండెలతో–నిశ్శబ్దంగా నర్తకి హావభావాలు పరిశీలిస్తూ ప్రతిమల్లా కూర్చున్నారు.

రంగస్థలానికి ఎదరగా సోఫాలో కూర్చున్న గోపాల్ సంభ్రమంతో కిన్నెరనృత్యాభినయంలో లీనమై పోయాడు.

కిన్నెర నృత్యం ముగిసింది. ముగ్ధులైన ప్రేక్షకుల కర తాళ ధ్వనులకు బెదిరి తెర జారిపడింది.

"అద్భుతం. విశ్వనాథవారి ఊహాసుందరికి చక్కని రూపకల్పన!" అన్నారెవరో.

"విశ్వనాథవారు కిన్నెరను సృష్టించకపోతే ఏనాడో ఆంధ్రుల అభిమానాన్ని పోగొట్టుకునేవారు" అన్నా రింకెవరో.

గోపాల్ సవ్వ్యముఖంతో వెనక్కి చూశాడు.

ప్రేక్షకులు చాలా సంతోషంగా ముచ్చటించుకొంటు న్నారు.

తిరిగి తెరలేచింది.

పచ్చికబయల్లో ఓపర్ణశాల - చుట్టూ నగ్నమై విరాజిల్లు తోన్న ప్రకృతి దృశ్యాలు - తాళ్లతోపు - చెరువుగట్టు - పూర్ణ చంద్రుడు - పండువెన్నెల!

ఓ పల్లెపడుచు వేదికమీదికి వచ్చింది. గోపాల్ కన్నులు కాంతితో మెరిశాయి. నల్లకి చెంగులు దోపుకున్న గళ్ళచీరా- ఎర్రరవికా - కట్టింది. చెంపలమీద జుత్తు ఎగదువ్వి నడినెత్తిన ఎత్తుగా కొప్పు పెట్టింది. నుదుటిమీద కాసంత కుంకంబొట్టూ- ముక్కుకి నత్తూ - అడ్డబాసా - చేతులనిండా నల్లగాజులూ - పైట మీద వ్రేళ్లాడుతోన్న తాళిబొట్టూ - కంఠాన్ని కౌగలించుకున్న నల్లపూసలూ - కాళ్ళకి అందెలూ - బేడీలూ - బితుకూ బితుకూ చూపులతో మోకాళ్ళ చుట్టూ చేతులు చుట్టుకుని

విచారంగా కూర్చున్న నర్తకిని చూస్తోంటే - అందరికీ జాలి వేసింది.

" నన్నిడిసిపెట్టెల్లినాడె నారాజు "

—గీతం ప్రారంభమైంది.

"అరె! ఎంకి! నండూరివారి ఎంకోయ్!"

"నేను ఇందాకే అనుకున్నాను స్మీ!"

ఉత్కంఠతో ప్రేక్షకులు నృత్యం చూడసాగారు.

వలపుకాడు పొరుగూరు పోయి వస్తానన్నరోజుకి రాక పోతే ఆ వలపుకత్తెకి ఎంత దుఃఖమైనా వస్తుంది. ఎన్ని అను మానాలైనా పుడతాయి.

పాపం నాయుడుబావ వూరెళ్ళి రెండురోజులు దాటి పోయింది.

" మొన్న తిరిగొస్తానన్నడే! నాడె తిరిగొస్తానన్నడే! "

—కానీ రాలేదు. కదిలినా మెదిలినా ఎంకికి నాయుడుబావే ప్రత్యక్షం.

" నీళ్ల తేబోతంటే - నీతోడె ఓలమ్మి
నావెంట ఎవ్వరో నడిసినట్టుంటాది.
అద్దములొ సూత్తుంటె అదేటె ఓలమ్మి
నా ఎనక ఎవ్వరో నవ్వినట్టుంటాది.
సల్లన్ని ఎన్నెల్లో సాపేసి కూకుంటె
ఒట్టమ్మి ఒల్లంత ఉలికులికి పడతాది- "

—పాపం ఎంకి అవస్థ చూస్తోంటే జాలివేస్తుంది. ఎంకి మనస్సు పరిపరివిధాల శంకిస్తోంది నాయుడిబావ నైజంగురించి.

" నీ తైన ఓడె నారాతెట్టగుండదో
కళ్ళల్లొ సత్తెముగ కట్టినట్టుండాది "

నిట్టూర్చింది ఎంకి. ఎంకి నిస్సృహాచూస్తోంటే నాయుడు బావమీద కోపంకూడా వచ్చింది ప్రేక్షకులకి. ఇచ్చిన మాట నిలబెట్టుకోకుండా అమాయకురాల్ని కంగారుపెడతాడా? — "ఈసారి వాడొచ్చినప్పుడు నువ్వు పల్కరించకే ఎంకీ!" అని ఓదార్చాలనిపించింది.

" నవ్వి డిసిపెట్టెల్లినాడె నారాజు "

దిగులుగా కూర్చునేవుంది ఎంకి. తెరపడింది.

చప్పట్లతో హుషారంతా ప్రదర్శించారు ప్రేక్షకులు.

"పూర్వకవులంతా గొప్పగొప్ప రాజకుమార్తెల ప్రేమలూ - దేవకన్యల అనురాగాలూ గ్రంథాల కెక్కించారే గానీ - పూరిగుడిసెల్లో అమాయకపు గుండెల అభిమానాలు ఎవరు అర్థంచేసుకున్నారయ్యా - నండూరువారు తప్ప" అను కొంటూ లేచారు.

గోపాల్ హుషారుగా లోపలికి వెళ్ళాడు. ఎంకివేషంతో వున్న పద్మిని సిగ్గుపడుతూ కర్టెన్ చాటుకి పరిగెత్తింది.

మోహిని నవ్వి — " రండి రండి, మీ అభిప్రాయా లేమిటో తొందరగా చెప్పండి బాబూ! కంగారు పడి చస్తున్నాం" అంది.

" మీరిద్దరూ ఒక్కసారిగా ఎంతో గొప్పవాళ్ళై పోయారు. ప్రేక్షకులు తెగ మెచ్చుకొంటూ వెళ్ళారు "

"పోనీలెండి, తిట్టుకోలేదుగా? మరి కిన్నెర గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

" వనములుదాటి - వెన్నెల బయలు దాటి
తోగులనుదాటి - దుర్గమాద్రులనుదాటి
పులుల యడుగుల నడుగులు కలుపుకొనుచు-
రాళ్ళవాగుదాటి పథాంతరములు దాటి
అచట కిన్నెరసాని - నాయాత్మయందు
నిప్పటికిని దాని సంగీతమే నాదించు— "

"కిన్నెరకవి అన్నట్టు - ఆ సంగీతంతోపాటు మీ నృత్యం కూడా నా మనస్సులో ముద్రపడి పోయింది. మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తోంది. ఎన్నిసార్లు చూసినా తనివితీరదేమో!"

"థాంక్సండీ గోపాల్! మీ వుద్దేశ్యం ఎలా వుంటుందోనని నేను చాలా సంశయించాను." సంతృప్తిగా నవ్వింది మోహిని.

పద్మిని తెల్లటిచీర కట్టుకుని - పొడుగాటి పాలుజడ అల్లుకొంటూ నవ్వుతూ వచ్చింది.

"మీ నాయుడుబావ కన్పించాడా? అంత నవ్వుకొంటున్నారు?" గోపాల్ చిలిపిగా చూశాడు.

మోహిని నవ్వింది - "అక్కయ్య బ్రహ్మాండంగా చేసింది కదండీ! అబ్బ! ఎంకి అంటే అచ్చం అలాగే వుంటుందనిపించింది కదండీ!"

"అంతేనా! రంగస్థలంమీద కూర్చున్న ఎంకి ఎంత స్పష్టంగా కన్పించిందో - ఎంకి గుండెల్లో తిష్ఠ వేసుకున్న నాయుడు బావకూడా అంత స్పష్టంగానూ కన్పించాడు." అన్నాడు గోపాల్ పద్మిని మొహంలోకి చూడాలని ప్రయత్నిస్తూ.

జడ ముందుకు వేసుకుని అల్లుకొంటూ నేలచూపులు చూస్తోన్న పద్మిని కళ్లెత్తి గోపాల్ కేసి చూడలేకపోయింది. ఆ ఒక్క క్షణంలోనే అతనెంతో చేరువైనట్టు తోచింది.

*  *  *

"రండి రండి," అంటూ ఆహ్వానించింది గేటు తీసుకు వస్తోన్న గోపాల్‌ని మోహిని - "వూరునుంచి వచ్చాక మళ్లా మీరు కన్పించనే లేదే?"

"ఆఫీసుపని ఎక్కువగా వుండి రాలేకపోయానండీ!" గోపాల్ హాల్లోకి చూస్తూ అడిగాడు - "మీ సిస్టర్ లేరా?."

"లేదండీ! ఫ్రెండ్స్‌తో మ్యాట్నీకి వెళ్తానని చెప్పింది."

గోపాల్ వుత్సాహమంతా గాలిలో కలిసిపోయినట్టయింది.

"పైకి వెళ్దాం! రండి," అంది మోహిని.

"ఎందుకులెండి, ఇక్కడే కూర్చుందాం."

ఇద్దరూ హాల్లోకి వెళ్లారు. గోపాల్ పేపరు అందుకుని చూడటం ప్రారంభించాడు.

మోహిని లోపలికి వెళ్ళి 'టీ' కోసం చెప్పి వచ్చింది.

"ఏమిటండీ అంత శ్రద్ధగా చదివేస్తున్నారూ?" అంటూ సోఫాలో కూర్చుంది.

"ఏదో కాలక్షేపం. పోనీ మీరేమైనా చెప్పండి" పేపరు మడిచి టేబుల్ మీద పడేశాడు - "మళ్ళా ఏమైనా కొత్తవి నేర్చుకొంటున్నారా?" అన్నాడు.

"లేదండీ! మా మాస్టారు వెయ్యిళ్ళ పూజారి" నవ్వుతూ అంది మోహిని - "ఆయనికి స్టూడెంట్సు ఎక్కువ. ఎంతసేపూ వాళ్ళసంఖ్య పెంచాలనే తాపత్రయ పడుతూంటారు.

వాళ్ళందర్నీ పరీక్షలకి కట్టించటంతో సరిపోతుంది ఆయనకి. ఒక కొత్త ఐటమ్ కంపోజ్ చెయ్యాలంటే నెలలకు నెలలే అవలీలగా గడిచి పోతుంటాయి."

"మరి మీరూ అశ్రద్ధగా వూరుకుంటే ఎలా ?"

"లేదండీ! నాకేం అశ్రద్ధలేదు. అసలు నేను చాలా తొందర మనిషిని కూడాను. కిన్నెరసాని మిగతా కథ కూడా కంపోజ్ చెయ్యండి మాష్టారూ! అని నిత్యం అడుగుతూనే వున్నాను. ఇదిగో, ఈ ఎగ్జామినేషన్స్ ఐతేగాని ఆయనికి తీరిక వుండేలా లేదు. ఏం చేస్తాం ?"

"పోనీ మళ్ళా ఎక్కడైనా ప్రోగ్రాం వుందా ?"

"చెయ్యాలంటే ఏవో వుంటూనే వుంటాయి. నాకే యిష్టం లేదు. చేసినవే చెయ్యటం బొత్తిగా విసుగేస్తోంది. మళ్ళా కొత్తదేదైనా నేర్చుకునేవరకూ ఎక్కడా చెయ్యదల్చుకోలేదు."

గోపాల్ ఏం మాట్లాడలేదు. అతని దృష్టి అంతా వీధి గేటు వేపే వుంది.

రాజమ్మ 'టీ' తెచ్చింది.

"తీసుకోండి, చాలా కామ్‌గా కూర్చున్నారు." అంటూ టీ కప్పు అందించింది మోహిని. టీ తాగుతూ కాలక్షేపాని కో ప్రశ్న వేశాడు.

"మీ ప్రోగ్రామ్‌కి ఎంత డబ్బు వస్తూ వుంటుంది?"

"ఏడెనిమిది వందలపైనే వస్తుందనుకుంటాను, వెయ్యి నూటపదహార్లు తీసుకున్న సందర్భాలుకూడా వున్నాయి."

"అందులో మాష్టారి కెంత? "

"ఎంతేమిటి. ఆర్కెస్ట్రాకి పోను - మిగతాది ఆయనే తీసుకుంటారు."

గోపాల్ టీ పూర్తిచేసి కప్పు టేబుల్‌మీద పెడుతూ "అయితే మాస్టారు ఎక్కువగా ప్రోగ్రామ్స్ మీదే దృష్టెందుకు కేంద్రీకరిస్తున్నారో మీకు తెలీటం లేదూ?" అన్నాడు.

మోహిని విస్మయంగా చూసింది. మాస్టారి గురించి అలా ఆలోచించటం చాలా దారుణంగా తోచింది - "లేదండీ! ఆయన్ని ఎప్పుడూ అలా శంకించలేము" అంది నొచ్చుకొంటోన్నట్టు.

గోపాల్ నవ్వుతూ - "మీరు చెప్పింది వింటే నాకుమాత్రం అలాగే తోచింది. పోనీ మీకేం అనుకోకండి" - మళ్లా దృష్టి వీధికేసి తిప్పిచూస్తూ కూర్చున్నాడు. కొంతసేపటికి విసుగువచ్చిన వాడిలా లేచాడు - "వెళ్తానండి!"

"అదేమిటి ? అప్పుడే? అక్కయ్య రానేలేదు."

"అదే యింతసేపూ చూశాను."

అక్కయ్యకోసమే ఇంతసేపూ కూర్చున్నాడా? నిశితంగా చూసింది మోహిని - "పోనీ మీరు వస్తోన్నట్టు అక్కయ్యకి ఫోన్ చెయ్యలేకపోయారా?" అంది నవ్వుతూ.

"లేదండీ! నేను వస్తానని ముందు అనుకోలేదు."

"పోనీ యిప్పుడేం మించిపోయింది, కాస్సేపు కూర్చోండి ఎలాగూ వచ్చేస్తుంది."

పద్మినికోసమే మళ్ళా కూర్చోవటం గోపాల్ కిష్టంలేదు- "వెళ్తాను. రూమ్‌లో కొంచెం పనివుంది."

"ఏం పని ? వంటచేసుకోవాలా ? అలా అయితే అసలే వెళ్ళొద్దు. ఈ పూట ఇక్కడే భోంచేసి మరీ వెళ్లండి."

"థాంక్స్ ! నేనుమాత్రం వెళ్ళాలి." నవ్వుతూనే హాల్లోంచి బయటికి వెళ్ళాడు గోపాల్. మోహినికూడా లేచి వెళ్ళి సాగనంపింది.

సాయంత్రం పద్మిని వచ్చి రాగానే నవ్వుతూ చెప్పింది మోహిని—"అక్కయ్యా! ఇందాక నీకోసం గోపాల్ వచ్చాడు."

బిత్తర పోయింది పద్మిని—"అదేమిటి? నాకోసం ఏమిటి?"

"మరి అలాగే అనిపించింది నాకు. వస్తూనే నీగురించి అడిగాడు. లేవని చెప్పగానే వుస్సురని నిట్టూర్చాడు. పైకి వెళ్ళి కూర్చుందాం రమ్మంటే రాను పొమ్మన్నాడు. మాటిమాటికి గేటు కేసి చూస్తూ మెట్లమీద కూర్చున్నట్టే కూర్చున్నాడు. ఒక్క అరగంట మాత్రం ఎలాగో ఓపిక తెచ్చుకున్నాడు. సరి! వెళ్తానని లేచాడు. కూర్చోవయ్యా, బాబూ ! అంటే ససేమిరా విన్నాడు కాదు. నీ ఖర్మ పొమ్మన్నాను." అతిశయోక్తులతో—నవ్వులతో చెప్పింది మోహిని.

పద్మినికూడా నవ్వుతూ అంతా విని—"అదా నాకోసం రావటం?" అంది.

"అవును మరి, నువ్వు వుంటే గంటలతరబడీ కూర్చుంటాడుగా?"

"అతనికేం పనివుందో వెళ్ళిపోయాడు."

"అంతి పని వున్నవాడు అసలు రావటం ఎందుకూ?"

"సరి! సరి! అసలేం మాట్లాడాడు ?"

"మొహం పేపర్లో దాచుకుని కూర్చున్నాడు. ఒక్క మాటకూడా మాట్లాళ్ళా.

"అదేం?"

"నామీద కోపం."

పద్మిని నవ్వుకొంటూ పైకి వెళ్ళిపోయింది బట్టలు మార్చుకోవటానికి.

స్నానంచేసి తలదువ్వుకొంటూ అద్దంముందు కూర్చుంది.

గోపాల్ వచ్చాడట- ఎందుకూ? తనకోసం. నవ్వొచ్చింది పద్మినికి. తనకోసం రావటం ఏమిటి? లేకపోతే మోహిని ఎందుకలా చెప్పింది? నిజంగా గోపాల్ తనకోసమే వస్తాడేమో! తీరా అతను వస్తే తను లేకపోయింది—

అద్దంలో చెల్లెలు నవ్వటం కన్పించి కంగారుపడుతూ వెనక్కి తిరిగింది.

"నిజంగా నువ్వు తలదువ్వుకుంటున్నావా? స్వగతాలు చెప్పుకొంటున్నావా?" మోహిని దగ్గిరికి వస్తూ అంది.

"ఛ! లేదే! ఏదో ఆలోచన వస్తేనూ అలా కూర్చున్నాను."

"సరేగానీ నువ్వీమధ్య వీణ ప్రాక్టీస్ చేస్తున్నావా?"

"ఎందుకు లేదూ? రోజూ చేస్తున్నాను. నువ్వు యింట్లో వుండవు సరిగదా..."

"అయితే మొన్న రాసియిచ్చిన స్వరం వాయించావా? ఇవ్వాళ కృతి వాయించరాదూ?"

దువ్వెన వేళ్ళతో పట్టుకుని యిబ్బందిగా చూసింది పద్మిని - "అబ్బ! ఈపూట నేనేం చెయ్యలేనే మోహినీ!"

"ఏం? ఏమైంది?"

"చాలా అలసటగా వుంది బాబూ !"

"ఎందుకమ్మా ? హాయిగా కుషన్ ఛెయిర్‌లో కూర్చుని సినిమా చూసి వచ్చినందుకా ?"

"ఆ సినిమా చూడ్డానికే ఎంత శక్తి - ఎంత సహనం- ఎంత శాంతం - ధారపోశానో నీకేం తెలుసు ? నువ్వాయితే ఓ పావుగంటకే లేచి చక్కా వచ్చేదానివి."

"పాపం అందుకని ఈపూట వీణవాయించటం ఎగవేస్తానంటావు. అంతేనా ? వద్దులే ! హాయిగా దేవకన్యలా కలలు కంటూ పడుకో."

"అలా కోపం తెచ్చుకోకే మోహినీ ! రేపటినుంచీ రెగ్యులర్‌గా ప్రాక్టీస్ చేస్తాగా ?"

"అసలు నీ కిప్పుడేమైందో చెప్పు."

"అలా అంటే ఎలాగే మోహినీ ! నాకు చాలా చికాగ్గా వుంది. నా తల్లి వికదూ ? నువ్వు వాయించు, నేను వింటాను."

మోహిని కాస్త శాంతించింది.

"నువ్వాయితే హాయిగా వాయిస్తావు. చక్కగా పాడుతావు. సుఖంగా వింటాను. సరేనా ?"

"దువ్వెన పారేసి తొందరగా రా !"

"ఇదిగో! వచ్చేస్తున్నా!"

మోహిని హాల్లోకి వెళ్ళిపోయింది. వీణ ఒడిలో పెట్టుకుని టుఁయ్ టుఁయ్ మంటూ తీగలు మీటుతూ శృతులు సరి జేసుకోసాగింది.

వీణావాదనంలో తల్లి కళాప్రావీణ్యం అంతా మోహినికి అబ్బింది. ఎలాంటి సాహిత్యాన్నయినా రాగాలు నిర్ణయించి

స్వరకల్పన చేసి సంగీతంలోకి అనువదించగలదు. కమ్మని కంఠంతో లలితగీతాలు పాడటంలోకూడా నేర్పు కలదే!

తెల్లగా పొడవుగా కాంతికిరణాలలావున్న చేతివేళ్ళని హుషారుగా వీణ మెట్లమీద పరిగెత్తిస్తూ పరిసరాల్ని మధుర శబ్దాలతో నింపసాగింది.

ముస్తాబు చేసుకునివచ్చి - చెల్లెలికి ఎదరగా కూర్చున్న పద్మని మోహిని చేతిమీద చేయివేసి వారిస్తూ అంది,

"నాదో చిన్న విన్నపం."

"ఏమిటే?"

"కోప్పడకూడదు?"

"ప్రామిస్. చెప్పు!"

"అయితే విను. మొదటిది - అంతూ దరీ లేని ఆలాపన గోలతో నా సహనాన్ని పరీక్షించకూడదు. రెండోది-గమకాలూ-సంగతులూ-అతిగాపాడి నా ప్రియమైన ప్రాణాల్ని..."

"షటప్!" ఎర్రగా చూసింది మోహిని-"నువ్వు కాబట్టి-అదీ ప్రామిస్ చేశాను కాబట్టి-ఆమాత్రం వినగలిగాను. మోహిని ఎదట సంగీతాన్ని గురించి అంత హాస్యంగా మాట్లాడటానికి ఎన్ని గుండెలు నీకు!"

"అదికాదే చెల్లాయీ! నా సహనం అంతా ఇందాకాసినిమాకే ధారపోసి వచ్చానని చెప్పానుకదే! అందుకని..."

"నో నో. నేనేం వినను. నోరు మూసుకో. మరేం మాట్లాడకు. నేను ఎలాపాడితే - ఎలా వాయిస్తే అలా విను. నువ్వే సంగీత మాధుర్యాన్ని అనుభవించలేకపోతే ఇక

సామాన్యులమాట ఏమిటి? బొత్తిగా కళానుభవంలేని మోటు మనిషిలా మాట్లాడతావేం :"

మూతి ముడుచుకుంది పద్మిని.

మోహిని అక్కగార్ని అపరాధిని చూసినట్టు చూసింది— "ఆలాపన వద్దన్నావుకదూ? నీకు నోరెలా వచ్చిందే అక్కయ్యా? ఆలాపనతో కాకపోతే సంగీత కళాకారుడి ప్రతిభ దేనితో వెల్లడౌతుందే? కృతులు ఎవ్వరైనా పాడ గలరు, పేరంటాలో మంగళహారతులు ఎంతమంది పాడటం లేదూ!"

"అబ్బ! అదికాదే మోహినీ!"

"ఊహూ! నువ్వేం మాట్లాడకు. నేను చెప్పేదంతా పూర్తిగా విను. ఓ విద్వాంసుడు సంధ్యవేళ కూర్చుని రాత్రి అంతా గడిచి తెల్లవారేసరికి ఆలాపనా పల్లవీ పాడి ముగించాడట. ఆశ్చర్యంగావుంది కదూ?"

స్ఫురించి భయపడిపోయింది పద్మినికి.

"మరో విద్వాంసు డేమన్నాడో తెలుసా?"

"ఏమన్నాడూ" భయంగా చూసింది పద్మిని.

"గమకాలూ సంగతులూ లేకుండా శుద్ధరాగంతో సంగీతం పాడితే— ..."

"పాడితే...?"

"వెన్నెలలేని రాత్రిలా — పద్మాలులేని సరస్సులా — సూర్యుడు లేని పగలులా — ఇంకా ఎలాగో ఎలాగో వుంటుం దన్నాడు. అసలది సంగీతమే కాదు పొమ్మన్నాడు."

"[illegible] [illegible] [illegible] [illegible] పద్మిని."

"పూర్వం సంగీత విద్వాంసుల చరిత్ర లేవి చూసినా ఏవేవో ప్రజ్ఞా విశేషాలు చూపించి ఎన్నెన్నో బహుమానాలు అందుకున్నట్టే తెలుస్తుంది."

పద్మినికి విసుగు పుట్టింది – "ఏ రాకుమారుడో మారు వేషంలోవచ్చి నీ గానమాధుర్యానికి – సంగీత ప్రతిభకీ మెచ్చి ఏ రత్నఖచిత వీణనో బహూకరించి మరీ వెళ్తాడులే."

"ఒక్క రాజకుమారుడేం ఖర్మ ? ఒకనాటికి యావత్ భారతదేశం నా సంగీతానికి ప్రశంసలమీద ప్రశంసలు కురిపిస్తుంది చూడు." నవ్వింది మోహిని.

"పోనీ అప్పుడు నేనూ ఒప్పేసుకుంటాలే. ఇవ్వాల్టికి మాత్రం..."

"అదేం కుదరదు. ఇంకా నేను చెప్పాల్సింది చాలా వుంది. సంగీతం గురించి నువ్వింత హాస్యంగా మాట్లాడుతున్నావు కదా ?..."

ఇక వుపన్యాసం వినక తప్పదని గుండె రాయి చేసేసుకుని కూర్చుంది పద్మిని.

"జయదేవుడి గీతగోవిందం – రామామాత్యుడి సర్వమేళ కళానిధీ – నారాయణతీర్థుల కృష్ణలీలా తరంగాలూ – క్షేత్రయ్య మువ్వ గోపాల పదాలూ – పురందరదాసు పాండురంగ పదాలూ – త్యాగరాజు కృతులు – రామదాసు కీర్తనలూ – ఇవన్నీ ఎన్నివందల సంవత్సరాలనుంచీ – ఎన్ని కోట్ల మంది అంతరంగాలను పరవశింపజేస్తూ సంగీతకళను సజీవంగా వుంచుతున్నాయో ఆలోచించావా ? ఆ విద్వాంసులంతా ఎంతలేసి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి చిరంజీవులుగా

నిల్చివున్నారో అర్థం చేసుకున్నావా ?"

వద్మిని బుద్ధిగా నోరు విప్పకుండా కూర్చుంది. "అసలు సంగీతంలో మహాత్తుకూడా వుందంటారు. జయదేవుడు గీత గోవిందం రాస్తోన్న రోజుల్లో శ్రీకృష్ణుడు పద్మావతికి కన్పించి స్వహస్తాలతో అష్టపది రచించి మరీ వెళ్ళాడట.

రామదాసు సంగీతంతో తిట్టిపోసేసరికి రామలక్ష్మణులు గజగజలాడుతూవచ్చి తానీషాకు డబ్బు చెల్లించి మరీ పోయారట.

త్యాగరాజు భక్తిపారవశ్యంతో ఓ కృతి పాడేసరికి రాముడు కలలో కన్పించి కావేరిలో వడివున్న విగ్రహాల మాట చెప్పాడట. మేఘరంజనిపాడి వర్షాలు కురిపించిన విద్వాంసు డెవరో వుండేవాడట..."

మోహిని ధోరణి వింటోన్నకొద్దీ పద్మినికి ఒళ్ళు మండింది. చురచురా చూస్తూ అంది-"అమృతవర్షిణి కూడా పాడి అమృతం కురిపించుకొని తాగి ఇంకా ఎక్కడేనా బ్రతికే వున్నాడేమో వెదుకు."

"వెదుకుతా. ముందు నే చెప్పేది మాత్రం విను. మహాత్ముల సంగతి కాదూ! మీరా చరిత్ర విన్నావా ? సంగీతం పాడిపాడి భగవంతుడిలో ఐక్యమై పోయింది. ఇంకానేమో..."

"ఇంతకీ అలా భగవంతుడిలో ఐక్యమై పోదామనా ఏమిటీ ఈ తాపత్రయం అంతాను?"

"అదంతా మాటవరసకి చెప్పాను. అసలానిదర్శనాలన్నీ అవునో కాదో నే నెప్పుడూ తర్కించుకోలేదు. నా భక్తి ఏ భగవంతుడిమీదా లేదు. ఒక్క సంగీతం మీదే. ఒక్కటికి

మాత్రం నిజం. శిశువులూ పశువులూ కూడా తన్మయత చెందే సంగీతమాధుర్యంతో హాయి గొలిపే మానసికానందం కలుగు తుంది. పోనీ అది ఒప్పుకుంటావా?"

"కాదనటానికి నేనేం బండరాయి ననుకున్నావా? కానీ..."

"ఆగు, నాకు తెలుసు. నేనుకూడా నీవుద్దేశాలతో ఏకీ భవిస్తాను. అంతా శాస్త్రమే అయితే జటిలంగా వుంటుంది. లలితం ఎప్పుడూ హృదయానికి సన్నిహితం అవుతుంది. కర్ణాటక సంగీతంలో ఆ రెంటికీ సమన్వయం సాధించాలన్నదే నా ధ్యే యంకూడా."

పద్మిని మొహం పద్మంలా వికసించింది - "బ్రతికించావు తల్లీ! తెల్లవార్లూ ఏ రాగాలాపన వినమంటావోనని భయంతో చస్తున్నాను." అంది పుట్టెడు సంతోషంతో.

మోహిని చిరునవ్వుతో వీణ ఒళ్లోకి తీసుకుని సుతారంగా వ్రేళ్లు సారించసాగింది. కదనకుతూహలరాగం ఎత్తుకుని తొందరగానే ప్రారంభించింది-

"రఘువంశ సుధాంబుధీ చంద్రశ్రీ రామరాజేశ్వర"—

అంటూ.

"అఘ మేఘమా!
దత శ్రీకరా
అసురేశ - మృగేంద్ర - ధరాజగన్నాథా!"

మధుర వీణానిక్వాణాలు కర్ణపుటాలకు సోకీసోకగానే నాగస్వరం విన్న నాగుబాములాగా మేడపైకి వచ్చాడు బలరామయ్య. వీణతీగలమీద నాట్యం చేస్తోన్న వ్రేళ్ళ కదలి [illegible] స్తున్నాయి.

" భృగునందనా
గర్వభంజనా – భృగు...నందనా!"

పదేపదే చరణాంశాన్ని పల్లెవేస్తూ తన్మయత్వంలో మునిగింది మోహిని.

" బృందారక – బృందహితకదనా!
నిగమాంతవాస – ముదావనా!
నీరజాక్ష – వెంకటేశ్వర......
రఘువంశ సుధాంబుధీ...... "

సంగీతాంబుధిలో పూర్తిగా మునిగిపోయాడు బలరామయ్య.

పద్మిని నెమ్మదిగా లేచి మెత్తమెత్తగా నడుస్తూ గదిలోకి వెళ్ళిపోయింది.

పద్మిని మనస్సు చాలా కలవరంగా వుంది. సంగీత మాధుర్యానికి కూడా లొంగకుండా దేనికోసమో ఆరాట పడుతోంది.

మోహిని వీణావాదనం ఓ గంటపైగా సాగుతోనే వుంది. తాతయ్య అడిగిన కృతులన్నీ వాయించింది. చిట్ట చివర—

" వాతాపి గణపతిం భజేహం"

ఎత్తుకొంది.

అది వింటూ తాతయ్య ఎవర్ని స్మరించుకొంటాడో – ఎంత పరవశించిపోతాడో మోహినికి తెలుసు.

" కలుష విదూరం
భూతాకారం

అనాది గురుగుహ
తోషిత బింబం
హంసధ్వని భూషిత హేరంభం."

వీణావాదనం ఆగింది – వేళ్లు ఒత్తుకొంటూ అడిగింది మోహిని – "ఎవరు బాగా వాయించారు తాతయ్యా, అమ్మా? నేనా? నిజం చెప్పాలి," అంది నిర్మలంగా నవ్వుతూ.

గత స్మృతులలో కొట్టుకుంటోన్న బలరామయ్య నీరసంగా కళ్లు విప్పి దీనంగా చూశాడు.

"ఏమో! ఏమో! నాకు తెలీటంలేదమ్మా! కళకూడా అచ్చు ఇలాగే – ఈ శృతితోనే – ఇలాంటి సంగతులతోనే వాయించేది. అమ్మ అంతరంగంలో అణగారిపోయిన కళాభిమానం అంతా నీకు అబ్బింది తల్లీ! నువ్వు పాడితే నేను విని ఆనందిస్తానని కళ నిన్ను నాకు యిచ్చివెళ్ళిందమ్మా! అంతే. అంతే."

తాతయ్య కళ్ళు చెమర్చటం చూసి మోహిని దిగాలు పడింది.

"లే తాతయ్యా! చాలా ఆలశ్యమైంది. భోజనాలకి వెళ్దాం." అంటూ ప్రసక్తి మారుస్తూ వీణ కిందపెట్టి లేచింది.

* * *

"అక్కయ్యా! నువ్వు బయల్దేరటంలేదూ? ఇంకా ఏమిటా చదువు?" అంటూ వచ్చింది మోహిని పద్మినిగదిలోకి.

పుస్తకంలోంచి తల ఎత్తి నిదానంగా చూస్తూ "ఎక్కడికి?" అంది పద్మిని.

"ఓహో! పద్మినీదేవిగారు పరాకు చిత్తగిస్తున్నారే!

ఇవ్వాళ నిర్మల పుట్టినరోజని మాష్టారి భార్య చెప్ప లేదూ ?''

"ఓ! అదా! మర్చేపోయాను."

"సరే; గుర్తువచ్చిందిగా? లేచిరా! ఇదిగో, నీ సింగారింపులో మునిగి కూర్చున్నావంటే నాదారిన నేను పోతాను."

పద్మిని నవ్వింది – "వెళ్ళు, నేను రాను."

"ఏం; ఎందుకురావూ ?"

"ఒంట్లో బాగాలేదు."

"నిజంగానా ?"

పద్మిని అబద్ధాలతోరణం కట్టలేక నవ్వేస్తూ–

"కాదే! గోపాల్ వస్తానని ఫోన్ చేశాడు."

"ఎందుకూ ?"

"ఏమో !"

"ఏమో ఏమిటి ? అంత రాచకార్యం ఏముంది? ఏదో కాలక్షేపంగా కూర్చోటానికేగా వచ్చేదీ? మాష్టారింటికి వెళ్ళాలని చెప్పలేక పోయావా ?"

"తీరా ఫోనెత్తినప్పుడు నాకీసంగతి గుర్తురాలా. ఇంట్లోనే వుంటానని చెప్పి రమ్మన్నాను."

"ఊ! అయితే, నే ఒక్కదాన్నీ వెళ్ళనా ?''

"పోనీ నువ్వే చెప్పు. మాట యిచ్చి తప్పిపోతే బావుంటుందా ?"

"బావుండదు, బావుండదు. ఎవరో ఫ్రెండ్ కోసం వెయిట్ చేయటంవల్ల రాలేక పోయావని చెప్పనా మాష్టారితో?"

"తల్లి! తల్లి! అంత పనిమాత్రం చెయ్యకు. తలనొప్పిగా వుండి పడుకున్నానని చెప్పెయ్."

"వెధవ అబద్ధాలాడటానికి నాకేం ఖర్మ!"—విసురుగా వెళ్తోన్న చెల్లెలు వెనక పరిగెత్తింది పద్మిని—

"మోహినీ! మోహినీ!"

మోహిని చేతిలో ఏదో పార్శిల్ పట్టుకుని క్రిందికి వెళ్ళిపోయింది.

నవ్వుకొంటూ పద్మిని అద్దంముందు కూర్చుంది సింగారానికి.

గోపాల్ మరో అరగంటకి వచ్చాడు.

అతన్ని చూస్తోనే పద్మిని మొహంనిండా సంతోషం—కన్నుల్లో సిగ్గుదొంతరలూ దోబూచులాడాయి.

"రండి, రండి." పైకి దారితీసింది. మంత్రముగ్ధుడిలా అనుసరించాడు గోపాల్.

ఇద్దరూ పద్మిని గదిలోకి వెళ్ళారు.

టేబుల్‌మీద నాలుగైదు రకాల స్వీట్సూ-యాపిల్ పళ్లూ అమర్చివున్నాయి.

"కూర్చోండి. అచేమిటలా కొత్తవాళ్లలా నిలబడ్డారు?" కుర్చీ జరిపి చనువుగా చూసింది పద్మిని.

గోపాల్ పద్మినిని విస్మయంగా చూస్తూ - "నిజంగా ఇవ్వాళంతా కొత్తగా వుంది నాకు." తన ఆశ్చర్యాన్నంతా బయటబెట్టాడు.

"కొత్తేమిటి? మీరు వస్తానని ముందు చెప్పారుగా? అందుకని కాస్త బాగా మర్యాద చేద్దామని బుద్ధి పుట్టింది. అంతే." నవ్వింది పద్మిని.

"అంతేకాదు, ఇంకా ఏదో కొత్తవుంది." గోపాల్

నిస్సంకోచంగా మెరిసేకళ్ళతో పద్మినిని నఖశిఖ పర్యంతం చూస్తూ నించున్నాడు.

పద్మిని ఎంత దాచాలని ప్రయత్నిస్తోన్నా ఆ కొత్తదనం వెల్లడౌతూనేవుంది. ఫుల్‌వాయిల్ చీరమీదనుంచి తెరలు తెరలుగా వస్తోన్న మొగలి సువాసనలు కొత్త! పొడుగాటి వాలుజడలో మెడలమీదికి ప్రేళ్లాడుతోన్న గులాబీలమాల కొత్త! మాటిమాటికీ మొహంమీదికి వచ్చిపోతోన్న సిగ్గు తెరలు చాలా చాలా కొత్త!

జారిపోతోన్న పైటకొంగుని ఎడంచేతి కిందనుంచి ముందుకు తీసుకొంటూ సున్నితంగా నవ్వింది పద్మిని. ఆ నవ్వు కన్నమనసుని తేటతెల్లం చేస్తోంది.

గోపాల్ అలా చూస్తూంటే పద్మినికి ఒళ్ళంతా పులకరించింది. సిగ్గుతో మొహంతిప్పి చూడలేక టేబుల్ దగ్గరికిపోయి నించుంది. ప్లేట్లమీద మూతలుతీసి వేరుగా పెడుతూ వారగా చూసింది -

"మీరలా బుద్ధదేవుడిలా కూర్చోవటంకాదు."

"మరేం చెయ్యమంటారు ?"

"వీటి పనేదో చూడండి."

"ఏం చూడమంటారు ?"

పద్మిని నవ్వింది - "ఎందుకంత కోపం నామీద ? కాస్త అతిథి సత్కారఫలం దక్కనివ్వకూడదా నాకు ?"

"నేనేం అతిథిని కాదుగా ? తిథీ నియమాలూ చెప్పకుండా రాలేదుగా ? గంటలూ - నిముషాలూ కూడా చెప్పి మరీ వచ్చాను."

పద్మిని వెనక్కి తిరిగి చూస్తూ చిరుకోపంగా అంది -
"ఇంతకీ మీ రనేదేమిటి?"
"నేనేమీ అనటంలేదే!"
"ఏమీ అనద్దనే నేచెప్పేది. బుద్ధిగా కూర్చుని చెప్పినట్టు వినండి, యాపిల్స్ కోసియిస్తూ వుంటాను, తినండి."
"సారీ పద్మినీ! ఇదంతా నాకేం యిష్టంలేదు."
పద్మిని సంశయంగా చూసింది.
"అవును, మీతో కాస్సేపు మాట్లాడి - రికార్డులేమైనా విని వెళ్దామని వచ్చాను. మీరిలా పార్టీలూ డిన్నర్లూ చేస్తానంటే అసలు నేనిక్కడికి రాలేను." స్పష్టంగా అయిష్టం వెల్లడిస్తూ అన్నాడు గోపాల్.
పద్మిని తలదించి యాపిల్ ముక్కలు కోస్తూ అంది - "రావటం రాకపోవటం మీయిష్టం. అంతేగాని నాపనిని విమర్శించేహక్కు మీ కేం లేదు."
"నిజమే, కానీ..."
"మీరింత మొహమాటపడాల్సిందేముంది?" తల ఎత్తి చిరునవ్వు నవ్వుతూ చూసింది పద్మిని—
"మీరు ఎన్నోసార్లు వస్తే వుత్త టీ యిచ్చి పంపాను. ఇవ్వాళ అవకాశం కుదిరింది. నా సరదాకొద్దీ ఏదో చేశాను. ఇందులో ఏముంది."
"కావచ్చు కానీ..."
"అబ్బ! ఈ కానీలు ఎన్నిసార్లండీ!" పద్మిని అనునయంగా చూస్తూ రెండడుగులు దగ్గిరికి వెళ్ళి నిలబడింది. మొగిలి

సువాసన మరీ వుక్కిరిబిక్కిరి చేసింది గోపాల్‌ని.

"అనవసరంగా మీరు కంగారుపడి నన్ను కంగారు పెట్టేస్తున్నారు. నా సరదా అంతా మీరిలా పాడుచెయ్యటం బావుందా?" ప్రాధేయతగా చూస్తోన్న పద్మిని మొహంలోకి ధైర్యంగా చూస్తూ నించున్నాడు గోపాల్.

పద్మిని నవ్వుతూ అంది - "మీకోసం నేనో ఎంగేజ్‌మెంట్ డ్రాప్ చేసుకున్నాను."

"థాంక్స్!" చిలిపిగా చూశాడు గోపాల్.

"ఉత్త థాంక్స్ నాకేం అక్కర్లా."

"మరి?"

పద్మిని మాట్లాడలేదు.

"మీకు నే నివ్వగలిగేదేంవుంది?" గుచ్చిగుచ్చి చూస్తూ అడిగాడు గోపాల్.

పద్మిని సుతారంగా నవ్వుతూ - "ఒకమనిషి మరోమనిషికి యివ్వగలిగేది ఏమీ లేదా?" అంది.

"ఒకమనిషి ప్రతీ మనిషికీ యివ్వగలిగేది ఏమీవుండదు. ఒకే మనిషికి యివ్వగలిగేది చాలా వుంటుంది - మీకోసం నేను కూడా ఎన్నిపనులు మానుకుని వచ్చానో తెలుసా?"

పద్మిని చిరుకోపం నటించింది - "మీపనులన్నీ పాడు చేసుకుని నాకోసం రమ్మనలేదే!"

"ఎందుకనలేదూ? రాత్రి కలలోకన్పించి పిలిచారనే నేనింత పనిగట్టుకు వచ్చాను." నిస్సంకోచంగా పద్మిని మొహంలోకి చూశాడు గోపాల్.

పద్మిని చురుకుచూపులు చూస్తూ - నేనేం మీకలలోకి రాలేదు. హాయిగా నాపరుపుమీద పడుకుని నిద్రపోయాను."

"హాయిగా." ఒత్తిపల్కాడు గోపాల్ - "ఎంత హాయిగా!"

"మైమరిచేంత హాయిగా!"

"అబద్ధం: రాత్రి మీరసలు నిద్రపోలేదు."

"జోస్యం తెలుసా మీకు!"

"జాతకాల్లోదికాదు, మనసుల్లోది తెలుసు."

"ఎవరి మనసుల్లోది?" అనాలనిపించింది. అనలేక పోయింది పద్మిని - ప్రసక్తి మారుస్తూ - టేబుల్‌దగ్గిరికి నడుస్తూ- "సరే! మీరిలా కబుర్లతో కాలం దొర్లిస్తారా!"

"మీ ఆతిథ్యం స్వీకరించమంటారా, అంతేగా!"

"అంతేకాదు - అసలు అదే నేనుకోరేది."

"తినటానికి పెట్టటం ఒక్కటేనా ఆతిథ్యం?"

"ఇంకా ఏమిటో?"

"అతిథి ఏది అడిగినా సంతోషంగా యివ్వాలి. అదే మన సాంప్రదాయం."

పద్మిని నవ్వింది-"మీకు సాంప్రదాయాలన్నీ క్షుణ్ణంగా తెలుసనుకుంటాను."

"మీకోసం తెలుసుకున్నాను. అతిథిసత్కారఫలం పొందాలని మీకు చాలా ఆపేక్షగావుందిగా?"

పద్మిని సిగ్గుపడి మాట్లాడలేకపోయింది.

"సరే! మిమ్మల్ని ఇంకా విసిగించను." అంటూ గోపాల్ యాపిల్‌ముక్కలప్లేటు తీసుకున్నాడు.

“నేనో మాట అడగనా” పద్మిని గ్రామఫోన్ పెడుతూ అడిగింది

“మీరు అడగటానికి నా అనుమతి ఎందుకూ?”

“మీపనులన్నీ పాడుచేసుకుని యిక్కడి కెందుకొచ్చి నట్టు?”

“మళ్లా మొదటి కొస్తారేం? చెప్పానుగా కల వచ్చిందని!”

“అబద్ధాలాడటం కూడా మన సాంప్రదాయమేనా?”

“అరె! నమ్మకపోతే నేనేంచెయ్యను? నాకు మాత్రం తెల తెలవారుతోండగా చక్కటి కలవచ్చింది. చెప్పమంటారా?”

“వద్దులెండి.”

“ప్చ్! ఏంచెయ్యగలను? పాపం మీరు వింటారేమో చెప్దామనుకున్నాను. నేను పడుకుని హాయిగానిద్రపోతున్నానూ-ఓ అమ్మాయి నాదగ్గిరికి వచ్చింది - అని కలంతా చెప్దామను కున్నాను.”

“గడుసుదనం మీసొత్తులావుంది. మీరు నిద్రపోతోంటే అమ్మాయి వచ్చినసంగతి మీకెలా తెలిసింది?”

“అయితే మానెయ్యండి, లాయర్‌లా అడిగితే అసలు నేను చెప్పనే చెప్పను.”

“లేదులెండి, ఇంక అలా అడగను.”

“బుద్ధిగా వింటారా?”

“మహాబుద్ధిగా వింటాను.”

“సరే! అయితే...అప్పుడేమో!...ఎప్పుడూ!”

“[illegible] లేకుం[illegible] [illegible] నిద్రపో[illegible]..” పద్మిని

కళ్ళుమూసుకుని అభినయిస్తూ చెప్పింది-"అంతలో ఓ అమ్మాయి మీదగ్గిరికి వచ్చింది."

"ఆఁ అంతే - ఆ అమ్మాయి చాలా అందంగావుంది."

"ఎంత అందంగా?"

"చాలా అందంగా - అచ్చం మీలాగా."

"నేనేం అంత అందంగా లేను."

"నా అభిప్రాయం కాదనటానికి మీరెవరు?"

నవ్వింది పద్మిని- "సరే! చెప్పండి."

"అప్పుడేమో ఆ అందగత్తె ఘల్లు ఘల్లు మంటూ నాట్యంచేయటం ప్రారంభించింది.

"మలయమారుతముచే మది ఝల్లుమనెరా!
కరుణింప యిది మంచి సమయమురసామీ!"

— అంటూ నాచుట్టూ తిరిగింది.

పద్మిని వస్తోన్న నవ్వు ఆపుకొంటూ ఆసక్తిగా వింటూ నిలబడింది.

"ఆడీ ఆడీ అలిసిపోయిం దా అందగత్తె. అప్పుడేంచేసిందో తెలుసా?"

"ఏం చేసిందబ్బా?"

"ఊహించండి చూద్దాం."

"అలిగి వెళ్ళిపోయింది కదూ?"

"అంత పిచ్చిదేం కాదు."

"మరేం చేసింది?"—కళ్ళు విశాలంచేసుకుని సంభ్రమంగా అడిగింది పద్మిని.

గోపాల్ చిరునవ్వుతో పద్మినిని చూస్తూ మృదువుగా

అన్నాడు- "చాలా శ్రద్ధగా వినాలి- అలా ఘల్లుఘల్లున అడుగులు వేస్తూ వచ్చి నా పక్కమీద కూర్చుంది. నా మొహం మీదికి ఒంగి-చూసి... చూసి చటుక్కున ముద్దు పెట్టేసుకొంది."

తృళ్ళిపడింది పద్మిని, అరిచేతులు రెండూ చెంపలకి కప్పుకుని బెదిరిన లేడిలా చూస్తూ కంపిస్తోన్న కంఠంతో అంది- "మీరు చెప్పింది కలసంగతి కాదు అదంతా మీ వూహ."

గోపాల్ ఒక్క అడుగు సన్నిహితంగా వచ్చి నిలబడి అన్నాడు- "నా వూహ మీకు బాగా అర్థమౌతోందా?"

పద్మిని కళ్లుదించుకుని మందస్వరంతో అంది- "నా గురించి మీ రెండు కలా వూహిస్తున్నారు"

"మనస్సులో వూహించుకునే స్వేచ్ఛ ప్రతి వ్యక్తికీ వుంది."

"కానీ..." పద్మిని కళ్లెత్తి చూస్తూ అడిగింది- "నా గురించి యిష్టమైనట్లూ వూహించుకునే అవసరం మీ కేం వుంది?"

"చాలా వుంది పద్మినీ! నా వూహలతో నేను సంతోషిస్తోన్నంత మాత్రాన మీ కేం ద్రోహం జరగటం లేదు. మీరు వినటానికి సిద్ధపడ్డారు కాబట్టే ఆ వూహ అయినా మీకు చెప్పగలిగాను."

ఎప్పుడో రికార్డు అయిపోయి పిన్ను గీసుకుంటోంటే రెండు అడుగులు వేసి గ్రామఫోను ఆఫ్ చేసి- పద్మిని బరువుగా నిట్టూర్చింది.

"కోపం వచ్చిందా పద్మినీ?" మొహం కేసి చూస్తూ దీనంగా అడిగాడు గోపాల్.

"కోపం ఎందుకూ?" బరువుగా కళ్ళెత్తింది పద్మిని.

"మీరు నావూహల్లోకి రావటం మానరుగా!" అన్నాడు.

నవ్వింది పద్మిని— "అది నావశంలో లేదే!"

"మీ గురించి వూహించకుండా వుండటంకూడా నావశంలో లేదని మీకు తెలీదా!"

"శాస్తీ...."

"ఎన్ని చెప్పినా సరే! నేనేం అమానుషంగా మాత్రం ప్రవర్తించటం లేదు. నా మనస్సరసి నాకువుంది. అందులో ఒకే ఒక పుష్పం వికసించింది. దాన్ని నేను పదిలంగా దాచుకుంటాను."

"గోపాల్!" పద్మిని చలించిపోయింది.

గోపాల్ అప్రయత్నంగా పద్మిని చేతిని చేతిలోకి తీసుకున్నాడు.

అతని పొడుగాటి వేళ్ళ స్పర్శ మధురమై—మధురతరమై—అల్లకల్లోలమౌతోన్న పద్మిని హృదయాన్ని పులకరింపులతో నింపి వేసింది. అతని చేతిని గట్టిగా పట్టుకొంటూ కళ్ళలోకి మూగగా చూడబోయింది.

గోపాల్ ఆవేశంగా పద్మినిని చేతులమధ్య బంధించుకుని గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు. వివశతతో పద్మినికి కన్నీళ్లు పొర్లిపొర్లి వచ్చాయి. అవి ముత్యాలకోవలా చెక్కిళ్ళ మీదనుంచి జారాయి.

"ఎందుకు? ఎందుకు పద్మినీ?" కంగారుపడ్డాడు గోపాల్.

పద్మిని నోరువిప్పి ఏమీ మాట్లాడలేకపోయింది. ఎంతో సేపు గోపాల్ చేతులుపట్టుకుని అతని కళ్ళలోకి చూస్తూ—హృదయపు కోతలు వినుకుతూ తన్మయావస్థలో వుండిపోయింది.

[illegible] పద్మినీ!"

"లేదు, లేదు." ఎన్నో మాటలతో తన సంతోషం వ్యక్తంచెయ్యాలని ప్రయత్నించింది. వశంకాలేదు. గోపాల్ వుత్సాహంతోనే ఆనందాబ్ధి అయ్యే పద్మిని అంతరంగం - అతని మనస్సరసిలోని తన రూపాన్ని వూహించుకుని - ఆ రూపం అతని కంటిపాపలలో ప్రతిబింబించటం చూసి తన్మయత్వంతో మూగదై పోయింది.

*  *  *

"గోపాల్ వచ్చాడా ?" భోజనాలదగ్గిర అడిగింది మోహిని పద్మినిని.

"వచ్చాడు." తడబాటు అణుచుకొంటూ చాలా పొడిగా క్లుప్తంగా అంది పద్మిని.

"ఏం మాట్లాడాడు?"

"ఏముంది ? మామూలే!" తలదించుకుని అన్నం కలుపుకొంటూ ముభావంగా వుండిపోయింది. తాతయ్యకూడా రావటంతో ప్రసక్తి మారింది. రోజులా పద్మిని వుత్సాహంగా ఆసక్తిగా మాట్లాడలేకపోయింది.

గబగబా భోజనం ముగించి ఒక్కతీ పైకి వెళ్ళి బాల్కనీలో నించుంది చీకటిలో గేటు కేసి చూస్తూ.

క్షణ క్షణం అంతులేని ఆతృతతో చూస్తోంటే వారం రోజులు ఎలాగడిచిపోయాయోకూడా అర్థంకాలేదు.

మళ్లా గోపాల్ వస్తాడని పద్మిని నిరీక్షిస్తోనేవుంది. వారంరోజులై ఒక్కసారికూడా రాలేదు. కనీసం ఫోన్ కూడా చెయ్యలేదు.

ఆరోజు పద్మినికి మరీ విసుగ్గావుంది. వెర్రిగావుంది.

గోపాల్ ని చూడాలి. గోపాల్ తో మాట్లాడాలి - ఇక తను జాప్యంచెయ్యలేదు. గబగబా క్రిందికి వెళ్ళింది. ఫోన్ తీసి గోపాల్ కోసం అడిగింది.

"నాలుగురోజులనుంచీ శెలవు." ఆఫీసునుంచి జవాబు. ఏంచెయ్యాలో కాస్సేపు తోచలేదు. ఆలోచిస్తూ మెట్లెక్కింది. చిన్నగా చెల్లెలుగదిలోకి వెళ్ళింది - "మోహినీ!" కొంచెం సంకోచంగానే పిలిచింది - "గోపాల్ అడ్రెస్ నీదగ్గర వుండాలి కదూ?" ఏదో రాసుకుంటోన్న మోహిని తలెత్తి అంది -

"నోట్ బుక్కులో వున్నట్టుంది, ఎందుకూ?"

"ఏంలేదు, మొన్న నోపుస్తకం గురించి చెప్పాను. మర్చిపోయాడేమో! ఓ కార్డు రాద్దామని -" ఏమంత ప్రత్యేకత లేనట్టు అంటూ - డెస్క్ లోంచి నోట్ బుక్కు తీసి అడ్రెస్ లు తిరగవేస్తూ నించుంది. మోహిని ఆశ్చర్యంగాచూసి మళ్ళా రాతలో మునిగిపోయింది. పద్మిని అడ్రెస్ రాసుకుని గదిలోంచి వెళ్ళిపోయింది.

సాయంత్రం పద్మిని డ్రెస్ చేసుకుని బయల్దేరుతోంటే మోహిని వూరుకోలేక అడిగింది -

"ఎక్కడికో అడగవచ్చునా?"

"వందనా వాళ్ళింటికి. ఓసారి రమ్మని ఫోన్ చేసింది."

మోహిని మాట్లాడకుండా చూస్తూ నించుంది.

* * *

సన్నటి సందులోంచి నడిచివెళ్ళి పాత పెంకుటింటి వసారాముందు నిలబడి రెండునిముషాలు సంశయించింది పద్మిని. అప్రయత్నంగా నేత్రవేళ్ళతో తలుపులమీాద మృదువుగా కొట్టింది.

ఓ నిముషం ఆలశ్యంగా తెరుచుకున్నాయి తలుపులు. ప్రత్యక్షమైన గోపాల్‌ని చూస్తూ సంతోషంగానూ విస్మయంగానూ వుండిపోయింది పద్మిని. తలుపుకొట్టిన పద్మినిని చూసి ప్రాన్పడి నిలబడిపోయాడు గోపాల్.

గోపాల్‌ని చూసిన తృప్తితో వెంటనే తేరుకుని గడప దాటి లోపలికి వెళ్ళింది పద్మిని-"నేనిప్పుడు అక్షరాలా అతిథిని, తెలుసా ? ఇదేనా ఇంటికి వచ్చినవాళ్ళకి చెయ్యాల్సిన మర్యాద?" అంది తేలికగా నవ్వుతూ - తలుపులు రెండూ మూసి గడియపెట్టింది.

"పద్మినీ ! ఇక్కడి కెలా వచ్చావు ?" జారిపోతున్న తుండు భుజాలచుట్టూ కప్పుకొంటూ ఆశ్చర్యంగా అడిగాడు గోపాల్.

"ఎలా రావటం ఏమిటి? నిక్షేపంలా రెండు బస్సులు మారి - నాలుగు ఫర్లాంగులు నడిచి - ఇంటి నెంబర్లన్నీ చదువుకొంటూ - దర్జాగా వచ్చాను."

"చాలా చిరాకుపడి వుంటావు."

"అప్పుడు కాదుగానీ ఇప్పుడు నిజంగా నే చిరాకు వేస్తోంది. మీరు పిలవకపోయినా నేను వచ్చానని సంతోషించకపోగా ఎందుకీ నిట్టూర్పులూ?" చిరుకోపంతో మొహం చిట్లించుకొంది పద్మిని.

"అది కాదు, ఇల్లు తెలుసుకోవటాని కెంతయాతన పడ్డేవు కదూ?"

"పడితే పడ్డాను, ఇంట్లోకూర్చుని ఎదురు తెన్నులు చూస్తూ అనుభవించే యాతనకన్నా ఎక్కువేం కా యిది."

"నాకోసం ఎదురు చూశావా?"

కన్నుల్లోకి చొచ్చుకుపోతోన్న గోపాల్ చూపులు తప్పించుకొంటూ - అంది - "మీరు చాలా చిక్కిపోయినట్టు కన్పిస్తున్నారేం!"

గోపాల్ వాస్తవంలోకి వచ్చాడు. గదిలోవున్న ఒక కుర్చీ దగ్గిరికి జరుపుతూ అభిమానంగా అన్నాడు-

"కూర్చో పద్మినీ! నిలబడే వున్నావు."

"మీరలా వున్నారేమంటే చెప్పకుండా ఈ మర్యాద లేమిటి?"

"ఏం లేదులే. నాలుగు రోజులు జ్వరం వచ్చింది. నిన్నట్నుంచీ..."

"తగ్గిపోయిందా?"

"తగ్గింది. కొంచెం నీరసంగావుంది."

"అన్నం తిన్నారా?"

"తిన్నాను."

"మీరే వండుకున్నారా?"

"లేదు లే. ఇవ్వాల్టికి హోటల్‌నుంచి తెప్పించుకున్నాను."

"హోటల్ మెతుకులతోనా పథ్యం?" పద్మిని బాధగా అంది- "జ్వరంతో ఈగదిలో పడుకునివున్నారా?"

"అదేం ప్రశ్న? నాగదిలో నేను వున్నాను."

"ఎవ్వరూ లేకుండా జ్వరంతో ఇంత ఒంటరిగా..."

"ఎవ్వరూ లేకపోవటం ఏమిటి?" గోపాల్ కిటికీ దగ్గిరికి వెళ్ళి నుంచున్నాడు. కిటికీకి అవతల చాలా దగ్గిరగా నైట్‌క్వీన్ మొక్కలున్నాయి. ఆకులన్నీ రెమ్మలతోసహా

కిటికీవూచలలోంచి దూరివచ్చాయి గదిలోకి.

గోపాల్ నైట్‌క్వీన్ రెమ్మలు చేతులతో పట్టుకొంటూ - "ఈ ఆకులు నన్నెప్పుడూ పల్కరిస్తూనేవుంటాయి. సాయంత్రం అయ్యేసరికి కిటికీనిండా గుత్తులు గుత్తులుగా పువ్వులు పూస్తాయి. ఈగదిలో రాత్రుళ్లు పడుకుంటే ఎంత హాయిగా వుంటుందో తెలుసా!"

"బావుంది. జ్వరంతోపాటు కవిత్వంకూడా వచ్చిందా!"

"కవిత్వంకాదు, చెట్లన్నా - మొక్కలన్నా నాకు చాలా యిష్టం. పచ్చటి ఆకుల్ని చూస్తూవుంటే ఎంతోమంది ఆప్తుల్ని చూసినట్టే వుంటుంది."

పద్మినికి నిజంగా కోపం వచ్చింది- "నేను అడుగుతోంది మీ చెట్లమాటా చేమలమాటా కాదు. సాయంగా ఎవరూ లేకుండా జ్వరంతో ఎలా వున్నారూ? అని."

గోపాల్ నిరాశగా నవ్వాడు - "జ్వరంతో ఏమిటి? జబ్బుతో ఏమిటి? ఎవరూ లేనివాళ్ళకి ఎవరొస్తారు?"

ఎంతో జాలివేసింది పద్మినికి. ఆర్ద్రితగా అంది-"ఎవ్వరూ లేరా మీకు?"

"ఒక్క చెల్లెలు మాత్రం వుంది."

"ఆవిడకే వైర్ చెయ్యిలేకపోయారా?"

"అబ్బే! ఎక్కడో నాలుగు వందలమైళ్ల దూరంలో పల్లెటూళ్ళో వుంది. టెలిగ్రాం పేరు వింటేనే కంగారుపడి ఏడ్చేస్తుంది."

"పోనీ కనీసం నేనైనా గుర్తురాలేదా?"

పద్మిని మాటల్లో నిష్ఠూరం ధ్వనించింది. గోపాల్

ఆశ్చర్యపడ్డాడు- "నేను జ్వరపడ్డానని తెలిస్తే నువ్వు ఇక్కడికి వచ్చేదానివా ?"

"పోనీ మిమ్మల్ని మాయింటికి తీసుకెళ్లేదాన్నిగా ? హాయిగా మాయింట్లో అన్నీ చూసేదాన్నిగా."

"అంతమాట అన్నావు పద్మినీ! చాలు నాకు."

"అదేమిటి ? ఆ మాత్రం నేను చెయ్యనని సంశయించారా "

"అది కాదు."

"మరి ? అసలు నేను గుర్తే రాలేదుకదూ?"

"మంచి ప్రశ్నే !"

"నిజం చెప్పరాదూ ? ఎందుకా దాపరికం ?"

"పద్మినీ!" గోపాల్ పద్మినికి దగ్గరగా నిలబడ్డాడు.

"నిజం చెప్పమంటావా!"

"మీరు చెప్పకపోయినా నాకు తెలుసు."

"ఏం తెలుసు!"

"ఆరోజు తర్వాత మళ్లా నేను గుర్తురాలేదు మీకు."

"పిచ్చిదానివి!"

"నిజంగా నన్ను పిచ్చిదాన్ని చేసింది మీరు."

"పద్మినీ!" మృదువుగా పద్మిని చేతిని పట్టుకున్నాడు - "నిజం వినకుండా నామీద ఎందుకంతకోపం? అసలు నీగుర్తుతోనే యింతజ్వరం తెచ్చుకున్నాను."

ఆశ్చర్యంగా నవ్వింది పద్మిని.

"నమ్మవా!" పద్మిని కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూశాడు. "ఆరోజు మీయింటినుంచి వచ్చాక పిచ్చివాడిలాఅయిపోయాను.

అన్నం సయించలేదు. ఒక్క నిమిషంకూడా నిద్రపట్టలేదు. వక్షణానికాక్షణమే నీదగ్గరికి పరిగెత్తుకు రావాలనిపించింది. ఆపరి స్థితిలో నువ్వు కన్ని స్త్రీ ఎంత పశువునైపోతానో నాకే తెలీదు. నాశరీరం మనస్సూకూడా పూర్తిగా నావశంలో లేవు. జాగా రాలతో వుపవాసాలతో రెండురోజులు దుర్భరంగా గడిపాను- మూడోరోజుకి చాలా టెంపరేచర్ వచ్చింది. నాలుగురోజులు వుండాజ్వరం. ఇవ్వాళే కొంచెం శాంతంగావుంది. ఇప్పుడుచెప్పు నేను నిన్ను మర్చిపోయానుకదూ?"

పద్మిని సిగ్గుతో తలదించుకుని నించుంది. కళ్ళెదుట బంగారు బొమ్మలా నిలుచున్న పద్మినిని- క్షణమొకయుగంచేసి బాధించిన వూహాసుందరిని చూస్తూ- పూర్తిగా సహనం కోల్పోయాడు గోపాల్. నిస్సంకోచంగా పద్మినిని దగ్గిరికి తీసు కుని చేతులలో ఇముడ్చుకున్నాడు.

నల్లగా నగ్నంగావున్న గోపాల్ గుండెలకు హత్తుకు పోయింది పద్మిని. కంపిస్తోన్న పెదవులమీద కాలే పెదవులతో ఆవేశపూరితంగా ముద్దుపెట్టుకున్నాడు. వివశత్వంతో గోపాల్ చేతులనుంచిజారి పాదాలమీద మోకరిల్లింది పద్మిని.

"నీకెంత దయ పద్మినీ!" వెచ్చగా నిట్టూర్చాడు గోపాల్.

"నీ దయకోసమే నేను వెదుక్కుంటూ వచ్చాను గోపాల్" కంపించే కంఠస్వరంతో మత్తుగా మాట్లాడింది పద్మిని.

"పద్మా !'

సంభ్రమంగా చూసింది పద్మిని.

"అలా కన్పించదు. తాగు తెలుస్తుంది" గోపాల్ గ్లాసు ఎత్తి పద్మిని పెదవులకు అందించాడు, గోపాల్ ని క్రీకంట చూస్తూ సుతారంగా పెదవులు ఆన్చి నీళ్ళు తాగింది పద్మిని. సగం తాగనిచ్చి గ్లాసు లాక్కొని మిగతా నీళ్ళు గడగడా తను తాగేసి గ్లాసు కింద పెట్టాడు గోపాల్— "అబ్బ! అమృతంలా వున్నాయి కదూ ?"

"ఏమో! నేనెప్పుడూ అమృతం తాగలేదు."

"పాపం!" సానుభూతి ప్రకటించాడు. గర్వంగా చూస్తూ— "నేను తాగాను."

"అమృతమే!" కళ్ళు విశాలం చేస్తూ విస్మయం ప్రకటించింది పద్మిని.

"వట్టి అమృతమా!" చిలిపిగా చూశాడు— "ప్రేయసి అధరామృతం తాగాను."

సిగ్గుతో మొగ్గలా ముడుచుకుని మోకాళ్ళమీద గడ్డం ఆన్చి గారంగా చూస్తూ కూర్చుంది పద్మిని.

"పద్మా!"

"ఏమిటి ?" కళ్ళతో ప్రశ్నించింది.

"నువ్విలా కదలకుండా కూర్చుంటావా ? నేనో బొమ్మ గీస్తాను"

ఆశ్చర్యంతో తల ఎత్తింది పద్మిని—"నిజం ?"

"రాత్రంతా నీబొమ్మ గియ్యాలనే ఆలోచిస్తూ పడుకున్నాను."

గాలికి ఎగిరి టేబుల్ మీదనుంచి ఓ కాయితం కిందపడింది. పద్మిని తీసి చూసింది. పద్మం మీదికి వాలబోతోన్న తుమ్మెద

చిత్రం రంగులతో చూడటానికి ముచ్చటగావుంది.

"ఈ బొమ్మ నువ్వే వేశావా ?" ఆశ్చర్యంగా అడిగింది. పద్మిని.

"నిద్రపట్టక ఏమీ తోచక రాత్రి కాస్సేపు కూర్చుని వేశాను. బాగా రాలేదు. విసుగుతో మళ్ళా పడుకున్నాను."

"బాగా రాకపోవటం ఏమిటి? చాలా బావుంది" గోపాల్ లేచి అల్మైరాలోంచి లెదర్ కేస్ బయటికి తీశాడు— "ఇవి చూడు పద్మా! నీకు నచ్చుతాయేమో!"

రెమ్మకు అంటిపెట్టుకుని గాలిలో సుతారంగా వూగు తోంది, ఎర్రగులాబీ!

"కెమేరా కొనుక్కొని హాయిగా ఫొటోలుతీసుకోరాదూ? కష్టపడి బొమ్మలు గీసుకోవటం ఎందుకూ? అని ఓసారి నువ్వాడి గావు గుర్తుందా? ఖరీదైన రంగులుకూడా కొనుక్కోలేని నేను కెమేరా కొనుక్కోగలనా ? అదీ కాక నేను బొమ్మలు గీసు కోవటానికి కారణం మాత్రం అదికాదు— కొమ్మకు ఒక నారింజ ఆకు వుంది. దాన్ని తీసిన ఫొటో చూడు. దాన్ని చూసి వేసిన చిత్రం చూడు. లేతపసుపూ-ఆకుపచ్చా-నీలిరంగులతో తీర్చిదిద్దిన చిత్రంలో జీవం తొణికిసలాడుతూవుంటుంది. కొమ్మ నుంచి ఒక ఆకు తుంచి కాయితంమీద పడ వేసినట్టు వుంటుంది. ఎన్నిరంగులతో ఫొటోతీసినా అలా వుంటుందా ?

అంతేకాదు. ఫొటో చెట్లనీ చేమల్నీ - వస్తువుల్నీ అన్నిటినీ యథాతథంగా చూపించగలదు, అంతే. వాటిలో వున్న భావాన్ని వ్యక్తీకరించగలదా?"

పద్మిని సందేహంగా చూసించి - "ఈ చిత్రంలో మీరు

చూపించిన భావం ఏమిటి?"

గోపాల్ చిరునవ్వు నవ్వాడు- "అది నేనే చెప్పాలా?"

"మరి నాలా కళాదృష్టి లేనివాళ్ళకి చెప్పక తప్పదు."

"ఈ చిత్రంలో గులాబీతో నీకేం కన్పిస్తున్నాయి."

"రెండు వేపులా రెండు ముళ్లు."

"గులాబీకి ముళ్ళెందుకుంటాయని నీవుద్దేశ్యం ?"

"ఏమో ! నాకు తెలీదు."

"కొంచెం వూహించరాదూ ?"

"ఈముళ్ళ నింత వాడిగా ఇంత పొడవుగా బహుశా గులాబీకి కాపలా పెట్టి వుంటావు"

"సరిగ్గా అంతే" రక్షణకోసమే గులాబీకి ముళ్ళు వుంటాయేమోనని నేననుకున్నాను."

"ఎవరినుంచి రక్షణ ?"

"పువ్వుని పాడుచెయ్యాలనీ- తెంచాలనీ ప్రయత్నించే వాళ్ళనుంచి."

"అయితే మిగతా పువ్వుల కీరక్షణ ఎందుకులేదు ?"

"సరిగ్గా నేను తర్కించుకున్నట్టే నువ్వూ అడిగావు. అయినా గులాబీ చాలా సున్నితమైనదికదా? అందుకే గులాబీకి ముళ్ళు వుంటాయేమోనని అప్పటికి సరిపెట్టుకుని ఆభావం వెల్లడి అయ్యేట్లుగా- చిత్రం గీశాను. ప్రకృతి రహస్యాలు అర్ధం చేసుకోవాలని ప్రయత్నించటంవరకే మనం చేయగలిగేది. అవునా ? అసలు గులాబీ ఎలావుందో చెప్పలేదేం ?"

పద్మిని నవ్వింది- "చెప్పనా, ఈపరిసరాల్లో ఎక్కడైనా తుమ్మెద తిరుగుతోంటే యిక్కడికే వచ్చి ఈగులాబీమీద

వాలుతుంది."

"ఆహా! ఏం సొగ సు!"

"నిజం! నాకు అలాగే అన్పిస్తోంది."

"అయితే నీకు చిత్రాన్నిచూస్తే సంతృప్తి కల్గినట్టే. నీ అనుభూతికి రూపకల్పనచేస్తే ఎలావుంటుందో వూహించ గలవా?"

పద్మిని కుతూహలంగా చూసింది - "మనస్సులో కలిగే భావాలకుకూడా రూపం వూహించగలమా? అయితే సంతృప్తికి రూపకల్పనచేస్తే ఎలావుంటుంది?"

"ఎలా వుంటుందో నేను బాగా ఆలోచించి గీసి మరో సారి చూపిస్తాను. ఇదిగో! 'ఆనందం' అన్నభావం ఎలా వుంటుందో నేను వూహిస్తూ గీశాను చూడు."

పగలబడి నవ్వుతోన్న స్త్రీమూర్తిచుట్టూ విరగబూసి వున్న వుద్యానవనం-ఆమె కంటిపాపలు వెదజల్లుతోన్న కాంతి కిరణాలమీదుగా రెక్కలు విప్పార్చుకుని ఎగురుతోన్న పక్షులూ- ఆమె పాదాలు తాకుతూ పురివిప్పి నాట్యంచేస్తోన్న నెమళ్ళ జంటా.

చిత్రం చాలా భావాత్మకంగా వుంది.

"ఆనందానికి రూపంవస్తే యిలావుంటుందా?" పద్మిని సంభ్రమంగా చూసింది- "ఎటుచూసినా ఆనందమే చిందులు తొక్కుతూచూసేవాళ్ళ హృదయాల్ని ఆనందమయం చేస్తోంది."

"కేవలం ఇది నావూహ. ప్రతీవ్యక్తికీ రకరకాల వూహ లుంటాయి కదా? మరో చిత్రకారుడెవరైనా ఆనందాన్ని మరోవిధంగా చిత్రించవచ్చు. చిత్రం విలువ చిత్రకారుడి ఆలో

చనాశక్తినిబట్టీ - చిత్రం వేయగలిగే ప్రతిభనుబట్టీ వుంటుంది. ఓ ప్రదర్శనంలో నేను 'బాటసారి' అనే చిత్రాన్ని చూసి ఎంతో ముగ్ధణ్ణయ్యాను."

"ఎలావుం దా బాటసారి చిత్రం ?"

"నువ్వే వూహించి చెప్పు."

పద్మిని బుగ్గన వేలుపెట్టుకుని కంటిరెప్పలు అల్లలార్చుతూ వూహ అభినయించింది — ఓ నిముషానికి నవ్వుతూ అంది— "చెప్పనా ? విశాలంగావున్న పెద్దరోడ్డూ - సంచీ పట్టుకుని నడుస్తోన్న ఓ మొగవాడూ, అవునా?"

"అలాకాదు. ఆ రోడ్డుకి రెండువైపులా చెట్లు వుండ:

"ఊఁ. వుంటే ?"

"ఆచెట్లకి మధ్య కన్పిస్తోన్నచోటే బాట" ఆ చెట్ల తాలూకు కొమ్మలూ రెమ్మలూ ఎలా చిత్రించబడ్డాయో తెలుసా ? వాటి ఒంపులతో ఖాళీగా కన్పిస్తోన్న బాటకి ఓ స్త్రీరూపం ఏర్పడింది. శిరస్సూ - వక్షము - ఉదరభాగం - పాదాలూ- అన్నీ స్పష్టంగా ఏర్పడ్డాయి ఆ బాటమీద ఒక పురుషుడు నడిచి వస్తున్నాడు" గోపాల్ లేచి తెల్లకాయితం- పెన్సిలూ అందుకుని చకచకా చెట్ల ఒంపులతో స్త్రీమూర్తిగా ఏర్పడిన బాటని గీసి చూపించాడు.

పద్మిని ఆశ్చర్యపడింది- "బాటని స్త్రీగాచేసి పురుషుణ్ణి బాటసారిగా చెయ్యటంలో అర్థం ఏమిటి ? ఆబాటసారి ఎన్నో బాటలమీద నడిచినట్టే - పురుషుడుకూడా ఎంతమంది స్త్రీలతో నైనా వుండవచ్చుననా చిత్రకారుడి భావం ?"

"చాలా పొరపడ్డావు. బాటసారి దృష్టిలో బాటల వైవిధ్యంలేదు. సుదీర్ఘమైన ఒకే ఒకబాట అతని మార్గం. "బాటలేనిదే బాటసారి ప్రయాణం చెయ్యలేడు. 'స్త్రీ చెలిమిలేనిదే పురుషుడి ప్రయాణం సాగదు.' అని చెప్పటమే ఆ చిత్రకారుడి భావం. బాటకీ బాటసారికీ వున్న అనుబంధాన్ని మనకళ్ళకు చూపిస్తూ స్త్రీ పురుష సంబంధాన్ని దాని గుప్తార్థంగా చేశాడు చిత్రకారుడు. చిత్రంచూసి దాని సందేశం మనం అర్థంచేసుకోవాలి."

పద్మిని గోపాల్ గీసిన స్కెచ్ మరోసారిచూసి సంతృప్తి వెల్లడించింది - "నిజమే. ప్రదర్శనలో చిత్రం చూస్తే ఎంత బావుంటుందో అన్పిస్తోం దిప్పుడు."

"సరే నీ యిప్పుడు చెప్పు, కెమేరాతో తీసిన ఏ ఫోటో అయితే 'బాటసారి' భావాన్ని వ్యక్తంచెయ్యగలదు?"

"లేదు, లేదు. కెమేరావుపయోగానికీ చిత్రలేఖనం వుద్దేశ్యానికీ సంబంధమేలేదు. నేను సరిగా ఆలోచించకుండా అప్పుడలా హాస్యంగా అన్నాను. ఏం? చిత్రకారులుంగారికి కోపం వచ్చిందా?" చిలిపిగా చూసింది.

"బాగా వచ్చింది. ఒక కళలో ప్రతిభకలదానివి నువ్వే అలా అనాలోచితంగా మాట్లాడితే కోపంరాదూ?"

"వస్తే వచ్చిందిగానీ ఒకమాటచెప్పు. అసలు నీకిలా బొమ్మలు గీయటం ఎలాచేతనైందబ్బా?" బుగ్గనచెయ్యి చేర్చుకుని విస్మయంగా అడిగింది.

గోపాల్ నవ్వుతూ అన్నాడు-"చిన్నప్పుడు మసిబొగ్గో - సుద్దముక్కో- పట్టుకుని నేలమీద గోడలమీదా-ఎగిరేపక్షుల్ని

వంకరటింకరగ గియ్యటంతో ప్రారంభ మైందనుకుంటాను. నిజమే. ఇంట్లో వస్తువులన్నిటినీ చూసి బొమ్మలుగీస్తూ కూర్చునేవాణ్ణి. సుద్దముక్కల కోసం చేసిన దొంగతనాలన్నీ యిప్పటికీ గుర్తువస్తూవుంటాయి."

పద్మిని నవ్వుతూ వినసాగింది.

"క్రమంగా మనస్సులో మెదిలే వూహాల్ని కాయితాల మీదికి ఎక్కిస్తూ - చెట్లూ - పువ్వులూ - ఆకులూ - గడ్డీ - నీళ్ళూ - ఆకాశం - వాటికేవేవో రంగులు రుద్దుతూ- ఎక్స్పరిమెంట్లు చెయ్యటం ఓ హాబీ అయింది. సంవత్సరాల తరబడీ చేసిన సాధనవల్ల ఈచిత్రాలు గీయటం తప్పితే దీన్ని గురించి నేనెక్కడా నేర్చుకోలేదు. నేర్చుకోవాలని ప్రయత్నించినా వీలుకాలేదు. పుస్తకాలు మాత్రం చాలా చదివాను."

"అయితే మీకు పుటకతోనే ఈకళ అబ్బింది." పద్మిని అభినందిస్తోన్నట్టు చూసింది.

"కాదనటం ఎందుకూ ? ముందీ బొమ్మలు చూడు." గోపాల్ మరో చిత్రం తీసి చూపించాడు - ఒక పసిపాప ! బొటన వేలు నోటిలో పెట్టుకుని చిన్నిచిన్ని కళ్ళు తెరిచి అమాయకంగా లోకాన్ని చూస్తూ నేలమీద పొరాడుతోన్న పసిపాప!- మరో వృద్ధమూర్తి! పండిపోయిన జుత్తుతో - ఆపాదమస్తకం జీర్ణమై ముడుతలుపడ్డ శరీరంతో - దడదడలాడుతూ - వంకర టింకర చేతికర్రను ఆసరా చేసుకుని - నడుం ఒంగిపోయి - బోసినోరు తెరిచి - లోతుకుపోయిన కళ్ళు చిట్లించి ఆకాశం మీదికి చూడాలని విశ్వప్రయత్నం చేస్తోన్న వృద్ధమూర్తి !

ఆ రెండు రూపాలకూ మధ్య ఎత్తైన కొండలూ - లోతైన

లోయలూ.

చిత్రాన్ని ఎంతసేపు చూసినా దానిభావం ఏమిటో పద్మినికి అంతుపట్టలేదు.

"ఊహించు పద్మినీ! నీకేం మస్తిష్కంలేదా? వూహాశక్తి లేదా?"

"చంటిపాపనీ - ముసలితాతనీ ఒక్క చిత్రంగా ఎందుకు గీశావో నాకు అర్థం కావటంలేదు మరి."

"జీవితాన్ని సహజమైన కొలతగా మనం తీసుకుంటే దాని ప్రారంభదశ ఈ పసిపాప. ఆఖరిస్థితి ఈ వృద్ధుడు. జీవితంలోని అనుభవాలు - ఈ కొండలూ లోయలూ! ఈ చిత్రానికి పేరు పెట్టాలంటే 'జీవితపు ఆద్యాంతాలు' అనాలి."

"అబ్బ! ఎంత చక్కని భావం! ఆపేరు చిత్రంకింద రాసేస్తే నేను మొదటే అర్థంచేసుకునేదాన్నిగా!"

"చాలా కష్టపడేదానివి!" హాస్యంగాఅన్నాడు. పద్మిని మూతి ముడుచుకుంది.

"ఆ తప్పు నాదేంకాదు లెద్దూ! ఓరియంటల్ ఆర్ట్ అంటూ ఏవేవో అర్థంగాని గీతలు చూడ్డం తప్పితే ఇలాంటి భావాత్మకమైన చిత్రాలు నేనెప్పుడూ చూడలేదు మరి. నీచిత్రాల్లో అలాంటి పూర్వపు సాంప్రదాయాలు వున్నట్టులేవే!"

"నేలవిడిచిన సాము ఎప్పుడూ వుండదు. అలాగే ఏ కళలో అయినా శాస్త్రమూ సాంప్రదాయమూ లేకుండా వుండవు. కానీ కళతో బాగా పరిచయం కలిగిన తర్వాత ఎల్లకాలం పాతధోరణీ పాతశైలీ పాటించాలన్న నియమంలేదు.

స్వాంత ఫ్రాహాలతో - కొత్తదనంతో - తనకు తోచిన విధంగా కళని బహిర్గతంచేసే స్వాతంత్ర్యం ఏ ఆర్టిస్ట్‌కైనా వుంటుంది. సంకుచితంగా ప్రాంతీయశైలినీ - సాంప్రదాయాల్నీ అంటిపెట్టుకుకూర్చుంటే కళలో లోతులు తెలుసుకోవటం - కళని విస్తృతం చేసుకోవటం అసంభవం."

గోపాల్ మాటలు చాలా నచ్చాయి పద్మినికి-తర్వాత మరోచిత్రం చూపిస్తూ- "పేరు ముందే చెప్పమన్నావుగా ? ఇది- 'నాహృదిలో ప్రకృతి' " నవ్వుతూ అన్నాడు.

ఆ చిత్రం చాలా పెద్దది. చూస్తోంటే విభ్రాంతితో మతిపోయింది. ప్రకృతిలోవున్న సౌందర్యాన్ని అంతా ఆచిత్రంలో బంధించినట్టు వుంది. ఎత్తైన కొండలూ - అగాధాల్లాంటి లోయలూ - కొండల్లో సెలయేళ్లూ - లోయలోకి దుముకుతోన్న జలపాతం - విస్తరించుకున్న వృక్షాలూ - విశాలమైన పచ్చికమైదానం - ఆకాశంలో మబ్బులూ - మబ్బులో విహరిస్తోన్న పక్షుల గుంపులూ - పచ్చికమీద గంతులేస్తోన్న లేడికూనలూ - అన్నీ లేలేతవర్ణాలతో సహజసౌందర్యాలు గుమ్మరిస్తున్నాయి. కొండలమాటున సూర్యుడు అస్తమించటం - నీటికెరటాలమీద సూర్యకాంతి ప్రతిఫలించటం అద్భుతంగా వుంది.

పద్మిని చిత్రాన్ని తదేకంగా చూస్తూ ముగ్ధురాలైంది - "గోపాల్! నీ ఆర్ట్ అంతా ఈ ఒక్క-చిత్రంలోనే కేంద్రీకరించేశావా ?" విస్మయంగా అడిగింది - "కానీ నాకో అనుమానం వస్తోంది. అడగమంటావా ?"

"నిక్షేపంలా అడుగు."

"ఇంత పొందిగ్గా కొండలూ - లోయలూ - సెలయేళ్లూ - జలపాతాలూ - చెట్లూ - పుట్టలూ - మైదానాలూ యివన్నీ ఒక్కచోట గుమిగూడి వుండటం వాస్తవంగా వుందా?"

"అంత వాస్తవంగా లేదు నిజమే. అసలు వాస్తవం ఎలా వుంటుందో తెలుసా ? కొండలకి చాలాదూరం పోతే అక్కడో పచ్చికబయలు వుంటుంది. మళ్ళా చాలాదూరం పోతే కొన్ని వృక్షాలుంటాయి - ఇంకా చాలాదూరం పోతే ఓనది పారుతూ వుంటుంది. ఎక్కడో లోయలుంటాయి. మరెక్కడో జలపాతాలుంటాయి. ఇలా ప్రకృతి అందాలన్నీ సువిశాలమైన భూమిమీద వాటివాటి అనుకూలతల్ని బట్టి ఏర్పాటైవుంటాయి. వాస్తవాన్ని కళాదృష్టితో వెల్లడించాల్సివస్తే కొంచెం కల్పన తప్పదు. ఈ అందాలన్నీ ఒకదాని సరసనే ఒకటి వున్నట్టు నేను కల్పించాలి. ఈ కల్పనవల్ల వాస్తవానికి ఎలాంటి అపచారమూ జరగదు. ప్రకృతంటే నాకు వున్న ఆరాధనతో భూమిమీద అందాలన్నీ దగ్గిరికిచేర్చి ఒకేచిత్రంగా చిత్రించాను. కేవలం భావోద్వేగంతోటీ - సౌందర్య కాంక్షతోటీ - ఈచిత్రం గీయాలని ప్రయత్నించాను. ఎంతవరకూ సాధించగల్గానో నాకు తెలీదు. చూసేవాళ్ళ మనసుల్లోకూడా ఈ ప్రకృతి దృశ్యం సజీవంగా నిలిస్తే నాకృషి ఫలించినట్టే."

"అయితే నీకృషి ఫలించిందని నేను ధైర్యంగా చెప్ప గలను. ఈచిత్రాన్ని జీవితంలో మర్చిపోతానని నేననుకోను."

గోపాల్ చిరునవ్వు నవ్వాడు. మరోచిత్రాన్ని చూపిస్తూ - 'ఇది నేను చాలా కాలంక్రిందట గీశాను. అప్పట్లో ఎంతసేపూ నాదృష్టి అంతా పువ్వులమీదా చెట్లమీదా వుండేది." అన్నాడు

ఆచిత్రాన్నిచూసింది పద్మిని-రకరకాల పూలతోనిండి వున్నవుద్యానవనం - పురివిప్పి నాట్యంచేస్తూన్న నెమళ్ళు - గున్న మామిడి చివుళ్ళు రుచిచూస్తోన్న కోయిలలు-ఎర్రటిముక్కులతో పళ్ళుతింటోన్న రామచిలుకలు - పువ్వుపువ్వుచుట్టూ ఝుం ఝుంటూ ఎగురుతోన్న తుమ్మెదలు-చిత్రం అంతా వసంతంలో మునిగి తేలుతోంది.

"ఎన్నోసుందరదృశ్యాలు స్వాగతం వల్కితే తప్ప ఇటు వంటి మనోహరమైన చిత్రం గీయటం సాధ్యంకాదు." అంది పద్మిని.

ఝుంఝుమారుతంతో తీరాన్ని కొట్టుకొంటూ వుద్వే త్తుగా కెరటాలతో లేచిపడుతోన్న సముద్రాన్ని కూడా చూసింది. ఆచిత్రం ఏదో అర్థంకాని భీతినీ - విషాదాన్నీ కల్గించింది.

"ఇప్పుడు నా అభిప్రాయం చాలామారింది పద్మినీ! నూటికి నూరుపాళ్ళూ ప్రకృతిని అనుసరించే చేష్ట కళ అవదు. ఏ కళకైనా ఓప్రయోజనంవుంది. ఓసందేశం వుంది. ఇకమీదట అలాంటి చిత్రాలు గీయాలని నిర్ణయించుకున్నాను."

చిత్రాలు చూడటం కన్నులవిందుగానే వున్నా ఎందుకో విసుగు కల్గింది పద్మినికి.

"నీకు చాలా యిష్టమైన చిత్రం మరేదైనా చూపించు" అంది వుత్సాహం తెచ్చుకొంటూ.

గోపాల్ తీసియిచ్చిన చిత్రంచూస్తూ తృళ్ళిపడింది.

అణుఅణువునా సౌందర్యంతో చైతన్యంతో తొణికిస లాడుతూ వయ్యారంగా పడుకుని వుంది నగ్నంగా ఒక యువతి.

నల్లటిజుట్టు విశాలంగా విడిపోయి శరీరంమీద కొన్నికొన్ని భాగాలు మరుగుచేస్తోంది. పెదవులమధ్య చిరునవ్వు చిందిస్తూ - అర్ధనిమీలిత నేత్రాలతో మబ్బులచాటున సగందాగిన చంద మామని చూస్తోం దాయువతి. ఆచిత్రం గీసిన ప్రతిభా-ఆ నగ్న శరీరసౌందర్యాన్ని సృజించిన శక్తీ విస్మయం కల్గించాయి. చిత్రాన్ని చూస్తోన్నకొద్దీ సిగ్గూ కోపం ముంచుకువచ్చాయి పద్మినికి. చురుగ్గాచూస్తూ మూతి బిగించుకొంది.

"ఎలావుంది?" నవ్వాడు గోపాల్.

"ఎవరీ చిత్రాంగి" అడగకుండా వుండలేకపోయింది పద్మిని.

గోపాల్ తన్మయుడౌతూ అన్నాడు-"నావూహాసుందరి."

"ఎప్పటి నుంచో?"

"ఊహల్లో వుద్వేగం లేచినప్పటినుంచీ."

"మీవూహాసుందరికి చీరలులేవా?"

"నేను కట్టుకోనివ్వనుగా!"

సిగ్గు దాచుకొంటూ అంది పద్మిని - "పోనీ సిగ్గూలేదా!"

"నాదగ్గి రెందుకూ?"

"ఏమో బాబూ! నా కేం నచ్చలేదు."

"నచ్చలేదూ!" గోపాల్ పద్మిని భుజాలమీద చేతులు వేసి కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూశాడు.

"నిజంచెప్పు. నావూహాసుందరినిచూస్తే నీకు అసూయను కదూ?"

"నా కేం అసూయ లేదు."

"పోనీ కోపమూ?"

"నాకు కోపమూ లేదు."

"అయితే చాలా అనురాగంవుంది- అవునా ?"

"నా అనురాగం ఎందుకూ ? నీ వ్యూహాసుందరి నీకు వుందిగా ?"

గోపాల్ చిలిపిగా పద్మినిచెంప ముద్దుపెట్టుకున్నాడు.

పద్మిని కోపంగా అంది - "నువ్విలామాత్రం ఎప్పుడూ చెయ్యకు."

"అబ్బ ! ఎంతకోపం ? అయితే అసలుసంగతి చెప్పనా?"

"నేనేం వినను."

"ఓ సుముహూర్తాన ... వింటున్నావుకదూ? నావ్యూహా సుందరి - దివినుంచి భువికి దిగివచ్చిన దేవకన్యలాగా నాట్యం చేస్తోంటే చూసి మతిపోగొట్టుకున్నాను."

"అబద్ధం. నేనేం నమ్మను."

"నన్ను నమ్ము పద్మా ! నీకు నమ్మకం కలగటానికి పోనీ ఆ చిత్రం చించేస్తాను."

అదిరిపడింది పద్మిని. గోపాల్‌చేతిలోచిత్రం లాక్కుంది- "ఛీ ! నువ్వు మనిషివేనా ? పైగా చిత్రకారుడివా ?"

"నీ కంత కోపంవస్తే మరేం చెయ్యను ?"

"అందుకని నువ్వు గీసుకున్నబొమ్మ నువ్వే చించేసుకో గలవా ?"

"నీకోసం ఏమైనా చేస్తాను. నా వ్యూహాసుందరి నాకు లభించాక ఈచిత్రం లేకపోతేమాత్రం నష్టం ఏమిటి ? ఇదే నీకోపానికి కారణం అయితే ... "

"లేదు, లేదు. నాకేం కోపంలేదు." పద్మిని మందహాసం

చేసింది - "ఈ చిత్రంమాత్రం చాలా జాగ్రత్తగావుంచు."

గోపాల్ జాలిగా అడిగాడు - "కోపం రాకుండా ఎందుకంత మండిపడ్డావు ?"

పద్మిని గోపాల్ చేతిని మృదువుగా నొక్కింది—"ఇప్పుడు చల్లబడ్డాగా !" అంది— "నువ్వు పిచ్చిపిచ్చి బొమ్మలు గీస్తావంటే ఏమో అనుకున్నాను. ఇప్పుడు నీ చిత్రాలన్నీ చూస్తోంటే నాకు మతిపోతోంది. చిత్రకళ గురించి నాకేం తెలియకపోయినా నీచిత్రాల్లో ఏదో గొప్పతనం వుందని మాత్రం ఖచ్చితంగా చెప్పగలను."

గోపాల్ నవ్వాడు— "నిజంగా నేను గొప్పవాణ్ణే అంటావా, ఆమాట ఎవరూ అనలేదే !"

"ఎలా అంటారు ? నీబొమ్మలన్నీ నీదగ్గరే దాచుకుని ఈ మారుమూల కూర్చో. అదే కళారాధన అవుతుంది."

"అమాయకంగా మాట్లాడుతున్నావు పద్మా! కళామతల్లి కడుబీదది. బహుసంతానవతి. ఆమె అందచందాలు చూసి ఆనందించేవారేగానీ పోషించేవా రెవరు ?"

"అలా అంటే నేను ఒప్పుకోను. దేశం ఎప్పుడూ గొడ్డుపోదు. కళాహృదయులు లేకుండాపోరు. అసలు నీలో ప్రతిభ వుందని నీకే నమ్మకంలేదు. నిజం చెప్పాలంటే ఆత్మవిశ్వాసం లేకపోవటమే ఏ కళాకారుడి భవిష్యత్తుకైనా గొడ్డలిపెట్టు. కాదంటావా !"

"ఎలా అంటాను !"

"మరి నీ ఆర్ట్ గురించి ఎవ్వరికీ చెప్పకుండా ఏ ప్రయత్నాలూ చెయ్యకుండా ఎందుకింత వుదాసీనంగా వుండటం?"

"ఏం చెయ్యమంటావు?"

"తెలియకే అడుగుతున్నావా నన్ను? నీచిత్రాలేవైనా ప్రదర్శనకి పంపరాదా! పత్రికలకి పంపరాదా? చేజేతులా నీ భవిష్యత్తుని నువ్వే నిర్లక్ష్యం చేసుకుంటున్నావు."

గోపాల్ నవ్వుతూ అన్నాడు-

"నీ బొమ్మగీస్తే ఎంతయిస్తావో చెప్పు."

"ఎంతకావాలి ?"

"నేనే వెలకట్టుకోనా ?"

"లేకపోతే బొమ్మచూడకుండా నాకేం తెలుస్తుంది ?"

"సరే! చూశాకే ధర నిర్ణయించు, బొమ్మగీయించుకోవాలంటే రెండు మూడు గంటలైనా నాముందు కూర్చోవాలి."

"హాయిగా కూర్చుంటాను."

"ఎంతదూరం తీసికెళ్ళినా రావాలి. నే నేభంగిమ అడిగితే అదే యివ్వాలి."

"ఎందు కిన్ని షరతులు ? అక్షరాలా నువ్వు చెప్పినట్టే వింటాను. నా బొమ్మమాత్రం గీసి చూపించు, చాలు."

"తర్వాత వెల అడుగుతాను. మర్చిపోకు."

పద్మిని నవ్వింది. "నీ చిత్రాలు కొన్ని నాకిస్తావా ? నా గదిలో పెట్టుకుంటాను."

"నీయిష్టం వచ్చినవి తీసుకో."

"ఇప్పుడు కాదు, మరోసారి తీసుకొంటాను." ఏదో గుర్తు వచ్చినట్టు రిష్ట్ వాచ్ చూసుకుని కంగారు పడింది పద్మిని-"చాలా చీకటిపడిందే!"

"ఏం భయమా? అయితే యిక్కడే ఉండిపో."

"ఇక్కడా?"

"ఏం? వుండకూడదా?"

"ఊఁ, వుండిపోతే....?"

"అన్నం వండిపెడతాను."

"ఊఁ

"పక్క వేసి నిద్రబుచ్చుతాను."

"జోలపాట పాడుతూనా?"

"ప్రేమపాట పాడుతూ!"

"ఆహాః మెచ్చాం! ముందు నన్ను సాగనంపండి."

"ఏం, అంత కంగారు? నన్నుసూస్తే భయంగా వుందా?" చిలిపిగా అడిగాడు గోపాల్.

పద్మిని మృదువుగా అంది – "నన్ను చూసుకుంటే నాకే భయంగావుంది, ఇలా నీమాటలు ఇంకా వింటే నిజంగానే వుండిపోతాను" గోపాల్ చేతిని చెంపకి తాకించుకొంది.

శరీరమంతా విద్యుత్తు ప్రవహించి – చేతులమధ్య ఖైదు చేశాడు పద్మినిని గోపాల్.

పద్మిని పిరికిచూపులు చూసింది–"నాకు భయంగావుంది. పంపించివెయ్యవూ?"

గోపాల్ నవ్వి పద్మిని చెక్కిలిమీద సున్నితంగా ముద్దు పెట్టుకుని వదిలేశాడు.

* * *

"అక్కయ్యా! చెప్పటం మర్చిపోయాను. సాయంత్రం నా పాట ఒకటి రేడియోలో వచ్చింది–" అంది మోహిని

భోజనాలు అయ్యాక పైకి వస్తూ.

"ఏంపాట వచ్చింది ?"

"యమునా తీరాన...అనేది."

"ఇంకా ఎవరెవరివి వచ్చాయి ?"

మోహిని కాస్సేపు రేడియోకబుర్లు చెప్పింది. హఠాత్తుగా గుర్తువచ్చినట్టు— "అన్నట్టు నీకోసం వందన ఫోన్ చేసింది ?"

"ఎప్పుడు ?" పద్మిని కంగారు అణుచుకొంది.

"నువ్వు బయల్దేరి తర్వాత ఓ గంటై వుంటుంది."

"మరేం చెప్పావు ?"

"ఇంకేం చెప్పాను. నువ్వు వాళ్ళింటికే వెళ్ళావని చెప్పాను." మోహిని నిశితంగా పద్మిని మొహం పరిశీలిస్తూ అంది.

"నిజంగా అలాగే చెప్పావా ?"

"ఏం ? నువ్వు వందనా వాళ్ళింటికే వెళ్తానన్నావుగా ?"

"అన్నానుగానీ...."

"అన్నావుగానీ ... వెళ్ళలేదు." కాస్త వెటకారంగా చూసింది మోహిని – నువ్వు బయల్దేరిన గంటకికూడా వాళ్ళింటికి చేరలేదంటే ఎక్కడికో వెళ్ళివుంటావని వూహించాలే. వందనకి మరేదో చెప్పాను."

పద్మిని అపరాధిలాగా సిగ్గుపడుతూ—"నిజంగా వందనా వాళ్ళింటికే వెల్దామనుకున్నానే మోహినీ ! కానీ ... "

"కానీ నీకాళ్లు గోపాల్ దగ్గిరికి లాక్కుపోయాయి. అవునా !"

"అదికాదే! చాలాసార్లు మనయింటికి వచ్చాడా ? పోనీ ఒక్కసారి వెళ్ళివద్దామని ... పాపం నాలుగు రోజులు జ్వరపడ్డాడట. చాలా బలహీనంగా వున్నాడు."

మోహిని మాట్లాడలేదు.

పద్మిని చెల్లెల్ని ప్రసన్నం చేసుకోవటానికి నవ్వు తెచ్చి పెట్టుకుంటూ—"గోపాల్ గీసిన బొమ్మలవీ చూశాను మోహినీ! నిజంగా చాలా గొప్పగా వున్నాయి. అతను బొమ్మలుగీస్తా డంటే ఏమో అనుకున్నాంగానీ ... నిజంగా చూస్తే మతి పోతుందనుకో. గడ్డిరంగూ - నీళ్ళరంగూ - ఆకాశంరంగూ ఎంత సహజంగా వున్నాయో నేను చెప్పలేను. కెరటాలమీద సూర్యకిరణాలు పడి మెరవటంచూస్తే ... నిజంగా ...."

అన్నమాటే అంటూ - తడబడుతూ అక్కగారు చెప్తోన్న సంగతేం మోహినికి రుచించలేదు. విసుగు వ్యక్తంచేస్తూ అంది - "అతను గీసిన బొమ్మలు బావుంటే బావున్నాయిలే, అసలు ఒక్కమాటచెప్పు. నువ్వు వందన దగ్గిరికి వెళ్తున్నానని అబద్ధం ఎందుకు చెప్పాలి?"

పద్మినికి ఏంచెప్పాలో తోచలేదు. చెల్లెలు అంత నిలదీసి అడగటం చికాకుకూడా కల్గించింది.

పద్మిని జవాబు చెప్తుందని ఎదురు చూడలేదు మోహిని - "ఏమో అక్కయ్యా! నువ్వు చాలా మారిపోతు న్నావు," - ఆరెండుమాటలూ సాధ్యమైనంత చిరాగ్గా అనేసి గదిలోంచి వెళ్ళిపోయింది.

క్షణంపాటు తెల్లబోయినా - తర్వాత తనలో తను నవ్వుకొంది పద్మిని. నిజమే, తను నిర్ధారణ చేసుకోలేని నిజం

మోహిని కసిపెట్టింది. పద్మిని గదితలుపులుమూసి పక్కమీద పడుకొంది. గోపాల్‌గదిలో జరిగిన సంఘటనంతా కళ్ళకు కట్టినట్లు నిలిచింది.

తను గోపాల్‌కోసం వెదుక్కుంటూ వెదుక్కుంటూ వెళ్ళింది. 'నీ దయకోసమే వచ్చానని' చెప్పుకొంది. అతనెలా ప్రవర్తించినా అంగీకరించింది. సర్వం మరిచి అతని గదిలో అలా గంటలతరబడీ కూర్చుండిపోయింది.

తల్చుకొంటోంటే ఎంత ఆశ్చర్యంగా వుంది! అతన్ని చూడకపోతే అశాంతీ — కంగారూ — విసుగూ — అతని దగ్గర అంత సిగ్గులేనితనం — తొందరపాటూ — ఇదంతా ఏమిటి? ఎందుకూ?

నిజంగా తను చాలా మారిపోవటం కాదూ? "కానీ — కానీ — నేను మారటం లేదు మోహినీ! గోపాల్ నన్ను మార్చేస్తున్నాడు." అని చెప్పెయ్యాలనిపించింది.

తలగడలో మొహం ఒత్తుకుని పడుకుంది.

* * *

సంధ్యాకాంత చుట్టు చెంగావి చీర కట్టుకొంది. ఎత్తుగా ఆకాశంలోకి చూస్తోన్న కొండశిఖరాలు గర్వంతో ఎర్రగా మెరుస్తున్నాయి.

బండమీదనుంచి కాలుజారి పడబోయిన పద్మినిని గట్టిగా పట్టుకున్నాడు గోపాల్.

"పోనీ యిక్కడ కూర్చుందామా?" అన్నాడు చుట్టూ పరిసరాల అందచందాలుచూస్తూ. విశాలమైన చెట్లతో — దూరంగా కన్పిస్తోన్న కొండలతో నిర్మానుష్యంగా ప్రశాంతంగా

వుందా ప్రదేశం.

ఇద్దరూ కొంచెందూరం నడిచి ఎత్తుగా వున్న ఓ రాతి మీద కూర్చున్నారు.

"నేను హాయిగా ఇలా కూర్చుంటాను. నువ్వు బొమ్మ తీసుకో." అంది పద్మిని - కాలుమీద కాలు వేసుకుని దర్జాగా కూర్చుంటూ.

"అలాకాదు. లేచి కొంచెం దూరం వెళ్ళు."

"ఊఁ వెళ్ళి ?"

"చెప్తాను. నేనోసారి లేపాక్షి శిల్పాల్లో ఒక దేవకన్య ప్రతిమ చూశాను. ఎంత మూవ్ అయ్యానో చెప్పలేను. ఆభంగిమ నా మనస్సులో అలా ముద్రపడివుంది. అలా నిలబడాలి నువ్వు."

"ఎలాగో చెప్పు." పద్మిని వయ్యారంగా నడుస్తూ నాలుగడుగులు వేసింది — "ఇక్కడ నించోనా?" అంది. గోపాల్ దగ్గిరికి వెళ్ళి పద్మిని నిలబడాల్సినవిధం చెప్పాడు.

కుడిచేతిత్తో హృదయానికి దిగువగా శిరంపట్టి ఎడంచేతిని లతాహస్తంలాగా సుతారంగా జారవిడిచి - నడుం వయ్యారంగా కుడివక్కకు ఒంచి - మెడఎత్తి మొహంకొంచెం ఎడమవైపుకువట్టి - పచ్చగడ్డిమీద పాదాలు ఆనీ ఆననంత మృదువుగా ఆన్చి నిలబడింది పద్మిని.

"ఇలా ఎంతసేపు నిలబడాలి" అంది పిరికిచూపులు చూస్తూ.

"ఎంతసేపైనా హాయిగా నిలబడతా నన్నావుగా!" గడ్డంపట్టి మొహం కొంచెం సర్ది-చెంపమీద చిలిపిగా ఓ చిటికె

వేసి బండదగ్గిరికి నడిచివెళ్లాడు గోపాల్.

పద్మిని సిగ్గుతో ఎర్రబడ్డ బుగ్గలతో చిరుకోపం ప్రదర్శిస్తూ - చిరునవ్వు మిళితంచేస్తూ కన్నులు సోగగాపట్టి వాలు చూపులు చూస్తూ ప్రతిమగట్టి నిల్చింది. గోపాల్ పెన్సిల్ చేతిలోకి తీసుకుని పద్మినిని తదేకంగా చూశాడు. సజీవశిల్పంలా మందహాసంచేస్తూ నించున్న పద్మిని గోపాల్ నిగ్రహాన్ని ఆదిలోనే తుడిచివేసేలా కన్పించింది.

గోపాల్ దృఢంగా వూపిరి పీల్చి - ఒక్క క్షణం కళ్ళు మూసుకుని తెరిచాడు. స్కెచ్ పూర్తిచేశాడు. తర్వాత గోపాల్ కుంచె చకచకా పరుగులు పెట్టసాగింది. మధురభావాలతో దాగుడుమూతలాడుతోన్న ఆడలేడిలాగా గంతులు వేసింది — పద్మిని రూపురేఖావిలాసాన్ని — రంగులలోకి తర్జుమా చేస్తూ.

దీక్షగా తపస్సు చేస్తోన్న మహాముునిలా - చిత్రం గీయటంలో నిమగ్నమైపోయిన గోపాల్‌ని తన్మయత్వంతో చూస్తూ పద్మిని నిలబడేవుంది.

ఎందుకో కంటిపాపలు కదిల్చింది.

గోపాల్ అటువేపు చూశాడు.

ఎవరో ఇద్దరు మగవాళ్ళు దూరంగా వెళ్తూవెళ్తూ పద్మినికేసి ఆశ్చర్యంగా చూడటం కన్పించింది. గోపాల్ చిరునవ్వు నవ్వుతూ - "చూడనీ పద్మినీ! తరిస్తారు" అన్నాడు.

పద్మిని లజ్జాభారంతో కళ్ళు దించేసింది.

"అదిగో! అలా కళ్ళుమూసుకోకు. నా మూడ్ పోతుంది."

"అబ్బ! నేను నిలబడలేను." అన్నంత జాలిగా చూసింది కళ్ళెత్తి.

"ఫర్వాలేదు. కదలకు. ఒక్క పదినిముషాలు - ఆపే స్తాను." బతిమిలాడుతూ మళ్ళా కుంచె కదిలించాడు. కాయి తాన్ని ముద్దులాడుతూ పరుగులెత్తుతోన్న కుంచెల్ని చూస్తూ ఓపికగా నించుంది పద్మిని.

మరో పావుగంట గడిచింది.

గోపాల్ కుంచెలు బండమీదపడేసి నవ్వుతూ పద్మిని దగ్గిరికి అడుగులు వేశాడు.

పద్మిని నిశ్చలంగా నిలబడేవుంది.

"ఇంకా ఇలా నిలబడి...నిలబడి...నిజంగా బొమ్మవై పోతావేమోనని భయం వేస్తోంది." గోపాల్ పద్మినిచేతిమీద చెయ్యివేసి మృదువుగా ఒత్తాడు.

ప్రాణం పోసుకుంటోన్న ప్రతిమలాగా పద్మిని నెమ్మ దిగా ... నెమ్మదిగా ... కదిలింది — చిరునవ్వు నవ్వింది— మత్తుగా ఒళ్ళు విరుచుకోబోయింది. గోపాల్ హస్తాలలో బందీ అయిపోయింది. పరిసరాలన్నీ పారవశ్యంలో ఈదులాడాయి. పద్మిని మత్తుగా గోపాల్ చేతుల్లోంచి పచ్చిగడ్డి మీదికి జారింది.

"చాలా కష్టపెట్టానుకదూ పద్మా ? కాళ్ళు ఒత్తనా ?" గోపాల్ పద్మిని సరసన కూర్చుని మృదువైన పాదాలమీద చేతులువేసి ఒత్తసాగాడు.

పద్మిని కోపంతో గోపాల్ చేతులు తోసివేసి పాదాలు పూర్తిగా చీరకుచ్చెళ్ళతో కప్పుకొంది.

"చాల్లే ! ఏం పని ఇది ?"

"పాదసేవ."

"నాకేం అక్కర్లా."

"ఏం? నాకా అర్హత లేదా ?"

"అబ్బ! ఏం మనిషివి నువ్వు? నీతో పాదాలు ఒత్తించుకోనా?"

"ఇంతసేపు నించున్నావు, పాదాలు నొప్పి పెట్టటంలేదూ?"

"నాకేం నొప్పిలేదు."

"అబద్ధం ఆడుతున్నావు. నీకోసం నేనేమీ చెయ్యలేనంతదూరంగా వుంచుతున్నావుకదూ?" విస్మయంగా చూసింది పద్మిని.

"నేను నీకాళ్లు ఒత్తుతానంటే నీకు చాలా తప్పుగా తోస్తోందికదూ?"

"మరి తప్పుకాదా?"

"నేనుచెప్పే నాలుగుమాటలు వింటావా? మనకందరికీ ఆదర్శపురుషుడు శ్రీకృష్ణుడు - 'ప్రియే! చారుశీలే!' అంటూ రాధని ఎలా బ్రతిమిలాడుతున్నాడో నీకుతెలుసు. ఎనిమిదివందల సంవత్సరాల క్రిందట జయదేవకవి స్త్రీవిషయంలో ఎంతో సహజత్వాన్ని వెల్లడించాడు. ఆదర్శవంతమైన ప్రేమనీ-సరసతనీ అభివర్ణించాడు. పవిత్రమైన అనురాగానికి విశిష్టంగా రూపకల్పన చేశాడు."

పద్మిని చిరునవ్వు నవ్వుతూ అంది - "నువ్వింత మెచ్చుకుంటున్నావుగానీ ఆ అష్టపది నేర్పమంటే మాామాస్టారు ఒప్పుకోలేదు తెలుసా? అది స్టేజీమీద చెయ్యటానికి బావుండదన్నారు."

గోపాల్ కళ్లు కోపో ద్రేకంతో ఎర్రబడ్డాయి-"అవును. ఓం మాస్టారుకూడా ఓ విమర్శకాగ్రగణ్యుడే కాబోలు. సాక్షాత్తూ పరమాత్ముడు - శ్రీకృష్ణుడంతటివాడు ఒక ఆడదాని పాదాలు ఒత్తుతాననటమా? స్వహస్తాలతో లత్తుక పూస్తాననటమా? ఆ విధంగా కాళ్ళావేళ్ళావడి బ్రతిమిలాడటమా?— అని మన పెద్దలు చాలా మంది కుతకుతా వుడికిపోయారు. జయదేవుడు ఎంత గొప్ప కవికానీ - ఆ కవిత మాత్రం చాలా అనుచితంగా వుందన్నారు. జయదేవుడు శ్రీకృష్ణుణ్ని అవమానాలపాలు చేశాడని బాధతో తల్లడిల్లిపోయారు. పాపం ఈ విమర్శక శిఖామణుల్ని చూస్తే శ్రీకృష్ణుడు పగలబడి నవ్వుతాడని తోచలేదు. జాలితో నిట్టూరుస్తాడనీ అనుకోలేదు."

పద్మిని కుతూహలంగా అడిగింది — "ఎందుకూ?"

"శ్రీకృష్ణుడు దేవుడైతే-కృష్ణుడు ప్రేయసి కౌగిలిగిన రాధ మాత్రం దేవత కాదూ? - దేవత అయినా 'ఆడది - ఆడదే' అన్న ధోరణి మన పెద్దమనుషులది. ఆడది తనకన్నా అంతస్తు తక్కువ అని భావించే మగవాడు ఆ ఆడదాన్నుంచేగా అన్నీ పొందాల్సిందీ? ఇద్దరు మగవాళ్ళే సహచర్యం చేస్తే ఈ అంతస్తుల భేదం వుండదుగా?"

ఫక్కున నవ్వింది పద్మిని.

"మన పెద్దమనుషుల్ని చూసి నిజంగా నవ్వాల్సిందే. అనురాగానికికూడా హద్దులూ అంతస్తులూ నిర్ణయించే ఈ విమర్శకులు ఆడదాన్ని ఎక్కడ వుంచుతారో మనం వూహించవచ్చు, పాదసేవ తప్పితే ఆడదానికేం దక్కనివ్వకూడదనుకుంటారు. కానీ ఆ ఆడదాన్నుంచి ఎంత కోల్పోతున్నారో

మాత్రం అర్థంచేసుకోలేరు. రాధని ప్రాధేయపడ్డ కృష్ణుడు పిచ్చివాడా ? కృష్ణుణ్ని సృష్టించిన జయదేవుడు పిచ్చివాడా ?"

"వా సమర్థించే నువ్వు పిచ్చివాడివి. అనురాగపు లోతులు తరిచి చూసినట్టే మాట్లాడుతావేం

"అందుకేగా నీ పాదాలు ఒత్తుతానన్నానూ ?"

"కవి హృదయంలా నీది చాలా సంస్కార హృదయం కదూ ?"

గోపాల్ విసుగు వ్యక్తంచేస్తూ - "నువ్వసలు ఆదిలోనే తప్పటడుగు వేస్తున్నావు. నిజాన్ని నిజంగా అంగీకరించటమే సంస్కారం అవదు.

దాహం వేస్తోన్నప్పుడు నేను మంచినీళ్లు తాగి - నీకు కూడా మంచినీళ్లు యివ్వటం సంస్కారమా ? ఒక బాటమీద నాతో సమానంగా నిన్ను నడవనివ్వటం సంస్కారమా ?

ఇదంతా ఎంత సహజమో జయదేవుడు వెల్లడించిన భావాలు అంత సహజం. కానీ మనకు తరతరాలుగా సాగుతోన్న నియమాలు మార్చుకోవటం యిష్టంవుండదు. అందుకే చేదుగా కనిపించే నిజాలని వ్యతిరేకిస్తూ విమర్శల పరంపర సాగిస్తారు. అలాంటివాళ్ళకే ఏమాత్రం న్యాయసమ్మతమైన ప్రసక్తి విన్నా అదేదో సంస్కారజాడ్యంలాగా తోస్తుంది."

పద్మిని దీర్ఘంగా నిట్టూర్చింది - "నీ వుపన్యాసం ఒక్క ముక్కకూడా నాతలకెక్కలేదు. ఇంతకీ సారాంశం ఏమిటి ? నాపాదాలు ఒత్తుతానంటావు. అంతేనా ? సరే! అలాగే కానీ! దర్జాగా పడుకుంటాను." అంది పచ్చికమీదికి వాలుతూ. "చూడు, నేనిప్పుడు మహారాణీని."

"నువ్వు మహారాణీవైతే నేనెవర్ని ?"

"మహారాజువి."

"మహారాజు మహారాణీకి కాళ్ళొత్తుడుగా? హాహా నవ్వ్వి పోస్తాడు."

"మరి నువ్వెవరివి ?"

"శ్రీకృష్ణుణ్ణి."

"ఊహూ! నాకిష్టంలేదు."

"ఏం?"

"కృష్ణుడికి చాలామంది ప్రియురాళ్ళుంటారు. రాధ తన బాధనంతా సఖులకు చెప్పుకోవటం నీకూ తెలుసుగా ? ప్రేయసీప్రియులమధ్య అలాంటి అసూయలకీ ఆవేదనలకీ తావుంటే ఏం సుఖం ? ఆడదాని మనస్సుని అంత చక్కగా ఎరిగిన జయదేవుడంటే నాకు చాలా యిష్టం."

"అయితే నేను జయదేవుణ్ణే!"

ఇద్దరూ నవ్వుకొంటూ లేచారు.

"నాబొమ్మ చూపించవ్ ?"

"ఇప్పుడు కాదు. పూర్తి కావాలి."

"ఇంకెప్పుడు ?"

గోపాల్ నవ్వి అన్నాడు—"నాకు మంచి మూడ్ కుదిరితే తొందరగా పూర్తిచేసి చూపిస్తాను."

* * *

నిండు పౌర్ణమినాటి వెన్నెల రాత్రి. ఆకాశమంతా నక్షత్రాల తావడంతో మిలమిలా మెరుస్తోంది. తెల్లని వెన్నెల స్నానం చేస్తోన్న పుద్యానవనం. కన్నులవిందు కల్గిస్తోన్న పువ్వుల

గుత్తులు, సువాసనలతో సరాగాలాడుతోన్న పిల్లగాలు.

"బావుంది కవిత్వం."

"ఉద్యానవనానికి మధ్య ఎత్తైన నృత్య వేదిక చుట్టూ పచ్చిక తివాచీలమీద వాద్యబృందం అందరూ దేవతలే! అందరూ మానవాతీతులే."

"ఎవరెవరో ?"

"సున్నితంగా మురళి వూదుతున్నాడు ఇంద్రుడు. వీణ మీటుతూ శ్రావ్యంగా గానంచేస్తోంది సరస్వతి. మృదంగం దరువులు వేస్తున్నాడు విష్ణువు. తంబురతో లయ అందిస్తున్నాడు నారదుడు. తాళం వేస్తున్నాడు బ్రహ్మ!

అందరూ ఎదురుచూస్తోండగా నాట్యాలంకారాలతో నృత్యవేదికమీద ప్రత్యక్షమయ్యారు ఉమాశంకరులు. ఎవరో వాళ్ళిద్దరూ వూహించావా ?"

గోపాల్ పద్మిని కన్నుల్లోకి కన్నులుగుచ్చి తదేకంగా చూసుకున్నారు.

"సరిగ్గా నాట్యారంభానికి ముందు ఇలాగే చూసుకున్నారు ఉమాశంకరులు. గంధర్వులూ — అప్సరసలూ — కిన్నరులూ – కింపురుషులూ – మొదలైన దేవతలంతా ఆకాశ వీధుల్లో విహరిస్తూ చూస్తోంటే ఉమాశంకరుల నాట్యం ప్రారంభమైంది.

"భోంభోం" అని శంఖం వూది హెచ్చరికచేసి తాండవం ప్రారంభించాడు శంకరుడు.

దినదినాభివృద్ధి చెందుతోన్న సృష్టినిచూసి ఆనంద సంధ్యాతాండవాలు చేశాడు. ఆ అభివృద్ధినిరోధక శక్తుల్ని

ఘండాడుతూ కలికి తాండవం చేశాడు దుష్టశక్తుల్ని సంపాదించి ప్రపంచనాశనం చేస్తోన్న ఋషులతో పోరాడి - హోమగుండం నుంచి పుట్టుకొచ్చిన భయంకర సర్పాన్ని పూలమాలగా కంఠంలో ధరించాడు. గుండంనుంచి బయటపడ్డ పులినిచీల్చి దాని చర్మాన్ని వొలిచి మొలకుచుట్టుకున్నాడు. దుష్టశక్తి గజాసురుణ్ణి పాదంతో తొక్కి విజయతాండవం చేశాడు.

నాట్యంలో ఉమాశంకరులకు పంతం హెచ్చింది. తాండవంలో దిట్ట శంకరుడు. లాస్యంలో నేర్పరి ఉమ. 'నేనుగొప్ప' అంటే 'నేను గొప్ప' అంటూ ఇద్దరూ వాదులాడుకున్నారు. దేవతలందరూ ప్రోత్సహించగా వుత్సాహంతో తిరిగి నాట్యాం ప్రారంభించారు. హెచ్చుతగ్గులు నిర్ణయించలేనివిధంగా ఊర్ధ్వ తాండవం చేశారు.

రుద్రభూమినుంచి వచ్చిచేరుతోన్న సమస్త భూత గణాలతోనూ కలిసి ఉమాతాండవం చేశారు. సంసార సాగరం నుంచి కడ తేరివచ్చిన జీవరాసిని తమలో ఐక్యంచేసుకొంటూ సంహార తాండవం ప్రారంభించారు.

క్రమంగా ఉమా దేవి నృత్యపోకడ చూపరుల ప్రశంసల నందుకోసాగింది. శివుడు ఒక్కసారిగా కాలు ఎత్తి నెత్తిమీద పెట్టుకుని ఆడటం సాగించాడు. ఉమాదేవి స్త్రీసహజమైన లజ్జతో అలా చెయ్యలేక ఓటమి అంగీకరిస్తూ నాట్యం ఆపింది.

సప్తతాండవాలు ముగించి విజయగర్వంతో శంఖం పూరించాడు రుద్రుడు.

చిట్టచివర చూసుకుంటే ఉమాశంకరులు ఎవరు?"

"ఎవరు?"

"మనమే, నేను శంకరుణ్ణి, నువ్వు ఉమవి. అప్పుడు వచ్చీరాగానే దేవతలూ – నాట్యాలూ – సంగీతాలూ అన్నీ మాయమయ్యాయి."

"ఆహా! ఎంత అద్భుతంగా వుంది నీకల!"

"బ్రహ్మాండంగా వుందికదూ?"

"అయితే ఇలా కలలుకంటూ కాలం గడపటమేనా నీ వుద్యోగం?"

"ఉద్యోగమా? ఇది నా ప్రాణం. ఇలా కలలు కనకపోతే ఏనాడో నేను పిచ్చివాడినై పోయేవాణ్ణి. రాత్రింబవళ్లూ నీ చుట్టూ అల్లుకుంటోన్న మధురమైన వూహాలతోనే కాలం గడుపుతున్నాను పద్మా!" పద్మినిని ఒడిలోకి చేర్చుకుని చూపులతో చూపులు కలుపుతూ వేదనంతా వెల్లడించుకున్నాడు గోపాల్.

పద్మిని ఆరోజు ఆకుపచ్చ పట్టుచీర కట్టుకొంది. శరీర సోయగాన్ని పట్టి బంధిస్తోన్నట్టు పాముకుబుసంవంటి ముదురాకుపచ్చ రవికె ధరించింది. ఆకుపచ్చ కుంకుమతోనే నుదుట బొట్టు తీర్చి దిద్దుకొంది.

పద్మిని సౌందర్యంచూస్తూ ముగ్ధుడయ్యాడు గోపాల్. క్షణక్షణానికి ఇనుమడిస్తూ గోచరిస్తోన్న పద్మిని సోయగం చూస్తూ – "పద్మినీ! నువ్వు ఎలా వున్నావో చెప్పనా!" అన్నాడు మత్తుగా.

పద్మిని సిగ్గుతో మొగ్గ అయిపోయింది. అరమోడ్పు కన్నులతో వారచూపులు చూసింది—

"ఊఁ ఎలా వున్నాను?"

పద్మిని భుజాలచుట్టూ చేతులువేసి పరవశంతో కౌగి

లించుకొన్నాడు గోపాల్ - "నాకోసం ప్రత్యక్షమైన వనకన్యలా వున్నావు. దివినుంచి భువికి దిగివచ్చిన అప్సరసలా వున్నావు".

"చాలు, చాలు," నవ్వింది పద్మిని.

"చెప్పనీ పద్మా!" పారవశ్యంతో పద్మిని పెదవులు చుంబిస్తూ-చెక్కిలికి చెక్కిలి రాస్తూ-వెచ్చగా నిట్టూర్చుతూ - రహస్యంలా అన్నాడు గోపాల్ - "ఈ విప్రలంబశృంగారం ఎన్నాళ్లు పద్మా?"

పద్మిని త[illegible]వసించింది. గులాబీ రేకుల్లా రంగు మారేయి చెక్కిళ్లు, కంపిస్తోన్న పెదవులమీద మందహాసం చిందించాలని ప్ర[illegible]స్తూ - సిగ్గుగా - పిరికిగా - అయిష్టంగా - సరికొత్తగా చూస్తూ - గోపాల్ భుజంమీద చెయ్యివేసి మృదువుగా దూరం చెయ్యబోయింది. గోపాల్ గాఢంగా హత్తుకున్నాడు - "నీకింత కాఠిన్యం తగదు పద్మా!" దీనంగా వివశత వెల్లడించాడు.

పద్మిని నవ్వింది. గోపాల్ చెంపమీద చురుగ్గా వేళ్ళు అంటించింది - "నువ్విలా మోటుతనంచేస్తే నేనెప్పుడూ నీతో రాను. గుర్తుపెట్టుకో."

"అబద్ధం. నాతో రాకుండా నువ్వు వుండలేవు. అది నువ్వు గుర్తుతెచ్చుకో."

పద్మిని కంపించే పెదవులతో గోపాల్ కంఠంమీద ముద్దుపెట్టుకుని - సిగ్గుతో గోపాల్ గుండెల్లో మొహం దాచేసుకుంది.

కాలం స్తంభించింది.

ఆక్షణం — మరికొన్ని క్షణాలసేపు నిలిచిపోయింది.

గోపాల్ పద్మిని మొహం చేతులమధ్యకుతీసుకుని లాలనగా

అడిగాడు – "నన్ను చూస్తే నీకు భయంవేస్తోందా పద్మా ?"

పద్మిని నేలచూపులు చూసింది – "నాకేం భయంలేదు, కానీ నువ్వు ఎప్పటిలా వుండలేవూ ?"

"నాకు తెలీదు పద్మా! అంతశక్తి నాకులేదు." పద్మిని తల ఎత్తి నిశ్చలంగా – సూటిగా చూసింది.

మృదువుగా అంది – "మనం దారి తప్పటంలేదూ ?"

మాట్లాడలేకపోయాడు గోపాల్.

పద్మిని ప్రశ్న అర్థరహితంకాదు. అర్థవంతమూ కాదు. పద్మిని అనుకునేదాకే సరైనదైతే – అది ఇప్పటికే తప్పటం జరిగిందని పద్మినికి తెలియదా ? శృంగారచేష్టలు మాత్రం దారి తప్పటం కాదా ?

గోపాల్ ఆవేశం చాలవరకు గాలిలో కలిసిపోయింది – "క్షమించు పద్మా! నేను తొందరపడ్డాను." అన్నాడు అపరాధిలా.

పద్మిని అనునయంగా అడిగింది – "కోపం వచ్చిందా?"

"నాకేం కోపంలేదు. నువ్వుమాత్రం నాగురించి ఎలాంటి భయం పెట్టుకోకు. నీకునన్నుకు నామీద స్థిరత్వం ఏర్పడకుండా నిన్ను కలవరపెట్టాను. నన్ను అపార్థంచేసుకోకు పద్మా!"

పద్మిని కోపంగా అంది – "నువ్వే నన్ను అపార్థంచేసుకుంటున్నావు. నన్ను క్షమాపణకోరటం ఏమిటి ?" గోపాల్ తనకేదో నచ్చచెప్పటానికే ప్రయత్నిస్తాడనీ–తనబాధ వ్యక్తం చేస్తూ ప్రాధేయపడతాడనీ – జంకుతోవున్న పద్మిని, – అతని నిర్లిప్తతకి బాధపడింది. బేలగాచూస్తూ కూర్చుంది.

గోపాల్ ఏమీ జరగనట్టు–చిరునవ్వునవ్వి – బేగ్‌లోంచి

కుంచెలూ అవీ తీస్తూ - "పద్మా! మనం అసలుసంగతి మర్చి పోయాం. నువ్వు లేచి ఎప్పటిలా నిలబడు. నేను చిత్రం పూర్తి చేస్తాను." అంటూ కుంచె చేతిలోకి తీసుకున్నాడు.

పద్మిని మారుమాట్లాడకుండా లేచింది. నాలుగడుగులు నడిచి ఎప్పటిలా భంగిమ పెట్టి నిలబడింది.

"కొంచెం తల ఎత్తు పద్మా! నిన్నటిలా నిలబడు. కొంచెం నవ్వుతూ చూడు పద్మా! మనస్సులో చాలా కోపం పెట్టు కున్నావులా గుంది!"

పద్మిని చిన్నగా నవ్వింది. ఎప్పటిలా వయ్యారంగా నిలబడింది. పద్మినిమీది ఆపేక్షనుంచి మనస్సు నిగ్రహించుకుని - కుంచెలు రంగులలో ముంచుతూ - చిత్రీకరణలో నిమగ్నమైపోయాడు గోపాల్.

నిశ్చలమైన మనస్సుతో తపస్సుచేసే మునీశ్వరుడులా గోచరిస్తోన్న గోపాల్‌ని తదేకంగా చూస్తూ శిల్పంలా వుండి పోయింది పద్మిని.

ఎప్పటికో ... ఎప్పటికో ... చేతిమీద చల్లటి స్పర్శ తగిలితే - శరీరమంతా చైతన్యం ప్రసరించి కదిలింది.

ఒళ్ళు విరుచుకొంటూ గోపాల్ మీదికి తూలి పడింది. గోపాల్ నిర్వికారంగానవ్వి పద్మినిజుత్తు నిమురుతూ-"నీబొమ్మ చాలా బాగావచ్చింది." అన్నాడు.

"నాకంటేనా ?" అసూయగా చూసింది.

"హాయిగా ఆడుతూ - నవ్వుతూ మాటాడే నీకంటే బొమ్మ ఎలా బావుంటుంది ?"

పద్మిని మూతిముడుచుకొంది - "నాబొమ్మ నాకన్నా

అందంగా గీయనప్పుడు నీ కళాప్రతిభ ఏమిటో ?"

గోపాల్ నవ్వాడు - "బొత్తిగా ఆడదానివి. నీబొమ్మ నీకన్నా అందంగా వుందంటే ఓర్చలేవు. అందంగా లేదంటే సహించలేవు. నీబొమ్మ అచ్చం నీలాగేవుంది. తెలుసా ?"

"ఏదీ ? చూస్తాను ?"

"ఇప్పుడు కాదు. ఇంకా కొంచెం పనివుంది."

"అబ్బ ! నేనీ సస్పెన్స్ భరించలేను బాబూ !" అంది కోపం నటిస్తూ - మాట్లాడకుండా కూర్చుంది.

"పద్మినీదేవికి కోపంవచ్చిందా ? ఈ దీనుణ్ణి క్షమించ రాదూ ?"

"క్షమించి ... ?"

"మాట్లాడరాదూ ?"

"మాట్లాడి ... ?"

"సంతోష పెట్టరాదూ ?"

"సంతోష పెట్టి ... !"

చటుక్కున పద్మినిని దగ్గిరికిలాక్కుని చేతుల్లో ఇముడ్చుకుని - "ఇద్దరం తరిస్తాం." అన్నాడు.

"నీకు కోపం పోయిందిగా ?" దీనంగా అడిగింది పద్మిని.

"నాకేం కోపంరా లేదు పద్మా ! నీకే కోపంవచ్చిందని నేను భయపడ్డాను."

నవ్వింది పద్మిని.

* * *

పద్మినిచిత్రం అప్పుడే విచ్చిన పువ్వులా సౌందర్యంతో - సౌకుమార్యంతో తొణికిసలాడుతూ తయారైంది. చిత్రం

చుట్టూ ఆవరణంతా నల్లటిమబ్బుల  కప్పి వేయబడింది.

సంభ్రమంతో చిత్రం చూస్తోన్నపద్మిని ముఖకవళికలు అంతుపట్టకుండా పోయాయి గోపాల్‌కి.

"ఎలావుంది పద్మా ?" అన్నాడు ఆతృతగా.

"బొమ్మచుట్టూ పూలమొక్కలూ — సెలయేరూ — కొండలూ - అవీ గీస్తావనుకున్నాను." అమాయకంగా అంది పద్మిని.

గోపాల్‌నవ్వి - "ఎందుకూ?" అన్నాడు.

"ఎందు కేమిటి ?" తెల్లబోయింది.

"అలా వేస్తే ఇంకా బాగుండేదిగా ?"

"అదికాదు పద్మా! కేవలం రూపభంగిమకే ప్రాధాన్యం ఇవ్వాలనుకున్నాను. బొమ్మచుట్టూ - చెట్లూ - పువ్వులూ - సరోవరాలూ - అన్నీ చేర్చితే చూసేవాళ్ళదృష్టి ఈ భంగిమ మీదికి కేంద్రీకరించదు. చిత్రంలో ముఖ్యవస్తువుగా తీసుకున్న దానిప్రతిభ మిగతా పరిసరాలమీద ఆధారపడివుండకూడదు. ప్రతీచిత్రానికీ ప్రకృతిదృశ్యాలు జతపర్చి చిత్రావరణ పూర్తి చెయ్యాల్సిన అవసరం వుండదు. అలావేస్తే చిత్రంలో ప్రత్యేకంగా చెప్పాలనుకున్న భావం దెబ్బతింటుంది."

గోపాల్ మాటలు అర్థంచేసుకోవటానికి ప్రయత్నిస్తూ మళ్ళా చిత్రాన్ని దీక్షగా చూడసాగింది పద్మిని.

చూడగా చూడగా రంగులతో చిత్రీకరించబడ్డ నాట్యభంగిమ దేదీప్యమానమై - చైతన్యవంతమై - కదలటానికి సిద్ధంగా వున్న - సజీవమూర్తిలాగా గోచరించింది. మబ్బులలో తళుక్కున మెరుస్తోన్న విద్యుల్లతలాగా కన్పట్టింది. పద్మిని మొహం

మంతా సంతోషంతో వెలిగిపోయింది.

"బావుంది గోపాల్! చాలా బావుంది."

"నిజంగా నీకు నచ్చిందికదూ."

"నచ్చటం ఏమిటి? ఎంతో మనోహరంగా కన్పిస్తోంది. నిజం, ఫోటోలు తీయించుకోవటం తప్పితే ఇలాంటి కళాదృష్టి లేదు నాకు. నా బొమ్మ ఇంత అందంగా గీసిన నీ ప్రతిభను అభినందించాలి."

"అంతగా పొగడకు పద్మా! గంటలతరబడి ఎంతో సహనంతో భంగిమ మార్చి నిలబడ్డావు. నీకా ఏకాగ్రత లేకపోతే నా ఆర్ట్ సూత్రం ఏం రాణించేది? –"

"అదేం కాదు, ఇదంతా నీ గొప్పతనమే."

"నువ్వలా అంటే నామీద నాకు విశ్వాసం కలుగుతోంది. నీకు సంతోషం కల్గేలా బొమ్మ గీసినందుకు – నా కళాజీవితం సార్థకమైందనిపిస్తోంది. ఈసారి నీకు నచ్చేవిధంగా మరొకటి గీస్తాను."

పద్మిని సంభ్రమంగా అంది – "నువ్వలా కుంచెలు కదిలిస్తూ బొమ్మ గీస్తూవుంటే నిముషం నిశ్చలంగా నిలబడి వుండటం ఎంత హాయిగా వుంటుందో తెలుసా?"

"ఎంత హాయిగా వుంటుంది?"

సిగ్గుతో చిత్రంమీదికి దృష్టి మళ్ళించుకుంది పద్మిని.

"నువ్వు కావాలన్నావని కొన్ని చిత్రాలు తీసుకువచ్చాను" గోపాల్ అందించిన చిత్రాలు చూస్తూ మురిసిపోయింది పద్మిని.

"నా గదికి చాలా అందం వస్తుంది వీటితో అలంకరిస్తే" అంది.

"విచిత్రం వేశాక నేనడిగింది యిస్తానన్నావుగా?" కలవరపాటు అణుచుకొంటూ బింకంగా అన్నాడు.

"అడగరాదూ."

గోపాల్ నవ్వి - "మువ్వేం భయపడకు. అడగరానిది అడగనులే. నాలుగురికార్డులువేసి విన్పించు చాలు." అంటూ లేచి కిటికీదగ్గిరికి వెళ్ళి నిలబడ్డాడు.

పద్మిని హాయిగా నిట్టూర్చి లేచింది. మోహిని మెట్లు ఎక్కి పైకివస్తూ పద్మిని గదిలోంచి ఘల్లుఘల్లున గజ్జలమోత వినిపించి విస్తుపోయింది.

గ్రామఫోన్ పాటకి అనుకూలంగా గజ్జెలమోత సాగుతోంది.

"విరహమున నను నను వదలకురా!
విరహతాపముక ఓర్వలేనురా!
వెన్నెల వెలుగుల
సరసము లాడగ
చెలియను కౌగిట చేకొనరా!
సరగునరార - సమయమిదేర -
సరసుడవని - నే - సరసకు చేరితిర,"

బాలసరస్వతి కంఠం మత్తుమందు జల్లుతోంది.

మోహిని హాల్లోంచి తనగదికేసివెళ్తూ పద్మినిగదికేసి చూసింది.

"అద్భుతంగావుంది. మల్లీశ్వరిలో రికార్డు వేస్తావా?"- గోపాల్ మాటలు వినబడి ఆశ్చర్యంతో తలమునకలైంది - తన గదిలోకి పోయి పుస్తకం టేబుల్ మీద పడేసి మోచేతులు

టేబుల్ మీదికి ఆన్చి చేతులమధ్య తల పెట్టుకు కూర్చుంది

అక్కయ్య ఎందుకిలా మారిపోతోంది ?

వాళ్ళిద్దరూ ఏలోకాలలో విహరిస్తున్నారు ? గోపాల్ తరుచూ రావటం- అక్కయ్య గంటలతరబడీ అతనితో బాతాఖానీకొట్టటం తను చూస్తూనేవుంది.

అటు అక్కయ్య చాలా మృదుభావంగా వుండేది. ఎవరు పల్కరించినా ఓ చిరునవ్వు చిందించి వూరుకునేది. కాలేజకో మాష్టారింటికో బయటికెళ్ళటం తప్పితే - ఎప్పుడూ ఇంట్లోనే కూర్చునేది - పుస్తకాలు చదువుకుంటూనో - జాకెట్లు కుట్టుకుంటూనో - పువ్వులవీ అల్లుకుంటూనో ఒంటరిగా కాలం గడిపేస్తూ వుండేది.

అలాంటి అక్కయ్య గోపాల్‌ముందు డ్యాన్సుచేసే స్థితికి వచ్చిందా ? భగవాన్ !

వాళ్ళిద్దరూ చేస్తున్న షికార్లకి అంతువుందా ? డాన్స్ట్యూషన్‌కూడా ఎగగొట్టి అక్కయ్య వెళ్ళిపోయినరోజు తనెందుకు అడగలేదు? గోపాల్‌కోసం గంటలతరబడీ రికార్డులు విన్పిస్తోంటే తనచదువుకి ఆటంకమైనా ఎందుకు సహించింది ? తెల్లవార్లూ బాల్కనీలో పచార్లుచేసి తెల తెలవారుతోండగా డాన్స్ ప్రాక్టీస్‌కి ఎగనాంపెట్టి గదిలోదూరి పడుకుంటే ఎందుకు నిర్లక్ష్యం చేసింది ? నెలలకొద్దీ వీణసాధనకి ఏవేవో సాకులుచెప్పి తప్పించుకొంటోంటే ఎందుకు వదిలేసింది ?

నిజంగా అక్కయ్య మారిపోవటానికి పరోక్షంగా తను చాలా దోహదం చేసింది. చాలా పొరపాటుచేసింది. లేకపోతే అక్కయ్య ఇంత సాహసించగలిగేదికాదు.

భానుమతి కంఠం మాధుర్యాలొలికిస్తూ ఆలోచనలు సాగనివ్వకుండా మనసుని మంత్రించి వేస్తోంది.

"ఈ నయగారము
ఈ వయ్యారము
ఈ నవయౌవ్వన
మారగ నినునే
పిలచిన బిగువటరా?"

కాలిగజ్జెల మ్రోత మృదువుగా పాటలో లీనమౌతోంది.

"గాలుల తేలెను
గాఢపు మమతలు
నీలపు మబ్బుల
నీడలు ఒసదలెను
అందెల రవణుల
సందడి మరిమరి
అందగాడ ఇటు తొందర సేయగ..."

మోహిని విసురుగా లేచింది. హాల్లోకి వెళ్ళి పద్మిని గదిముందు నిలబడి తటపటాయించింది.

రికార్డు ఆగింది. గజ్జెల ఘల్లుఘల్లూ ఆగింది. "అక్కయ్యా!" కంఠంలో కావలసినంత అసహనం గుమ్మరిస్తూ మెత్తగా పిల్చింది.

"మోహినీ! రా! అలా నిలబడ్డావేం?" తనజంకు దాచుకొంటూ - గజ్జెలు చప్పుడు కాకూడదన్నంత సుతారంగా అడుగులేసూ గుమ్మం తెర వెనక్కిపట్టుకుని అంది పద్మిని -
"ఎంతసేపైంది నువ్వొచ్చి?"

"ఇప్పుడేలే." గదిలో అడుగుపెట్టి విస్మయం ప్రక టిస్తూ - "అరె! గోపాల్ కూడా వున్నారే! నమస్కారమండీ! అక్కయ్యా ఒక్కతే రికార్డులు వేసి డాన్సు చేసుకుంటోందేమో అనుకున్నాను." అంటూ నవ్వుతూ విష్ చేసింది మోహిని.

గోపాల్ రిసీవ్ చేసుకొంటూ - "లేదులెండి. నేనే ప్రెస్ చేసి డాన్సు చేయించాను. నాకు జావళీలంటే చాలా యిష్టం. అన్నాడు.

పద్మిని ఏమీతోచక - మాట్లాడకుండానూ వుండలేక - "మా మోహిని చాలా బాగాపాడుతుంది" అంది గోపాల్ ని చూస్తూ.

"అవును. మీరికార్డులు చాలా విన్నాను. స్వయంగా వినేభాగ్యం లభించలేదు."

గోపాల్ నిరాశ వ్యక్తంచేస్తూ నవ్వాడు. అతనిభావం అర్థంకానట్టే వూరుకుంది మోహిని. గోపాల్ మళ్లా అన్నాడు- "మోహినీదేవి! మీరేదైనా పాడండి! మీసిస్టర్ డాన్సుచేస్తుంది. మీగానం - ఆమెనాట్యం - నిజంగా నేను ధన్యుణ్ణవుతాను."

గోపాల్ మందహాసాలు చూస్తూంటే మోహినికి ఒళ్లు మండింది-"ఇదేం డాన్సు క్లబ్బుకాదు మిష్టర్!" అనెయ్యాలని పించింది. ఆమాటలు తననోటినుంచి వస్తే ఎంత అనుచితంగా ఎంత అసభ్యంగా వుంటుందోకూడా వూహించగల్గింది. అతి ప్రయత్నంమీద చిరాకు అణిచిపెట్టుకొంటూ నవ్వి వూరుకొంది.

"మోహినీదేవి ! ఒక్కపాటపాడరూ ? ప్లీజ్ !"

"సారీ!" ఎక్స్క్యూజ్ మీ! నాకేం బాగాలేదండీ! అక్కయ్య ఇంత బుద్ధిగా డాన్సు చేసుకుంటోందేమిటా అని యిలా

వచ్చాను. వెళ్తానండీ!" గుమ్మంలోంచే వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

గోపాల్ ఆత్మాభిమానం గాయపడి సిగ్గుతో పద్మినికేసి చూశాడు. పద్మిని నెమ్మదిగా దగ్గిరికి వెళ్ళి నిలబడి ఓదార్పుగా అంది - "మోహిని ఎందుకో చిరాగ్గావుంది. మూడ్ తెలుసుకోకుండా అడిగావునువ్వు. మరెప్పుడైనా పాడుతుంది తప్పకుండా. ఏమీ అనుకోవుగా ?"

నవ్వి వూరుకున్నాడు గోపాల్.

పద్మిని గోపాల్ చేయిపట్టుకుని ఆప్యాయంగా అంది — "నువ్వు బాధపడకు గోపాల్! నేను వుండగా మరొకరి ప్రసక్తి ఎందుకు ? నువ్వలా చిన్నబుచ్చుకుంటే నాకు చాలా దిగులుగా వుంది."

"లేదు పద్మా! నేనేం బాధపడలేదు." తృప్తిగా చూశాడు.

*　　　　*　　　　*

చిత్రంచూసిన మోహిని ఆశ్చర్యాన్నుంచి ఎంతో సేపటికిగానీ తేరుకోలేకపోయింది. చిత్రం అందచందాలు అలా వుంచి - ఆ చిత్రం తయారుకావటానికి వెనుక జరిగిన విశేషాన్ని వూహిస్తే మతిపోయింది. విస్మితంగా అక్కగార్ని చూస్తూ - "గోపాల్ బొమ్మగీస్తోంటే నువ్వు అలా నించున్నావా ? అందుకేనా అన్నిరోజులు బయటికి వెళ్ళావు ?" అంది ఆశ్చర్యం వెళ్ళబుచ్చుతూ.

పద్మిని నవ్వింది - "చిత్రం బావుందో లేదో చెప్పు మోహినీ! చాలా బావుందికదూ ?"

అక్కగారి నిర్లక్ష్యానికి మోహిని అమితంగా చిరాకుపడింది - వెటకారం భావం ధ్వనింపజేస్తూ అంది - "గోపాల్‌తో నీ స్నేహం దినదినాభివృద్ధి చెందుతోన్నట్టుందే!"

పద్మిని చెల్లెలి మొహంలోకి మెత్తగా చూసింది -

"గోపాల్ చాలా మంచివాడు మోహినీ!"

"అయితే?"

"అతనంటే నాకు చాలా యిష్టం."

"ఎలాంటి యిష్టం?"

పద్మిని మాట్లాడలేదు. మోహిని లేచి చేతిలో చిత్రం టేబుల్ మీద పెట్టి వెనక్కి తిరిగింది - "అక్కయ్యా! నిన్నొక మాట అడగనా?"

"ఏమిటి?"

"మీ స్నేహం వుత్తస్నేహమేనా? మరేమైనా అర్థాలున్నాయా?"

పద్మిని నవ్వింది - "నీకేమైనా అర్థం కన్పిస్తోందా?"

"నాకేం అర్థం కన్పించటంలేదు. అనర్థం కన్పిస్తోంది. పోనీ నీ అభిప్రాయం ఏమిటో చెప్తే అర్థంచేసుకుంటానుగా?"

"నువ్వు చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నావు మోహినీ!"

"నిజమే. సీరియస్‌గానే మాట్లాడుతున్నాను. ఆ మాత్రం గ్రహించావు చాలు."

"గోపాల్ అంటే నీ కెందుకంత తేలిక భావం?"

"నా భావాలగురించి తర్వాత ఆలోచిద్దాం. ముందు

మీ ాస్వ్రహానికి అర్థం ఏమిటో చెప్పరాదూ ?"

పద్మిని కొంచెం చురుగ్గా అంది-"నీకు అంతా తెలుసు. అయినా చెప్పమంటే చెప్తాను. గోపాల్‌ని నేను పెళ్ళి చేసుకుంటాను."

తృళ్ళిపడింది మోహిని - "అక్కయ్యా !" నమ్మశక్యం కానంత విస్మయంగా చూసింది- "పెళ్ళి.. పెళ్ళి...నువ్వు పెళ్ళి చేసుకుంటావా ?"

పద్మిని మాట్లాడ లేకపోయింది. పెళ్ళిమాట వింటూనే చెల్లెలు ఎంత కంత అదిరిపడుతుందో పద్మినికి తెలుసు. కానీ...

"పెళ్ళి చేసుకోకుండా ఎవరు వుంటారు మోహినీ ?" అంది మృదువుగా.

మోహిని నుదురు చిట్లించింది-"ఎవరిమాటో నిన్న దాక తెలీదే !"

"పోనీ నాసంగతే. పెళ్ళి లేకుండా నేను వుండలేనేమో!"

"అక్కయ్యా !" తీక్ష్ణంగా చూసింది మోహిని - "ఇలా చెప్పటానికి నీకు సిగ్గువెయ్యటంలేదూ ? పెళ్ళిమాట ఎత్తితే అసహ్యం ముంచుకు రావటంలేదూ ?"

పద్మిని మౌనం వహించింది.

"మగవాళ్ళ అధికారాన్ని తల్చుకుంటే మనస్సు ముంచి పోవటం లేదూ ? అమ్మ జీవితం ఏమైంది ? మొగుడి మూర్ఖత్వానికి ఆహుతి అయిపోయింది."

"మోహినీ! ఎప్పుడో ఏదో జరిగిందని దాన్ని తర తరాలకూ సమన్వయించుకోవటం సమంజసం అవుతుందా?"

"ఎప్పుడో ఏదో జరిగిందా?" ఆశ్చర్యంతో అక్కగార్ని

ఎగాదిగా చూసింది – "మొన్న మొన్నటి మాలతి విషయం అప్పుడే మర్చిపోయావా? అప్పుడు మనం చెప్పుకున్నవన్నీ గాలిలో కలిసిపోయాయా? ఇంతమార్పెలా వచ్చింది నీకు?"

అపరాధిలా నిలబడింది పద్మిని.

మాలతి విషయం తను మర్చిపోలేదు. ఎలా మర్చిపో గలదు?

మాలతి దూరపుబంధువుల పిల్ల.

మాలతి పెళ్ళికి తాతయ్య బయల్దేరుతోంటే అక్క-చెల్లెళ్లుకూడా సరదాకొద్దీ బయల్దేరి వెళ్లారు.

సరిగ్గా ముహూర్తం సమయానికి పెళ్ళివారింటికి చేరటం జరిగింది.

మాలతి – పెళ్ళికూతురై పేరంటాళ్లమధ్య కూర్చుని వుంది లేతకనకాంబరంరంగు పట్టుచీరా–ఒంటినిండా నగలూ–బుగ్గన చుక్కా–కల్యాణం బొట్టూ–పువ్వులుకుట్టిన వాలుజడా – పారాణిదిద్దిన పాదాలూ – సిగ్గుతో చితికిపోతూ కూర్చునివున్న మాలతిని తాతయ్య చూపిస్తే పద్మినీ మోహినీ సిగ్గుపడి పోయారు

తర్వాత పెళ్ళికూతుర్నీ – పెళ్ళికొడుకునీ పెళ్ళి పందిట్లోకి తీసుకువెళ్ళి పీటలమీద కూర్చోబెట్టారు బాజాలన్నీ ఒక్కసారి మోగాయి.

పురోహితుడేవో మంత్రాలు చదువుతూ పూజలు చేయించబోతే – ఎవరో పెద్దమనిషి రంకెలు వేస్తూ ఆటంక పెట్టాడు.

"విడిది సదుపాయాలగురించీ – భోజనాల గురించీ –

మర్యాదలగురించీ - ఎన్ని అవకతవకలు జరిగినా నోరు మూసుకుని వూరుకున్నాం. ఆఖరికి కట్నాలదగ్గిరా కానుకల దగ్గిరా వెళ్లి పెడతారాకే అలా వీల్లేదు. బాజాలు ఆపండో యిః పంతులుగారూ! మీరు నోరుమూసుకోండి. ముందా కట్నం సంగతేదో తేల్చండి." అంటూ ఆ పెద్దమనిషి నిర్మోహమాటంగా తేల్చి చెప్పేశాడు.

ఎక్కడివాళ్ళక్కడ కూలబడ్డారు.

కట్నంతాలూకు డబ్బు కొంతయిచ్చినా మిగతాభాగం పెళ్ళినాటికి జతపడ్చలేక పోయాడు పిల్లతండ్రి. ఆడపెళ్ళివాళ్ళు చాలామంది చేతులు పట్టుకుంటూ మొగపెళ్ళివాడికి సర్ది చెప్పాలని చూశారు. లాభం లేకపోయింది.

మాటామాటా పెరిగింది. పెళ్ళిపందిరంతా గందరగోళంగా తయారైంది.

పెళ్ళికూతుర్నీ - పెళ్లికొడుకునీ — పీటలమీదనుంచి లేవదీసి తీసుకుపోయారు.

పద్మినీ-మోహినీ తెల్లమొహాలతో పందిట్లోంచి పెళ్లింట్లోకి వెళ్ళారు. ఆడవాళ్ళంతా కళ్ళు ఒత్తుకుంటున్నారు. పెళ్లికూతురుతల్లి ఓమూల కూర్చుని ఏడుస్తోంది. పెళ్ళికూతురు కూడా మోకాళ్ళలో మొహందాచుకుని వెక్కి వెక్కి పడుతోంది.

పద్మినికి చాలా జాలేసింది. చెల్లెలికేసి చూసింది మోహిని పెళ్ళికూతురుకేసి చూసింది.

పందిట్లోంచి ఎవరో వచ్చి చెప్పారు- "పెళ్ళివారు వెళ్ళిపోతారట. గంతా బొంతా సర్దుకుంటున్నారు. ఛీ! ఏం మను

ష్టుల్లో ! అనుకున్న డబ్బు కాస్తా పెద్దలంతా కలిసి ఎలాగో సర్ది యిచ్చారు. ఇంకా ఏవో లాంఛనాలూ - మర్యాదలూ - అంటూ సాగదీస్తూ కూర్చున్నారు.”

పెళ్ళికూతురుతల్లి - “అయ్యో ! భగవంతుడా! ఇంత చిలవంపు తెచ్చావా ? ఇంత నవ్వులపాలుచేశావా ?” అంటూ తలబాదుకొంటూ ఏడ్చింది.

“పోతే పోనిద్దూ ! వాడు కాకపోతే వాడి తాతలాంటి వాడొస్తాడు. ఎలాజరగాలో అలా జరుగుతుంది, ఏడ్చి మొత్తుకుంటే ఏమైనట్టూ ?” అంటూ అక్కడి ఓదార్పటంలో పడ్డారు చాలామంది.

శుభముహూర్తం గిభముహూర్తం అన్నీ దాటిపోయాయి - మళ్ళా ఎవరోవచ్చి చెప్పారు. - “వాళ్ళుసిగ్గు వాళ్ళే [illegible]న్నారు. వాళ్ళుగూడను కూర్చున్నారు. ఏదీ ! పెళ్ళికూతుర్ని తీసుకురండి. ఏడుపులో - పెడబొబ్బలో - ఆ మూడుముళ్ళూ పడితే సరి. అన్నీ సర్దుకుంటాయి. మళ్ళా ఏదో ముహూర్తంవుందిట, పురోహితుడు కంగారుపడుతున్నాడు.”

అంతా పెళ్ళికూతురుకోసం చూశారు. ‘ఏదీ? అమ్మాయి ఏదీ ? మాలతేదీ ?’ అంటూ ఇల్లూ వాకిలీ వెదికారు.

“ఇందాక దొడ్లోకి వెళ్ళటం నే చూశానమ్మా !” అందో ఆవిడ.

అందరూ కంగారుగా పెరట్లోకి పరుగులెత్తారు.

నిజం నిలకడమీద తెలిసింది.

మాలతి శరీరాన్ని నూతిలోంచి బయటికి తీశారు - ఇల్లంతా శోకాలతో నిండిపోయింది. “ఇదేంఘోరమే తల్లీ ?”

అంటూ అందరూ ముక్కులమీద వేళ్ళేసుకున్నారు.

నూతి చప్టామీద పడివున్న మాలతిని భయంతో బిగు సుకుపోతూ దూరంనుంచిచూస్తూ నిలబడ్డారు పద్మినీ మోహినీ.

మాలతి శరీరం చాలా దారుణంగా కన్పించింది. పొట్ట వుబ్బి ఘోరంగా అందవికారంగా వుంది. పారాణివ్రాతలూ - కళ్యాణంబొట్టులూ అన్నీ తుడుచిపెట్టుకు పోయాయి. నుదుటి మీద పెద్దదెబ్బ స్పష్టంగా కన్పిస్తోంది. పట్టుచీర వూడి లుంగలు చుట్టుకుపోయింది. పూలజడ నీళ్ళోడుతూ నేలమీద పడివుంది.

ఓగంటు క్రిందట- పసుపుకుంకాలతో - కళకళలాడుతూ- సిగ్గుదొంతరల మధ్య ముసిముసిగా నవ్వుకొంటూ - తలదించు కుని పెళ్ళిపీటమీద కూర్చున్న మాలతి - పెరట్లో నూతిపళ్ళెం దగ్గిర బురదలో నిర్జీవంగా పడివుంది.

ముందుచూపుగలవాళ్ళంతా గుండె రాయి చేసు కున్నారు_"ఎందుకొచ్చిన బెడద? పోలీసులూ... కేసులూ.... ఛీ! లేపండి అయ్యిందేదో అయింది." అంటూ కూడబలుక్కొని జరగాల్సిన తతంగమంతా పూర్తిచేశారు.

పెళ్ళికూతురు శవాన్ని ఖాళీ పెళ్ళిపందిరిలోంచి - బోసి పోయిన మండపంలోంచి నిశ్శబ్దంగా తీసుకుపోయారు.

పెళ్ళికూతురు తల్లి స్పృహతప్పి పడిపోయింది. ఇంగతా వాళ్ళంతా దెయ్యాల్లా కూర్చున్నారు. పెళ్ళియిల్లు వల్లకాడులా తయారైంది.

"అక్కా! మనం వెళ్ళిపోదాం," అంది మోహిని వస్తోన్న ఏడుపు ఆపుకొంటూ.

"నాకూ వుండబుద్ధికావటంలేదే!" అంది పద్మిని పిరికి

చూపులు చూస్తూ.

తాతయ్య రైలుఎక్కిస్తే యిద్దరూ యింటికి వచ్చేశారు. వచ్చీరాగానే - "రాజమ్మా! ఏమైందనుకున్నావ్? పెళ్ళికూతురు నూతిలోపడి చచ్చిపోయింది." అంటూ జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పారు. నాగరాజు కన్పిస్తే - "నాగరాజూ! ఏమైం దనుకున్నావ్?..." అంటూ మళ్లా అంతా ఏకరువు పెట్టారు. వారం తిరిగేసరికి ఎంతమందికి చెప్పారో వాళ్లకే తెలీదు.

ఆవారంరోజులూ రాత్రీ పగలూ - మాలతి విషయమే మాట్లాడుకున్నారు. "అయినా మాలతి అలా చేసి వుండ కూడదు. పిరికిదానిలాగా చచ్చిపోవటం ఏమిటి?" అంది మోహిని చాలాసార్లు.

"అదేం పిరికితనంకాదు. చావటానికి చాలా సాహసం కావాలి." అంది పద్మిని వాదిస్తూ - "పాపం మాలతి ఎన్నో ఆశలతో - జీవితంమీద ఎంతో కోరికతో పెళ్లిపీటలమీద కూర్చుంది. కానీ ఆస్థానంలోంచి లేచిపోవాల్సిన పరిస్థితి సంభవిస్తే మాలతి అభిమానం దారుణంగా గాయపడి వుంటుంది అదీగాక మొగపెళ్లి వారు వెళ్ళిపోతారన్న కబురుకూడా వింది. ఆ అవమానం సహించలేకపోయింది.

నిజానికి మాలతిలాంటి అభిమానవతి మళ్ళా ఆపెళ్ళి కొడుకుని చేసుకోవటానికి ఎంతమాత్రం యిష్టపడదు. ఒకవేళ పెళ్ళివారు రాజీకివచ్చి - పెళ్ళికి సిద్ధపడితే - ఆపెళ్ళి జరగటం మాలతికి యిష్టంలేదు. కానీ - 'నేను చేసుకోను.' అని చెప్ప లేదు. చెప్పినా ఆపరిస్థితిలో ఎవ్వరూ వినరు. 'ఎలాగో పెళ్ళి

వారిని బ్రతిమలాడుకుని ఒప్పిస్తే - ఇప్పుడు నువ్వు చేసుకో నంటావా ?' అని నలుగురూ చివాట్లుపెట్టి నోరు మూయించి మరీ పెళ్ళిచేస్తారు. అంత అయిష్టంతో పెళ్ళి చేసుకుని జీవితాంతం కుళ్ళికుళ్ళి ఏడ్చేకన్నా - 'ఇప్పుడే ఏదో చేసేద్దాం' అన్న ఆవేశంతో - పాపం నూతిలో దూకింది."

"అదే పిచ్చిపని. ఎక్కడికైనా పారిపోతే బావుండేది."

"ఎక్కడికి పారిపోతుంది? తర్వాత యింటికెలా వస్తుంది?"

"ఏమో ! అదంతా నాకు తెలీదు. చావటం మాత్రం తెలివితక్కువ. నేనీపెళ్ళి చేసుకోనని ఖచ్చితంగా చెప్పెయ్యాలి."

"చచ్చిపోయింది కాబట్టి ఇలా అంటున్నాం. మామూలుగా కూర్చుని ఆమాట అంటే ఎవ్వరూ వినరు."

"ఎవ్వరూ వినకపోతే తిన్నగా వెళ్ళి పెళ్ళికొడుకే చెప్పెయ్యాలి."

"ఏమని ?"

"ఓ అప్రయోజకుడా ! నిన్ను నేను పెళ్ళి చేసుకోను, లేచి చక్కా వెళ్ళు - అని."

"వాడో ఇకిలింపు ఇకిలించి - 'నిన్ను నేను చేసుకుంటాగా? దా ! కూచో !' అంటాడు "

"ఛ! నువ్వంతా తలతిక్కగా మాట్లాడుతున్నావ్. పెళ్ళికూతురు అలాచెప్పేస్తే వాడికి పౌరుషంరాదూ ?"

"అయ్యోఖర్మ ! వాడికి పౌరుషం - అభిమానం వున్నాయనే భ్రమిస్తున్నావన్నమాట."

"ఎన్ని చెప్పు అక్కయ్యా ! మాలతి చావటం బాగా లేదు."

"మాలతి చావటం బ్రహ్మాండంగా వుంది. నేనా స్థితిలో వుంటే అలాగే చేస్తాను"

"నేను ఛస్తే అలా చెయ్యను."

తర్కవితర్కాలతో గంటలు గంటలు దొర్లించి – "పాపం! మాలతి చచ్చిపోయింది." అంటూ చివరికి మాలతికి సానుభూతి చూపిస్తేగానీ యిద్దరి మనస్సులూ శాంతించేవి గావు.

"అక్కయ్యా! నాకా రెండు దృశ్యాలూ కళ్ళముందు కొట్లాడుతున్నాయి. చక్కగా సింగారించుకుని పెళ్ళిపీటమీద కూర్చుండలేదా? పాపం ఆ మాలతే నేలమీద బురదలో అస్తవ్యస్తంగా చచ్చిపడివుంది. అబ్బ! ఎంత దారుణం!" ఒళ్ళంతా జలదరిస్తోంటే చేతులు రెండూ చెంపలకు ఆన్చుకుని భీతిగా చూసింది మోహిని.

"అది తల్చుకుంటోంటే నామనస్సుకూడా కుతకుతా వుడుకుతోంది."

"ఇలా ఎన్ని దారుణాలు జరుగుతున్నాయో మనకేం తెలుసు!"

"నిజమే. ఈ కట్నాలగోల చిన్నవాళ్ళనీ–పెద్దవాళ్ళనీ–కుటుంబాలనీ – శాంతిసుఖాలనీ – సర్వనాశనం చేస్తోంది."

"ఇదంతా ఒక్క కట్నాలసమస్యకే సంబంధించింది కాదక్కయ్యా! మనుష్యుల్లో కనీసపు మానవలక్షణంకూడా అడుగంటిపోతే యింకెన్ని దారుణాలైనా జరుగుతాయి. జరుగుతున్నాయికూడాను. పెళ్ళి కాస్తా ఎలాగో అయితేమాత్రం అసలు జీవితమంతా ముందేవుంది. అధికారాలూ–అహంకారాలూ – తిట్టుకోటాలూ –కొట్టుకోటాలూ... ఛీ! అసలు సమస్యలన్నీ

పెళ్ళిమూలానే."

"పెళ్ళిమూలాన కాదు. మనుష్యుల్లో మూర్ఖత్వం మూలాన."

"అంత మెత్తగా చెప్పకు. మనుష్యుల్లో మూర్ఖత్వం తప్పనప్పుడు సమస్యలు లేపే పెళ్ళికి విలువయివ్వటంలో అర్థం లేదు. అక్కయ్యా! నేనొకటి చెప్పనా ?"

"ఏమిటి?"

"మనం పెళ్ళి చేసుకోవద్దు."

"బావుంది. ఇప్పుడు మనం పెళ్ళి చేసేసుకుంటున్నామూ!"

"ఇప్పుడు కాదు. ఎప్పుడూ చేసుకోవద్దు. ఈ పెళ్ళిళ్ళవల్ల ఏం గొప్పవుంది చెప్పు? అందరికీ లొంగి వుండటం - ఈసురోమంటూ ఏడవటం తప్పితే - మరేంలేదు. మనం యింకా పెద్దవాళ్ళం అయ్యాకకూడా పెళ్ళిచేసుకోవద్దు. తాతయ్య అంటాడుగా. నాట్యకళలో మనం గొప్పవాళ్ళం అయిపోవాలని. నిజంగా మనం చాలా గొప్పవాళ్ళం అయిపోవాలి. మన పేరు దేశంలో నలుమూలలా మారుమ్రోగాలి. మన నాట్యాలకోసం ప్రజలందరూ తపించిపోవాలి, భారత దేశం మనల్ని చూచుకొని గర్వించాలి. మనం అంత గొప్ప కళాకారులం అయిపోవాలి."

పద్మిని మొహం సంభ్రమంతో వికసించింది - "నిజంగా అలా అయితే ఎంత బావుంటుందీ!"

"తప్పకుండా అవుతుంది అక్కయ్యా! తాతయ్య మనకి అండగా వున్నాడు. అమ్మలా కాకుండా మనం ఓ ప్రత్యేకత సంపాదించుకోవాలి. పెళ్ళిచేసుకోవటం - అత్తారింటికెళ్ళటం లాంటి పిచ్చిపిచ్చిపనులు చేస్తే మనం సాధించగల్గేదేమీ

వుండదు.

కష్టపడి చదువుకుందాం. నాట్యం నేర్చుకుందాం. సంగీతం నేర్చుకుందాం. కళారాధనకి తప్పితే మనజీవితాల్లో దేనికీ తావులేకుండా చేసుకుంటే తప్పకుండా గొప్పవాళ్లం అవుతాం."

చెల్లెలి మాటలు పద్మినికి చాలా నచ్చాయి. చిరునవ్వుతో అంగీకారం తెలియజేయగానే మోహిని సంతోషం పట్టలేక చప్పట్లుకూడా కొట్టింది.

అదంతా ఆరేళ్లనాటి ముచ్చట. మొన్న మొన్న జరిగినట్టే పద్మినికికూడా గుర్తువుంది. మాలతి విషయం ఎప్పుడు గుర్తు వచ్చినా జుగుప్సలాంటిభావం పసిరికపాములా గుండెల్ని చుట్టబెడుతూనే వుంటుంది. పెళ్ళిపట్ల ఏర్పడ్డ విముఖత బలంగానే వుంది.

అయినా తను పెళ్ళి చేసుకోవటానికెలా సిద్ధపడిందో ఆలోచిస్తే పద్మినికే అయోమయంగా వుంది. తను చాలా చాలా మారిపోయింది. పెళ్ళంటే పూర్తిగా ఏవగింపేగాక - ఏదో మధురభావంకూడా తలఎత్తింది మనస్సులో. తను అర్థం చేసుకున్న దానికన్నా అర్థంచేసుకోవలసిందే చాలా వుందేమో!

పద్మిని చివరికి అంది - "కానీ మోహినీ! అప్పుడు మనం చాలా పసితనంగా వూహించామేమో!"

"పసితనంగానా, అంటే?"

"మాలతి దారుణంగా చచ్చిపోయిందన్న కోపంతోటీ ఆవేశంతోటీ మాట్లాడుకున్నాం."

"ఆ కోపం - ఆ ఆవేశం ఇప్పుడు మాత్రం లేవా?"

"ఉన్నా దానికే మిగిలిన విషయాలన్నీ ముడిపెట్టకూడదన్న వివేకంకూడా వుంది."

కొత్తగా వచ్చిపడ్డ వివేకం ఏమీలేదు. మాలతి విషయం గురించి ఆలోచించి కాదు అర్థమైతే వేళ్లు జరిగినా కొత్తగా తర్కించాల్సిందేం లేదు."

"అది కాదు మోహినీ! దేనికైనా మంచీచెడ్డా రెండూ వుంటాయి. ఏవుద్దేశంతో ఆలోచిస్తే అదే అధికంగా కన్పడుతుంది. మాలతి పెళ్ళి సమస్యతోనే చచ్చిపోయింది. నిజమే. మాలతిలా చావకపోయినా ఎంతోమంది జీవచ్ఛవాలై కాపురాలు చేస్తున్నారు. అదీ నిజమే. కానీ వాటికి పరిష్కారమార్గం మొత్తంగా పెళ్ళి మానటం అని నేననుకోను. పెళ్ళినీ మగవాణ్ణీ ద్వేషించి జీవితాన్ని సమస్యారహితం చెయ్యలేం."

"ఓహో! ఇవ్వాళ్టికి నీ అర్థాలు మారిపుంటాయి. రాబోయే సమస్యల్ని మరోవిధంగా పరిష్కరించుకుంటాకన్నా- అసలాసమస్యలు వుత్పన్నం కాకుండా చేసుకోవటంలో అర్థం లేదా?"

"కానీ నావిషయంలో ఎలాంటి సమస్యలూ వస్తాయని నేననుకోవటంలేదు మోహినీ!"

మోహిని కోపంతో ఎర్రబడింది. మాటలురాక కొంతసేపు వూరుకొంది.

"పోనీ ఒక్కటిచెప్పు. ఇప్పుడు పెళ్ళిచేసుకోవాల్సినంత కంగారేం వచ్చింది నీకు?"

"నువ్వాలా అడిగితే నేనేం చెప్పలేను మోహినీ! పెళ్ళి గురించి ఒకప్పుడు మనం అనుకున్నదిమాత్రం మార్చుకున్నాను.

పెళ్ళిలేకుండా కళారాధనలో గడపటం అసంభవమని తెలుసు కున్నాను. పెళ్ళి ఎప్పుడైనా చేసుకోవాలనే నిర్ణయం వున్న ప్పుడు ఇప్పుడే చేసుకోవటంలో వచ్చేనష్టం ఏమిటి ?"

"నష్టం ఏమిటా? ఏమిటని అడుగుతున్నావా?" పద్మిని నిర్లక్ష్యాన్ని మోహిని సహించలేకపోయింది.

"భవిష్యత్తుగురించి ఎంత వుజ్వలంగా భావించు కున్నామో ఒక్కసారి గుర్తుతెచ్చుకుంటావా ? కళాజీవితం మీద ఎన్నిఆశలు పేర్చుకున్నామో కొంచెం జ్ఞాపకం చేసు కుంటావా ?

అక్కయ్యా ! ఇవ్వాళ అదంతా అబద్ధం అయిపోయింది కదూ ? కళారాధన అంటేనే బూటకం అయిందికదూ ? మన ఆదర్శాలూ - ఆశయాలూ అన్నీ ఎగిరి గాలిలో కలిసిపోయాయి కదూ ? నీపెళ్ళీ - నీకాపురం - అవే నీకు నగ్నసత్యాల్లాగా ధర్మసిద్ధాంతాలుగా గోచరిస్తున్నాయి.

నువ్వు ఎంత మారిపోయావో నీకు తెలుస్తోందా ? నీ వ్యక్తిత్వం ఎలా కోల్పోయావో అర్థమౌతోందా? అక్కయ్యా! ఇదంతా నేను భరించలేను. నాకు మతిపోతోంది. నువ్వు పెళ్లి చేసుకోవటానికి వీల్లేదు. మనం ఎప్పటిలా ఒక్కఆశయంతో వుందాం. ఒక్కమార్గంలో నడుద్దాం. నామాట వినవా అక్కయ్యా !"

"మోహినీ ! నువ్వు చాలా ఆవేశపడుతున్నావే! నేను పెళ్ళిచేసుకున్నా ఎలాంటి సమస్యలూరావు. ఎప్పటిలాగే మనం అన్నీ నేర్చుకుందాం."

"నేన్నమ్మను. ఈ కబుర్లు తర్వాత వుండవు. పెళ్ళితోనే

ఆడది అన్నివిధాలా అసమర్థురాలై పోతుంది. అదే నిజం. కాదనుకోవటం మనల్ని మనం వంచించుకోవటమే."

"నీ వూహాలన్నీ అపోహాలు. నావిషయంలో అలా జరగదు. గోపాల్ చాలా మంచివాడు."

మోహిని మండిపడింది – "అతని పేరు నాదగ్గిర ఎత్తకు. నీ అభిప్రాయం నువ్వుచెప్పు."

పద్మిని మాట్లాడలేదు – తర్కించకుండా వూరుకుంటే – మోహిని కొంచెం శాంతంగా ఆలోచిస్తుంది. ఇద్దరిమధ్యా చాలాసేపు నిశ్శబ్దం నిశ్శబ్దంగా నాట్యంచేసింది. పద్మిని టేబుల్ మీదవున్న చిత్రం తీసుకుంది – "నేను వెళ్తాను మోహినీ! నిద్రవస్తోంది."

మోహిని మాట్లాడలేదు. మాట్లాడే వుద్దేశ్యం లేదు. అక్కయ్య ఆలోచించుకొంటుంది. ఆలోచించే అవకాశం యివ్వక తప్పదు.

పద్మిని గదిలోంచి వెళ్ళగానే తలుపులుమూసి పక్క మీద కూర్చుంది.

అక్కయ్య నింత పిచ్చిదాన్ని చెయ్యటానికి గోపాల్‌లో ఏముంది ? మొగవాడి ఆకర్షణకి లొంగకుండా ఆడది బ్రతకలేదా ? ఆ బలహీనత అక్కయ్యలోకూడా వుందా ? — అసహనంగా నిట్టూర్చింది.

*	*	*

పద్మిని బయటికి వెళ్తోన్నా చూస్తూ కోపం ఆపుకొంటూ వూరుకుంది మోహిని. గోపాల్ రాకపోయినా అక్కయ్య వెళ్ళటం మానదేమో ! అతని స్నేహం తగ్గించుకునే ప్రయత్న

మైనా చెయ్యదేమో! తను ఏమీ చెయ్యలేదా? అక్కయ్య ఘోరణి మార్చలేదా?

ఆలోచిస్తూ గార్డెన్ లో తిరుగుతోన్న మోహిని గేటు తీసుకువస్తోన్న గోపాల్ ని చూసి చూడనట్టు మొహంతిప్పుకొంది. గోపాల్ దగ్గరికి వచ్చాడు- "నమస్తే మోహినీదేవీ!"

అప్పుడే చూసినట్టు తలతిప్పుతూ-"నమస్తే! రండి రండి" లాని నవ్వు తెచ్చుకుని మొహం ప్రసన్నం చేసుకుంది - "ఏం ఇలా వచ్చారు?" వీణానాదం లాంటి కంఠస్వరంలో నిర్లక్ష్యం మిళాయించింది.

తెల్లబోయాడు గోపాల్ మోహిని ప్రశ్నకి. మోహినే అంది - "ఓ! సారీ! అక్కయ్యకోసమా? ఇంట్లోవున్నట్టు లేదండీ!"

తటపటాయిస్తూ అలాగే నించున్నాడు గోపాల్.

"ఏం? అత్యవసరంగా ఏమైనా మాట్లాడాలా?"

"అబ్బే! లేదండీ!" అన్నాడు అతిప్రయాసతో.

మోహిని చేతికందిన ఆకులన్నీ చించిపోస్తూ మౌనంగా నించుంది.

మోహిని ప్రవర్తన చాలా కొత్తగాతోచింది గోపాల్ కి. మూడ్ బాగాలేక చిరాగ్గావుందేమో! ఇద్దరిమధ్యా ఆ మౌనం భరించలేక నవ్వుతూ అన్నాడు గోపాల్ —

"మీకా మొక్కమీ దెందుకో కోపం వచ్చినట్టుంది?"

మోహిని తనుచేస్తోన్నపని గ్రహించింది-చేతిలో ఆకులు వదిలేస్తూ - "ఇష్టపడి పెంచుకుంటోన్న మొక్కలమీదగానీ- మనుషులమీదగానీ కోపం ఎందుకు వస్తుందండీ? ఏమిటో ఏదో

ఆలోచిస్తూ పిచ్చిపనిచేశాను." పైటకొంగు వేళ్ళకి చుట్టు కొంటూ – మొక్కలమధ్య తిరుగుతూ – వాటి పువ్వులూ – మొగ్గలూ పరీక్షిస్తోన్నట్టు వుండిపోయింది మోహిని.

కనీసం తనని లోపలికి రమ్మనైనా అనకుండా అంత నిర్లక్ష్యం వ్యక్తంచెయ్యటంలో మోహినిలో మార్పు బాగా అర్థమైంది గోపాల్‌కి.

"నేను వెళ్తాను మోహినీదేవీ!" అనేసి వెనక్కితిరిగి రెండడుగులు వేశాడు.

"అరె! గోపాల్! అంత తొందరగా పోతున్నారేమిటి?" మోహిని గబగబా మొక్కలమధ్యనుంచి బయటికి వచ్చింది. "ఏం, పద్మినీదేవి లేకపోతే కళానిలయాన్నే వెలివేస్తారా? రండి. లోపలికి వెళ్దాం." అంది నవ్వుతూ.

"ఎక్స్‌క్యూజ్ మీ! వెళ్తానండీ, కొంచెం పనివుంది."

"అంత పనివున్నవాళ్ళు అస లెందుకు వచ్చారండీ? అక్కయ్యవుంటే కూర్చునేవారేగా? ఓ కప్పు టీ అయినా యిచ్చి పంపించకపోతే ఆవిడ వూరుకుంటుందా? తన ఫ్రెండ్‌ని ఇన్సల్ట్‌చేశానని నామీదో యుద్ధం ప్రకటించదూ?"

"థాంక్స్! ఇప్పుడు నాకోసం మీరేం శ్రమపడకండి మోహినీ! మరోసారి వస్తాను."

మోహిని పట్టుదల ఎక్కువైంది – "అలా నేను ఒప్పుకోను. మీరు లోపలికివచ్చి కాస్సేపు కూర్చుని మరీ వెళ్ళాలి. ప్లీజ్!"

అప్పటికప్పుడే అంత ఆప్యాయంగా మాట్లాడుతోన్న మోహినిని చూసి ఆశ్చర్యపడ్డాడు గోపాల్. వెనక్కి చూడ

కుండా పోర్టికో కేసి నడుస్తోన్న మోహిని వెనక తనూ వెళ్ళాడు.

మోహినికి చాలా ఆనందంగావుంది - "రండి. పైకి వెళ్దాం నాగరాజూ ! టీ తీసుకురా !" అంటూ ఓ కేక పెట్టి మెట్లకేసి నడిచింది. గోపాల్ అయిష్టంగానైనా అనుసరించక తప్పలేదు.

ఇద్దరూ హాల్లోకి వెళ్ళారు.

"రండి, నా గదిలో కూర్చుందాం."

గోపాల్ కి కొత్తగావుంది. మోహిని ఆశ్చర్యంగా ప్రవర్తిస్తోంది.

మోహిని గదిలోకి వెళ్తూనే ఫేన్ ఆన్ చేసింది. చేతి కందిన రేడియో స్టేషన్ లో ఏదో సంగీతం పెట్టింది.

"వచ్చే సోమవారం నా వీణ కచ్చేరీ వుందండీ రేడియోలో. మొన్ననే రికార్డింగు అయింది. మీ రెప్పుడైనా విన్నారా?" అంటూ కుర్చీ దగ్గిరికి జరుపుకుని కూర్చుంది.

"లేదండీ ! అంత భాగ్యం కలగలేదు."

"వినకుండానే పొగడటం ముఖప్రీతి అవుతుంది." అంటూ నవ్వింది– "అన్నట్టు మీరు వేసిన చిత్రం అక్కయ్య చూపించింది. మిగతా చిత్రాలన్నీకూడా గదినిండా అలంకరించింది. అన్నీ చూశాను."

"చూశానని చెప్పటంతోపాటు మీ వుద్దేశ్యంకూడా చెప్తే విని సంతోషిస్తాను."

"నిజం చెప్పాలంటే మీ చిత్రాలుచూసి సంభ్రమంలో తలమునకలయ్యాను. చిత్రాలన్నీ కళాఖండాలే."

"కళాపూర్ణాలు కావా ?" నవ్వాడు గోపాల్.

మోహిని మళ్ళా అంది — "అంత గొప్పగా మీరు గీస్తారని నాకేం తెలుసు?"

"మీరు నూశాకే పొగుడుతున్నారు కాబట్టి ముఖ ప్రీతి అవదు కాబోలు !"

"ముఖప్రీతి కాదండీ ! నిజంగా మీ చిత్రాల్లో ప్రతిభ వుంది. వైవిధ్యం వుంది. వ్యక్తిత్వం వుంది. కానీ వాటికి వ్యతిరేకంగా ఏదో వెలితి - శూన్యంకూడా వున్నాయని పించింది."

"అంటే ?"

"కేవలం చూడటానికి మనోహరంగా వుండేలా చాతుర్యంతో చిత్రించటం తప్పితే చిత్రకళవల్ల మరో ప్రయోజనం లేదా ? అందమైన అమ్మాయి భంగిమ తప్పితే మరేదీ చిత్రం గీయటానికి పనికిరాదా ?"

"ఎందుకు పనికిరాదు ! కంటికి కనిపించేదాన్నీ — వూహాల్లో మెదిలేదాన్నీ దేన్నయినా వస్తువుగా తీసుకోవచ్చు."

"అయితే మీకు కన్పిస్తోందీ — మీరు వూహిస్తోందీ అంతా సౌందర్యంతోటే నిండివుందంటారా?"

"ప్లీజ్ ! మీ అభిప్రాయం కొంచెం విపులంగా చెప్పండి."

"పోనీ మీరేనైనా చారిత్రక ఘట్టాలుగానీ- పౌరాణిక ఘట్టాలుగానీ చిత్రాలుగా గీశారా ?"

"నిజం చెప్పాలంటే నాలో ఒక బలహీనత వుంది. ఎంతో మూవ్ అయితేగానీ నేను గియ్యలేను. పాతగాథలకి నేనంత మూవ్ కాలేను. అర్జునుడు చూసిన విశ్వరూప సందర్శనం సరిగ్గా గీతలో వర్ణించినట్టే గీయాలని ప్రారం

భించాను రెండు సంవత్సరాల క్రిందట. ఇప్పటికీ పూర్తిచెయ్యా లేకపోయాను."

"సరే! అవి వదిలెయ్యండి. మీచిత్రాల్లో సోషల్ యాస్పెక్ట్ మాత్రం ఏం వుంది ? సంఘపు స్థితిగతుల్ని మీ చిత్రాల్లో ప్రతిబింబింప చెయ్యవచ్చుకదా ? మనుషులు జీవిస్తోన్నంతకాలం - మానవసముదాయంలో ఎన్నో దురాచారాలు వుంటోనే వుంటాయి. ప్రస్తుతం తలెత్తి విలయ తాండవం చేస్తోన్న వరకట్నం - లంచగొండితనం- అవినీతి- మొదలైనవన్నీ మీకు తెలుసు. వాటిని ఆధారంగా చేసుకుని ఒక్కో ఘట్టం ఎత్తి చిత్రించవచ్చు కదా ?"

మోహిని మాటలు ఎంతో నచ్చాయి గోపాల్‌కి "థాంక్స్ మోహినీదేవీ ! - ఇన్నాళ్ళుగా నాసాధన కోలక్ష్యం లేకుండా పోయింది. కళని జీవిత వికాసానికి వుపయోగించటమే మొట్టమొదటి లక్ష్యం అవుతుంది. ఈ అభిప్రాయం చాలా కాలంగావున్నా దాన్ని స్థిరపర్చుకోలేక పోయాను."

నాగరాజు 'టీ' తీసుకొచ్చాడు. మోహిని కెటిల్‌లోంచి కప్పుల్లో పోస్తోంటే గోపాల్ అడిగాడు - "ఈమధ్య మీ పెర్ఫార్మెన్స్‌ఏం లేవా ?"

మోహిని టీకప్పు గోపాల్‌కి అందిస్తూ - "ఏదో శాప్రం చెప్పినట్టుంది మాపరిస్థితి. చెప్పిందే చెప్పటం, పాడిందే పాడటం మామాష్టారికో హాబీ! నేనెంత తొందర పడతానో అంత జాప్యం అవుతూ వుంటుంది. ఏమిటో లైఫ్ చాలా డల్‌గా వుందండీ !" టీ తాగుతూ వెనక్కి జరిగి కూర్చుంది.

గోపాల్ నవ్వుతూ అన్నాడు- "ఒకలా చెయ్యండి. లైఫ్

చాలా ఎట్రాక్టివ్ గా వుంటుంది."

"ఏం చెయ్యమంటారు?"

"పెళ్లి చేసుకోండి."

తృళ్ళిపడ్డట్టు చూసింది మోహిని — కప్పు గట్టిగా పట్టుకొంది. మనస్సులో అయిష్టం స్పష్టంగా కన్పరుస్తూ — "చంపారు. ఇంకా ఏమిటో చెప్తారనుకున్నాను. అది జీవితంలో జరిగేది కాదే!" అంది.

విస్మయంగా చూశాడు గోపాల్.

"ఎందు కంత ఆశ్చర్యపోతారు? అక్కయ్యకీ నాకూ కూడా ఆ వుద్దేశ్యంలేదు. ఆఖరికి మా తాతయ్యకికూడా ఆ అభిప్రాయం లేదు. "కళారాధన, కళారాధన" అంటాడు అస్తమానూ. చిన్నతనంనుంచీ అదే నూరిపోశాడు మాకు. మాకు వూహా తెలిశాకకూడా ఆ అభిప్రాయాన్ని మార్చుకో లేదు. సాధ్యమైనంతవరకూ సంగీత నాట్యాలలో మంచి స్థాయికి చేరుకోవాలనే పట్టుదల తప్పితే మరో దృష్టిలేదు."

గోపాల్ తేరుకోలేని ఆశ్చర్యంతో మాట్లాడలేక అయోమయంగా చూశాడు.

మరో విషయం చెప్పమంటారా: మా అమ్మకి "కళాబాల" అని పేరు పెట్టాడు తాతయ్య. అంటే ఆయన మనస్సులో ఈ కళాభిమానం ఎంతకాలంగా పాతుకుని వుందో మీరు వూహించవచ్చును. కానీ, ఆయన ఆశలు మా అమ్మ ద్వారా తీరలేదు. పైగా భరించలేని నిరాశా దుఃఖాన్ని భరించాల్సి వచ్చింది. చివరికి మా అమ్మ చాలా దారుణమైన పరిస్థితిలో చచ్చిపోయింది."

"అవును. పద్మినిచెప్తే అంతా విన్నాను. చాలా విచారించాను."

"ఎంత విచారిస్తే ఏం ప్రయోజనమండీ ? మరోసారి అలాంటి దారుణం జరగకుండా చెయ్యాలన్నదే తాతయ్య పట్టుదల అసలు మా నాన్న మగవాడిననే అహంకారంతో ప్రవర్తించకుండా వుంటే ఇప్పుడు మా అమ్మ బ్రతికే వుండేది."

"కావచ్చు. కానీ కాలం చాలా మారిపోతోంది. మీ అమ్మగారి కాలానికీ యిప్పటికీ చాలా భేదం వచ్చింది మగవాళ్ళ మూర్ఖత్వంకూడా చాలావరకు పరివర్తన చెందుతోంది."

"మీరన్నదాంట్లో నిజం వుండవచ్చు. కానీ చాలా తక్కువ. ఈరోజుల్లో అయితేమాత్రం కళలకి తగినంత గౌరవం ఎవరిస్తున్నారు ? నాట్యం అనగానే అది మర్యాదలేనివాళ్లు చేసేదన్నభావం చాలా ఎక్కువమందిలో పాతుకునివుంది. అది మీరూ ఒప్పుకుంటారుగా ? నిజానికి కళలన్నిటిలోకీ నాట్యకళ ఎంత వుత్కృష్టమైనదో - దానికోసం ఎంత శ్రమించాలో — ఎంత వెచ్చించాలో - ఎవ్వరూ అర్థంచేసుకోరు.

ఇదంతా తెలిసే ఈ కళాప్రపంచంలో శాశ్వతంగావుండిపోదామన్న నిర్ణయం ఏర్పచ్చుకున్నాం. పెళ్ళీ - సంసారం - అంటూ బంధనాలూ బలహీనతలూ లేకుండా మాశక్తిఅంతా- మాదృష్టిఅంతా దీనికోసమే కేంద్రీకరించాలనుకొంటున్నాం."

గోపాల్ ఆశ్చర్యంగా అన్నాడు - "అది సాధ్యమో కాదో ఆలోచించారా ?"

మోహిని విస్మయంగా అంది - "మా నిర్ణయం వింటే

మీరు చాలా ప్రశంసిస్తారనుకున్నాను. ఇలా మాట్లాడుతున్నా రేమిటి? సాధ్యం అసాధ్యం అనేవి మన మనసుల్లో వుంటాయి. ఏది సాధించినా మనుషులేగానీ చెట్లూ చేమలూ కావుగదా? మనలో అంత శక్తిసామర్ధ్యాలు వున్నాయనే ఎందు కనుకో కూడదు? ఆత్మవిశ్వాసమేకదా ఆచరణకి బలం యిస్తుంది? నిజంగా అలాంటి విశ్వాసం అక్కయ్యకూ నాకూ గాఢంగా వుంది లెండి."

ఎంత దాచాలన్నా శక్యంకాని ఆందోళన గోపాల్ మొహంలో తొంగిచూసింది. పద్మిని తనకు దూరంగా ఎందు కుండిపోతోందో అర్థమైనట్టు తోచింది. ఆరిన పెదవులు తడుపు కొంటూ దీర్ఘంగా గాలిపీల్చుకున్నాడు–"మీ ధ్యేయానికీ పెళ్ళికీ ముడిపెట్టడం చాలా విరుద్ధం." అన్నాడు అసహనంగా.

"విరుద్ధం ఎప్పుడూకాదు." గోపాల్ ముఖకవళికలు కనిపెడుతోన్న మోహిని ఒత్తి పల్కింది – "పెళ్ళివల్లే మా ధ్యేయం దెబ్బతింటోన్నప్పుడు ఆపెళ్ళి విరమించటంలో విరుద్ధం ఏముంది? పోనీ మీరు విరుద్ధమే అంటే నేనొకటి అడుగుతాను. ఏది విరుద్ధంకాదు? స్త్రీ యిష్టాన్ని ఖైదు చేయటం విరుద్ధం కాదా? స్త్రీవ్యక్తిత్వాన్ని అణిచిపెట్టటం విరుద్ధంకాదా?

మా అమ్మ వీణ వాయించుకోవాలని ఎంతో తహతహ లాడిందట. ఆవిడ అభిరుచుల్ని మానాన్న ఎంత విరుద్ధంగా నాశనం చేశాడో మీకు తెలుసు. ఆఖరికి మాఅమ్మ ప్రాణాల్ని కూడా ఎంత క్రూరంగా–ఎంత అమానుషంగా హత్యచేశాడో కూడా తెలుసు."

"మీరలా వెనక్కి వెళ్ళకండి మోహినీ! నిజానికి మీ అమ్మ

గారికి జరిగిన ఘోరానికి ఈనాటి సంస్కారవంతుడు దేవుడైనా సిగ్గుతో తలదించుకుంటాడు. కానీ దానికి పూర్తిగా మీనాన్న గారిది కూడా అపరాధం కాదు. సామాన్యమైన మనిషి ఎప్పుడూ సంఘం చేతిలో కీలుబొమ్మే. సంఘ నియమాల పరిధిని దాటే శక్తి మీనాన్న గారికి లేకపోవటంలో విశేషం లేదు.''

''సంఘం అంటే ఏమిటి? మానాన్నలాంటి పురుష పుంగవులెందరో కలిస్తే సంఘం అయింది. వాళ్ల అభిప్రాయా లన్నీ సంఘనియమాలయ్యాయి.''

''నిజమే. అలాంటి సంఘంలోనే మీతాతయ్య లాంటి వాళ్ళుకూడా వున్నారన్న విషయాన్ని విస్మరిస్తున్నారు మీరు. అందుచేత రెండు విధాలా ఆలోచించాలి. ఆనాటి పురుషుడిలో అధికభాగం అహంకారం మూర్ఖత్వం చిందులు తొక్కాయి. నిజమే.

కానీ మీరు వర్తమానంలోకి చూడండి. భవిష్యత్తు లోకి చూడండి. మగవాడి మనస్సు ఎంత వివేకపూరితంగా మారుతోందో అర్థం చేసుకోండి. ప్రస్తుతాన్ని విస్మరించి - గతాన్ని శాశ్వితం చేసుకోవటం సమంజసం అవుతుందా?''

''గోపాల్! మీరు భ్రమపడుతున్నారు. నన్ను భ్రమపెడు తున్నారు, అంతే. భూమి స్వర్గంలా మారిపోతోందని మీరు చెప్తే నేనెలా ఒప్పుకుంటాను?

మొన్న మొన్నటి సంఘటన ఒకటి చెప్తాను. వినండి, పీటలమీద కూర్చున్న పెళ్ళికూతురు నానా రాద్ధాంతాలతో పెళ్ళి ఆగిపోతే ఆత్మహత్య చేసుకు చచ్చిపోయింది. అదంతా నా కళ్ళతో నేను చూశాను. పెళ్ళికి ఎంతో పవిత్రత వుందం

టూరే! ఆ పెళ్ళిపందిట్లో ఆ పవిత్రతని ఎంతమంది గుర్తించారు? గుర్తిస్తే అలాంటి రాద్ధాంతాలకు అవకాశం యివ్వగలిగే వాళ్ళా? కట్నం యిచ్చే తాహతు లేకుండా కూతుర్ని పెళ్ళికెందుకు సిద్ధపడ్డాడు పిల్లతండ్రి? పెళ్ళి పవిత్రతని గుర్తిస్తే ఎందుకు ఆటంకపెట్టాడు పెళ్ళికొడుకు తండ్రి?

ఎవరికీ లక్ష్యంలేని ఆ పెళ్ళి తలపెట్టి చివరికి నవ్వులపాలు చేస్తే పెళ్ళికూతురు ఎంత బాధపడిందో ఎవరైనా అర్థం చేసుకున్నారా? ఒక్క మగవాడిలోనైనా మానవత్వం వుంటే ఆడదాని అభిమానాన్ని గుర్తించకుండా వుంటాడా? ఈ పెళ్ళిళ్ళ పేరిట ఇలా ఎన్ని జరుగుతున్నాయో ఎవరికి తెలుసు? సంసారాలు సరిపడక ఎంతమంది భార్యాభర్తలు నిరాశలతో విస్పృహలతో కాలం దొర్లిస్తున్నారో మాత్రం మనం చూడటం లేదా? ఇదంతా సంఘం స్వర్గంలా మారిపోయిందనటానికి నిదర్శనమా?"

"మోహినీదేవీ! మీరింత ఆవేశపడాల్సిందేమీ లేదు. మీరు అపార్థం చేసుకోనంటే నేను కొంచెం సూటిగా మాట్లాడుతాను."

"చెప్పండి."

"స్త్రీ పురుషులకి ప్రకృతిసిద్ధమైన కోర్కెలు వున్నాయని ఒప్పుకుంటారా?"

"ఒప్పుకోవచ్చు."

"ఈనాటి సభ్యసమాజంలో అవి తీర్చుకోవలసిన మార్గం పెళ్ళే అనికూడా ఒప్పుకుంటారా?"

"ఊఁ చెప్పండి."

"అలాంటి పెళ్ళిని ద్వేషించటం - మన జన్మని ద్వేషించటం - సృష్టినే ద్వేషించటం అవుతుందని మీరు ఆలోచించారా ?"

"కావచ్చు. కానీ అమూల్యమైన కళారాధనకోసం దేన్నయినా విస్మరించాలన్న అభిప్రాయం నాది. స్వసుఖాల్ని కూడా నిర్లక్ష్యం చెయ్యాలన్న నిర్ణయం నాది."

గోపాల్ అమితంగా ఆశ్చర్యం వెలిబుచ్చాడు — "అసలు కళారాధన అంటే అర్థం ఏమిటి ? కళల ప్రయోజనం ఏమిటి ? ఒక్క పావుగంటక్రిందటే మీరు నాకు చెప్పారు కదా ?"

"తార్కికంగా మీరు నన్ను ఒప్పిస్తారు. కాదనను. కానీ మా యిద్దరివిషయం అదికాదు. మావిషయంలో తర్కానికీ అభిరుచులకీ సంబంధంలేదు.

మాకు మాభవిష్యత్తుమీద ఎంతో ఆశవుంది. ఎంతో విశ్వాసం వుంది. మాయిద్దరికీ పెళ్ళికన్నా అతి ముఖ్యమైన జీవితం ఎంతోవుంది. పూర్వం ఎప్పుడో భారతావని కళలతో విలసిల్లేదంటారు. ఈరోజుల్లో ఆకళ లెంత జీర్ణించివున్నాయో మీకు తెలియనిదికాదు. తాతయ్య మాకు పసితనం నుంచీ కళాభిరుచి కల్గించాడు. అన్నివిధాలా మాకు సహకరిస్తున్నాడు. కావలసినంత స్వాతంత్ర్యం యిచ్చాడు. ఇంతకన్నా ఏంకావాలి? భరతం - కూచిపూడి - మణిపురి - కధకళి - అన్నీ మాశక్తి కొద్దీ అభివృద్ధి చేసుకుని నాట్యకళను మాద్వారా విస్తృతం చేయాలనే కాంక్షతో వున్నాం. ఆంధ్రులకి కళావిజ్ఞానం లేదన్న అపకీర్తి మీ రెరుగనిది కాదే! ఈస్థితిలో కళాప్రచారాని కెంత

అవసరంవుందో కూడా మీరు వూహించగలరు."

గోపాల్ మతి తప్పుతోన్న స్థితిలో లేచి నిలబడ్డాడు.

మోహిని దృఢంగా అంది - "మా లక్ష్యం మేము సాధించగలం అన్న విశ్వాసం గాఢంగావుంది. కానీ ఒక్కటి మాత్రం నిజం. మాపురోభివృద్ధికి ఎవరు సహకరించకపోయినా వర్రీలేదు. కనీసం అడ్డు నిలవకుండా - మరోమార్గంలోకి దించకుండావుంటే చాలు.

ప్రమాన్పడిపోయాడు గోపాల్.

మోహిని ఇదంతా ఎందుకుచెప్తోంది ? ఎవరికి చెప్తోంది ?

టేబుల్‌మీద పత్రికతీసి తిరగవేస్తూ చదవటంలో నిమగ్నమైపోయినట్టు కూర్చుంది మోహిని.

గోపాల్ ఒక్కక్షణంకూడా అక్కడ నించోలేకపోయాడు. తల గిరగిరాతిరుగుతోంటే తడబడుతూ గుమ్మంకేసి రెండడుగులు వేశాడు —

"వెళ్తానండీ ?"

మోహిని తలపైకెత్తి అమాయకంగా చూసింది —

"వెళ్తారా ? అప్పుడే ? ఇంకా సిక్సయినా కాలేదండీ ! కూర్చోరాదూ ? అక్కయ్య వస్తుంది."

"లేదండీ ! వెళ్ళాలి."

మోహిని పత్రిక కుర్చీలో పడేసి లేచింది.

ఇద్దరూ కిందికి వచ్చారు.

గోపాల్ వెళ్ళిపోతోంటే మోహినికి పట్టరానిసంతోషం కలిగింది.

తన మాటల ప్రభావం అద్భుతంగా పని చేస్తుంది.

గోపాల్‌లో ఏమాత్రం సంస్కారమున్నా తనదారికి అడ్డు రాడు. నిజానికి గోపాల్ అంత సంస్కారహీనుడు కాదు.

అబ్బ! ఎంత తెలివైన పనిచేసింది తను!

రాత్రి భోజనాలదగ్గిరమాత్రం క్లుప్తంగా చెప్పింది మోహిని - అక్కగారితో.

"సాయంత్రం గోపాల్ వచ్చాడు."

"గోపాల్ వచ్చాడా ?" ఆశ్చర్యపడింది పద్మిని.

"ఆఁ కాస్సేపు కూర్చున్నాడు."

"ఏం మాట్లాడాడు ?"

తన ఆర్ట్ గురించీ — మన ప్రోగ్రామ్స్ గురించీ ఏదో మాట్లాడాడు.'

పద్మిని మౌనంగా భోజనం చేస్తూ కూర్చుంది.

"పెద్దమ్మాయ్! నీ కోసం ఎవరో ఫోను చేస్తున్నారమ్మా!" నాగరాజు వచ్చి చెప్పాడు.

పద్మిని గబగబా మధ్యగదిలోకి వెళ్ళి పేపర్ మీద వుంచిన రిసీవర్ తీసుకొంది — "హల్లో!"

"... ... ..."

"ఆ! నేనే!"

"... ... ..."

"ఏపా ?"

"... ... ..."

"నిజంగా ?"

"... ... ..."

"అలాగే, అలాగే"

పద్మిని మళ్ళా వచ్చి టేబుల్ ముందు కూర్చుంది. అక్కయ్య మొహంలో ఏదో ఆలోచన గుర్తించింది మోహిని. పట్టీపట్టనట్టు అడిగింది-

"ఎవరక్కయ్యా ఫోన్ చేసింది ?"

"గోపాల్."

"గోపాల్! వాళ్ళింట్లో ఫోనుందా ?"

పద్మిని తలెత్తి చెల్లెలికేసి చూసి తల దించుకుంటూ - "అతను డబ్బుకలవాడేం కాదు."

పద్మినిమూడ్ బాగా లేదు.

తర్వాత సంభాషణేం జరగలేదు.

*                    *                    *

"అంతా విని ఎందుకింత పట్టనట్టు కూర్చున్నావు ?" ఆవేశమంతా వెళ్ళగక్కుతూ అడిగాడు గోపాల్.

పద్మిని కళ్ళెత్తి చూసింది. ఆ కళ్ళు ఎరుపురంగులో కన్పించాయి. పెదవినొక్కుకొంటూ నిట్టూర్చింది.

పద్మిని ధోరణి గోపాల్ కేం నచ్చలేదు. మోహిని చెప్పినదంతా నిజమేనేమోనని భయం వేసింది. అసహనంగా అన్నాడు-"పద్మా! నువ్విలా నిట్టూర్పులు విడవటంకాదు. నోరువిప్పి మాట్లాడు."

నిర్లిప్తంగా చూసింది పద్మిని - "ఏమిటి ?"

"ఏమిటా ?" తెల్లబోయాడు గోపాల్ - "అయితే ఇంతవరకూ చెప్పింది కంఠశోషేనా ? నీతో స్నేహం మానుకోమని నీచెల్లెలితో చెప్పించకపోతే నువ్వే నిర్మొహమాటంగా చెప్పవచ్చుగా ?"

"గోపాల్ !"

"ఏం ? ఉన్నమాట అడుగుతున్నాను."

"ఉన్నమాటా ? నన్ను అర్థంచేసుకున్నది ఇంతేనా ? నేను మోహినితో చెప్పించానా ?"

"లేకపోతే మోహిని ఎందుకలా హెచ్చరించింది ?"

"దానికి కారణం చాలా వుంది. మోహినికి మన స్నేహం యిష్టంలేదు."

"మధ్య మోహిని యిష్టం ఏమిటి ?"

"అది కాదు."

"అదంతా నాకనవసరం. నీ అభిప్రాయం చెప్పు. నా దారిన నేను వెళ్ళిపోతాను"

"ఎక్కడికి ?"

"ఎక్కడికో. నీకవసరంలేని వ్యక్తి ఎక్కడికిపోతే నీకెందుకు ?"

"గోపాల్ !" పద్మిని దీనంగా గోపాల్‌కేసి చూసింది - "ఎందుకంత కఠినంగా మాట్లాడుతావు ?"

"నువ్వు ఇంకా నన్ను మభ్యపెట్టలేవు పద్మా! ఈ స్నేహానికి అర్థం ఏమిటో అంతస్తు ఏమిటో ఇవ్వాళ తేల్చుకోవాలనే నేను వచ్చాను. ఈ డోలాందోళన నేనిక భరించలేను. నీతో పరిచయం అయిన కొత్తలో నీనుంచి ఏమీ ఆశించకపోయినా నీ అనురాగాన్ని అనుభవించాక అధికంగా ఆశించకుండా వుండలేకపోతున్నాను. నేను ధనవంతుణ్ణి కాను. రిక్షాడితే కానీ డొక్కాడనంత బీదవాణ్ణి. మిగిలిన విషయా

లన్నీ నీకు తెలుసు. 'నా సహచర్యానికి నువ్వు తగవు.' అని చెప్పు. నాలో నీకేమీ కన్పించకపోతే ఆమాట నిర్మొహమాటంగా చెప్పు. నా దురదృష్టాన్ని నిందించుకొంటూ వెళ్ళిపోతాను."

"గోపాల్!" పద్మిని గోపాల్ చేతిని గట్టిగా పట్టుకొంది.

గోపాల్ పద్మినిచేతిని వదిలించుకున్నాడు - "ముందు మనం మనస్సులువిప్పి మాట్లాడుకుందాం పద్మా! అంతవరకూ మన అవధులు మనకి వున్నాయి."

పద్మిని గాయపడ్డట్టు చూసింది. కళ్ళనిండా నీళ్ళు నిండాయి — "నువ్వు నన్ను కంగారుపెట్టేస్తున్నావు. నా సంశయాలు ఒక్కటికూడా అర్థంచేసుకోవటంలేదు. నీకిది ధర్మంగా వుందా ?"

తెల్లబోయాడు గోపాల్ - "పద్మా! నిన్ను కంగారు పెట్టానా ?" అమాయకంగా అడిగాడు - "నిజంగా నాకు రాత్రంతా నిద్రపట్టలేదు. పగలంతా ఈ ఆలోచనతో వనేమీ చెయ్యలేకపోయాను. ఎంతొంతటా నిన్ను కలుసుకుంటానా అన్న తహతహతో నన్ను నేను మర్చిపోయాను. నిజంగా నాకు మతిపోయింది." దీర్ఘంగా నిట్టూర్చాడు — "చెప్పు. ఇప్పుడు చెప్పు. నీకు నామీద నమ్మకంలేదా ? నీ భవిష్యత్తు పాడుచేస్తానని శంకిస్తున్నావా ? చెప్పు పద్మా!" అనునయంగా అడిగాడు.

పద్మిని అయోమయంగా చూసింది - "ఏమిటో నేనేమీ చెప్పలేకపోతున్నాను. జీవితంమీద ఆశ ఎంత వుప్పొంగుతూగా లేస్తోన్నా దాన్ని నిరాశ తరిమేస్తోంది. అసలీ ప్రేమలకూ పెళ్ళి

ళ్ళకూ అర్థం వుందంటావా ?"

గోపాల్ విస్మయంతో పద్మినిని తదేకంగా చూశాడు. "ఈస్త్రీత్వం- పురుషత్వం- మమకారం- శృంగారం- ఇదంతా వ్యర్థంగా సాగుతోందేమో! మనజన్మ మరెందుకైనా నిర్దేశించ బడిందేమో ! అది అర్థం చేసుకోలేక మనమంతా ఈదారిన సాగిపోతున్నామేమో ! తీరా చరమదశలో మన పుట్టకకు కారణం మరేదోవుందని గ్రహిస్తే ఏమైపోతాం? ఆలోచిస్తోంటే యిలా అనిపించటం లేదూ నీకు ?"

గోపాల్ విస్మయంగా చూస్తోనే వున్నాడు. పద్మినికి మెంటల్ షాకేం రాలేదుగదా ? లేకపోతే ఈవైరాగ్య ధోరణి ఏమిటి ? ఇంత అధికమైన అన్వేషణాచింతన ఎలా కలిగింది ? స్త్రీపురుషుల మనుగడనే శంకించగలిగే జిజ్ఞాస ఎలా పొడచూపింది ? ఈ వయస్సులో-ఈ పరిస్థితులలో రాదగ్గ సంశయమేనాయిది? అందుకేనా పద్మిని తన కింత సన్నిహితంగా వుంటూకూడా అంత నిర్వికారంగా వుంటోంది ? దగ్గిరికి చేరాలని తహతహలాడుతోన్న తనని అంత దూరాన నిల్పు తోంది.

"పద్మా!" అనురాగపూరితంగా చూశాడు — "ఈ ఒక్క-క్షణంలోనే నువ్వు ఎంతో కొత్తగా కన్పిస్తున్నావు. జీవితం గురించి ఎంతో తరచి తరచి పరిశోధనచేసే విరాగులు తప్ప ఇలా మాట్లాడలేరు. ప్రకృతి సృష్టిలోనే ఏ జీవి ధర్మం ఆ జీవికి ఏర్పర్చిందని ఒప్పుకుంటావా ?"

"అంటే ?"

"పక్షులు ఎగరాలి. వాటి ఆహార సంపాదనా —

రక్షణా — జీవితమంతా ఆ ఎగరటంమీదే ఆధారపడివుంది. అందుకే వాటికి రెక్కలు సృష్టించబడ్డాయి — మనకు రెక్కలు లేవు. నడవటానికి కాళ్ళుమాత్రం వున్నాయి. నడవటం తప్ప ఎగిరే అవసరం మనిషికి లేదని ప్రకృతి వుద్దేశ్యమై వుంటుంది."

"మనిషికూడా ఎగర గలిగితే ఇంకా బావుంటుందిగా ?"

"ఉన్నదాన్ని విస్మరించి — లేనిదాన్ని గురించి ఆలోచించటం వివేకం అవుతుందా ? అవివేకం అవుతుందా ?"

"అదీ నువ్వే చెప్పు."

"ఎవరూ చెప్పకుండానే ఆలోచించగలిగే శక్తి నీకు వుంది పద్మా ? సూటిగా ఆలోచించు. సూటిగా అర్థంచేసుకో. ఆలోచనలకు తికమకలు పెట్టుకుంటే అవి చిక్కులున్న విడదీయలేనివి అవుతాయి. అర్థం చేసుకోలేనివి అవుతాయి. మనిషికి రెక్కలు వుంటే బావుంటుందన్నావు. తీరా అనిపిస్తే దూరదృష్టి కావాలనిపిస్తుంది. అదీవుంటే మరేదో కావాలనిపిస్తుంది. మన ఆలోచనలకి అంతెక్కడ ? మనుషులకి రెక్కలు వున్నప్పుడు సింహాలకీ - ఏనుగులకూ మాత్రం ఎందుకు వుండకూడదు ? ఇలా ఆలోచిస్తూపోతే మనం చాలా పిచ్చివాళ్ళం అవుతాం. ప్రకృతి ఎలా వుంది ? ఎందుకు వుంది ? అన్నది మాత్రమే మనం అర్థంచేసుకోవటానికి ప్రయత్నించాలి."

పద్మిని ఆసక్తిగా వినసాగింది.

"ఈ స్త్రీత్వం-పురుషత్వం-ఈ మమకారం - శృంగారం- ఇదంతా వ్యర్థమేమో అన్నావుకదూ ? ఇందులో అంత అర్థం చేసుకోలేని సమస్య ఏముంది ? క్రిమికీటకాలనుంచీ - మనిషి

జన్మవరకూ ఈ స్త్రీపురుష విభేదం వుండటం ముందు తరాల జీవోత్పత్తికేనని స్పష్టంగా తెలియటంలేదా ?"

"ఎన్నాళ్ళిలా ముందుతరాలు పెరుగుతాయి ? ఎందుకిలా పెరగటం ? అంతమంటూ వుంటుందా ? అసలీ భూమి మీద సృష్టిలేకుండా శూన్యంగా వుండకూడదా?"

"పద్మా ! నువ్వేకాదు, ఏ మాత్రం ఆలోచించగల వాళ్ళయినా ఎప్పుడో ఒకసారి ఈ ఆవేదన అనుభవించి తీరుతారు. కనీసం అప్పుల్ని శాశ్వితంగా గోల్పోయిన సమయాల్లోనైనా — 'ఏమిటీ సృష్టి ? ఎన్నాళ్ళిలా చావు పుట్టుకలతో సాగుతూ వుంటుంది ?' అన్న స్ట్రగుల్‌కి లోనౌతారు— కాని ఈ సృష్టి ఎంతకాలం సాగుతుందో ఎవ్వరూ చెప్పలేరు. సృష్టి ఆదిని చూచినవాళ్ళు ఇప్పుడులేరు. ఇప్పుడు వున్నవాళ్ళు అంతమంటూ వుంటే దాన్ని చూడలేరు. అంతాన్ని చూడగలిగేవాళ్లు ప్రపంచానికి చెప్పటాని కేమే మిగలదు." గోపాల్ ఒక్క క్షణం ఆగాడు —

"ఇప్పుడీ ఆలోచనలన్నీ నీకెందుకువచ్చాయో నాకు అర్థమౌతోంది. నేను తొందరపడి నిన్ను కలవరపెట్టాను. క్షమించు పద్మా !"

పద్మిని మాట్లాడలేకపోయింది. గోపాల్ చేతుల్లో మొహం దాచుకొంది.

"పద్మా ! ఈ ఆకర్షణలూ – అనురాగాలూ వ్యర్థమని నువ్వనుకోవటం ఎంత దురదృష్టం ! స్త్రీ పురుషుల సమైక్యత ప్రకృతిసహజం కానప్పుడు – ఈ రసావేశాలూ – ఈ అనుభూతులూ ఎందుకిలా సృష్టించబడతాయి ? మనం పుట్టటం

మరెందుకో అయినప్పుడు దానికి దోహదంచేసే లక్షణాలేవో వుత్పన్నం కావాలి కదా? - ఇలా ఆలోచిస్తే ప్రకృతి మన కర్తవ్యం మనకి ఖచ్చితంగా నిర్దేశించిందని తెలియటం లేదా? సహజంగా జరుగుతోన్నదాన్ని విశ్వసించకుండా — మరేదో అర్థంగాకుండా వుండిపోయిందని ఆవేదన చెందటం వివేకం అవుతుందా?

పద్మా! ఒక్కటిమాత్రం చెప్పకుండా వుండలేను. నీ వంటి ప్రేమదేవతతో కలిగిన ఈ స్నేహాన్ని శాశ్వతం చేసుకోవాలని నేను తపించిపోతున్నాను. నావల్ల నీ కళాజీవితానికి ఎలాంటి అవాంతరమూ రాదు. నీ కళారాధన ఇనుమడించేలా నా హృదయపూర్వకంగా దోహదంచెయ్యగలను. నన్ను అర్థం చేసుకోగలిగితే ఎలాంటి భయాలూ వుంచుకోలేవు. మాట్లాడు పద్మా!"

మాట్లాడలేకపోయింది పద్మిని ... "గోపాల్! నువ్వు నాకు అర్థమయ్యావు" అంది అంతరంగం. గోపాల్ పట్ల ఎంతో అనురాగం వుంది. ఎంతో విశ్వాసం వుంది. గోపాల్ భావాలతో సమైక్యతకూడా పొందింది. ఇంకా.... ఇంకా,.. గోపాల్‌ని దూరంగా వుంచుతోంది, ఎందుకని?

"గోపాల్!" పద్మిని కళ్ళెత్తి గోపాల్‌కళ్ళలోకిచూస్తూ కంపిస్తోన్న పెదవులతో అంది - "మనం పెళ్ళిచేసుకుందాం."

"పద్మా!"

"నిజం. మనం పెళ్ళిచేసుకుందాం. ఈ నిర్ణయానికి తిరుగులేదు. అబ్బ! నామనస్సు ఎంత తేలికపడింది!"

"పద్మా! నువ్వు ఆవేశపడటం లేదుకదా?"

"లేదు. నా సంశయాలన్నీ పోయాయి. ఇప్పుడు నా మనస్సు చాలా నిర్మలంగావుంది. మనం తప్పకుండా పెళ్ళిచేసుకుంటాం. జీవితానికి ఏది ముఖ్యమో అర్థమౌతుంది. తనకు మించిన ధర్మం ఎక్కడ వుంటుంది ? నా సుఖశాంతుల్నీ - నా సంతోషాన్నీ విస్మరించి నేను ఏదో చెయ్యాలనుకోవటం పిచ్చి భ్రమలాగా తోస్తోంది. నాకీ కళలమీదా కళారాధనమీదా ఆసక్తిపోతోంది."

"పద్మా!" చురుగ్గా చూశాడు గోపాల్ - "అలా ఎప్పుడూ మాట్లాడకు. కళ దైవప్రసాదితం. దాన్ని నిర్లక్ష్యం చెయ్యటం నేనెప్పుడూ సహించను."

పద్మిని ఇనుమడించిన అనురాగంతో గోపాల్ చేతులు ఒడిలోకి తీసుకొంటూ తన్మయత్వంతో మాట్లాడింది — "ఇంతవరకూ నిన్ను చాలా బాధపెట్టాను. పిచ్చిపిచ్చి సందేహాలతో నిన్ను భయపెట్టాను. ఇంక ఎప్పుడూ అలా చెయ్యను. నువ్వు చెప్పినట్లు వింటాను స్వర్గానికి తీసికెళ్తే స్వర్గానికి వస్తాను, నరకానికి తీసికెళ్తే నరకానికి వస్తాను. నీకు అయిష్టంగా నేను గాలికూడా పీల్చను. ఈ భువికీ దివికీ మధ్య, మనోహరమైన ప్రకృతిలో మనం లీనమైపోదాం."

"పద్మా!" పారవశ్యంతో చలించిపోయాడు గోపాల్. "నేను ధన్యుణ్ణి."

* * *

రాత్రి పడుకోవటానికి ముందువరకూ చాలా ముభావంగా వుంది పద్మిని.

మోహిని చదువుకుంటోంటే గది గుమ్మంలోకి వెళ్ళి

వించుంది—“నీవు ఆబద్ధాలాడటం చాలా అయిష్టం కాబోలు! నిన్న గోపాల్‌తో మాట్లాడిన విషయాలు కొన్ని నా దగ్గర మరుగుపర్చా వెందుకూ?” మోహిని ఎదురుచూడని పరిస్థితికి కొంచెం తడబడింది.

“నేనేం మరుగుపరిచాను. నీవు చెప్పానుగా ?”

“ఏం చెప్పావు ? అతన్ని నా దారిలోంచి పొమ్మని హెచ్చరించాననా ?”—మోహినికి అంతా అర్థమైంది.

“నేనేం అంత సిల్లీగా మాట్లాడలేదు. భవిష్యత్తు గురించీ కళల గురించీ ఏవో మాటలు దొర్లితే...”

“మోహినీ! ఎందు కంత నుభ్యపెడతావు ? గోపాల్ నన్ను అడిగాడు కాబట్టి సరిపోయింది. అతను నా మీద మనస్సు విరుచుకుంటే ఏమయ్యేది ?”

“ఏమయ్యేది ?” నిర్లక్ష్యంగా అంది మోహిని.

“అవును. ఏమయ్యేదో నీకెలా తెలుస్తుంది ?” పద్మిని ణంగా చూసింది - “నీవు ఏమాత్రం హృదయంవున్నా అతని మనస్సు పాడుచేయాలని ప్రయత్నించేదానివి కాదు అదంతా నీద్వారా నేనే చెప్పించానని అతను భ్రమపడ్డాడు కూడా.”

“అక్కయ్యా !” మోహిని అరమరికలు విడిచిపెట్టి మనస్ఫూర్తిగా అంది - “నిజమే. నేనొక అంతరార్థం పెట్టు కునే అతనితో మాట్లాడాను. కానీ, నీమీద ద్వేషంతోగానీ, అసూయతోగానీ కాదు. మన కళాజీవితాన్ని దృష్టిలో పెట్టుకుని మాత్రమే అలా ప్రవర్తించాను. దానివల్ల నీకు మంచి అవుతుందనే నా వుద్దేశ్యం.”

"నా మంచిచెడ్డలు నేను నిర్ణయించుకోగలను మోహినీ! నీ మనస్తత్వం నీది. నా మనస్తత్వం నాది. మన అభిప్రాయాలు వేరుపడటం నీకిష్టం లేకపోయినా అది తప్పేది కాదు. నా జీవితం గురించి నేను ఆలోచించుకోగలనన్న నమ్మకం నీకు లేదా?"

"అక్కయ్యా!"

"ఆఖరిసారిగా నా నిర్ణయం చెప్తున్నాను. నేను గోపాల్‌ని పెళ్ళి చేసుకుంటాను. దానికి తిరుగులేదు."

పద్మిని ధోరణికి చాలా కంగారు పడింది మోహిని.

"ఎందుకింత పిచ్చి!"

"అవును పిచ్చే. ఈ పిచ్చిలో ఎంత ఆనందం వుందో నీకు తెలీదు."

ఇంత మనస్సు పోగొట్టుకుని కొట్టుకుంటోన్న అక్కయ్యని ఎలా మార్చటం? ఎలా?

బతిమిలాడక తప్పదు - "అక్కయ్యా! నెమ్మదిగా ఆలోచించు. చాలా కంగారుపడుతున్నావు. ఇది అంత కంగారు పడే విషయం కాదు."

"నీకు తెలీదు మోహినీ! తర్కం నీది. వాస్తవం నాది. ఆశయం నీది, అనుభవం నాది. ఈ నిజం నీకు తెలియదని నన్ను పరిహాసం చెయ్యకు. నేను పెళ్ళికోసం చాలా తొందర పడుతున్నాను. నన్ను చూసి జాలిపడతావో - మండిపడతావో నాకు తెలియదు. నువ్వు నాకేమైనా సాయం చేయగలిగితే ఈ మాట తాతయ్యతో చెప్పి మా పెళ్ళి జరిగేలా చెయ్యి. అంతే నేను కోరేది."

మోహిని సహనం నశించి పోయింది. కోపంతో మండి

పడింది. అక్కయ్య పూర్తిగా మారిపోయింది. తన అభిప్రాయం పూర్తిగా తల్లక్రిందులైంది, తనీ శుభవార్త తాతయ్యకి చెప్పి రాయబారం నడిపి పెళ్ళి చేయించాలా? నిర్లక్ష్యంగా అంది-

"నీ పెళ్ళికే యిష్టపడని నన్ను సహాయం అడిగే ఖర్మేమిటి నీకు? నువ్వే తాతయ్యకి చెప్పి పెళ్ళి చేసుకో గలవు."

"సరే! ఆరోజువస్తే తప్పకుండా అవుతుంది." పద్మిని మరి నిలబడకుండా తన గదిలోకి వెళ్ళిపోయింది. పక్కమీద పడుకుంటే బావురుమని ఏడవాలనిపించింది. ఛీ! ఏమిటీ దౌర్భాగ్యం? అందరిలాగా హాయిగా పెళ్ళి చేసుకోవాలని కోరుకోవటంలో అపరాధం ఏమిటి?

చాలాసేపు ఆలోచనలతో గడిచింది.

గంటలు గంటలు దొర్లాయి.

పద్మిని పరుపుమీదనుంచి లేచింది, బాల్కనీలోకి వెళ్ళి కాస్సేపు తిరగాలనిపించింది. తలుపులు తీసుకొని హాల్లోకి వచ్చింది. మోహిని గదిలో లైటు జేగంటలా వెలుగుతోంది.

ఆశ్చర్యంగా గుమ్మం దగ్గిరికి వెళ్ళింది.

మోహిని కుర్చీలో కూర్చుని ఒళ్లో పుస్తకం పెట్టుకుని దీర్ఘంగా ఆలోచిస్తోన్నట్టు కూర్చుంది.

"మోహినీ! ఇంకా చదువుతూ కూర్చున్నావా?"

తలతిప్పి చూసి ఊరుకుంది మోహిని.

"ఇంకా పడుకోలేదా?"

దానికీ సమాధానం లేదు.

పద్మిని దగ్గిరికి వచ్చింది - అనునయంగా అడిగింది—

"కోపం వచ్చిందా మోహినీ!"

మోహిని సూటిగా చూసింది- "ఎవరిమీద?"

"ఇంకెవరిమీద? నీ అక్కయ్యమీద."

"లేరు. నాకెవ్వరూ లేరు."

"అంత కోపం ఎందుకే?"

"ఇది కోపం కాదు, బాధ! భరించలేని బాధ! నా అక్కయ్యతోపాటు నా ఆశలన్నీ నాశనమై పోయాయన్న బాధ! భవిష్యత్తంతా అస్తవ్యస్తమై పోయిందన్న బాధ. ఇది నీకు అర్థంకాదు."

"మహా బాగా అర్థమౌతుంది. నీ బాధ బొత్తిగా అర్థం లేనిది. భవిష్యత్తంతా నాశనమైనప్పుడుకదా నువ్వింత బాధ పడాల్సింది."

"అక్కయ్యా! పెళ్ళిచేసుకొని సంసారంలోకి దిగబోతూ నువ్వింకా ఏదో చేస్తానని నన్ను నమ్మించకు. ఒక్కమాట అడుగుతాను, చెప్పు. నువ్వు గోపాల్‌ని మర్చిపోరాదా? అతనితో మనకు పరిచయమే కాలేదనుకోరాదా?"

ఒకపుగా నవ్వింది పద్మిని - "మోహినీ! నువ్వే అక్కయ్యని మర్చిపోరాదూ? అక్కయ్య అసలు నీతో పుట్టలేదనుకోరాదూ?"

"అలాగే అనుకోమంటావా?"

"అనుకోమంటే అనుకోగలవా?"

"ఎందుకు అనుకోలేను? నీ అనురాగాలకోసం నువ్వు చెల్లెల్ని మర్చిపోతే - నా ఆశయాలకోసం నేను అక్కయ్యని మర్చిపోలేనా!"

"మర్చిపోలేవు. నాకు తెలుసు. నేను నిన్ను ఎప్పుడూ మర్చిపోలేదు. ఈ ఆప్యాయతలకీ - గోపాల్ అనురాగానికీ ముడిపెట్టకు. మోహినీ! ఈక్షణంలో నీకు నేను సిగ్గువిడిచి చెప్తున్నాను. అతను లేకుండా నేను బ్రతకలేనిస్థితికి వచ్చాను. అలాంటి దుస్థితే సంభవిస్తే నేను పిచ్చిదాన్నవుతాను. ఇప్పటికైనా నన్ను అర్థంచేసుకో చెల్లీ!" పద్మిని గొంతు గాద్గదికమైంది. కళ్ళు ప్రేమపారవశ్యంతో చెమర్చాయి.

మోహిని తా పిచ్చిధోరణి భరింప నశక్యంగా తోచింది. మాటలు రాక విస్మయంగా చూసింది.

"ఇక దీన్నిగురించి అతిగా ఆలోచించకు. నిద్రపో మోహినీ!"

పద్మిని తడబడుతూ నడిచి వెళ్ళిపోయింది.

మోహిని గాంభీర్యంచూసి నిద్రాదేవత దూరంనుంచే భయపడి పారిపోయింది.

* * *

"నేను డాన్స్‌స్కాలర్‌షిప్‌కి అప్లై చేద్దామనుకుంటున్నాను తాతయ్యా!" అంది మోహిని బయటికి బయల్దేరబోతూ తాతగారితో.

బలరామయ్య ఒక్కనిమిషం ఆలోచించాడు-"మంచిదే! చెయ్యమ్మా. మరి అక్కయ్యమాట?"

పద్మిని కలగజేసుకొంటూ అంది - "ఇద్దరికీ స్కాలర్‌షిప్ రావటం కష్టం. మోహిని ఒక్కతే అప్లైచేస్తే బావుంటుంది తాతయ్యా! నేను తర్వాత మోహినిదగ్గిర నేర్చుకుంటాను-" నవ్వింది.

"సరేనమ్మా! ఎలా వీలుంటే అలాచెయ్యండి." అన్నాడు బలరామయ్య - "మాష్టారేమన్నారు ?"

"ఇప్పుడు వెళ్ళి చెప్తాను తాతయ్యా! రాత్రే ఆలోచించా నీవిషయం."

మోహిని చెప్పినవిషయం వింటూ రామశాస్త్రి ఏమంత ఉత్సాహం ప్రదర్శించలేదు. "అబ్బే! ఆగొడవలన్నీ మనవల్లేక్కడ పడగలవ్? సెంట్రల్ గవర్నమెంట్నుంచి స్కాలర్ షిప్ రావాలంటే ఎన్ని సిఫార్సులూ! ఎంత తతంగం! ఆఁ"

"అదికాదు మాష్టారూ! టాలెంట్ చూసి యిస్తే యిస్తారు. లేకపోతే లేదు. అప్లై చేయటంవల్ల నష్టమేమీలేదు కదా? స్కాలర్ షిప్ వస్తే గవర్నమెంట్ దృష్టిలోకి వెళ్ళినట్టు అవుతుంది."

శిష్యురాలి ఆలోచన రామశాస్త్రికి కించిత్తు విస్మయం కల్గించింది - "పద్మినికూడా అప్లై చేస్తోందా?"

"ఇద్దరూ చేసినా రావటం కష్టమేమోనని అక్కయ్యా నన్ను ఒక్కదాన్నీ చెయ్యమంది."

"అదేవిటమ్మాయ్? ఇద్దర్నీ చూసి యిచ్చేదీ యివ్వందీ వాళ్ళే నిర్ణయిస్తారు. పద్మినినికూడా అప్లై చేయమన్నానని చెప్పు."

"అలాగే మాష్టారూ!"

అప్లికేషన్ మీద సంతకం పెట్టించటానికి మాత్రమే రెండోరోజు మోహిని అక్కగార్ని పలకరించింది. పద్మినికి యిష్టంలేకపోయినా మారుమాట్లాడకుండా సంతకం పెట్టింది.

నెల తిరిగేసరికి ఇద్దరికీ ఇంటర్వ్యూ లెటర్స్ వచ్చాయి.

పద్మిని ఇంటర్వ్యూ అంటేనే చాలా భయపడింది. గడిచిన నెలంతా పద్మిని ఆటమొహం, పాటమొహం చూడ లేదు. ఒక్కరోజుకూడా చీకటితో లేచి ప్రాక్టీస్ చెయ్య లేదు. మాస్టారు రమ్మన్నరోజుల్లో ఒక్కసారికూడా ట్యూషన్‌కి వెళ్ళలేదు. ఆ నెలంతా ఎంత ఆటవిడుపుగా గడి పిందో బాగా తెలుసు.

పద్మిని ధోరణి విని గోపాల్ చాలా విసుక్కున్నాడు. "ఛః నువ్వింత మొద్దమ్మాయిలా తయారవుతావనుకోలేదు. ఇన్నాళ్ళూ ఒక్కమాటకూడా చెప్పకుండా నోరు మూసు కున్నావు. నువ్వింత డల్‌గా వుంటున్నావని నాకేం తెలుసు? మోహిని భయపడ్డట్టు అక్షరాలా జరిగేలావుంది."

"నాతప్పేం లేదు—" నవ్వుతూ అంది పద్మిని—"నీతో గడపటం తప్పితే మరోపని చెయ్యటానికి నాకు బుద్ధి పుట్టటం లేదు. నన్నేం చెయ్యమంటావ్?"

"అలా పిచ్చిపిచ్చిగా మాట్లాడకు పద్మినీ! దేనిధోరణి దానిదే. పోనీ యిప్పుడు మించిపోయిం దేమీలేదు. ఈ రెండు రోజులూ ప్రాక్టీస్ చెయ్యి. ఇంటర్వ్యూకి వెళ్ళటం మాత్రం మానకు. ఏదో ఒకటి అవుతుంది."

"సరే! సరే! వెళ్తాలే, వూరుకో."

"అదిగో! నీకు నవ్వులాటలావుంది. నువ్వింకా నిర్లక్ష్యం చేశావంటే నేను వూరుకోను. నేను చెప్పినట్టు అక్షరాలా చేస్తానన్నావ్, ఇదేనా?"

"చాలు. చేస్తానన్నాగా? ఇంటికివెళ్తే ఆవిడా! ఇక్కడికి వస్తే నువ్వూ.—నాప్రాణాలకు శాంతిలేకుండా చేస్తున్నారు."

మూతి ముడుచుకుంది పద్మిని.

"అది కాదు పద్మా!" అంటూ పద్మినిని ప్రసన్నం చేసు కునేసరికి మత్తువచ్చి పద్మినిబుజంలో వాలి పడుకున్నాడు గోపాల్.

డాన్స్ ఇంటర్వ్యూ కళాక్షేత్రంలో జరిగింది. జడ్జీలలో కౌముదీబాయికూడా వుంది. ఆమె శాస్త్రీయ నాట్యాన్నంతా కరతలామలకం చేసుకున్న అదృష్టవంతురాలు. ఆమె పేరు ప్రఖ్యాతుల గురించి అనేకసార్లు విని - ఆమె నొక ఆదర్శ వ్యక్తిగా ఊహించుకుంది మోహిని.

హస్తాలపేర్లూ - కరణాలూ - నవరసాలూ - దృష్టి భూభేదాలూ - వగైరా థియరీలో మోహిని జవాబులు చెప్పిన ధోరణి చాలా సంభ్రమం కల్గించింది జడ్జీలను. ఏ విధమైన తొణుకూ బెణుకూ లేకుండా ప్రశ్న విన్నదే ఆలశ్యంగా తను చెప్పేదే శాస్త్రం అన్నంత ధీమాగా జవాబులో పది జవాబులు జతచేసి చెప్పింది.

పద్మినికూడా సరియైన జవాబులు యివ్వగలిగింది. కానీ వాటిలో "పరీక్షకు సిలబస్‌ని విధం" కొట్టవచ్చినట్లు కన్పించింది.

తర్వాత ప్రాక్టికల్స్ జరిగాయి.

మోహిని అడిగినవన్నీ చకచకాచేసి చూపించింది. చిన్నచిన్నపరీక్షలతో సంతృప్తిపడ్డ జడ్జీలు ఫైనల్‌గా ఒక ఐటమ్ చేయమని ఛాయస్ ఇచ్చారు.

"నాకు ఛాయస్ అవసరంలేదు. ఏది చెయ్యాలో మీరే నిర్ణయించి చెప్పండి. చెయ్యమంటే రెండూ చేస్తాను." అంది మోహిని.

"భామాకలాపం చెయ్యమ్మా! చాలు." అంది కౌముదీ బాయి.

విరహశృంగారంతో మూర్తీభవించిన సత్యభామ అయింది మోహిని.

ప్రాక్టికల్స్‌లో పద్మినికూడా భయపడినదానికన్నా బాగా చేయగలిగింది.

నాట్యకళను సాధించాలన్న దీక్షా వుత్సాహం మోహినిలో మాత్రం చూడగలిగారు జడ్జీలు. ఇంటర్వ్యూ అయ్యాక కౌముదీబాయి పద్మినీని మోహినీని వేరుగా ఒకగదిలోకి పిలిపించింది.

"ఇద్దరూ చాలా చక్కగా చేశారు. స్కాలర్‌షిప్పు విషయం తర్వాత తెలుస్తుంది. మీ ఇద్దరిలో ఎవరికి వచ్చినా రావచ్చును." ఆమె మోహినికేసి చూస్తూ అంది— "ఒకవేళ నీకువస్తే నువ్వు కళాశిఖరలో చేరితే బావుంటుందమ్మా!"

మోహినిని చూసి ఆమె చాలా ప్లీజ్ అయింది.

"నీలాంటి శిష్యురాలు నాకు కావాలి. నా విద్య అంతా నీకు నేర్పితే ఎంతో సార్థకం అవుతుందని నాకెంతో కోరికగా వుందమ్మా!" అంది అభిమానంగా చూస్తూ.

మోహిని మనస్సు ఆనందసముద్రం అయింది. కౌముదీ బాయిదగ్గిర తను నేర్చుకుంటే ఎంతో గొప్పది కావచ్చును. సందేహంలేదు. కానీ.... ఊహూ! ఇష్టంలేదు. నేలచూపులు చూస్తూ అంది— "ఎక్స్‌క్యూజ్ మి మేడమ్! మాకు మొదటినుంచీ రామశాస్త్రిగారే నేర్పుతున్నారు. ఇప్పుడు మా మాష్టార్ని కాదని........" మాటలు మింగుతూ నించుంది.

కౌముదీబాయి మళ్లా అంది- "ఆలోచించుకుని తర్వాత లెటర్ రాయి. నీ భవిష్యత్తు కోసమే నేనింతగా చెప్తున్నాను. ఇందులో నాకూ ఆనందం లేకపోలేదనుకో."

"థాంక్స్ మేడమ్!" అనేసి ఫూరుకుంది మోహిని కాసేపు.

"మీవంటి పెద్దవారు నా మంచికోరటం నాకు చాలా సంతోషంగా వుందండీ." అంటూ మనస్సులోమాట కాస్త విస్సంకోచంగా అడిగేసింది - "నా మంచికోసం మా మాష్టార్ని మార్చుకోవాలా మేడమ్!"

కౌముదీబాయి చిరునవ్వు నవ్వింది - "మార్చటం అవసరమని భావిస్తున్నా నమ్మా! ఇక నువ్వు నేర్చుకోవలసిందేమీ మీ మాష్టారి దగ్గిర లేదు."

తెల్లబోయారు అక్కచెల్లెళ్ళు. మాష్టార్ని గురించి అలా మాట్లాడింది తనకి అత్యంత ప్రియమైన కౌముదీబాయి గాకుండా మరెవరేనా అయితే కొంచెం తీవ్రంగానే జవాబు చెప్పేది మోహిని. చికాకంతా దాచుకుంటూ మందస్వరంలోనే పట్టుదల ప్రదర్శిస్తూ అంది - "మా మాష్టారు చాలా తెలివైన వారండీ! ఇంకా ఆయన మాకెంతో నేర్పుతా మంటున్నారు."

"ఇన్ని సంవత్సరాలనుంచీ మీరు నేర్చుకున్నది చాలా తక్కువమ్మా!" కౌముదీబాయి ఒక్కనిముషం ఆగి అంది - "స్కాలర్‌షిప్పు తీసుకోవటంతో సరిపోదమ్మా! సంవత్సరానికోసారి గవర్నమెంట్ టెస్ట్ చేస్తుంది. ఏమాత్రం అసంతృప్తి కల్గినా స్కాలర్‌షిప్ ఆపేస్తుంది. చూడమ్మా! అలా ... అయితే ... సరే! బాగా ఆలోచించుకుని నిర్ణయించుకో."

"థాంక్స్ మేడమ్! కానీ...క్షమించండి. నేనిక ఆలో చించుకునేదేం లేదు. మాష్టార్ని మార్చాల్సివస్తే నేనసలు స్కాలర్‌షిప్ తీసుకోను."

"అరె! ఎందుకంత తొందరపడతావ్ ?" కించిత్తు కోపంతో మందలించింది కౌముదీబాయి.

సిగ్గుపడి తలదించుకు నించుంది మోహిని.

"సరే! మీరు వెళ్ళండమ్మా !"

టాక్సీలో వస్తున్నప్పుడు పద్మిని అంది – "నీకు గ్యారంటీగా స్కాలర్‌షిప్ వస్తుంది మోహినీ!"

నిజంగా స్కాలర్‌షిప్ తనకే రావాలని మోహినికి పట్టుదలగావుంది. తనని చూసి అసూయపడే స్థితి వచ్చినప్పుడైనా అక్కయ్య కళ్ళు తెరుస్తుంది. తనలా వున్నతి సాధించాలని ప్రయత్నిస్తుంది. అదే తనకు కావలసింది.

"నీ ఉత్సాహం చూస్తే నువ్వు 'కళాశిఖర'లో నేర్చు కోటానికి ఒప్పేసుకుంటావేమోనని చాలా భయపడ్డాను. అలా అయితే మాష్టారు చాలా బాధపడేవారు" అంది పద్మిని.

"మాష్టారు బాధపడకపోతే మాత్రం వృత్తపుణ్యానికి ఆయన్ని మాన్పించటం బావుంటుందా ? అందుకే నేను ఒప్పుకోలేదు" అంది మోహిని.

ఇంటర్వ్యూ విషయాలన్నీ బలరామయ్య శ్రద్ధగా విన్నాడు. "మాష్టారి దగ్గిర పద్మిని నేర్చుకుంటుందనుకో, అయినా నువ్వు వేరేనేర్చుకోవటం ఎందుకూ!మంచిపని చేశావు" అన్నాడు.

మోహినికి ఒక్కదానికే సెంట్రల్ గవర్నమెంటు

నుంచి క్లాసికల్ డాన్స్‌లో స్కాలర్ షిప్ యివ్వబడింది. ఆవుత్తరం యింట్లో అందరికీ మహదానందం కల్గించింది. రామశాస్త్రి కూడా శిష్యురాల్ని చాలా అభినందించాడు.

"నువ్వు చాలా ట గలదానివి మోహినీ అన్నాడు.

ఎప్పుడో సగంలో వదిలేసిన కిన్నెరసాని పూర్తిగా కంపోజ్ చేశాడు రామశాస్త్రి. ఒక కొత్త తరంగం - ఒక అష్టపదీకూడా నేర్పించాడు.

మాష్టారు అంత రెగ్యులర్‌గా వస్తుంటే పద్మిని హడిలి పోయి షికార్లు కొంతవరకూ తగ్గించేసుకొంది.

గోపాల్ కళానిలయానికి చాలా అరుదుగా వస్తున్నాడు. లక్కయ్యతో ఘర్షణపడ్డ తర్వాత మోహిని గోపాల్‌ని చాలా తక్కువసార్లు చూసింది.

* * *

ఆరోజు మోహినిపేర ఒక వైర్ వచ్చింది - అది చదువు తుంటేనే ఎగిరి గంతేసింది. "తాతయ్యా! అక్కయ్యా! రండి, రండి," అంటూ ఆనందంతో కేకలు పెట్టింది.

"ఏమిటే మోహినీ?" అంటూ పద్మిని పరిగెత్తుకువస్తే అమాంతం కౌగిలించేసుకొంది.

"ఏమిటమ్మా హడావుడీ?" అంటూ తాతయ్య వచ్చాడు. వంటిల్లు వదిలేసి రాజమ్మకూడా వచ్చింది.

"వినండి, వినండి. ప్రఖ్యాత నర్తకీమణి మోహినీదేవి త్వరలో ఫారెన్ వెళ్ళబోతున్నారు." అంటూ అతిశయంగా పోజుపెట్టింది.

"ఏమిటి పద్మా?" అని తాతయ్య అడిగితే "నాకూ తెలీదు తాతయ్యా!" అంటూ చెల్లెలిచేతిలో కాయితం లాక్కుంది పద్మిని.

హఠాత్తుగా గుర్తువచ్చి మోహిని టెలిఫోన్ దగ్గిరికి పరిగెత్తింది. రిసీవర్ తీసి చకచకా డయల్ చేసింది.

"హల్లో!" అంటూ మాస్టారికంఠం ఖంగున మ్రోగేసరికి మోహిని నవ్వుమొహంతో అంది — "నమస్కారం మాస్టారూ! మీకో గుడ్‌న్యూస్ చెప్పాలండీ!"

"ఏమిటమ్మా అది?"

"మరేమో మాస్టారూ! నన్నే మోనండి ... "

"అదేమిటి? గుడ్‌న్యూస్ అంటూ అంత ఆలశ్యం చేస్తావేం? తొందరగాచెప్తే వింటాగా?"

"చెప్తున్నాను మాస్టారూ! ఈ సంవత్సరం వియన్నాలో జరగబోయే వరల్డ్ యూత్ ఫెస్టివల్‌కి - నన్ను భరతనాట్యం ప్రదర్శించేందుకు - సెలక్టు చేసినట్టు - ఇప్పుడే ప్రభుత్వంనుంచి వైర్ వచ్చిందండీ!"

అటునుంచి ఓ నిముషంవరకూ జవాబేలేదు - "మాట్లాడరేం మాస్టారూ? చాలా సంతోషం కల్గించేవిషయం కదండీ!"

"ఎవరికి సంతోషం!" మాస్టారినవ్వు చాలా కొత్తగా వినిపించింది.

మోహిని తెల్లబోయింది - "అదేమిటి మాస్టారూ! మీకు సంతోషంగా లేదూ?"

"అబ్బే! అదికాదు, సాయంత్రం నేను వస్తాగా? మాట్లాడుదాం."

"అవును. చాలా మాట్లాడాలి మాష్టారూ! ఈ జర్నీకి కొన్ని ఐటమ్స్ రికార్డ్ చేయాలండీ మనం."

"సరే! సరే! నేవచ్చి మాట్లాడుతాలే." రిసీవర్ పడేసిన శబ్దం.

మోహిని వుత్సాహం - నీళ్లు చిలికిన పాలపొంగులాగా వుధృతం తగ్గింది.

కాయితంలో విషయం తెలుసుకున్న పద్మిని చెల్లెల్ని చూస్తూ- "మోహినీదేవికి మా అభినందనలు" అంది నవ్వుతూ. బలరామయ్యకూడా చాలా సంతోషంగా కన్పించాడు.

"అభినందనలన్నీ తర్వాత. అసలు మాష్టారు సరిగ్గా మాట్లాడకుండానే రిసీవర్ పడేశారు."

"అవతల లేదైనా పనుందేమో నమ్మా! ఎలాగూ సాయంత్రం వస్తారుగా?" అన్నాడు తాతయ్యకూడా.

"నీకీ అవకాశం వచ్చిందంటే మాష్టారు చాలా సంతోషిస్తూవుంటారు." అంది పద్మిని.

"నిజమే. ఇంత మంచి అవకాశం రావటం కష్టంకదా? పెద్ద పెద్ద లందరి దృష్టిలోనూ నువ్వున్నావంటే ఎంత గొప్ప! అక్కయ్యకి మాత్రం ఈ అవకాశం వచ్చిందా?" అన్నాడు తాతయ్య.

పద్మిని నవ్వి— "ఆ అవకాశం నాకే వచ్చిందనుకో. చెల్లాయికి వచ్చిందా? అంటావు. ఎవరికో ఒకరికేకదా అవకాశం వచ్చేది!" అంది.

మోహిని ఆలోచనలన్నీ ఫారన్ ప్రయాణం చేస్తున్నాయి. ఏమేం చెయ్యాలి? ఏవే వస్తువులు తయారుచేసు

కోవాలి? ఎలాంటి డ్రెస్‌లు కుట్టించుకోవాలి? ఏ ఏ ఐటమ్స్ ప్రాక్టీస్ చెయ్యాలి? అన్నీ చాలా క్విక్‌గా చెయ్యాలి. ఒక్క-మినిట్ కూడా వేస్ట్ కాకుండా చెయ్యాలి.

సాయంత్రం ఐదుగంటల వేళ రామశాస్త్రి వచ్చాడు. టెలిగ్రాం కాయితం చదివి మళ్ళా టేబుల్ మీద పెట్టేశాడు - "ఊఁ అయితే ఏమిటి నీ వుద్దేశ్యం? వెళ్దామనే అనుకుంటున్నావా?" అన్నాడు మోహినిని చూస్తూ. మాస్టారి అనుమానం చూసి మోహిని మాట్లాడలేక పోయింది.

"ఇంకా వుద్దేశ్యం ఏమిటి మాస్టారూ వెళ్ళటానికి?" అంది ఆశ్చర్యంగా పద్మిని.

బలరామయ్యకూడా - "ఇలాంటి అవకాశం రావటం మంచిదేకదా శాస్త్రిగారూ!" అన్నాడు.

రామశాస్త్రి ఓసారి జేబురుమాలుతీసి, ముక్కూ-మొహం తుడుచుకున్నాడు - "సరే! మీ యిష్టం." టేబుల్ అంచుమీద వేళ్ళతో లయ వేస్తూ కూర్చున్నాడు. మాస్టారి ధోరణి ముగ్గురికీ ఆశ్చర్యం కల్గించింది.

మోహిని ఆతృతగా అడిగింది-"మీ వుద్దేశ్యం చెప్పండి మాస్టారూ!"

రామశాస్త్రి అదోలా నవ్వి - "ఇప్పుడు నా వుద్దేశ్యం ఏం చెప్పను? వెళ్లాలన్న నిర్ణయం అయిపోయిందిగా? ముందే నా అభిప్రాయం అనుగుణా వనుకున్నాను."అన్నాడు స్పష్టంగా నిష్ఠూరం ధ్వనింపజేస్తూ.

"అబ్బే! అదేంకాదు మాస్టారూ! వెళ్ళేవుద్దేశ్యం వుందా? అంటే వుందని వూరుకున్నాను. మీతో మాట్లాడి మీ అభి

ప్రాయం తెలుసుకోకుండా బయల్దేరుతున్నానా? మీ వుద్దేశ్యం ఏమిటో చెప్పండి మాస్టారూ!" అంది మోహిని ప్రాధేయపడుతోన్నట్టు. రామశాస్త్రి కాస్త మొహం ప్రసన్నం చేసుకున్నాడు -

"అది కాదమ్మా! ప్రభుత్వంవారు నిన్ను గుర్తించి ఈ అవకాశం నీకిచ్చారు, బాగానే వుంది. కానీ ఈ ప్రయాణంవల్ల ఏమైనా చిక్కులు వస్తాయేమో ఆలోచించావా?"

"చిక్కు లేమిటి మాస్టారూ?"

"వియన్నా కమ్యూనిస్ట్ [illegible]"

మాస్టారి రాజకీయ పరిజ్ఞానానికి ఫక్కున నవ్వు రాబోయింది శిష్యురాళ్ళకి.

మోహిని చిరునవ్వు నవ్వుతూ అంది -

"వియన్నా కమ్యూనిస్ట్ సిటీ కాదు మాస్టారు! ఆస్ట్రియాకి రాజధాని. ఒక వేళ అక్కణ్ణుంచి ఏ యుగోస్లేవియాకో వెళ్ళాల్సి వస్తే వెళ్తాము. కమ్యూనిస్ట్ కంట్రీకి వెళ్తే ఏమౌతుంది మాస్టారూ?"

"కీడెంచి మేలెంచాలి. అక్కడ నీకేదైనా రిస్క్ వస్తే!" ప్రశ్నార్థకంగా మొహంపెట్టాడు మాస్టారు.

మోహిని తర్కానికి దిగింది. "కమ్యూనిస్ట్ పార్టీ సిద్ధాంతాలు వేరు కావచ్చు గానీ - ఇలాంటి సాంస్కృతికోత్సవాలకు వచ్చినవాళ్ళని వాళ్ళేం చేస్తారు? అయినా ప్రభుత్వం ఇదంతా ఆలోచించకుండా వుంటుందా? మన దేశంనుంచి వెళ్ళే మెంబర్సంతా తిరిగి వచ్చేవరకూ బాధ్యతంతా ప్రభుత్వానిదే కదా?"

రామశాస్త్రి విసుగుదల ప్రకటించాడు. "ఏమిటమ్మాయ్ అంత అమాయకంగా మాట్లాడుతావు? ప్రభుత్వానికి బాధ్యత వుంటే మాత్రం అక్కడ అనుకోకుండా ఏదైనా జరిగితే తర్వాత ఏం చేస్తుంది? ఓ గజం పొడుగు సానుభూతి పత్రం పంపుతుంది. మహా అయితే నష్టపరిహారం యిస్తుంది. అంత కన్నా ఏం చేస్తుంది? కాదనటానికి నువ్వూ నేనూ ఎవరం?"

నిజానికి మాష్టారే పెద్ద కమ్యూనిస్టులా మాట్లాడుతున్నా రనిపించింది మోహినికి. మాష్టారి భయమంతా బొత్తిగా అర్థంలేని దనిపించింది.

"అయినా నువ్వు ప్లెయిన్‌లో వెళ్ళాలి, తల్చుకుంటేనే నాకు కళ్ళు తిరుగుతున్నాయి. వెధవ రైళ్లే రోజుకి పదిసార్లు పడిలేస్తున్నాయి. ఇక విమానాలమాట చెప్పేదేమిటి? ఒక దాన్నొకటి గుద్దేసుకుంటున్నాయి. అబ్బ! ఎన్ని యాక్సిడెంట్లో!"

మోహిని పద్మినికేసి చూసింది. పద్మినికూడా నవ్వు దాచుకోలేకపోయింది.

రామశాస్త్రి మొహం ఎర్రగాచేసుకొంటూ — "నవ్వు లాటకాదమ్మాయ్! మొన్ననోసారి మా పినతండ్రి విమానంలో ప్రయాణంచేసి నెల్లాళ్ళు ఖాయిలాపడ్డాడు. వెధవది! బతికివుంటే బలుసాకు తినచ్చు. విమానం ఎక్కటం గొప్పా ఏమిటి?" అన్నాడు.

మాష్టారి మాటలు వింటూ బలరామయ్య మొదట్లో కాస్త జంకినా రానురాను మాష్టారు బొత్తిగా చిన్నపిల్ల వాడిలా మాట్లాడుతోంటే విసుగువేసింది.

"సరేలెండి మాష్టారూ! ఎవర్నయినా బాగా తెలిసిన

వాళ్ళనికూడా అడిగిచూద్దాం" అన్నాడు.

"అబ్బే! మీరా పిచ్చిపెట్టుకోకండి బలరామయ్యగారూ! ఆడపిల్ల ఒక్కతీ అంతదూరం వెళ్ళటం మంచిదికాదు. తర్వాత ఏమైనా అయితే విచారించేది మనమేగానీ సలహాయిచ్చిన వాడెవడూ తొంగిచూడడు."

మాష్టారిభయాలు బొత్తిగా అర్థంపర్థంలేనివి. లేకపోతే బాధ్యతలన్నీ ప్రభుత్వం తీసుకుని దేశాంతరుపున పంపుతోంటే ఈ శంకలన్నీ ఏమిటి? — మోహిని తాతయ్యా అభిప్రాయం కోసం చూసింది.

"నీ కెలాతోస్తే అలా చెయ్యమ్మా! మాష్టారు చెప్పిన మాటలు నువ్వూ విన్నావు. నేనూ విన్నాను. నాకన్నా నీకే బాగా తెలుసు. ఆలోచించుకుని మరీ చెయ్యి" అన్నాడు బల రామయ్య హెచ్చరిస్తూ.

"ఫర్వాలేదు తాతయ్యా! నాకు వెళ్ళాలనేవుంది. మాష్టారు నామీద అభిమానంకొద్దీ అలా భయపడుతున్నారు గాని ..." అంది మోహిని. మోహినిపట్టుదల మాష్టారికి బాగా తెలుసు.

"సరే! నీయిష్టం అలాగే వెళ్ళు." అనేశారు మాష్టారు— ఆఖరికి తనే అనుమతి యిచ్చినట్టు.

*   *   *

మోహిని ట్రెయిన్‌కి వెళ్ళేంటే రామశాస్త్రి ఎయిరోడ్రోమ్‌కిరాలేదు —"చూశావా తాతయ్యా! అసలు మాష్టారికి నేవెళ్ళటం ఇష్టంలేదు." అంది మోహిని చిన్న బుచ్చుకొంటూ.

"పోనీలేమ్మా! ఆయనకేదైనా పనివుండేమో! నువ్వేం దిగులుపడకు." అంటూ ధైర్యం చెప్పాడు తాతయ్య.

మోహిని తలతిప్పి చూసేసరికి అక్కడున్న పక్కన గోపాల్ కన్పించాడు నవ్వుతూ - "ఇంత చిన్నవయస్సులో నిజానికింత అభివృద్ధి సాధించావు. చాలా అభినందనలండీ! నీ ప్రయాణం చాలా సుఖంగా జరగాలి."

"థాంక్స్" అనేసి వూరుకొంది మోహిని.

గోపాల్ విష్ చేసినట్లు మోహిని వియన్నా జర్నీ చాలా ఆహ్లాదకరంగా - మధురస్మృతిలాగా అయింది. గాలిలో ఎగరటం కొత్త! చూస్తోన్న ప్రదేశాలన్నీ కొత్త! కన్పిస్తోన్న మనుషులందరూ కొత్త! భాష కొత్త! వాతావరణం కొత్త! అయినా మోహిని వుత్సాహంతో అన్నీ ఎడ్జస్ట్ చేసుకొంటూ గడిపింది.

యూత్ ఫెస్టివల్ కి అనేక దేశాలనుంచి హాజరైన డెలిగేట్స్‌ను కలుసుకొంది. రకరకాల నాట్యాలు చూసింది. సంగీతాలు వింది, సాధ్యమైనంతవరకూ వాటిని అర్థంచేసుకోవటానికి ప్రయత్నించింది.

భారతదేశం తరుపున వెళ్ళిన మెంబర్స్‌తో తను భరతనాట్యం ప్రదర్శించి ఆడియన్స్‌ని ముగ్ధుల్ని చేసింది. సౌందర్యాన్ని ఇనుమడింపజేసే భరతనాట్యం దుస్తులతోనూ అలంకారాలతోనూ — కొత్తవారికికూడా అభిరుచి కల్గిస్తూ — చక్కని ఆంగికాభినయంతో - మృదువైన ముఖకవళికలతో - నాట్యంచేసి ప్రేక్షకులనుంచి అధికంగా రెస్పాన్స్ పొందగలిగింది.

తర్వాత రెండు లలితగీతాలుకూడా పాడి విన్పించింది.

తెలుగుభాష అర్థం కాకపోయినా - పదాల పొందికా-

ఆపాందికలో ధ్వనించే సంగీతం - హాయి గొలిపే కంఠస్వరం - అన్నీ చాలా నచ్చాయి ప్రేక్షకులకు. ప్రదర్శనల తర్వాత చాలామంది యువతీ యువకులు మోహినిచుట్టూ గుమిగూడి అభినందించారు.

"నమస్తే"

మధువులొలికే తెలుగు కంఠం వింటూ సంభ్రమంగా చూసింది మోహిని.

" నాపేరు సుధాకర్! " ఆ యువకుడు హాయిగా తెలుగులో మాట్లాడాడు - "ఇండియాలో నేను మీగురించి ఎప్పుడూ వినలేదు. చాలా కాలంగా బెనారస్‌లో వుంటున్నాను. చిన్న కంటి ఆపరేషన్‌కోసం యిక్కడికి వచ్చాను. ఓ ఫ్రెండ్ ఆహ్వానిస్తే ఇవాళ్ల లక్కీగా మీ పాటలు వినగలిగాను. డాన్సంటే నాకు మ్యూజిక్ అంటే చాలా యిష్టం. అందులోనూ లైట్‌మ్యూజిక్ అంటే మరీప్రాణం - మీరు పాడిన "రాధహృదయం" నాకు చాలాచాలా నచ్చింది."

సుధాకర్ మాట్లాడుతోన్నంతసేపూ మోహిని నవ్వుతూ వింది. మొహమూ - ముంజేతులూ తప్పితే అతనిశరీరంలో ఏ భాగమూ కన్పించటంలేదు - అయినా అతను తెల్లటితెలుపు అని స్పష్టంగా తెలుస్తోంది. రాజకుమార్తెల తాలూకు నాజూకుతనం అతన్ని వరించినట్టు మనిషి చాలా సున్నితంగా కన్పిస్తున్నాడు. మాట్లాడకుండా మనిషిని పరీక్షించటం మర్యాదగా వుండదని - "మీరు ఇండియా ఎప్పుడు వస్తున్నారు ?" అంది.

"ఓ నెల్లాళ్ళిక్కడే వుంటాను. తర్వాత బెనారస్

వెళ్తాను."

మరి కాస్సేపు సంభాషణ కాలక్షేపంగా గడిచింది. సుధాకర్ మళ్ళామళ్ళా మోహిని పాటవిషయం ఎత్తి ప్రశంసించాడు.

"మీకేదైనా ఆర్టుతో పరిచయం వుందా?" అంది మోహిని.

"పెద్ద ఆర్టేంకాదు. ఎప్పుడైనా నాకు సరదాగావుంటే ఏమైనా రాస్తూ వుంటాను."

"అలా చెప్పండి. అందుకే ఆపాటకి మీరంత ప్లీజ్ అయ్యారు." అంది నవ్వి మోహిని.

సుధాకర్ మోహిని అడ్రెస్ అడిగి తీసుకున్నాడు.

— మొత్తంగా వియన్నా ప్రయాణం మోహిని తెలివి తేటల్ని పెంచింది. ఊహాల్ని విశాలం చేసింది.

తను నేర్చుకున్నది చాలా స్వల్పం. ఇంకా నేర్చుకోవాల్సిందీ ప్రదర్శించాల్సిందీ ఎంతో ఎంతో వుంది. ఈ కళారాధనకే అంకితంచేసినా ఈ జీవితం చాలదు.

— మోహిని తిరిగి వస్తోన్న రోజుకూడా రామశాస్త్రి ప్లెయిన్ దగ్గిరికి రాలేదు. ప్లెయిన్ దిగి వస్తోన్న మోహినికి ఆ పూలతో పాటు గోపాల్ కూడా ప్రత్యక్ష మయ్యాడు.

"మాష్టారు అనవసరంగా భయపెట్టారుగానీ మీరు హాయిగా వెళ్ళి హాయిగా వచ్చారు. అవునా?" అన్నాడు నవ్వుతూ.

"మీరు విష్ చేసినట్టే అయింది. జర్నీ చాలా హేపీగా జరిగింది." అంది గోపాల్ మీద కోపం తాత్కాలికంగా మరిచి

చెల్లెలు ఆ రెండుమాటలూ గోపాల్‌తో మాట్లాడటం పద్మినికి చాలా సంతోషం కల్గించింది.

ఇంటికి వెళ్తూనే మోహిని వుత్సాహంగా ఫోన్‌దగ్గిరికి వెళ్ళింది. అట్నుంచి మాస్టారి కంఠం విన్పించింది.

"నమస్కారం మాస్టారూ! నేను వచ్చేశాను. అంతా చాలా సక్సెస్‌గా అయింది. మీకు చెప్దామని......"

"అలాగా! అయితే మంచిదే. నువ్వు వెళ్ళిన దగ్గిర్నుంచీ నేను భయపడుతూనే వున్నాను."

"అదేం లేదండీ! చాలా హేపీగా గడిచింది. ఈ జర్నీతో నేను ఓ విషయం తెలుసుకున్నాను మాస్టారూ! కళ ఎక్కడ వున్నా అది ముందు విస్తృతంకావాలి. ఎక్కడివాళ్ళక్కడే కూర్చుంటే ఒకరినుంచి ఒకరేం తెలుసుకుంటారు మాస్టారూ?"

"సరేనమ్మా! వెళ్ళివచ్చావు. మంచిదేగా?" ఓ నవ్వు నవ్వి రిసీవర్ పడేశారు మాస్టారు.

మోహినికూడా అక్కయ్యకీ - తాతయ్యకీ పొంగిపొర్లే వుత్సాహంతో కబుర్లు చెప్పటంలో మునిగిపోయింది.

* * *

మోహిని మాస్టారింటికి వెళ్ళేసరికి వసుంధరా నిర్మలా వాళ్ళంతా గజ్జెలకాళ్ళతో పరిగెత్తుకొంటూ వచ్చారు—

"నీ ప్రయాణం కబుర్లు చెప్పవ్? ఎలా అయింది? ఏమేం చూశావ్? అన్నీ చెప్పు మోహినీ!" అంటూ చుట్టూ మూగారు.

మోహిని నవ్వి — "ముందు మాస్టారేంచేస్తున్నారో చెప్పండి" అంది.

"పూజ చేసుకుంటున్నార్లే. అప్పుడే రారు. నీ కబుర్లు

చెప్పూ." అంటూ తొందరచేశారు.

మోహిని నవ్వుతూ అందరూ అడిగినవాటికి జవాబులు చెప్తూ విశేషాలన్నీ చెప్పింది.

వినేవాళ్ళ కుతూహలం చాలావరకు తీరింది.

"మోహినీ! మొన్న వియన్నా వెళ్ళకముందు గవర్నర్ వచ్చినప్పుడు చేసిన ప్రోగ్రామ్‌లో కొత్తగా చెప్పిన తరంగం అంతా పాడుచేశావటగా?" అంది వసుంధర.

"ఎవరన్నారు?" ఆశ్చర్యంగా అడిగింది మోహిని.

"మాస్టారే అన్నారు."

"మాస్టారన్నారా? నేన్నమ్మను. ఆరోజు ఎంతో బాగా చేశానని మాస్టారు మెచ్చుకున్నారు. తెలుసా?"

"అదే! మాకు నిజంగా చెప్పారోయ్! కావాలంటే మాస్టార్ని అడుగు."

రామశాస్త్రి అంతా వింటూనే బయటికి వచ్చాడు.

"ఓహో! మోహిని వచ్చిందా? ఎంతసేపైంది?"

"అది కాదు మాస్టారూ! నేను కొత్తతరంగం బాగా చెయ్యలేదని మీరు వసుంధరావాళ్ళతో అన్నారా?" అంది మోహిని సూటిగా చూస్తూ.

"అదేమిటమ్మా! విమానందిగి వస్తూనే దెబ్బలాట వేసుకుంటున్నావ్?" అంటూ నవ్వాడు రామశాస్త్రి.

"చెప్పండి మాస్టారు!" అంది మళ్ళా మోహిని.

"అవునమ్మా! అప్పుడు చెప్తే నిరుత్సాహపడి పోతావని అలా అన్నానుగానీ, బాగాచేయలేక పోయావ్. ఫెయిల్యూర్లు అంటూ ఎప్పుడూ వుండదా ఏమిటి? దాన్నిగురించి

ఇప్పుడెందుకూ !"

మాష్టారి సానుభూతి మాటలు వింటే ఒళ్ళుమండింది మోహినికి – "అదేమిటి మాష్టారూ ? ప్రతీ పదానికి – ప్రతీ చరణానికీ – ప్రతీ భావానికీ మీరు చెప్పిన విధంగానే చేసి చూపించాను. కొత్త ఐటమ్‌కదాని విధీ విరామం లేకుండా ప్రాక్టీస్ చేశాను. నేను ఎక్కడ లోపంచేశానో యిప్పుడు చెప్పండి, తెలుసుకుంటాను."

రామశాస్త్రి నవ్వుతూ – "అరె! అంతకోపం తెచ్చుకుంటావెందుకూ? నీతోవచ్చిన చిక్కేయిది. ఎంతసేపూ నిన్ను మెచ్చుకోవాలి తప్పితే విమర్శించకూడదంటావు," అన్నాడు.

"నేనంత మూర్ఖురాలినా మాష్టారూ ? నన్ను విమర్శించి నా తప్పొప్పులు చెప్తూవుండమనేకదా అడుగుతూంటాను."

"ఏమో మోహినీ! నీతరహా అంతా వేరు! కాలికివేస్తే మెడకీ – మెడకివేస్తే కాలికీ వేస్తావు. మీ అక్కయ్యలేదూ! ఏం చెప్పినా వింటుంది. రెండు చివాట్లువేస్తే పడుతుంది — వీళ్ళందర్నీ చూడరాదూ? ఎంత వినయంగా వుంటారు!"

మాష్టారి మాటలు వింటోన్నకొద్దీ దారుణంగా తోచాయి. అణుచుకోలేనంత కోపం వచ్చేసింది మోహినికి —

"నేను ఫలానా తప్పుచేశానని చెప్పండి. వీళ్ళందరి ఎదటా క్షమాపణ చెప్పుకుంటాను. దానికి నేనేం సిగ్గుపడను – అనవసరంగా నన్ను పదిమంది మధ్యా అవమానం చేస్తున్నారు."

రామశాస్త్రి వెటకారంగా చూస్తూ — "పదిమందీ ఎవరు? నీతోపాటు నాట్యం నేర్చుకొంటోన్న వాళ్ళంతా నీకిప్పుడు పరాయివాళ్ళై పోయారా? రేపోమాపో వాళ్ళూ

నీ స్థాయికి వస్తారు.'' అన్నాడు.

"తప్పకుండా రావాలి. నా స్థాయి కే కాదు. నన్ను మించి పోవాలికూడా. అర్జునుడు తనకంటే గొప్పవాళ్ళనుచూసి అసూయతో కుళ్ళిపోయినట్టు నేను ఒకరి ఔన్నత్యం చూసి బాధ పడను.

"విదేశాలు వెళ్ళివచ్చిన దాన్నని దురుసుగా మాట్లాడటంకూడా నేర్చుకున్నావా? నీవయస్సుకి అర్జునుణ్ణి విమర్శించటం ఏమిటి?" తీక్షణంగా చూస్తూ అన్నాడు మాష్టారు.

"అబ్బ! ఎందుకొచ్చినగొడవ మోహినీ! వూరుకో. మాష్టారితో తర్కించటం బావుండదు." అంది నెమ్మదిగా వసుంధర.

మోహిని ఎంత కోపం వున్నా ఏమీ మాట్లాడలేక పోయింది. రెండునిముషాలు నించుని - "వెళ్తాను మాష్టారూ! మీకోసారి కన్పించాలని వచ్చాను." అని హోల్డోంచి వెళ్ళి పోయింది.

"చూడండి ఆగర్వం! గురువు అంటే వినయం అదీ ఏమైనావుందా!" అంటూ వెనకాల రామశాస్త్రి మిగతా వాళ్ళతో చెప్పి వెటకారం చెయ్యటం మోహినికి తెలియలేదు. ఆలోచనలతో తల బద్దలుకొట్టుకొంటూ యింటికి వచ్చింది. మోహిని - "           ! మాష్టారు చాలా కొ తగా మారి పోయినట్టు అన్పించింది నాకు," అంది.

"ఏమిటి? ఏమైంది?" ఆశ్చర్యంగా చూసింది పద్మిని.

"ఓసారి మాష్టారికి కన్పించిరావాలని వెళ్లానా? విశేషాలేమిటని అడగలేదు సరిగదా, ఏవో పాతసంగతులు తెచ్చి

వెటకారంగా మాట్లాడటం మొదలుపెట్టారు. ఫారెన్ వెళ్ళి వచ్చినందుకు మిడిసిపడుతున్నానట. మిగతా స్టూడెంట్సుని నేను తేలిగ్గా చూస్తున్నానన్నభావం వాళ్ళలో కలిగించి వాళ్ళంతా నన్ను అయిష్టపడేలాగా పరిస్థితంతా క్రియేట్ చేశారు," అంటూ జరిగిన సంగతంతా చెప్పింది.

పద్మినికికూడా మాష్టారి ప్రవర్తన వింత కలిగించినా – "పోనీ మోహినీ! మాష్టారేమైనా చికాకులోవుండి అలా మాట్లాడారేమో! అంతేగానీ నువ్వంటే ఆయనకు చాలా యిష్టం. ఆమాట ఆయనే ఎన్నోసార్లు అన్నారుకదా!" అంది.

"నిజమే, కాదని నేనూ అనను. కానీ ...."

"కానీలేదు, ఏమీలేదు, అలా మనస్సు పాడుచేసుకోకు. మాష్టారు చనువుగా రెండు తిడితే తిట్టారే! అంతమాత్రాన మనకేం సిగ్గుచేటా?"

"అదికాదక్కయ్యా! ఉత్తపుణ్యానికే తిట్టటం ఎందుకూ అంటాను."

పద్మిని నవ్వుతూ అంది – "ఉత్తపుణ్యానికి కాదుగా? నువ్వు పెంకిగా జవాబులు ఇస్తావని అంటున్నారుగా?"

మోహిని మాట్లాడకుండా వూరుకుంది.

* * *

రామశాస్త్రిలో మార్పు దినదినాభివృద్ధి చెందటం మోహినికి స్పష్టంగా తెలుస్తోనేవుంది.

ఆయన రెగ్యులర్‌గా ట్యూషన్ చెప్పటంలేదు. కొత్త ఐటమ్సేవీ కంపోజ్ చెయ్యటంలేదు. కనీసం అలాంటి అభిప్రాయం కూడా కనపరచటంలేదు. ఎంతసేపూ తన డాన్స్ స్కూలుకి

స్టూడెంట్స్‌ని చేర్చుకోవటం — వాళ్ళలో కాస్త పెద్ద పెద్ద వాళ్ళతో ప్రోగ్రామ్స్ ఇప్పించటం తప్పితే - మరో విషయం మీద ఆయన దృష్టి ప్రసరించటం లేదు. ఓసారి మోహిని కొత్త వాటిగురించి అడిగితే నిర్లక్ష్యంగా నవ్వేస్తూ - "చూద్దాం లే, కంగారేమిటి?" అన్నాడు.

"చాలా డల్ గా వుంటోంది మాస్టారూ!" అంది మోహిని కొంచెం ధైర్యంచేసి.

"పాతవన్నీ ప్రాక్టీస్ చేస్తున్నావా? కొత్తవాటి మీద మోజుతో నేర్చుకున్నవన్నీ మర్చిపోయావా?"

మోహిని తెల్లబోయింది. మాస్టారు ఎందుకో చాలా నిర్లక్ష్యంగా - చౌకబారుగా కూడా మాట్లాడుతున్నారు. ఎంత సేపూ మిగతా స్టూడెంట్సు ఎదట ఇన్సల్ట్ చెయ్యాలనే ప్రయత్నిస్తున్నారు.

ఇదంతా ఏమిటి? మాస్టారికి తనంటే యిష్టంలేదా? ఒకప్పుడు తనపట్ల ఎంతో గాఢంగావున్న అభిప్రాయం ఎందుకు పోయింది? ఎలా పోయింది? తనేమైనా తప్పుచేస్తోందా? కొత్తకొత్త నాట్యాలు నేర్పమని అడగటమేనా అపరాధం? లేకపోతే నెలలకొద్దీ - సంవత్సరాలకొద్దీ యిలా అడుగులూ - హస్తాలూ నేర్చుకుంటూ వుండాల్సిందేనా? అసలు మాస్టారి దగ్గిర విద్యలేదా?—తన అనుమానానికి తనే తృళ్ళిపడింది మోహిని.

ఉత్సాహంగా నేర్చుకోవాలని కోరే శిష్యులకు విద్య నేర్పకుండా ఏ గురువు వుండగలడు? కష్టపడి నేర్చుకోవాలని తను సిద్ధంగావుంటే రెండేసి నెలల్కో మూడేసి నెలల్కో ఒకో—

చరణం నేర్పటం ఏమిటి? మాష్టారు సిన్సియర్‌గా నేర్పివుంటే ఈసరికి ఆయనతో సమానమైన స్థాయికి వచ్చేదికాదా తను! ఒక శిష్యురాల్ని తన స్థాయికి తీసుకురావటం మాష్టారికి యిష్టం లేదా ?

ఆలోచిస్తోన్నకొద్దీ - మాష్టారి అంతరంగమంతా అర్థమైపోతోన్నట్టు తోచింది మోహినికి. సరే! ఈ విషయంలో ఇంకా జాప్యం చెయ్యటం వివేకంకాదు.

మరోకసారి మోహిని మాష్టారితో కొత్త ఐటమ్స్ గురించి మాట్లాడబోయింది.

రామశాస్త్రి విసుగ్గా నొసలు చిట్లించాడు - "నువ్వు రోజుకోసారైనా నన్ను హెచ్చరిస్తున్నావు. నువ్వు గురువువో నేను గురువునో అర్థంకావటంలేదు."

"నేను గురువునెలా అవుతాను మాష్టారూ? నేను గురువునైతే మిమ్మల్నిలా ప్రాధేయపడటం ఎందుకూ?" అంది మోహిని. మాష్టారితో కొంచెం నిర్మొహమాటంగా నే మాట్లాడి వ్యవహారం తేల్చుకోవాలన్న వుద్దేశ్యంతో వుంది మోహిని.

"నన్ను ప్రాధేయపడటం నీకు తలవంపుగా వుందన్న మాట. అవునులే అమ్మాయ్! నీవు చాలా గొప్పదానివయ్యావు. నీకు గురువుతో మాట్లాడటంకూడా నామోషి అవుతోంది."

"మాష్టారూ ! మీరు చాలా అన్యాయంగా మాట్లాడుతున్నారు. నేను గొప్పదాన్ని అయ్యాననుకుంటే అది మీ అభిమానంవల్లే. ఎంత గొప్పదాన్నయినా ఆ గొప్పతనం గురువుగారిముందు ప్రదర్శిస్తానా ?"

"మరి నువ్వు చేస్తోంది ఏమిటి ? నీకు కొత్తవి నేర్పాలని నాకు తెలీదా ? రోజూ నన్నెందుకిలా వేధిస్తావు ? నీవు ఒక్క-దానివేనా నాస్టూడెంటువి ? అందరికీ చెప్పాలి. అందరి అభివృద్ధి చూడాలి."

"అదంతా కాదని నేననగలనా మాస్టారూ ! నా ఉత్సాహం కొద్దీ నేనడుగుతున్నాను. నెలలకు నెలలే వృథాగా గడుస్తున్నాయి. ఇలా టైమ్ వేస్ట్ చేయటం నాకిష్టంలేదు. రేపు స్కాలర్ షిప్ యిచ్చినందుకు గవర్నమెంట్ వారు టెస్ట్ పెడితే నేనేం చేస్తాను."

"డొంకతిరుగుడుగా మాట్లాడకపోతే నీవుద్దేశ్యం సూటిగా చెప్పరాదూ, నాకు జీతం యిస్తున్నావనేగా ఈ అధికారం అంతానూ. ఇదిగో చూడమ్మాయ్! ఇదివరకు అయితే నీస్వంత డబ్బు యిచ్చావు. ఇప్పుడు నువ్వుతిన్నా నేనుతిన్నా ప్రభుత్వానిదేగా? మరేం ఫర్వాలేదు."

మోహిని అసహ్యంతో ఎంతోసేపు మాట్లాడలేక పోయింది.

"మీరింత దారుణంగా మాట్లాడతారని నేనెప్పుడూ అనుకోలేదు మాస్టారూ! ప్రభుత్వం నాకు స్కాలర్ షిప్ యిస్తోంది అంటే దాన్ని సద్వినియోగం చేసుకోవాల్సిన బాధ్యత నాది. నేను మిమ్మల్ని విద్యనేర్పమని అడుగుతున్నాను, అంతే. దానికి మీరెందుకింత రాద్ధాంతం చేస్తున్నారో నాకర్థం కావటంలేదు."

రామశాస్త్రి మండిపడ్డాడు "రాద్ధాంతం చేస్తోంది నేనుకాదు, నువ్వు! పూర్వం నాతో నువ్వు ఎప్పుడూ యిలా

మాట్లాడలేదు. స్కాలర్ షిప్పు తెచ్చుకున్నాననే గర్వంవచ్చింది నీకు. విమానాలెక్కి విదేశాలెళ్లాననే అహంకారమూవుంది. అదంతా నేను కనిపెడుతూనే వున్నాను. ఇక నీకు డాన్సులు నేర్పటం నావశంకాదు నీవుత్సాహం అంతా తీరేలాగా మరెవరి దగ్గిరైనా నేర్చుకో. గబగబా గొప్పదానివైపో."

మోహిని మనస్సంతా అసహనంతో - అవమానంతో దహించుకుపోయింది - నిస్సంకోచంగా మాస్టారికేసి చూస్తూ అంది-"చాలా సంతోషం మాస్టారూ! ఇప్పటికైనా మీమనస్సు తేల్చిచెప్పారు.

ఒక శిష్యురాలు గురువుకి ఎంత ఎక్కువ గౌరవం యివ్వగలదో అంతా యిచ్చాను. ఎంత అభిమానంగా పూజించగలదో అంతా చేశాను. కానీ నాఔన్నత్యం మీకు కంటకింపుగా వుంది. నేను మిమ్మల్ని మించిపోతానేమోనన్న భయం పట్టుకుంది. నాస్థితి పాడుచెయ్యాలని మీ శక్తికొద్దీ ప్రయత్నిస్తున్నారు - నన్ను ఎప్పటికీ గొప్పదాన్ని చెయ్యకూడదని కంకణం కట్టుకున్నారు. ఇదంతా నేనుకూడా అర్థంచేసుకున్నాను. నేనిలా ధిక్కరించటం మీకు చాలా కష్టంకలిగిస్తుంది. క్షమించండి — ఇక వెళ్తున్నాను మాస్టారూ! నమస్కారం!" - మాస్టారికో నమస్కారంచేసి ఒక్క క్షణంకూడా నిలబడకుండా ఇంట్లోంచి బయటికి వచ్చింది మోహిని.

అంతా తాతయ్యకిచెప్తే ఎప్పటిలా నిదానంగా నవ్వుతూ - "ఇద్దరూ ఆవేశపడ్డారు. రెండురోజులు మాస్టారింటికి వెళ్ళకు. అదే సర్దుకుంటుంది." అన్నాడు.

మర్నాడే బలరామయ్యపేర రామశాస్త్రి రాసిన

వుత్తరం వచ్చింది. అందులో చాలా క్లుప్తంగా - పరిస్థితి వివరించాల్సిన అగత్యం తనకేం లేనట్టు రెండే రెండు వాక్యాలు రాశాడు -

"బలరామయ్యగారూ!

మీ మోహినికి నేను నాట్యం నేర్పలేను. వేరే గురువును కుదుర్చుకోండి. పెద్దవారని మీకు ప్రత్యేకంగా రాస్తున్నాను.

సెలవు!

రామశాస్త్రి"

ఆ వుత్తరం చదివితేగానీ వ్యవహారం అంత సీరియస్‌గా అయుందని బలరామయ్యకు అర్థం కాలేదు. కంగారుగా వుత్తరం మనమరాలికిస్తూ - "ఏమిటమ్మా యిది? నిజంగా మాస్టారికి కోపం వచ్చిందా? అంత మనస్సు విరిగిపోయినట్టు రాశాడేమిటి?" అన్నాడు.

మోహిని వుత్తరం చదివి తల ఎత్తుతూ- "విరిగింది ఆయన మనస్సుకాదు తాతయ్యా! నాది. గురువుని ప్రార్థించి విద్య నేర్చుకోవాల్సిన బాధ్యత శిష్యులకేగాక— శిష్యుల్ని అభిమానించి విద్య నేర్పాల్సిన అవసరం గురువుకి కూడా వుండాలి. అదిలేకపోయాక ఇక ఈగురుశిష్య సంబంధం సాగేదికాదు. ఈక్షణంతో తెగిపోయింది" - పైకి వెళ్ళిపోయింది మోహిని. చాలాసేపు వెర్రి పట్టినట్టు తిరిగింది. మాస్టారికి తనంటే ఎందుకింత ద్వేషం! ఏం అపరాధం చేసిందనీ? ఇప్పుడు కర్తవ్యం ఏమిటి? తనకి కావలసింది విద్యగానీ పిచ్చిగా గురువుని ఆరాధించటం కాదు. - ఒక్క నిట్టూర్పుతో గతాన్నంతా విస్మరించింది. టేబుల్ ముందు కూర్చుని కలం

కాయితం తీసుకుంది—

"మాస్టారు చాలా బిజీగా వుంటున్నారు. నాకు డాన్స్ నేర్పలేని పరిస్థితిలో వున్నారు. నేను మరొక గురువు దగ్గిర విద్య నేర్చుకోటానికి అనుమతి యివ్వవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను-" అంటూ ప్రభుత్వం వారికి వుత్తరం రాసింది.

ఉత్తరం పూర్తిచేసేసరికి చాలా సంతృప్తి కల్గింది. ఉత్తరం అక్కయ్యకి చూపించాలని ఆతృతగా బయటికి వస్తే పద్మిని యింట్లో ఎక్కడా కన్పించలేదు. రాజమ్మ నడిగితే - "ఇప్పుడే బయటికి వెళ్ళిందమ్మా!" అంది.

అక్కయ్య ఎక్కడికి వెళ్ళిందో వూహించగల్గిన మోహిని నిరాశగా నిట్టూర్పు విడిచింది.

*　　*　　*

గోపాల్ కొత్తగా గీసిన 'వెన్నెల రాత్రి'ని పరవశంగా చూస్తూ కూర్చుంది పద్మిని.

ఆచిత్రం ప్రశాంత సుందరమైన ఒక వెన్నెలరాత్రిని కన్నులముందు పరిచిపెడుతోంది.

పద్మాలతో నిండిన సరోవరం మీదా - పచ్చికబయలు మీదా వెన్నెల వర్షం కురుస్తోంది. పద్మాల రేకులూ - చెట్ల ఆకులూ- పచ్చిక తీసెలూ- నీటి వుపరితలం- అంతా వెన్నెల కిరణాలు పడి తళతళా మెరుస్తున్నాయి. తెల్లటి మబ్బులమీదుగా ఒక దేవకన్య- తెల్లని బట్టలలో తేలియాడుతూ ఎగిరి వస్తోంది. ఆమె చేతిలో ఒక తెల్లని పుష్పం వుంది. అర్ధనిమీలిత నేత్రాలతో పుష్ప సౌరభాన్ని ఆఘ్రాణిస్తూ - ఎవరికోసమో భూమి

మీద – అన్వేషిస్తూ వెన్నెల విహారం చేస్తోంది. చంద్రమామ మందహాసాలతో – వెన్నెల స్నానంచేస్తోన్న ఆ సుందర ప్రకృతి చిత్రణలో గోపాల్ సృజనశక్తిని గ్రహించి పద్మిని ముగ్ధురాలైంది.

"గోపాల్ ! ఈ దేవకన్య ఎవరు ?"

"ఒక అదృష్టవంతుడి ప్రియురాలు."

"ఈమె భూమిమీదికి దిగుతుందా?" కళ్లెత్తి నిర్లిప్తంగా చూస్తూ అడిగింది పద్మిని.

గోపాల్ పద్మిని కళ్ళల్లోకి గుచ్చి చూస్తూ అన్నాడు– "అదే నాకూ అర్థంకాలేదు పద్మా! నువ్వు చెపుతావనే నేను ఎదురు చూస్తూన్నాను."

పద్మిని చిరునవ్వు చిందిస్తూ అంది – "ప్రియుడు కంటికి కనుపించిన మరుక్షణంలోనే భూమిమీదికివచ్చి వాలుతుంది. అంతవరకూ అలా నిరీక్షిస్తూ ఆకాశ హర్మ్యాలలో విహరించక తప్పదు."

"పద్మా!" పద్మినిని గాఢంగా హత్తుకొంటూ తమకంతో చెక్కిలి ముద్దుపెట్టుకున్నాడు గోపాల్ – "ఒక ప్రశాంతమైన వెన్నెలరాత్రి – ఒక సరోవరం ఒడ్డున – ఒక పూలతోట ప్రక్కన – అలా ఇహలోకం మరిచి స్వర్గసీమలో విహరించాలని ఎంతో ఎంతో కోరికగా లేదూ?"

పద్మిని మాట్లాడలేదు.

"మాట్లాడు పద్మా!"

ఆ లాలన పద్మినిని వివశురాల్ని చేసింది –మాట్లాడ లేని అశక్తతతో మధురవూహాలతో మైమరచి గోపాల్ కౌగిట్లో

ఒదిగిపోయింది.

*　　*　　*

ఒకరోజు ఎర్రటి ఎండ వేళ రామశాస్త్రి కళానిలయానికి పరిగెత్తుకు వచ్చాడు. ఆయన జేబులోంచి ఒక వుత్తరం బయటికి తీసి కంగారు వ్యక్తంచేస్తూ బలరామయ్యకు అందించాడు. మోహిని ఇంగ్లీషు వుత్తరాన్ని చదివి తాతయ్యకు వివరంగా చెప్పింది—"మాష్టార్ని మార్చుకుంటానని నేను రాసిన వుత్తరం అందిందికదా ? ప్రభుత్వం ఇప్పుడు మాష్టార్ని నిజానిజాలు అడుగుతోంది."

రామశాస్త్రి గాంభీర్యం తెచ్చిపెట్టుకొంటూ — "ఇంత తొందరపడతావని అనుకోలేదమ్మాయ్ !" అన్నాడు.

"ఇందులో నేనేం తొందరపడ్డాను మాష్టారూ ? మీరు నాకు నేర్పనన్న తర్వాత మరో గురువుని చూసుకోవాలికదా?" అంది మోహిని ముభావంగా.

"ఆరోజేదో మాటామాటా వచ్చింది. ఏదో అనుకున్నాం. అంతమాత్రాన నీలాంటి శిష్యురాల్ని నేనుమాత్రం ఒదులుకుంటానా ?"

ఊసరవెల్లిలా రంగులుమార్చే తత్వం మనుషుల్లో వుండటం చాలా దారుణం - మాష్టార్ని చూస్తే ఎలాంటి సదభిప్రాయమూ కలగలేదు మోహినికి.

"ఇప్పుడు నేనుమాత్రం ఏంచేయగలను?" అంది.

"నువ్వు చెయ్యాలనుకుంటే ఏమైనా చెయ్యగలవు."

కానీ మాష్టారూ! మొట్టమొదట మీదగ్గిరే నేర్చుకుంటానని రాశాను. తర్వాత గురువుని మార్చుకుంటానని

రాశాను. ఇప్పుడు మళ్లా మీదగ్గిరే నేర్చుకుంటానని రాస్తే నిజంగా నాకు మతి చలించిందనుకుంటారు. ఇక నాచేతిలో వున్నదేమీ లేదు."

రామశాస్త్రి కోపం అణుచుకొంటూ - "అసలు నీకు నాదగ్గిర నేర్చుకోవటం ఇష్టంలేదని చెప్పరాదూ!" అన్నాడు.

"ఆమాటా నిజమే. ఇకమీదట నాకు మీదగ్గిర నేర్చుకోవటం యిష్టంలేదు. మీకు శిష్యరికం చేయటం వృథా అని నాకు బాగా తెలిసిపోయింది."

రామశాస్త్రి కోపం అంతా వెళ్ళగక్కాడు -

"ఇష్టంలేదంటే సరిపోదు. నన్ను మార్చటానికి ప్రభుత్వం ఛస్తే ఒప్పుకోదు."

మోహిని నూటిగా చూస్తూ అంది — చూడండి మాష్టారూ! గురుశిష్యులబంధం అధికారాలతో కట్టుబడేది కాదు. మిమ్మల్ని మార్చటానికి ప్రభుత్వం అంగీకరించకపోతే నేను స్కాలర్‌షిప్ వదిలేసుకుంటాను. మీదగ్గిరమాత్రం నేర్చుకోను."

రామశాస్త్రి ప్రూన్పడి పోయాడు.

మోహిని మళ్ళా అంది - "ఒకప్పుడు మీరు నన్ను ఎంత నిర్మలంగా ప్రేమించారో నేను మర్చిపోను. అలాగే నన్ను మీరూ మర్చిపోలేరు. ఆ దశ నా అభివృద్ధికి ప్రథమ సోపానం అవుతుంది నమస్కారం!" చెమర్చుతోన్న కళ్ళతో గబగబా లోపలికి వెళ్ళిపోయింది.

"శాస్త్రిగారూ! మీరేం బాధపడకండి. పోనీ ఆ గవర్న మెంటువారికి ఎలా రాయాలో మీరు రాయండి." అంటూ

బలరామయ్య చెప్తోన్నమాటలు గాలికి వదిలేసి రామశాస్త్రి విసవిసా నడిచి వెళ్ళిపోయాడు.

కొన్నాళ్ళకి - ప్రభుత్వం నుంచి మోహినికో వుత్తరం వచ్చింది.

"నీ గురువునుంచి మాకు జవాబు అందింది. ఆ జవాబు వల్ల గతంలో నువ్వు రాసినదంతా అబద్ధం అని తెలుస్తోంది. నీ గురువు నీకు విద్యనేర్పాలని ఎంత కుతూహలపడినా-నువ్వే నేర్చుకోటానికి బొత్తిగా ఆసక్తి కనపరచక జాప్యం చేస్తున్నావని తెలిసింది. కాబట్టి వెంటనే ఈవిషయంలో నీసంజాయిషీ యిస్తూ- ఇంతకాలం బాండుకి వ్యతిరేకంగా ప్రవర్తించినందుకు గాను - నువ్వు పొందివున్న స్కాలర్‌షిప్పు సొమ్ము మొత్తం వాపసు చేయవలసి వుంది."

ఆ వుత్తరం చదివితే కోపంతో-ఆశ్చర్యంతో తాతగారికీ మనమరాలికీ మతిపోయింది.

"ఎంత దుర్మార్గం! అక్రమంగా గురువు ఒక శిష్యురాల్ని ఇలా రచ్చకెక్కిస్తాడా!" అంటూ మండిపడ్డాడు బలరామయ్య.

మోహిని ఈనినపులిలాగా బుర్ర బద్దలుకొట్టుకొంటూ తిరిగింది - "తాతయ్యా! ఇప్పుడేవస్తానుండు," అంటూ గాలి దుమారంలా పైకి వెళ్ళింది. డెస్కులాగి కాయితాలన్నీ చిందర వందర చేసి వెదికింది.

"దొరికింది, దొరికింది." అంటూ వెర్రికేక లేసూ క్రిందికి పరిగెత్తింది.

"తాతయ్యా! ఈ వుత్తరం చూడు."

"బలరామయ్యగారూ!

మీ మోహినికి నేను నాట్యం నేర్పలేను. వేరే గురువుని కుదుర్చుకోండి. పెద్దవారని మీకు ప్రత్యేకంగా రాస్తున్నాను.
— రామశాస్త్రి."

ఉత్తరం చదివితే బలరామయ్యకు పుట్టెడు సంతోషం కలిగింది.

"తాతయ్యా! ఈ వుత్తరం జతపరుస్తూ ఇప్పుడే ప్రభుత్వం వారికి జవాబు రాసాను. గురుశిష్యులలో ఎవరు బాండుకి వ్యతిరేకంగా వెళ్లారో - ఎవరు ఎవరికి సంజాయిషీ చెప్పుకోవాలో ప్రభుత్వం గుర్తిస్తుంది." అంటూ చకచకా పైకి వెళ్ళిపోయింది మోహిని.

రామశాస్త్రి ఆట కట్టింది.

ప్రభుత్వం నిరభ్యంతరంగా మోహిని గురువుని మార్చటానికి ఒప్పుకొంది.

మోహిని "కళాశిఖర"లో కౌముదీబాయికి శిష్యురాలిగా చేరింది.

డాన్సు ట్యూషన్ ఆగిపోయాక పద్మినికి చాలా నిశ్చింతగా వుంది.

"అక్కయ్యా! నువ్వుకూడా కళాశిఖరలో నేర్చుకోరాదా?" అంది మోహిని చాలాసారు.

"చూద్దాంలే మోహినీ కొన్నాళ్ళు పోనిద్దూ! అంటూ నిర్లక్ష్యం ప్రకటించింది పద్మిని. పద్మినికి మళ్ళీ ఆ చికాకుల్లో చిక్కుకోవటం ఎంతమాత్రం యిష్టంలేదు.

రోజంతా గోపాల్ కోసం నిరీక్షించటంలో ఎంత మాధుర్యం వుంది! గోపాల్ చేయిపట్టుకుని వెకొండలలోనో-

కోనలలోనో - సముద్రాల అంచునో సంధ్యాసమయాలు గడిపేస్తోంటే - గోపాల్ విడిచే వెచ్చటి నిట్టూర్పులు చెంప లకు తాకుతోంటే - గోపాల్ హస్తాలు ఆవేశంగా పెనవేసు కొంటే... యుగాలు క్షణాలై దొర్లిపోవా? గోపాల్ సన్నిధి స్వర్గసీమ కాదా?

పద్మినికీ - మోహినికీ కూడా ఇరుమడించిన ఉత్సా హంతో గడుస్తున్నాయి రోజులు. మోహిని కౌముదీబాయి గురుత్వంలో మొదటి సంవత్సరం పరీక్షకు ప్రదర్శన యిచ్చి స్కాలర్‌షిప్ పొడిగించబడే అనుమతి పొందింది.

* * *

"రాజమ్మా! ఆకలేస్తోంది, అన్నంపెట్టు" అంటూ కాళ్ళు కడుక్కుని హడావిడిగా వచ్చింది మోహిని. రాజమ్మ అన్నం వడ్డిస్తోంటే - "అక్కయ్య తినేసిందా అని అడిగింది."

"పైకి తీసుకురమ్మని చెప్పిందమ్మా! నాగరాజు యిచ్చి వచ్చాడు. రెండు రోజులనుంచీ పైనే తింటోంది. ఏం తిండిలే! పెట్టింది పెట్టినట్టే వదిలేసోంది."

"ఏం? అసలేమైంది? ఒంట్లో బాగాలేదా?"

"నాకూ తెలీదమ్మా! అసలు కిందికే రావటంలేదు. పొద్దున్నే స్నానంచేసి వెళ్ళిందంతే... అప్పుడప్పుడూ టెలి ఫోను దగ్గిరికి మాత్రం వచ్చివెళ్తోంది. ఎవరైనా తనని పిలిస్తే వచ్చి చెప్పమంది. ఏవిటో పెద్దమ్మాయుంతా బధకం మనిషి," అన్నంగిన్నె పట్టుకుని వంటింట్లోకి పోయింది రాజమ్మ.

మోహిని అన్నం దగ్గిర్నుంచి లేచి గబగబా పైకి వెళ్ళింది.

"అక్కయ్యా !" అంటూ పద్మిని గదిలోకి వెళ్ళింది. అన్నం కూరలూ అన్నీ టేబుల్‌మీంద మూతలుపెట్టి అలాగే వున్నాయి. పద్మిని మంచంమీద పడుకుని నిద్రపోతోంది. లేపటానికి సంకోచిస్తూనే- నెమ్మదిగా "అక్కయ్యా !" అంటూ పిల్చింది. పద్మిని వులిక్కిపడ్డట్టు కళ్ళువిప్పింది.

"అక్కయ్యా! అన్నంతినకుండా నే పడుకున్నా వేమిటి?"

పద్మిని ఒత్తిగిలి పడుకుంటూ అంది - "తింటాలే."

"ఇంకెప్పుడు తింటావు? చల్లగా చల్లారిపోతోంది అన్నం. పోనీ కిందికిరా రాదూ? ఇద్దరం కలిసి తిందాం."

"అబ్బ! నే నిప్పుడేమీ తినలేనే! నువ్వు వెళ్ళి భోంచెయ్యి."

"తినలేకపోవటం ఏమిటి? ఆకలి వెయ్యటం లేదూ?"

"లేదు. నాకొంచెం ఒంట్లో బాగాలేదు.

"ఏం బాగాలేదు? పోనీ డాక్టర్‌గారిదగ్గిరికి వెళ్ళక పోయావా?"

"అబ్బే ! అంత జబ్బేంలేదు. కొంచెం రొంప - తల నొప్పి... అంతే. డల్‌గా వుంది. పోనీ ఈపూటకి అన్నంమానేస్తే మంచిదని వూరుకున్నాను."

"అయితే రొట్టి తినరాదూ ? నాగరాజుని తెమ్మని చెప్పనా?"

"రొట్టీవద్దు, నా నెత్తీవద్దు. కొంచెం వేడి వేడిపాలు తెమ్మని చెప్పు. చాలు."

"రెండు ఆస్ప్రోమాత్రలూ - పాలూ పంపిస్తాలే."

మోహిని కిందికి వెళ్ళిపోయింది.

తర్వాత నాగరాజు వచ్చి పాలూ మాత్రలూ యిచ్చి

అన్నం కూరలూ కిందికి తీసుకుపోయాడు. పద్మిని తలనొప్పి మాత్రలు రెండూ కిటికీలోంచి విసిరేసి - పాలు కొంచెం తాగి మిగతావి కిటికీలోంచి బయటికి ఒంచేసి ఖాళీగ్లాసు టేబుల్ మీద పెట్టి మళ్ళాపడుకుంది.

మోహిని అన్నం తినేసి పైకి వచ్చింది -

"తలనొప్పి ఎలావుంది? కొంచెం తగ్గిందా?" అంది.

"అదే తగ్గుతుందిలే. నాకు బాగా నిద్రవస్తోంది, నన్ను నిద్రపోనీ బాబూ!" అంటూ తెల్లటి దుప్పటి మడతవిప్పి ముసుగు పెట్టింది.

కళాశిఖరలో విశేషాలేవో చెప్పాలని వుత్సాహంగా వచ్చిన మోహిని - "సరే! పడుకో." అంటూ వెళ్ళిపోయింది.

పద్మిని రెండురోజులు తినీతినకుండా మేడమీదే పడు కుంది.

"అక్కయ్యా! తాతయ్యని చూడ్డానికి డాక్టరుగారు వచ్చారు. ఒక్కసారి కిందికివచ్చి నువ్వూ చూపించుకో రాదూ?" అంటూ పైకి వచ్చింది మోహిని.

పద్మిని తెల్లబోతూ - అంతలోనే చెల్లెలిమీద కోపం తెచ్చుకుని — "చాల్లే, వూరుకో, నా కేమైందనుకున్నావు? ఈ రెండురోజులూ కాస్త బద్ధకంగా వుందని పడుకున్నాను. అంతేగానీ .... డాక్టర్లూ మందులూ ఎందుకూ?" అంటూ విసుక్కొంది.

"సరే! నీయిష్టం," అనేసి వెళ్ళిపోయింది మోహిని. సాయంత్రం కళాశిఖరనుంచి తిరిగివస్తూ మోహిని అంది - "అక్కయ్యా! కళాశిఖర కెవరో గెస్ట్స్ వస్తున్నారట. కౌముది

బాయిగారు నన్నో ప్రోగ్రాం యిమ్మంటోంది. నీ మాటకూడా చెప్తే తనకేం అభ్యంతరంలేదంది. నువ్వీమధ్య పూర్తిగా మానేసి వూరుకున్నావు, ఈ నాలుగురోజులూ ప్రాక్టీసుచేసి ....''

"నువ్వు చూస్తూనే వున్నావుక దే మోహినీ! నాకు చాలా చిరాగ్గా వుంటోంది. ఏపనీ చెయ్యబుద్ధికావటంలేదు. ఆఖరికి పుస్తకాలుకూడా చదువుకోబుద్ధి పుట్టటంలేదు."

మోహిని ఆశ్చర్యంగా నుదురు చిట్లిస్తూ - "పొద్దుట డాక్టర్‌కి చూపించుకోమంటే జబ్బేం లేదన్నావ్? తీరా డాన్స్ మాటచెప్తే ఏవేవో వంకరువుపెడ్తున్నావ్, ఛా! నీధోరణి నాకేం అర్థంకావటం లేదక్కయ్యా! ఎవరైనా మనస్సువిప్పి మాట్లాడాలిగానీ లేకపోతే ఏంతెలుస్తుంది?" అంటూ విసుక్కుంటూ లేచి వెళ్ళిపోయింది.

పద్మిని నిర్లిప్తంగా ఆకాశంలోకి చూస్తూ కిటికీదగ్గర కూర్చుంది గంటలకొద్దీ.

రాత్రి పదకొండు గంటలు దాటింది.

మోహిని పుస్తకంమూసి పక్క సర్దుకొంటూ గుమ్మం కేసి చూసింది. గుమ్మాన్ని పట్టుకు నిలబడివున్న పద్మిని ఎంతో నీరసంగా - దీనంగా - ఎన్నడూ లేనంత వుదాసీనంగా కన్పించింది.

"అక్కయ్యా! అదేమిటి అలా నిలబడ్డావు? ఇలావచ్చి కూర్చో." ప్రయత్నరహితంగానే మోహిని కంఠంలో ఆర్ద్రత చిందింది.

పద్మిని గాలిలో తేలుతోన్నట్టు బలహీనంగా అడుగులు వేస్తూ వచ్చి పక్కమీద కూర్చుంది.

"అక్కయ్యా! సరిగ్గా చెప్పవే? ఎందుకంత దిగులుగా

వుంటున్నావు ?" మోహిని అక్కయ్య మొహమంతా తరిచి తరిచి చూస్తూ దగ్గిర కూర్చుంది.

"మోహినీ! నీకో విషయం చెప్పాలనే వచ్చాను. ఇంకా చెప్పకుండా వుండటం నావశం కావటంలేదు."

"ఏమిటది ?" ఆతృతపడింది మోహిని.

పద్మిని ఒక్కసారి గట్టిగా గాలి పీల్చుకుంది - "నువ్వు నన్ను అపహాస్యం చెయ్యకుండా అంతా వింటావుకదూ! నన్ను అర్థం చేసుకుంటావుకదే మోహినీ !"

"అదేమిటక్కయ్యా ! నేను నిన్నెప్పుడు మాత్రం ఎగతాళి చేశాను ? నీగురించే నేనెంతో ఆలోచిస్తూ వుంటాను. నువ్వే నన్ను అర్థంచేసుకోకుండా నిర్మొహమాటంగా మాట్లాడుతావు." సీరియస్‌గా చూస్తోన్న మోహినినిచూసి నిస్తేజంగా నవ్వింది పద్మిని.

"పోనీలే. ఎప్పుడైనా ఏమైనా అన్నానేమో!మనస్సులో వుంచుకోకే మోహినీ !"

"ఛ ! అదేంలేదు. నువ్వేదో మాటచెప్తానన్నావు చెప్పు."

"చెప్తాను. నీవుద్దేశ్యం ఏమిటో తెలుసుకోవాలనే ఈ విషయం బయటపెడుతున్నాను. గోపాల్... ఎక్కడికో వెళ్ళిపోయాడు."

అయోమయంగా చూసింది మోహిని — పద్మిని ఊహించినంత ఆశ్చర్యం ప్రకటించలేదు - "ఎక్కడికో వెళ్ళిపోవటం ఏమిటి ? నీకు అడ్రస్ అదీ ఇవ్వలేదా ?"

"అడ్రస్ యిస్తే ఈ ఆరాటం అంతా ఎందుకే! అతను

వెళ్ళిపోయిన రెండుమూడు రోజుల వరకూ ఆసంగతే నాకు తెలీలేదు. అప్పట్లో అతనికో వుత్తరంకూడా రాశాను. అది అందేవుంటుందో లేదోకూడా వూహించలేకపోతున్నాను."

"ఆ వుత్తరం ఏమని రాశావు?"

పద్మిని చెప్పకుండా వూరుకుంది.

ఆ విషయం విస్మరిస్తూ– "అతను పోయి ఎన్నిరోజులైంది?" అంది మోహిని.

"ఇవ్వాల్టికి నెలమీద నాలుగోరోజు."

"నెల్లాళ్ళయిందా!" ఆశ్చర్యంగా చూసింది మోహిని– "నెల్లాళ్ళనుంచీ ఒక్క వుత్తరమైనా రాయలేదా?"

పద్మిని అభిమానంతో తలదించుకొంది – "లేదు."

"అతను ఎక్కడికో వెళ్ళిపోయాడని నువ్వెందు కనుకుంటున్నావు."

"నేను వుత్తరం రాసినతర్వాత నాలుగురోజులు వూరుకున్నాను. అతను రానూలేదు. జవాబూ రాయలేదు. నా ఆత్రుతకొద్దీ అతను పనిచేసే ప్రెస్ ఆఫీసుకి ఫోన్ చేసి అడిగాను. వాళ్లేం చెప్పారంటే ..."

"ఏం చెప్పారు ?"

ఎండిపోతోన్న పెదవులు తడుపుకొంది పద్మిని –

"గోపాల్ అప్పటికి రెండుమూడు రోజుల క్రిందటే ప్రెస్‌లో వుద్యోగానికి రాజీనామా యిచ్చేసి వెళ్లిపోయాడట."

"రాజీనామా యిచ్చేశాడా? ఏం! ఎందుకు? ఏమైంది?"

"నేనూ అదే అడిగాను. మరే జాబ్‌లోనైనా జాయిన్ అవుతానని వెళ్ళారా ? మీకు తెలుసా!" అని ఎంత అడిగినా

'ఆవివరాలు మాకేం తెలీవు. స్టూప్రెస్‌లో మాత్రం అతనివ్వాడు పని చెయ్యటంలేదు.' అని ఖచ్చితంగా చెప్పేశారు. గోపాల్ ఈ విషయం నాకు మాటమాత్రం కూడా చెప్పలేదేమా అని ఆశ్చర్యపడుతూ ఆసాయంత్రం అతనిరూమ్‌కి వెళ్ళారు."

"ఏమన్నాడు ?"

పద్మిని ఒక్క-క్షణం చెల్లెలి మొహంకేసి చూసి తల దించుకుని నేలనూపులు చూస్తూ అంది- "నేను గదితలుపులు తట్టేసరికి ఎవరో కొత్తవ్యక్తి తలుపులు తీశాడు. నేను కంగారు పడుతోంటే నన్నుచూసి అతనూ కంగారుపడ్డాడు. కొంచెం తమాయించుకుని-

'ఈ గదిలో గోపాల్‌గారనీ....ఒకాయన వుండాలి...' అంటూ తడబడుతూ అడిగాను.

'నాకు తెలీదమ్మా! నేను నిన్ననే ఈ గదిలోకి వచ్చాను. ఇంటివారిని అడగండి. తెలుస్తుందేమో' అన్నాడు. నేను నమ్మలేక గదిలోకి చూశాను. చాలా వెలుతురుగావుంది. కిటికీని అంటిపెట్టుకున్న నైట్‌క్వీన్ మొక్కలు చాలాభాగం కొట్టేసి వున్నాయి. కిటికీలోంచి నీరెండకూడా పడుతోంది ... ఇక నమ్మక తప్పలేదు. గుండెలు బరువెక్కుతోంటే మరో వైపుగా వెళ్ళి సిగ్గుతో చితికిపోతూ ఇంటిగలావిడను అడిగాను-

'ఆ అబ్బాయి మొన్నరాత్రికిరాత్రి సామానదీ సర్దుకుని గది ఖాళీచేసేసి వెళ్ళిపోయాడమ్మా! వాళ్ళవూరో- ఎక్కడికో- వెళ్తున్నానని చెప్పాడు.' అందావిడ. నేనేం వింటున్నానో నాకు తెలియలేదు. ఆశ్చర్యంతో - దుఃఖంతో తల్లడిల్లిపోతూ ఎన్నో ప్రశ్నలడిగాను. ఆవిడ కేమీ తెలీదని చెప్పింది.

చెప్పటానికి విసుక్కుంది. విసుక్కుంటూనే చెప్పింది - వాళ్ళ బంధువుల కెవరికో బాగాలేదని వుత్తరం వచ్చిందట. స్టవ్వూ - పాతబట్టల పెట్టీ యింటి వాళ్ళకి యిచ్చేసి మరీ వెళ్ళిపోయాడుట. అంతకన్నా ఆవిడేం చెప్పలేదు.

ఇంకా గోపాల్ గురించి తెలుసుకోవటానికి ఏం చెయ్యాలో అర్థంకాలేదు. అతనికి ఇంకా ఫ్రెండ్సెవర్రైనా వున్నారో ఏమో కూడా నాకు తెలీదు. నాతోనే చెప్పని మనిషి మరో ఫ్రెండుతో మాత్రం ఏం చెప్తాడో నాకు నమ్మకమూ లేదు. ఎక్కడికి వెళ్లాడో ఎందుకు వెళ్ళాడో - గది ఖాళీచేసేసి - వుద్యోగానికి రాజీనామా ఇచ్చేసి - కనీసం ఫోన్ లోనైనా ఒక్కముక్క చెప్పకుండా - ఇంత హఠాత్తుగా ... ఆలోచనలతో బుర్ర బద్దలు కొట్టుకొంటూ యింటికి వచ్చాను - కానీ నాకు లోలోపల చాలా ధైర్యం వుంది. గోపాల్ అంత హఠాత్తుగా వెళ్ళిపోవటానికి కారణం ఏమిటో తప్పకుండా వుత్తరం రాస్తాడు. రెండు రోజులు - నాలుగు రోజులు - వారం రోజులు - నాలుగు వారాలు - పూర్తిగా నెలకూడా దాటి - ఇవ్వాళ నాలుగో రోజు. అతని గురించి ఒక్క ముక్కకూడా నాకు అదనంగా తెలియలేదు. ప్రతీరోజూ వుత్తరంకోసం ఎదురుచూస్తూ - ఎంత దారుణంగా గడిపానో భగవంతుడికి తెలుసు. గోపాల్ ఎప్పుడో హఠాత్తుగా వచ్చి నాకోసం ఫోన్ లో పిలుస్తాడని ఫోన్ కాల్ కోసం ఎదురు చూడని క్షణం లేదు. ఇలా ఎందుకు జరిగిందో - అసలు గోపాల్ ఏమయ్యాడో - నాకేమీ అంతుచిక్కటం లేదు. తిండి సయించటం లేదు. నిద్ర రావటం లేదు. ఎవ్వరితోనూ మాట్లాడబుద్ధి కావటం లేదు. పిచ్చిపడుతోన్నట్టువుంది.

ఈ బాధ భరించలేక - నాలో నేను మథనపడలేక ఇదంతా నీకు చెప్పేశాను." నిట్టూర్చింది.

పద్మిని నిజంగా పిచ్చిదానిలాగే తయారైంది. మొహం వాడిపోయి దీనత్వం గూడుకట్టినట్టు వుంది. శరీరం చిక్కిపోయి జబ్బుపడి లేచినట్టు వుంది. ఎప్పటిలా ముస్తాబులేదు. సింగారం లేదు. అందచందాలు లేవు - ఉత్సాహమే లేదు. అంతా విన్న మోహిని నిదానంగా అంది - "చాలా ఆశ్చర్యంగానే వుంది మరి."

"అంతేనా మోహినీ!" దీనంగా చూసింది పద్మిని — "గోపాల్ గురించి నామనస్సు పరిపరివిధాల పోతోంది. అతనెందుకిలా చేసివుంటాడో నువ్వయినా ఆలోచించు మోహినీ!"

మోహిని నిర్లక్ష్యంగా అంది - "ఇంకా ఆలోచించే దేమిటక్కయ్యా! గోపాల్ చెయ్యాలనే చేశాడిదంతా."

తెల్లబోయింది - "చెయ్యాలనే చేశాడా?".. ఊహూ! నేనలా నమ్మను!" పద్మిని కళ్ళల్లో ఏదో ఆశ తొణికిసలాడింది- "గోపాల్‌కి చెల్లెలుందని చెప్పాడు. ఆవిడికి బాగా లేదని వుత్తరం వచ్చిందేమో!" తనురాసిన వుత్తరంచూసి గోపాల్ పారిపోయాడని అనుకోలేకపోయింది పద్మిని.

"సరే! ఎక్కడికైనా హఠాత్తుగా వెళ్ళాల్సిన అవసరమే వచ్చిందనుకో- ఇంటికివచ్చి చెప్పలేకపోయినా ఏ టెలిఫోన్ బూత్ నుంచో ఫోన్‌లో చెప్పచ్చుగా ? పోనీ వెళ్ళినవెంటనే గాక పోయినా ఆలశ్యంగానైనా ఒక వుత్తరంముక్క రాయచ్చుగా ? ఇదంతా ఆలోచిస్తే అతను ఎందుకుచేశాడో నీకుమాత్రం అర్థంకావటంలేదూ ?"

పద్మిని మాట్లాడలేకపోయింది. తన అనుమానాన్నే మోహిని దృఢంచేస్తోంటే గుండెల్లో భయం బయులుదేరింది - చెల్లెలి కేసి ఆశాపూరితంగా చూస్తూ అంది - "కానీ మోహినీ! గోపాల్ చాలా మంచివాడే! నన్ను ఏవిధంగానూ తెలిసి బాధపెడతాడని నమ్మలేకపోతున్నాను."

"అక్కయ్యా! ఒక్కటి చెప్పు. గోపాల్ లేకపోతే బ్రతకలేని పరిస్థితికి వచ్చాననన్నావు. సిలాగే అతనుకూడా నిన్నంత గాఢంగా అభిమానించివుంటే ఇప్పుడిలా చెయ్యగలిగే వాడా? నువ్వు ఇప్పటికైనా అతని తత్వం తెలుసుకోక- ఇంకా ఎందుకు అతనికోసం బాధపడతావు?"

"అయ్యో! మోహినీ! నీకెలా చెప్పనమ్మా!" అంటూ బావురుమంది పద్మిని అంతరంగం. పద్మిని కళ్ళవెంట జలజలా కన్నీళ్ళు రాలిపడ్డాయి.

మోహిని లేచి పచార్లు చాగించింది. మోహినికి చాలా ఆనందంగా వుంది. గోపాల్ వదిలి పోయాడు. గోపాల్ మీద అక్కయ్యకి విరక్తికూడా పుడుతోంది. అక్కయ్య పిచ్చి అభిమానాలతో కొన్నిరోజులు బాధపడినా యధాస్థితికి వస్తుంది. ఎప్పటిలా నిశ్చింతగా సంగీతం నాట్యం నేర్చుకోం టుంది. మొగపురుగుకేసికూడా కన్నెత్తి చూపకుండా జీవితం కళారాధనకు అంకితం చేస్తుంది, థాంక్ గాడ్!

"మోహినీ!" నీరసంగా పిల్చింది పద్మిని.

"ఏమి టక్కయ్యా?" మళ్ళా వెళ్ళి దగ్గర కూర్చుంది మోహిని.

"నువ్వన్నట్టే గోపాల్ ఇదంతా చెయ్యాలనే చేశాడని

నేనూ ఒప్పుకుంటాను. కానీ, అందువల్ల అతనికి వచ్చే లాభం ఏమిటి? మేమిద్దరం పెళ్లిచేసుకోవాలనీ కూడా అనుకున్నాం కదా?"

"అవును, అలా అనుకున్నారు కాబట్టే నిస్సంకోచంగా సినిమాలూ షికార్లూ తిరిగారు. ఆ సరదా తీరిపోయింది. పెళ్ళీ - పిల్లాం - సంసారం అంటూ ఇరుక్కుపోవటం అతనికి యిష్టంలేదు. ఈ బెడద అంతా వదిలించుకోవాలంటే హఠాత్తుగా ఈ ఊరునుంచి మాయమవ్వటం ఒక్కటే మార్గం అనుకున్నాడు."

గోపాల్ గురించి మోహిని మాట్లాడుతోన్న ప్రతీ మాటా శూలాలంలావచ్చి గుచ్చుకోసాగాయి పద్మిని గుండెల్లో - మోహిని చెప్తోంది అక్షరాలా నిజమేనేమో! తను ఉత్తరంలో పెళ్ళివిషయంకూడా దీర్ఘంగా ప్రస్తావిస్తూ రాసింది. దానికి జవాబుకూడా యివ్వకుండా గోపాల్ మాయమయ్యాడు. గతంలో గోపాల్ చెప్పినమాటలన్నీ నీటిమూటలా? - గోపాల్ చూపించిన అనురాగమంతా ఉత్తిబూటకమా? భగవంతుడా! ఎలా నమ్మటం? - "మోహినీ! గోపాల్ పెళ్ళికోసం ఎంత తపించిపోయాడో నీకు తెలీదు. నేనులేనిదే తను బ్రతకలేనన్నాడు, నా సహచర్యంతో స్వర్గసుఖాలు అనుభవిస్తానన్నాడు. జీవితమంతా నాకోసం - నా కళకోసం శ్రమిస్తానన్నాడు - అబ్బ! గోపాల్ని నేను శంకించలేను, ఎన్ని ఘోరాలు చేసినా శంకించలేను". తలపట్టుకొంది పద్మిని.

"అక్కయ్యా!" నిరసనగా నవ్వింది మోహిని- "నిజంగా నువ్వు పిచ్చిదానివి. అందుకే అంత తొందరపడి గోపాల్కోసం

మనసు పోగొట్టుకున్నావు. అతన్ని అతిగా విశ్వసించి ఇవ్వ కూడని స్థానం యిచ్చావు. అంతమాత్రాన అతని విలువ పెరుగుతుందా? నీ అమాయకత్వం మాత్రమే బయటపడింది. ఈ కాలంలో ఇలాంటి విషయాలలో ఎన్ని నమ్మకద్రోహాలు జరుగుతున్నాయో మనం వింటూనేవున్నాంకదా? - గోపాల్ స్టయిల్‌గా - పోగ్గా మాట్లాడాడని అతన్నిగురించి మనం అతిగా అంచనావేసి అతని స్నేహంకోసం పాకులాడాం. అతనికి అంతకన్నా ఏంకావాలి? ఒకటికి నాలుగుసార్లు మన యింటి చుట్టూ తిరిగి పరిచయం పెంచుకున్నాడు. నీనుంచితనాన్ని ఆసరా చేసుకున్నాడు. నీతో సినిమాలూ షికార్లూ సాగించాడు. ఇదంతా నిజం కాదంటావా?"

మోహిని వర్ణిస్తోన్న కధనం వింటూ తల్లడిల్లిపోయింది పద్మిని - నిజమే, అదంతా నిజమే. ఒక్క అక్షరంకూడా అబద్ధం కాదు. కానీ గోపాల్ అదంతా బూటకంగా చెయ్యలే ద్రోహబుద్ధితో చెయ్యలేదు. గోపాల్ హృదయం మోహినికేం తెలుసు? తనకు తెలుసు. తన అంతరంగానికి తెలుసు.

మోహిని సూటిగా చూస్తూ అంది - "గోపాల్ వెళ్ళి పోవటానికి కారణం ఏమిటో బాగా వూహిస్తే ఒకటిమాత్రమే స్ఫురిస్తోంది?"

"ఏమిటి? ఏమిటి మోహినీ?" ఆత్రుతగా చెల్లెలి మొహంలోకి చూసింది పద్మిని. మోహిని గర్వంగా అంది - "పెళ్ళి చేసుకోకుండా నీనుంచి అతనికేమీ దొరకదని అర్థమై పోయిందేమో!"

అంధకారంలో పడిపోయినట్టు కృంగిపోయింది పద్మిని - "అయ్యో! చెల్లీ! నీకెలా చెప్పను? నీ నమ్మకాన్ని ఎలా

నాశనం చెయ్యను? పెళ్ళికాకుండానే నా సర్వస్వం గోపాల్‌కి అర్పించుకున్నాను. అతని అనుభవంకోసమే నేను పుట్టానని విశ్వసించాను. అతని సహచర్యంతో నా బ్రతుకు పావన మౌతుందని కలలుకన్నాను. అతని స్పర్శని - అతని వాంఛని తిరస్కరించలేని అశక్తురాలినయ్యాను. అతని సుఖంకోసం - అతని సంతోషంకోసం - నన్ను నేను సమర్పించుకున్నాను. అతని సంతృప్తిచూసి — అతని చిరునవ్వుచూసి ఎంత పరవశించి పోయానో - అతనిని నా మనస్సులో మనస్సుగా - నా తనువులో తనువుగా ఎలా ఐక్యం చేసుకున్నానో - నీకెలా చెప్పనమ్మా? ఎలా చెప్పను?" ఒక్కమాటకూడా నోరు విప్పి చెల్లెలితో చెప్పలేకపోయింది పద్మిని.

గోపాల్ ఎందుకు వెళ్ళిపోయాడో తనే వూహించగల దేమో? ఇక తననుంచి పొందటాని కేమీ మిగలనప్పుడు - తనను పెళ్ళిరూపంతో బంధించుకోవటం యిష్టంలేనప్పుడు - గోపాల్ వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడా? అందుకే తనతో అనుబంధాన్ని తెగ తెంపులు చేసుకుని వెళ్ళిపోయాడా?

భగవంతుడా! ఇంత ఘోరాన్ని నువ్వు సహించ గలవా? క్షమించగలవా? వెక్కి వెక్కి పడుతూ పద్మిని మొహానికి రెండు చేతులూ కప్పుకొంది. మోహినికికూడా కళ్ళ వెంట నీళ్ళు తిరిగినంతపని అయింది.

"అక్కయ్యా!" పద్మిని చేతులు తన చేతుల్లోకి తీసు కొంటూ సానుభూతిగా చూసింది - "కొన్ని నిజాలు చాలా దారుణంగా వుంటాయి. మన అభిమానాలకోసం వాటిని విస్మ రించినా అవి అబద్ధాలై పోవు. ఒక గురువు ఒక శిష్యురాలికి

ఎంత ద్రోహం చేయగలడో మనకు తెలిసిందికదా ? అలాంటి దే యిదికూడా. ఒక స్నేహితుడు- ఒక స్నేహితురాలికి అంతకన్నా ఎక్కువ ద్రోహం చెయ్యగలడు. నిజాన్ని నిజంగానే ఒప్పుకోవటం వివేకం అవుతుంది. గోపాల్ మొదటినుంచీ పవిత్రంగా ప్రేమించలేదు నిన్ను. ప్రేమిస్తోన్నట్టే భ్రమకల్పించాడు. నువ్వు మాత్రం అతని తత్వం తెలుసుకోకుండా గాఢంగా అభిమానించావు. అందుకే ఈ బాధంతా అనుభవిస్తున్నావు. ఇప్పటికైనా నిజం తెలుసుకో అక్కయ్యా! గోపాల్‌ని శంకించటం అంటే నాకూ మనస్కరించటంలేదు. కానీ యధార్థాన్ని నువ్వూ నేనూ తల్లక్రిందులు చెయ్యలేం. హఠాత్తుగా వెళ్ళిపోవటం - ఒక్క వుత్తరంముక్క కూడా రాయకపోవటం - ఇదంతా ఆలోచిస్తే - ఇక అతని పేరుకూడా నువ్వు స్మరించకూడదు."

పద్మిని నిర్లిప్తంగా చూస్తూ మౌనంగా కూర్చుంది చాలాసేపు. హఠాత్తుగా అంది - "మోహినీ! గోపాల్ చెడ్డవాడని నువ్వు మనస్ఫూర్తిగా అనుకోగలవా ?"

"అక్కయ్యా! నువ్వు మళ్లా మొదటికొస్తున్నావు. నీమంచితనమే నిన్నిలా చేతకానిదాన్ని చేస్తోంది. అతన్ని గురించి ఇంకా సమర్థించటానికి నీకు సిగ్గువెయ్యటంలేదూ? అంత నమ్మకం వున్నదానివి ఇలా శంకలతో దిగులుపడిపోవటం ఎందుకూ ? చూడక్కయ్యా! మన పురాణాల్లో రాక్షసుల్ని వర్ణించినట్టు - చెడ్డవాళ్ళనేవాళ్ళు రెండేసి కొమ్ములతోటి - పెద్ద పెద్ద కోరలతోటీ ఎక్కడా వుండరు. మనుషుల మనస్సుల్లో మంచీ చెడ్డా దాగివుంటాయి. అందరి ప్రవర్తనవల్లా వాటిని

ఏ నం అర్థంచేసుకోలేం. దొరలా మాట్లాడినవాడే దొంగ పనులు చేస్తాడు. యోగిలా నీతులు బోధించినవాడే హత్యలు చేస్తాడు. తప్పులు చేసే వాళ్ళెప్పుడూ పైకి చాలా వుత్తముల్లాగా ప్రవర్తిస్తారు. గోపాల్ ఇదివరకు చెప్పిన కబుర్లకీ - ఇప్పుడు చేసినదానికీ ఏమైనా సంబంధం వుందా ? ఇంతకన్నా అతని గుణం తెలియటానికి ఏం నిదర్శనం కావాలి ?"

పద్మిని మాట్లాడలేకపోయింది.

"ఇప్పుడు నీకొచ్చిననష్టం ఏముందక్కయ్యా? అలాంటి మోసగాణ్ణి పెళ్ళిచేసుకోవటం తప్పిపోయినందుకు సంతోషించు. తెలిసో తెలియకో ఎన్నో అవకతవకలు చేస్తాం. జరిగిందంతా ఒక పీడకల అనుకుని మర్చిపో. మనస్సుకు కొంచెం ధైర్యం తెచ్చుకుని గతాన్నంతా విస్మరించి ఎప్పటిలాగా నిశ్చింతగా బ్రతకటం వుత్తమం - ఆలోచిస్తే నీకే తెలుస్తుంది."

పద్మిని తూలుతూ లేచింది. ఒక్కమాటకూడా మాట్లాడకుండా గదిలోంచి నెమ్మదిగా వెళ్ళిపోయింది.

గది గుమ్మంముందు నిలబడి ఎంతోసేపు పద్మిని గది కేసి చూస్తూ వుండిపోయింది మోహిని. పద్మిని వెక్కి వెక్కి ఏడుస్తోన్న శబ్దం స్పష్టంగా విన్పించింది.

"అక్కయ్య నిజంగా పిచ్చిదే! ఏడవటమే మంచిది! మనస్సయినా తేలిక పడుతుంది."

అక్కయ్యని ఒంటరిగా విడిచిపెట్టటం తప్పితే మరో మార్గంలేదు. తనలోతను బాగా తర్కించుకుని అయినా నిజానిజాలు తెలుసుకొంటుంది —

* * *

మర్నాటి రాత్రివరకూ అక్కాచెల్లెళ్లు మాట్లాడుకోలేదు. పడుకోబోయేముందు మాత్రం మోహిని పద్మినినోసారి పలకరించింది – "అక్కయ్యా! ఏ ఒంట్లో గాంగాం తేలిగ్గా వుందా?"

"ఫర్వాలేదు, బాగా నేవుంది," ముభావంగా చెప్పింది పద్మిని.

"కాస్సేపు రికార్డులేమైనా వేసుకుందామా?"

"వద్దులే మోహినీ! నాకు నిద్ర వస్తోంది."

"సరే! పడుకో," – మోహిని బయటికి వచ్చేసింది — ఈ ఒక్కరోజుకే అక్కయ్య చాలా తేరుకొంది. లేకపోతే అతగాడేం తాళికట్టిన మొగుడా ఏమిటి అంత మర్చిపోకుండా వుండటానికి?

అక్కయ్యకి నెమ్మదిగా ధైర్యం చెప్పి – దిగులంతా పోగొట్టి – కౌముదీబాయితో మాట్లాడి – అక్కయ్యనికూడా కళాశిఖరంలో చేర్చి ......భవిషత్తు గురించి వ్యూహాగానాలు చేస్తూ పక్కమీద పడుకుంది మోహిని – నిద్రాదేవి నిశ్శబ్దంగా జోలపాట పాడింది.

ఎవరో తట్టిలేపుతోంటే వులిక్కిపడి లేచింది మోహిని – మంచందగ్గిర నించునివున్న పద్మినిని చూస్తూ కంగారుపడింది – "ఏమిటక్కయ్యా ఇలా వచ్చావేం? నిద్రపోలేదా?"

"తర్వాత నిద్రపోతా. ఇప్పుడు నాకు నిద్రరావటం లేదే మోహినీ! కిందికి వెళ్ళి తాతయ్యని చూసివచ్చాను."

"ఏం? ఏమైంది? తాతయ్యకేమైంది?"

"ఏంకాలేదు. హాయిగా నిద్రపోతున్నాడు. నాకే

చూడాలని బుద్ధిపుట్టి చూసివచ్చాను."

"అక్కయ్యా!" ఆశ్చర్యపడింది మోహిని "నువ్విలా కొత్తగా మాట్లాడుతున్నా వేమిటి ?"

అదేం వినిపించుకోలేదు పద్మిని - "ఇవ్వాళకూడా గోపాల్ ఉత్తరం వస్తుందని ఎదురు చూశానే! ఇక రాదని నమ్మక తప్పలేదు."

"మళ్లా ఆగోడ వెందుకక్కయ్యా? ఇంకా అతనికోసం ఎదురు తెన్నులు చూడటం ఏమిటి ?" విసుక్కుంది మోహిని - "అతన్ని మర్చిపోరాదూ !"

"ఎలా మర్చిపోనే మోహినీ! నీకు మరో రహస్యం కూడా చెప్పేస్తాను. అతని రక్తం - అతని వారసత్వం నా కడుపులో మిగిల్చి మరీ వెళ్ళాడు. అతన్ని నేనెలా మర్చి పోగలను ;" - అదిరిపడింది మోహిని.

పురుగుని చూసినట్టు చూసింది పద్మినిని. దుఃఖాన్ని దిగమింగుకొంటూ - వణుకుతోన్న కంఠంతో - "మోహినీ! నీకన్నా నాకు ఆప్తులెవ్వరూ లేరు. నా రహస్యాలన్నీ నీకు చెప్పేశాను. నన్ను చూసి అసహ్యపడకు. ఈ దుఃఖంతో - అవమానంతో - బాధతో కుళ్ళిపోతున్నాను, శరీరంలో రేగిన కోరికలకి లొంగి నావివేకం పోగొట్టుకున్నాను. నాకెన్నో స్వర్గసుఖాలు చూపిస్తానని నమ్మించి గోపాల్ చివరికి నన్ని నరకంలోకి తోసి వెళ్ళిపోయాడు. ఇప్పుడు నాకు దారీ తెన్నూ లేక మహాసముద్రంలో గడ్డిపరకలాగా అల్లాడుతున్నాను."

"అక్కయ్యా!" తనను తను తమాయించుకొంటూ అనునయంగా పిల్చింది మోహిని - "ఈ విషయం కూడా

గోపాల్‌కి తెలుసా ?"

"నేను తెలుసుకోవటానికే రెండు నెలలు దాటింది. నాకీ అనుమానం వచ్చీరాగానే గోపాల్‌తో ముఖాముఖీ చెప్పలేనని వుత్తరం రాశాను. ఆ వుత్తరం అందినతర్వాతే గోపాల్ కీ ద్రోహబుద్ధి పుట్టింది. నాఖర్మానికి నన్నువిడిచి — గతమంతా తుడిచివేసుకుని - తనదారిన తను వెళ్ళిపోయాడు. నేను.... నేనింకా గోపాల్‌కోసం — గోపాల్ వుత్తరంకోసం ఎదురు చూస్తూన్నాను - ఎంత పిచ్చిదాన్ని!"

గోపాల్ అంత హఠాత్తుగా ఎందుకు వెళ్ళిపోయాడో బాగా అర్థమైంది మోహినికి. ఛీ! ఇంకా ఆ దుర్మార్గుడికోసం పలవరించటం మనుషులు చేయదగ్గ పనేనా?

"ఇప్పుడు నీకు..." సందేహిస్తూ ఆగింది మోహిని.

"నాలుగు నెలలు" సిగ్గు విడిచినదానిలా చెప్పింది పద్మిని- "నేను గోపాల్‌ని గాఢంగా విశ్వసించానమ్మా మోహినీ! లేకపోతే ఇంత తెలివితక్కువదాన్నయ్యేదాన్ని కాదు. నువ్వా ఆదినుంచీ నన్ను హెచ్చరిస్తూనే వున్నావు. నీ మాటలన్నీ పెడచెవిన పెట్టాను. నేను నమ్మిందే నిజం అనుకున్నాను. చివరికిలాంటి దుస్థితిలో చిక్కుపోయాను. నాతోకలిసి పుట్టినదానివి - నా ప్రాణానికి ప్రాణానివి - నీతోమాత్రమే నా గోడు చెప్పుకోగలిగాను. రేపు తాతయ్య మొహం ఎలా చూస్తాను? పదిమంది ఎదటా ఎలా తల ఎత్తుకుంటాను? నువ్వే చెప్పు మోహినీ! బ్రతికే అర్హత నాకు వుందా?"

"ఛీ! ఛీ! అవేం మాట లక్కయ్యా!" కంగారుపడింది మోహిని - "నువ్వేం దిగులుపడకు. ఏదో చేద్దాం ఏదో అవు

తుంది. అంతేగానీ..."

"అంతే కాదమ్మా!" నిస్తేజంగా నవ్వింది పద్మిని - "ఏదీ చెయ్యకూడదు మనం. మన మంచి చెడ్డలు మనలోనే దాగిపోవాలి. ఎవ్వరికీ వెల్లడి కాకూడదు. పెదవి దాటితే పృథ్వి దాటుతుందంటారు. తాతయ్య అవమానంతో కృంగిపోతాడు. అందుకని ..." ఆయాసంతో బాధపడసాగింది పద్మిని.

"అందుకని ...? చెప్పు అక్కయ్యా! నిన్ను చూస్తే నాకేమిటో భయం వేస్తోంది."

"లేదమ్మా! నేను నీ అక్కయ్యని. నన్ను చూసి నువ్వే భయపడుతున్నావా?" చెల్లెలి చేతిని గట్టిగా పట్టుకొంది పద్మిని- "గోపాల్ నన్ను మోసంచేశాడు, చెయ్యనీ! గోపాల్‌కి అంతరాత్మ వుంది. ఎప్పటికైనా తన తప్పు తను తెలుసుకుంటాడు. కాని అది చాలదు నాకు. గోపాల్‌ని నేను క్షమించలేను. కానీ ... చెల్లీ! గోపాల్ లేకుండా నేను బ్రతకలేను. గోపాల్ లేని జీవితాన్ని ఒక్క రోజుకూడా సాగించలేను. గత స్మృతులు స్మరించుకొంటూ - వాటితోపాటు ఈ మోసాన్ని కూడా వల్లె వేసుకొంటూ - మిగిలిన జీవితాన్ని దుర్భరంగా ఈడ్చలేను. ఎందుకమ్మా నేను బ్రతకటం? ఎవరికోసం బ్రతకను?" పద్మిని నిస్సత్తువతో పక్కని కరిచిపెట్టుకుని నిశ్చలంగా వుండిపోయింది.

" ! అక్కయ్యా! నాకేమిటో భయం వేస్తోందే? నీకు ఒంట్లో బాగాలేదా? ఎందుకే అలా అయిపోతున్నావు? నీ మొహం ఎంతో నల్లగా అయిపోయింది. కాళ్ళూ చేతులూ వణుకుతున్నాయి. నిజం చెప్పు. నాకేమిటో

భయం వేస్తోంది." మోహిని కళ్ళనీళ్లు తుడుచుకొంటూ కంగారు కంగారుగా అడిగింది.

పద్మిని తల ఎత్తాలని ప్రయత్నించి ఎంతో కష్టంతో దిండుమీద ఆనుకొని లేచింది -

"చెల్లీ ! నువ్వు నన్ను క్షమించవా ?"

"అయ్యో ! ఎందుకు క్షమించను? నువ్వేం తప్పు చేశావు? నువ్వు చాలా మంచిదాని వక్కయ్యా! అందరి ఆడవాళ్ళలాగా నువ్వూ ప్రేమించావు - అంతే. వాడు మోసం చేశాడు. ఆ తప్పు నీదెలా అవుతుంది? నిన్ను నేను ఎప్పుడో క్షమించాను. నీ మనస్సంతా అర్థంచేసుకున్నాను. అక్కయ్యా! నువ్వంటే నాకెంతో యిష్టం."

నిర్జీవంగా చూస్తూ - నోరు పెగుల్చుకుని మాట్లాడటానికి ప్రయత్నిస్తూ అతికష్టంగా మాట్లాడింది పద్మిని- "గోపాల్ నన్ను... మోసం... చేశాడు. అందుకే... గోపాల్‌ని నేనూ... మోసం చేస్తాను. అతను... ఎప్పుడేనా... వచ్చేసరికి... నేను... లేకుండా వెళ్ళిపోతాను."

"అక్కయ్యా!" మోహిని అక్కగారికేసి తీక్షణంగా చూసింది -"నువ్వేదో చేశావు. నాకిప్పుడే అర్థమైంది. ఎందుకింత ఘోరం చేశావు? ఉండు. నేనిప్పుడే వెళ్ళి- డాక్టర్ గారికి ఫోన్ చేస్తాను, తాతయ్యనీ వాళ్ళనీ లేపుకొస్తాను." అంటూ గుమ్మంకేసి పరిగెత్తింది.

"మోహినీ! మోహినీ!... నేను చచ్చిపోతున్నాను. ఈ ఆఖరిఘడియల్లో నన్ను అల్లరిపెట్టకమ్మా! నా పరువు కాపాడు- చెల్లీ! నీకు దణ్ణం పెడుతున్నాను." చేతులు రెండూ దగ్గిరికి

చేర్చాలని ప్రయత్నిస్తే జారి కర్రల్లా పక్కమీద పడ్డాయి.

మోహిని ఎటూతోచక తలబాదుకొంది. అక్కయ్య కొనప్రాణంతో వుంది. ఇంకా ఆలశ్యం చేయటం వివేకం కాదు- పద్మినిని గదిలో వదిలేసి హాల్లోంచి మెట్లకేసి వెర్రి కేకలు పెడుతూ పరిగెత్తింది. "తాతయ్యా! తాతయ్యా! రాజమ్మా! రండి, రండి. అక్కయ్య...అక్కయ్య చచ్చిపోతోంది." అంటూ మెట్లమీదే ఏడుస్తూ కూర్చుండిపోయింది.

అందరూ పైకి పరుగెత్తుకువచ్చి గదిలో జొరబడ్డారు.

పద్మిని మంచందగ్గిర నేలమీద రెండు కుర్చీల మధ్యా పడి వుంది.

నాగరాజు పద్మినిని లేవనెత్తి మంచంమీద పడుకో బెట్టాడు. ముక్కుదగ్గిర వేలుపెట్టి చూశాడు. గుండెలమీద చెయ్యిపెట్టి చూశాడు - "డాక్టరుగార్ని పిలిస్తే బాగుంటాదు బాబూ!" అన్నాడు. మోహిని ఏడుస్తూ-"వద్దు తాతయ్యా! అంతా అయిపోయాక డాక్టర్లెందుకు? రకరకాలుగా ప్రశ్నలు వేస్తారు వద్దు తాతయ్యా!" అంది.

బలరామయ్య అతి ప్రయత్నంమీద నోరు పెగల్చు కున్నాడు - "ఇంత... హఠాత్తుగా... అసలేమైందమ్మా?"

మోహిని వెక్కి వెక్కి ఏడుస్తూ చెప్పింది - "నాకూ తెలియదు తాతయ్యా! ఇప్పుడే నాదగ్గిరికి వచ్చింది కడుపులో బాగా నొప్పి వస్తోందని చెప్పింది-అంతే. బాధపడుతూనా మంచం మీద కూర్చుంది. నేను పరుగెత్తుకుని మీదగ్గిరకి వచ్చాను. అంతే తాతయ్యా!" అంటూ ఒక్కసారి బావురుమంది.

తాతయ్య వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు. మనము

రాలి తలని ఒడిలో పెట్టుకున్నాడు. చెంపలమీద నుంచి ధారల్లాగా కన్నీళ్ళు కార్చుతూ "అప్పుడే నీకు నూరేళ్ళూ నిండిపోయాయాతల్లీ!" బొంగురు పోయిన గొంతుతో మరేమీ మాట్లాడలేక రాయిలాగా కూర్చున్నాడు.

మోహిని దూరంగా గుమ్మాన్ని కరిచి పెట్టుకుని ఏడుస్తూ నించుంది.

కళానిలయంలో మృత్యుదేవత విలయ తాండవం చేసింది.

* * *

మోహిని తాతయ్య మంచందగ్గిర దిగులుపడుతూ కూర్చుంది. పద్మిని పోయిన వారం రోజులనుంచీ బలరామయ్య మంచం దిగలేదు. ఆరోగ్యం చెడింది. రాత్రింబవళ్ళు పద్మినికోసం కలవరిస్తూ - ధైర్యం గోల్పోయి తనూ మృత్యుముఖానికి సమీపంగా ప్రయాణం సాగించాడు. అక్కయ్య పోయిందన్న దుఃఖంకన్నా - ఏక్షణంలో తాతయ్య కూడా కన్నుమూస్తాడో నన్న భయం మోహినిని వెర్రిదాన్ని చేస్తోంది. "తాతయ్యా! తాతయ్యా! నువ్వా యిలా దిగులుపడితే ఎలా తాతయ్యా?" అంటూ ఎప్పటిలాగా తాతయ్య దుఃఖాన్ని మరిపించే ప్రయత్నం చేసింది.

బలరామయ్య లోతుకు పోయినకళ్ళు ఒత్తుకున్నాడు - "దుఃఖం కాకపోతే ఏముందమ్మా? చెట్టంత కూతురుపోయినా - కట్టుకున్న ఇల్లాలు పోయినా - అదంతా ఈశ్వర విలాసంగా భావించి - మీ ఇద్దరి కోసమే నా ప్రాణాలు నిలుపుకున్నాను. కానీ ఈ వయస్సులో ఈ దుఃఖం భరించి నేనిక తేరుకుని తిరగగల నంటావా? కళ్ళు మూసినా తెరిచినా నాచిట్టితల్లే కన్పి

స్తోంది. పద్మిని చూస్తే నాకళను చూసుకున్నట్టు ఎంతో తృప్తి కల్గేది. ఎప్పుడూ నిండుగా రకరకాల బట్టలు కట్టుకుని నవ్వుతూ తృళ్ళుతూ తిరిగే పద్మ తల్లిని ఎలా మర్చిపోగల నమ్మా?"

"తాతయ్యా! పోయినవాళ్ళతో పోతామా అంటారు పెద్దవాళ్లు. అక్కయ్యని తల్చుకుని విచారించటం బాగానే వుంటుంది, కానీ తిండీతిప్పలూ – మందూమాకూ అన్నీ వద్దను కుంటే ఎలా చెప్పు? మనం బ్రతికేవున్నాం కాబట్టి మన ధర్మాలు మనకి తప్పవు కదా? పొద్దున్న యిచ్చిన మందులు అలా బల్ల మీద వుంచావు. ఇలా అయితే నువ్వెన్నాళ్లు బ్రతుకుతావు?"

"పిచ్చితల్లీ! మందులు ఆయుష్షుని పెంచితే అందరూ ఆహారం మానేసి మందులే తింటారమ్మా! నా బాధకొద్దీ నేనేమీ నోట పెట్టలేకపోతున్నాను. ఇంకా ఈ బ్రతుకుమీద ఆశ లెందుకు నాకు?"

"అదేమిటి తాతయ్యా! అక్కయ్యమీద బెంగ పెట్టుకుని నువ్వుకూడా ఇలా అయిపోతే ఇక నాకెవరున్నారు? నేను ఒక్క దాన్ని ఈ ప్రపంచంలో ఎలా బ్రతుకుతాను?"

"అన్నిటికీ భగవంతుడే వున్నాడమ్మా! రెండుతరాల వెనకవాణ్ణి, నేను నిన్ను కనిపెట్టుకుని వుంటానా."

"ఇలాంటి విరక్తి నువ్వు అమ్మపోయినరోజునే కలిగిం చుకోవలసింది తాతయ్యా! మాకు ఆలనా పాలనా లేకుండా మా ఖర్మానికి మమ్మువదిలెయ్యాల్సింది. కానీ మామీద ప్రేమ చేత మమ్మల్ని పెంచి పెద్దవాళ్ళని చేశావు. ఆ ప్రేమ ఇప్పుడు అక్కయ్యమీదేగానీ నామీద లేదా? అక్కయ్య చచ్చి

పోయింది. దాని బ్రతుకంతా నిశ్చింతగానే గడిచింది. బ్రతికి వున్న నన్నుకూడా నువ్వు చచ్చిపోయినవాళ్ళతో జమకట్టుతున్నావు కాబోలు. నువ్వు లేకపోతే నేనేమౌతానో అన్న ఆలోచనైనా రానివ్వకుండా చావుకోసం ఎదురుచూస్తూకూర్చున్నావు. సరే తాతయ్యా! నా అదృష్టం ఎలావుంటే అలా అవుతుంది. అంతకన్నా నేనేం చెయ్యగలను?" మోహిని చెంపలమీద కన్నీళ్లు జలజలా రాలి తాతయ్య చేతులమీద పడ్డాయి.

తాతయ్య కంగారుపడి లేచికూర్చున్నాడు. మనమరాల్ని దగ్గిరికి తీసుకుని తల నిమురుతూ- "పిచ్చితల్లీ! నువ్విలా బాధపడితే నేను చూడగలనా అమ్మా! భగవంతుడు తీసుకుపోయేవరకూ నేను నిన్ను కనిపెట్టుకుని వుంటాను. నువ్వొకర్తె దానివే నాకళ్ల వెలుగులా మిగిలివున్నావు. నిన్ను బాధపడనిస్తానా అమ్మా?" అంటూ ఓదార్చాడు.

"తాతయ్యా! నువ్వు ధైర్యంగా వుంటే నేనుకూడా ధైర్యంగా వుంటాను." అంది మోహిని తాతయ్య మొహంలోకి బేలగాచూస్తూ.

"అలాగే తల్లీ! నువ్వు బెంగపెట్టుకోకు. అక్కయ్యకీ మనకీ ఋణానుబంధం తీరిపోయిందనుకుందాం. ఇక మనం చెయ్యగలిగిందేమీలేదు."

మోహినికి కొండంత ధైర్యం వచ్చింది— మందు తాగు తాతయ్యా! అంటూ సీసాలో మందు ఒంచి యిచ్చింది. బలరామయ్య మందుతాగి ద్రాక్షపండు చప్పరిస్తూ పక్కమీద పడుకున్నాడు. తాతయ్యకి దుప్పటికప్పి మోహిని బయటికి

వచ్చింది.

ఎవరో ఫోన్‌లో పిలిస్తే నాగరాజు రిసీవర్ ఎత్తి జవాబు చెప్తున్నాడు. ఉన్నట్టుండి నాగరాజు మొహం ఆశ్చర్యంగా మారింది. అప్పుడే తాతయ్య గదిలోంచి వస్తోన్న మోహినిని చూస్తూ- "చిన్నమ్మాయ్! చూడమ్మా! ఎవరో పెద్ద అమ్మాయి కావాలని అడుగుతున్నాడు" అన్నాడు.

మోహిని ఆశ్చర్యపడుతూ రిసీవర్ అందుకొంది — "హల్లో!"

"పద్మినీ! నువ్వేకదూ?"

"మీరు... మీరు..."

"గోపాల్ని...మర్చిపోయినట్టున్నావే!"

మోహిని ప్రాణపడిపోయింది. గోపాల్...గోపాల్... అక్కయ్యని నమ్మించి ద్రోహంచేసిన గోపాల్... అక్కయ్యని అమానుషంగా హత్యచేసిన గోపాల్... దుర్మార్గుడు... మోసగాడు... గోపాల్... గోపాల్... ఎందుకు వచ్చినట్టు? ఎందుకు? ... రిసీవర్ పట్టుకోవటానికే మోహిని చెయ్యి పట్టు సడలి కష్టమైపోయింది — "మీరు ... ఒక్కసారి ... వస్తారా?" సాధ్యమైనంత మృదుత్వం చిందిస్తూ మాట్లాడింది.

"వస్తాను పద్మినీ! ఇప్పుడే స్టేషన్‌లో దిగాను. నా సామాను ఏదైనా హోటల్‌లో పడేసి వచ్చేస్తాను ... నీతో చాలా విషయాలు మాట్లాడాలి."

"చాలు, చాలు. తప్పకుండా...రండి."

సంభాషణ ఆపేసి రిసీవర్ పడేసింది.

మోహిని మనస్సంతా అంతులేని ఆవేశంతో చిందులు

తోస్కుతోంది. భరించలేని వుద్రేకంతో వురకలు వేస్తు తోంది ... జీవితంలో ఎప్పుడైనా గోపాల్ కన్పిస్తే ... ఎంత దారుణంగా కసి తీర్చుకోవాలో అక్కయ్య పోయినక్షణం నుంచీ ఆలోచనలు చేస్తోంది మోహిని అంతరంగం. గోపాల్‌కు సర్వస్వం అర్పించి - చివరి కా దుర్మార్గుణ్ణి ఏమీ చేయ్యలేక అక్కయ్య చచ్చిపోయింది. కానీ తనులేదూ? తను .... గోపాల్‌ని విడిచిపెడుతుందా? ..

రెచ్చగొట్టిన ఆడపులిలాగా వచార్లు సాగించింది మోహిని - వున్నట్లుండి గుర్తువచ్చి నాగరాజుని పిల్చి చెప్పింది- "కాస్సేపటికి గోపాల్ వస్తాడు. అక్కయ్య విషయం నువ్వేమీ చెప్పకు, తిన్నగా నాదగ్గిరికి తీసుకురా!" — నిలకడ లేకుండా తిరుగుతూ ... గోపాల్ రాకకోసం ... నిరీక్షించ సాగింది మోహిని.

*                    *                    *

"నమస్తే మోహినీ దేవీ!"

త్రుళ్ళిపడి వెనక్కి తిరిగిన మోహిని - గుమ్మంలో నిలబడ్డ వ్యక్తినిచూసి నల్లత్రాచుని చూసినట్టు బెదిరింది — "న.... మ... స్తే..." వెటకారం ధ్వనించింది.

"పద్మిని లేదా?"

"పద్మిని..." పళ్ళు పటపట లాడించుకొంది మోహిని.

"లేదు. రండి పైకి వెళ్దాం."

మెట్లు ఎక్కుతూ గోపాల్ అడిగాడు . "ఇందాక నాతో మాట్లాడింది..."

నేనే: అక్కయ్యకాదు. పైమ్‌కి అక్కయ్య ఇంట్లో

లేదని అలా చెప్పాను."

గోపాల్ ఆశ్చర్యంగా మోహిని కేసి చూశాడు.

మోహిని చాలా గంభీరంగా కన్పించింది.

ఇద్దరూ పైన హాల్లోకి వెళ్ళారు.

పద్మిని పోయిన తర్వాత మోహిని రెండు మూడుసారుల కన్నా ఎక్కువగా పైకి రాలేదు. నాగరాజువచ్చి రోజుకోసారి గదులు తుడవటం తప్పితే మరే సందడీ లేదు పైన. నెలలకొద్దీ పాడుపెట్టిన ఇంటిలా హాలంతా దుమ్ముపడివుంది. గోడలమీద చిత్రాలు గాలికి చిరిగి ముక్కలై రెపరెపా కొట్టుకుంటున్నాయి.

బాల్కనీలోంచి గాలి విసిరిసిరి కొడుతూ దెయ్యంలా ఈలలు వేస్తోంది. హాల్లో అడుగుపెట్టగానే ఒకరకమైన వెచ్చటి వాసన కొట్టింది. మోహిని గబగబా అంగలు వేస్తూ వెళ్ళి — హాలుకీ బాల్కనీకీ మధ్యవున్న తలుపులు తెరిచింది. గాలి రయ్‌మంటూ గోడలమీద దుమ్ము ఎగర గొట్టింది. బాల్కనీలోకి వెళ్ళే తలుపులు వేసివుండటం గోపాల్ ఎప్పుడూ చూడలేదు. ఆ వాతావరణమంతా చిత్రమైన భీతి కల్పించింది.

హాలుమధ్య నిలబడి బయటికి గడియపెట్టివున్న పద్మిని గదికేసి చూస్తూ ఆశ్చర్యంగా అడిగాడు గోపాల్ — "పద్మిని ఎక్కడికి వెళ్ళింది?" మోహిని ఇక తన కోపాన్ని అణుచుకోలేక పోయింది - సాధ్యమైనంత వెటకారం ధ్వనింపజేస్తూ అంది —

"ఏం? ఆవిడ మీకు సమర్పించుకోవాల్సిందింకేమైనా మిగిలిపోయిందా?"

నిర్ఘాంతపోయాడు గోపాల్ — "ఎందుకు మీరలా

మాట్లాడుతున్నారు?"

"అవును. ఎందుకు నేనింత చేతకానిదానిలా మాట్లాడు తున్నానో నాకే తెలీటంలేదు — నిన్ను చూసీ చూడగానే అమాంతం నీ గొంతు పట్టుకుని నులిమేస్తాననుకున్నాను. కత్తి తెచ్చి నా కసిదీరా నీ గుండెల్లో పోట్లు పొడుస్తాననుకున్నాను—"

"మోహినీ దేవీ !"

"ఛీ! దుర్మార్గుడా! నీ నోటితో పిల్చి మా పేర్లు అపవిత్రం చెయ్యకు."

గోపాల్ అమితాశ్చర్యంతో తల్లడిల్లిపోతూ అన్నాడు. "మోహినీ దేవీ! మీరెందుకింత సీరియస్‌గా మాటలంటున్నారో నా కర్థం కావటంలేదు. నన్ను ఒక్కమాట అనే హక్కు కూడా మీకు లేదు. నేను పద్మినితో మాట్లాడటానికి మాత్రమే వచ్చాను."

"పద్మినితో మాట్లాడటానికా ? ... ఏం మాట్లాడటానికి ?"

"అది మీ కనవసరం. ఒకరి విషయాలలో జోక్యం కల్గించుకోవటం సభ్యతకాదు."

"గోపాల్ బాబూ ! సభ్యతల గురించీ — సంస్కారాల గురించీ మీరు ఉపన్యాసాలిస్తే లోకం తల్లక్రిందులైపోదూ ? ఇంకా ఎంతకాలం నటించగలరు ? నేను వెర్రి పద్మినిని కాను. ఆ అమాయకురాల్ని తప్పితే మరో ఆడదాన్ని మీరు మోసం చెయ్యలేరు."

" నేను .... నేను మోసం చేశానా ? ఎవర్ని ? పద్మినినా ? ... పద్మినిని మోసం చేశానా ? ఎవరన్నా

రీ మాట ?"

"ఇంకెవరన్నారు? ఆ పద్మినే అంది. మీ కల్లిబొల్లి కబుర్లన్నీ విని విని మోసపోయిన పద్మినే అంది." లక్ష్మణస్వామి అంది.

"అబద్ధం. నేను నమ్మను. పద్మిని భగవంతుణ్ణయినా శంకిస్తుందిగాని నన్నుకాదు. నేను మోసం చేస్తానని పద్మిని కలలోకూడా అనుకోదు. పద్మిని మనస్సు నాకు తెలుసు. నా మనస్సు పద్మినికి తెలుసు. మా ఇద్దరిమధ్యా ఎలాంటి మోసాలకూ శంకలకూ తావు లేదు." గోపాల్ కళ్లు చింతనిప్పుల్లా అయ్యాయి. "మోహినీ! ఇదంతా నువ్వు చేస్తున్నావు. నీ తెలివి తేటలకు మా యిద్దర్నీ ఎర చేస్తున్నావు. మొదటినుంచీ మా స్నేహం నీకు యిష్టం లేదు. నా మనస్సు పాడు చెయ్యాలని ఎంతో ప్రయత్నించావు. నీ ప్రయత్నాలేవీ సాగలేదని ఇప్పుడీ అవకాశం చూసి దుర్వ్యాపడుతున్నావు. మమ్మల్ని శాశ్వతంగా విడదియ్యాలని నీశక్తికొద్దీ కల్పనలు చేస్తున్నావు. ఇది నీకు ధర్మంకాదు మోహినీ! నీలో ఏమాత్రం మానవత్వం వున్నా...."

"గోపాల్!" తీక్షణంగా చూసింది మోహిని. "ధర్మాల గురించీ మానవత్వాలగురించీ నీ బోధనలు వినాల్సినఖర్మ లేదు నాకు. ఇప్పుడిలా రంకెలు వేస్తూ మాట్లాడినంతమాత్రాన నువ్వు చేసినదంతా మరుగుపడిపోదు. అక్కయ్య నీకు వుత్తరం రాసింది – దానికి జవాబైనా యివ్వని నువ్వు సభ్యతగురించీ – సంస్కారం గురించీ – ధర్మంగురించీ – మానవత్వం గురించీ నాకు హెచ్చరికలు చేస్తావా?"

"పద్మిని వుత్తరం రాసిందా?" తెల్లబోయాడు గోపాల్— "ఎప్పుడు రాసింది? ఏమని రాసింది పద్మిని?"

"నీ నటన చాలా బ్రహ్మాండంగా వుంది. కానీ నేను నమ్ముతానని మాత్రం అనుకోకు. వుత్తరంలో సంగతులు తెలియకుండానే నువ్వు హఠాత్తుగా మాయమయ్యావా?"

అదిరిపడ్డాడు గోపాల్ - "నేను ... హఠాత్తుగా మాయమయ్యానా?... వుత్తరంచూసి మరీ వెళ్ళిపోయానా? మోహినీ! నిజానిజాలు నీకు తెలుసా? సాటిమనిషిని ఇంత నీచంగా అంచనా వేసే నువ్వు మనిషివేనా? నీకు హృదయముందా? నువ్వు మోపే నిందలకు తలదించేఖర్మ నాకు లేదు. జరిగింది చెప్తాను.

ఎప్పుడో - కొన్నిసంవత్సరాల క్రిందట - పసితనంకూడా వదలని - నన్నూ నా చెల్లినీ మా దౌర్భాగ్యానికి విడిచి - మా అమ్మ ... మా అమ్మ .... లేచిపోయింది. చచ్చిపోవటం కాదు ... లేచిపోయింది. నా కన్నతల్లిని నేను విమర్శించటం లేదు. కానీ మగవాణ్ణి దుయ్యబట్టే నువ్వు — నా తల్లి లాంటి ఆడదాన్నికూడా గుర్తుపెట్టుకో!

ఆ అవమానంతో కృంగి కృశించి మా నాన్న చచ్చి పోయాడు.

ఒక్కగానొక్క చెల్లెల్ని నా వెంటబెట్టుకుని అడుక్కు తిని పెంచాను. నా కడుపుమాడ్చుకుని దానికడుపు నింపాను. నేనంటూ వున్నాననే ధైర్యంతో అది గర్వపడేలాగా పెంచాను.

దానికి పెళ్ళికూడా చేశాను. నేను చెయ్యలేను- భగ

పంతుడు చేశాడు.

నా చెల్లి సుఖంగా బ్రతుకుతోందని నేను నిశ్చింతిగా రోజులు గడుపుతున్నాను. కానీ...ఆ చెల్లి చచ్చిపోయిందని నాకు టెలిగ్రాం వచ్చింది. అది చదువుతోంటే నాకళ్ళ చీకట్లు కమ్మాయి. చైతన్యం గోల్పోయి రాయిలాగా వుండిపోయాను. తేరుకోగలిగిన వెంటనే గబగబా నాకు వున్న కొద్దిపాటి సామానూ సర్దేసుకున్నాను. నేను లేకుండా ఇంటికి అద్దె ఇవ్వ గలిగే తాహతు నాకులేదు. ఏవో ఒకటి రెండు సామాన్లు వది లేసి ఇల్లు ఖాళీచేసి తిన్నగా ప్రెస్ మేనేజర్ దగ్గిరికి వెళ్ళాను—ఒక నెలరోజులు శెలవు యిమ్మని అడిగాను. వీలుకాదన్నాడు. టెలిగ్రాం చూపించి ఎంతో వినయంగా ప్రార్థించాను. అలాంటి దొంగవార్తలు ఎన్నయినా సృష్టించవచ్చని మండి పడ్డాడు. వాడి వుద్యోగానికీ వాడికీ గుడ్‌బై చెప్పేసి — తిన్నగా స్టేషన్‌కి పోయాను. రైలు ప్లాట్‌ఫారంమీద సిద్ధంగా వుంది. పద్మినికి ఫోన్ చెయ్యాలని ప్రయత్నిస్తే అంతవరకూ వీలుకాలేదు. చివరిసారి స్టేషన్‌లో ట్రై చేశాను. మీ ఫోన్ ఎంగేజ్డ్. ఇక నాకు టైమ్ లేదు. వెళ్ళి రైలు ఎక్కి కూర్చున్నాను.

"సరే! తర్వాత ఒక్క వుత్తరంకూడా రాయకపోవ టానికి కారణం ఏమిటో?"

"మోహినీ! అసలు ఇదంతా నీకు చెప్పాల్సిన అవసరం నాకేంలేదు. కానీ పద్మిని సోదరిగా నిన్ను నేను గౌరవిస్తు న్నాను. నామీద నీకుకూడా దురభిప్రాయం వుండకూడదని ఇంతగా ప్రయత్నిస్తున్నాను. నే చెప్తోందంతా విని నీ అను మానాలు అడుగు. లక్షప్రశ్నలు వెయ్యి కాదనను.

నేను వెళ్ళేసరికి నాచెల్లెలుపోయి నాలుగురోజులైంది. విషజ్వరంతో మందూ మాకూ లేక చచ్చిపోయింది. అంత దూరం వెళ్ళి తల బాదుకొని ఏడవడంతప్ప నే నేమీ చేయలేక పోయాను. అక్కడికి వెళ్ళినరాత్రే నాకు తీవ్రంగా జ్వరం వచ్చింది. కన్ను తెరిచి వెలుగుచూడలేని పరిస్థితిలో రెండు రోజులు పడివున్నాను. నాలుగోనాటికి ఒంటినిండా పొక్కులు .. పొక్కులు .. కాళ్ళూ - చేతులూ - పొట్టా - వీపూ ఎక్కడా ఖాళీ లేకుండా - మొహంనిండా - కళ్ళమీదకూడా దట్టంగా పొక్కులు - మశూచికం అన్నారు తెలిసినవాళ్ళు. మందు లసలే వాడకూడ దన్నారు. నా చెల్లెలిభర్త - భార్యకి పెద్దఖర్మ చేయించేనాడే - రెండోపెళ్ళి చేసుకునే ప్రయత్నంలో వున్నాడు. నా చెల్లెలు భర్తతో ఎంత సుఖపడిందో నేను వూహించుకో గలిగాను. అలాంటి దౌర్భాగ్యురాలు చచ్చిపోవటమే చాలా మంచిదని సంతోషించాను. ఆ యింట్లో ఒక్క నిముషం కూడా వుండబుద్ధి కాలేదు. కాని ఒక్క అంగుళంకూడా కదలలేని పరిస్థితిలో వున్నాను - అంత నికృష్టస్థితిలో యమయాతన అనుభవిస్తూ - సరియైన ఆలనా పాలనా లేక నెల్లాళ్ళపైగా మంచంమీదే వున్నాను. కళ్ళు పూర్తిగా పోతాయని భయపడిన నేను ఎడమకంట్లో చిన్నపువ్వుతో బయటపడ్డాను. మరో నాలుగైదు రోజుల్లో లేచి తిరగగలిగే స్థితికి వచ్చాను - నాజబ్బులో - నా బాధలో - నాదుఃఖంలో - ప్రతీక్షణంలోనూ పద్మిని నాకు గుర్తువుంది. నేను చెప్పినా - నామనస్సు తెలుసుకుని నాకు సాయంచేసేవాళ్ళెవరూ లేరాయింట్లో. అలా పరాయి వ్యక్తులతో పద్మినికి వుత్తరం రాయించటంకూడా నాకిష్టం లేదు.

నేనే స్వయంగా జరిగినదంతా పద్మినికి చెప్పుకోవాలిగానీ - అన్నిరోజులు గడిచిపోయాక - వృత్తాంతం రాయటానికి మనస్కరించలేదు. నేను లేచి తిరగ గలిగిన వెంటనే తెలిసినవాళ్ళ దగ్గిర కొంచెండబ్బు అప్పుచేసి - బయల్దేరి వచ్చేశాను. ఇప్పుడు నాకు వుద్యోగం లేదు. అయినా పద్మినికోసమే వచ్చాను."

గోపాల్ మాటలన్నీ వింటూ ఆశ్చర్యంతో రాయిలా నించుంది మోహిని.

"ఇప్పటికీ నువ్వు నమ్మవా మోహినీ?" గోపాల్ నాలు గడుగులు వేసి దగ్గిరికివచ్చి నిలబడ్డాడు - "ఇలాచూడు." చేతులు ముందుకు తెచ్చి చూపించాడు. చటుక్కున చొక్కా ఎత్తి వీపు చూపించాడు-పొట్ట చూపించాడు.

మోహిని తనకోపోద్రేకంతో గోపాల్‌ని అంతవరకూ పరీక్షగా చూడలేకపోయింది. అతను చాలా నల్లటివ్యక్తి కావటంచేత శరీరంమీదిమార్పు దూరంనుంచి అంతుచిక్కలేదు. కానీ...అంత దగ్గిరిగా...గోపాల్‌నిచూస్తే కలవరంతో ఒళ్ళంతా జలదరించింది.

నల్లరాతినిండా పదునైన ఉలితో చెక్కులు చెక్కినట్టు గోపాల్ శరీరమంతా గుంటలు గుంటలు పడి దారుణంగా కన్పించింది. మొహంకూడా చెంపలమీదా - నుదుటిమీదా గుంటలతో అందవిహీనంగా వుంది.

"ఈ కన్నుచూడు మోహినీ! సరిగ్గా కన్పించటంలేదు. బట్టతెర కప్పినట్టు మసక మసకగా వుంటోంది." గోపాల్ ఎడమ కంటిని చూపించాడు.

మోహిని తలదించేసుకొంది. గోపాల్ చెప్తోన్న ప్రతీ

మాటా అక్షరాలా నిజమని అంతరాత్మ గాఢంగా విశ్వసిస్తోంది.

"కానీ ...కానీ..." తల ఎత్తి దిగులుగా చూస్తూ అడిగింది—"అక్కయ్య ఉత్తరం మీకు అందనేలేదా?"

"లేదు మోహినీ! నిజంగా పద్మినిరాసిన ఉత్తరం నాకేదీ అందలేదు. ఎప్పుడూ ప్రెస్ కే ఫోన్ చేసి మాట్లాడుతుందిగా? ఉత్తరం ఎదుకు రాసింది?"

"ఆ ఉత్తరం రాసేనాటికి అక్కయ్యకి నెలతప్పింది. తను తల్లిని కాబోతున్నానని తెలుసుకోగానే అక్కయ్య సిగ్గుపడిపోయి మీతో ముఖాముఖీ మాట్లాడలేనేమోనని — ఆ విషయాన్నే ఉత్తరంలో రాసిందట."

"మోహినీ!" గోపాల్ మొహమంతా కాంతివతం చేసుకుంటూ సంభ్రమంగా చూశాడు — "అంసుకేనా ఇంతసేపూ నాకు కనిపించకుండా కూర్చుంటే? ఫర్వాలేదు. నేనే పద్మిని దగ్గిరికి వెళ్ళి మాట్లాడుతాను. ఎక్కడవుంది?" తలతిప్పి మళ్ళా గదికేసి చూశాడు.

"కానీ...అక్కయ్య ఏమనుకుందో తెలుసా?"

"ఏమనుకుంది?"

"ఆ ఉత్తరం చూశాకే మీకేదో ద్రోహబుద్ధి పుట్టి హఠాత్తుగా వెళ్ళిపోయారనుకొంది."

"మోహినీ!" వెర్రిగా చూశాడు గోపాల్ - "పద్మిని నిజంగా అలా అనుకొందా? పద్మిని నన్ను శంకించిందా? నేను నమ్మను మోహినీ! పద్మినిని నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. పద్మినికూడా నన్ను గాఢంగా విశ్వసిస్తోంది, నేను

అంత ద్రోహం ఎలా చేస్తానని పద్మిని అనుకొంది? నేను పేద వాణ్ణేకానీ — దుర్మార్గుణ్ణికాను. నాకు డబ్బులేదుకానీ — హృదయంవుంది. నన్నే పద్మిని శంకించినప్పుడు ఈ ప్రపంచంలో ప్రేమకే విలువలేదు, మానవత్వానికే విలువలేదు."

మోహిని అనునయంగా అంది _ "అలా ఆవేశ పడటం కాదు, ఒక్కటి ఆలోచించండి. అక్కయ్య వుత్తరంరాసిన మర్నాడే వున్నట్టుండి మీరు హఠాత్తుగా మాయమైతే - రోజులతరబడీ ఒక్క వుత్తరంముక్కకూడా రాకపోతే - పెళ్ళి కాకుండా గర్భం తెచ్చుకున్న ఏ ఆడదైనా ఇంకేమను కొంటుంది?"

"ఏ ఆడదానిమాటా నాకవసరంలేదు. పద్మిని మాత్రం నన్ను అనుమానించదు."

"సంతోషంలో - సుఖంలో అందరూ ఒక్కలా వుండక పోవచ్చు. కానీ - కష్టాల్లో - దుఃఖాల్లో అందరూ ఒక్కలాగే ఆలోచిస్తారు. ఒక్కలాగే ప్రవర్తిస్తారు."

"అయితే పద్మినికి కోపం వచ్చిందా? నిజంగా నామీద కోపం తెచ్చుకుందా? ఒక్కసారి కన్పించమని చెప్పు మోహినీ! నేను నచ్చచెప్పుకుంటాను."

మోహిని తలదించుకుని నేలచూపులు చూస్తూ స్థాణువులా నించుంది.

గోపాల్ ఆవేశంగా అన్నాడు - "నేను బ్రతికివచ్చాను కాబట్టి ఇదంతా చెప్పగలిగాను. ఆ జబ్బులో నేను చచ్చిపోతే పద్మినికి నిజం ఎలా తెలిసేది? నేను మోసంచేశాననే భావిస్తూ జీవితమంతా గడిపేదా,"

"అయ్యో! ఇప్పుడు మాత్రం అక్కయ్యకి నిజం ఎలా తెలుస్తుంది?" మోహిని హీనంగా మొహానికి చేతులు కప్పుకుంది.

గోపాల్ ఆశ్చర్యపడ్డాడు - "మోహినీ! నువ్వెందుకలా బాధపడతావు! ఆ వంతునాది. పద్మిని ఎక్కడికి వెళ్ళిందో చెప్పు. నేను వచ్చానని, వెంటనే రమ్మని ఫోన్ చెయ్యి. పద్మినిని క్షమాపణ కోరేవరకూ ఈ రంపపుకోత నేను భరించలేను."

మోహిని దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది. తడబడే అడుగులతో పద్మిని గదిగుమ్మందగ్గిరికి వెళ్ళి తలుపులు తీసింది.

పద్మిని గదిలోనే వుండి తమ సంభాషణ అంతా వింటోందేమోనన్న సంభ్రమం గోపాల్‌ని ముంచెత్తింది. రెండడుగులు వేసి తనూ గదిముందుకు వెళ్ళి నిలబడ్డాడు. గదిలో పద్మిని.... లేదు. మోహిని కాయితంచుట్టిన ఫొటో పట్టుకుని బయటికి వచ్చింది - అయిష్టంగా గోపాల్‌కి అందించి గుమ్మాన్ని ఆనుకుని నించుంది.

గోపాల్ ఫొటో చూశాడు. — ఒంటినిండా పువ్వుల గుత్తులు కప్పివున్నాయి. మొహం మాత్రం పైకి కన్పిస్తోంది. కళ్ళు మూసుకుని పడుకునివుం దా యువతి-

"ఎవరు!...ఎవరు?...పద్మిని!...పద్మినేకదూ? ఎందుకిలా పడుకుంది మోహినీ!" ఆరాటపడుతూ అడిగాడు గోపాల్.

మోహిని ఒక్కసారి గోపాల్ మొహంలోకిచూసి తల దించుకొంది - "మీకు అర్థంకాలేదా!"

అదిరిపడ్డాడు గోపాల్- "అంటే!"

"అక్కయ్య...చచ్చిపోయిందండీ!"

"మోహినీ!" వెర్రి కేక వేశాడు గోపాల్ – "పద్మిని.... పద్మిని... చచ్చిపోయిందా? నా పద్మిని చచ్చిపోయిందా?... ఎందుకు?...ఎందుకు?" వణుకుతోన్న చేతులతో ఫొటో పట్టుకుని మళ్ళా మళ్ళా చూడబోయాడు. ఫొటో జారి కిందపడి పోయింది. గోపాల్ రెండుచేతులమధ్యా తల పట్టుకున్నాడు.

మోహిని పైట చెంగు నోటికి అడ్డంపెట్టుకుంది వెక్కి–వెక్కి–ఏడుస్తూ.

గోపాల్ ఆవేశంగా మోహిని దగ్గిరికి వెళ్ళి నిలబడ్డాడు – "నిజం చెప్పు. నేను నీ అన్నలాంటివాణ్ణి. నన్ను బాధపెట్టకు. నేను పద్మినికోసం తపించిపోతున్నాను. నిజంచెప్పు. ఆ ఫొటో ఎందుకు తీశారు?....పద్మిని ఎక్కడికి వెళ్ళింది?"

మోహిని నీళ్ళనిండిన కళ్ళెత్తి దీనంగా చూసింది – "నేను అబద్ధం చెప్పటంలేదు — నిజంగా ... అక్కయ్య ... చచ్చి పోయింది...ఏదో మందుతిని...."

"మందుతిని...మందుతినా? ఎందుకు? ఎందుకు మందు తింది? ... పద్మిని చచ్చిపోయిందా? నిజంగా చచ్చిపో యిందా?..." రెండుగుప్పిళ్ళతో తల పీక్కున్నాడు. – "ఎందుకింత ఘోరంచేసింది మోహినీ?"

మోహిని భయం భయంగా చెప్పింది — "మీరు ఎక్కడికో వెళ్ళిపోయారనీ...తనని పూర్తిగా మర్చిపోయారనీ....తనకి పెళ్ళికాకుండానే...కడుపు వచ్చిందనీ ఎంతో బాధపడిపోయి ... గోపాల్ నన్ను ... మోసం చేశాడు... మోసం చేశాడు...అంటూనే...ప్రాణాలు విడిచింది."

"పద్మినీ!" ఆడదానిలాగా బావురుమన్నాడు గోపాల్–

"నేను... నిన్ను మర్చిపోయానా? నిన్ను మోసం చేశానా? - అయ్యో! ఎంత తొందరపడ్డావు పద్మినీ! నువ్వు లేకుండా నాకీ ప్రపంచంలో ఎవరున్నారు? నిన్ను మర్చిపోతే నా బ్రతుకులో యింకేముంది? పద్మినీ! నామీద ఇంత నిందమోపటం నీకు ధర్మంగా తోచిందా? - నేను నిన్ను మోసం చెయ్యలేదు పద్మినీ! నీకోసం మృత్యుదేవతతో పోరాడి ప్రాణాలు దక్కించుకొని... నీకోసం... నీకోసం తిరిగివచ్చాను. నీదగ్గిర దోషిలా నిలబడి - సంజాయిషీ చెప్పుకోవాలని తపిస్తూ వచ్చాను. ఇలాంటి దుర్వార్త వినటానికా? ఇలాంటిఘోరం చూడటానికా? — పద్మినీ! నిన్ను నేను మోసం చెయ్యలేదు. మోసం చెయ్యలేదు. ఈ నిజం నీకెలా తెలుస్తుంది? ఎలా తెలుస్తుంది?" గోడకి తల బాదుకొంటోన్న గోపాల్‌ని మోహిని రెండుచేతులతో గట్టిగా పట్టుకుంది.

"చూశావా మోహినీ! పద్మిని నామీద ఇలాంటి నిందవేస్తే నేను భరించగలనా? నామీద అలిగి యింత దారుణం చేస్తే నేను సహించగలనా? నువ్వు చెప్పమ్మా! నువ్వుచెప్పు."

మోహినికి దుఃఖం పొర్లి పొర్లి వచ్చింది.

"నువ్విలా ఆవేశపడకు బావా!"

"బావా!" కన్నీళ్ళతో విస్మయంగా చూశాడు గోపాల్ - "నన్ను బావా అని పిలుస్తున్నావా?"

"అవును బావా! నువ్వు నా అక్కయ్య భర్తవి. ఈ సత్యం నేనిప్పటికైనా అర్థంచేసుకోగలిగాను."

"కానీ... కానీ .. ఈ రంపపుకోత నేను భరించలేనమ్మా! మీ అక్కయ్య నేనుచేయ్యని నేరానికి నాకు ఘోరమైన

శిక్ష వేసింది. పద్మిని నన్ను ప్రేమించింది. ఆరాధించింది. సర్వస్వం నాకు అర్పించింది. నన్ను తండ్రినికూడా చేయబోయింది. కానీ... ఆఖరిక్షణాలలో... నేనొక మోసగాణ్ణనీ ....దుర్మార్గుణ్ణనీ అనుకొందా?.. అసలు మీ అక్కయ్యే నన్ను ఘోరంగా మోసం చేసిందని నేనంటాను. అప్పుడు పద్మ నేంచెప్తుంది?"

గోపాల్ పిచ్చిధోరణిలో మాట్లాడుతోంటే మోహిని విస్మయంగా చూసింది — "నువ్వు శాంతంగా వింటానంటే నేనొకవిషయం చెప్తాను బావా!"

"ఏమిటది? ఇంకా నామీద వెయ్యాల్సిన అభాండాలేమైనా మిగిలాయా?"

"క్షమించు బావా! నిన్ను క్షమకోరే అర్హతకూడా నాకులేదు. కానీ జరిగిన విషయమంతా నీకు చెప్పకపోతే అక్కయ్యకికూడా ద్రోహంచేసినదాన్ని అవుతాను. చచ్చిపోయిన అక్కయ్య నిజానిజాలన్నీ నీకు చెప్పలేదు. అక్కయ్య నిన్ను అలాంటి పరిస్థితిలోకూడా గాఢంగా విశ్వసించింది. కానీ - నువ్వు మోసగాడివనీ - అందుకే వెళ్ళిపోయావనీ - అక్కయ్యకు భ్రమకల్పించింది నేనే!"

"మోహినీ!"

"అవును బావా! అక్కయ్య నిన్ను ఎన్నోవిధాల సమర్థించింది కానీ నేనే తర్కంతో అక్కయ్యని ఒప్పించాను. నిన్ను మర్చిపోవటం ఒక్కటేమార్గమని హెచ్చరించాను. పాపం అక్కయ్య నువ్వులేకుండా బ్రతుకలేనని ఏడ్చింది. నువ్వు మోసంచేశావని చివరిక్షణాల్లో నమ్మింది."

మోహినీ! ఎందు కింత పుణ్యం కట్టుకున్నావు? నీ కేం ద్రోహం చేశాను తల్లీ!"

"లేదు, నా కెవ్వరూ ద్రోహం చెయ్యలేదు. నేనుకూడా ఎవరికో ద్రోహంచేస్తున్నానని అనుకోలేదు. 'గోపాల్ నీకోసం తప్పకుండా వస్తాడు, నువ్వు తొందరపడకు.' అని అక్కయ్యకి నచ్చచెప్తే తప్పకుండా నీకోసం నిరీక్షిస్తూ వుండేది. కానీ అక్కయ్య ఇంత విరక్తి పెట్టుకుంటుందనీ - ఇలాంటి ఘోరం చేస్తుందనీకూడా నేను వూహించలేకపోయాను. అక్కయ్య గర్భవతి అనికూడా నాకు తెలీదు. మొదటే ఆ విషయం తెలిస్తే అక్కయ్యని అంత తొందరపెట్టేదాన్ని కాదు. అక్కయ్య ఏదో అఘాయిత్యం చేసిందని నేను గ్రహించినవెంటనే డాక్టర్ని పిలుస్తానని పరిగెత్తబోయాను. ఆఖరిక్షణాల్లో తనప్రాణంకు అలరిపాలు చెయ్య వద్దని నా కాళ్ళకు సంకెళ్ళు వేసింది. అయినా నేను ఫోన్ చెయ్యాలని పరిగెత్తాను. దగ్గిర ఎవ్వరూ లేకుండానే మంచంమీదినుంచి దొర్లి క్రిందిపడి చచ్చిపోయింది." బావురుమంది మోహిని.

కొయ్యబారినట్టు నిలబడ్డాడు గోపాల్ - దుఃఖం తగ్గించుకొంటూ అంది మోహిని - "నువ్వు అంత ముభావంగా నన్ను క్షమించకు బావా! నీకు తోచిన విధంగా తిట్టు, శపించు, నా మనస్సు తేలిక అవుతుంది."

మోహినీ! నిన్ను శిక్షించే అర్హత నాకు లేదు." వంగి నేలమీదపడ్డ ఫొటో తీసుకున్నాడు గోపాల్ - "వెళ్తాను," హఠాత్తుగా అన్నాడు.

"ఎక్కడికి?" అదిరిపడింది మోహిని - "నువ్వు ఎక్కడికి

వెళ్ళద్దు. అక్కయ్యలేని ఈ యింట్లో నువ్వాయినావుండు. నువ్వెక్కడికీ వెళ్ళటానికి వీల్లేదు బావా! అక్కయ్యకన్నా అపు రూపంగా నిన్ను చూసుకుంటాము."

గోపాల్ దీర్ఘంగా నిట్టూర్చాడు — "పద్మినిలేని ఈ ఇంట్లో నేనిక ఒక్కక్షణంకూడా నిలబడలేను. నేను వెళ్తాను. వెళ్ళిపోతాను. ఈ ఫొటోమాత్రం తీసుకు వెళ్తాను."

"ఎక్కడికి వెళ్తావు?" పిరికిగా చూసింది మోహిని.

"ఎక్కడికైనా వెళ్తాను. ఈ విశాల ప్రపంచంలో నాకు చోటులేదా?"

గోపాల్ మాటల్లోని దృఢత్వం మోహినిని మారు మాట్లాడనివ్వకుండా చేసింది - "పోనీ - ఎప్పుడైనా గుర్తువస్తే... ఇక్కడికి వస్తావా బావా?"

"చెప్పలేనమ్మా! నేను సృష్టికర్తనా? భవిష్యత్తులో ఏం చేస్తానో నాకిప్పుడేం తెలుసు?"

"నాకు ఒక్కమాట యిస్తావా?" మోహిని గోపాల్ దగ్గరికి వెళ్ళి నిలబడింది - "అక్కయ్యలా నువ్వుమాత్రం ఆవేశంతో ఎలాంటివనీ చెయ్యనని మాటయిస్తావా?"

"మనిషికి లేని విలువ మాటకు వుంటుందా మోహినీ? ఈమాటయిచ్చి నేను నిలుపుకుంటానని నువ్వు విశ్వసిస్తావా?"

"బావా! నన్ను క్షమించకూడదా?"

"క్షమ! క్షమ! అది ఇచ్చేశక్తి నాకులేదమ్మా! ఫొటో గుండెలకానించుకుని తడబడుతూ - తడబడుతూ - మెట్లకేసి నడిచాడు గోపాల్.

* * *

ఆ దిగ్భ్రమనుంచి తేరుకోవటానికి బ్రతుకంతా చాల పనిపించింది మోహినికి. మూర్తీభవించిన ఆ ప్రేమమూర్తిని చూస్తోన్నకొద్దీ తనో క్షుద్రకీటకంలాగా మారిపోతానని పించింది. పవిత్రమైన ఆ అనురాగపు వెలుగుల్లో తన దృష్టి మసకబారిపోల్పి అంధత్వం ఆవరిస్తుం దనిపించింది.

"అక్కయ్య మరణానికి చాలావరకు కారణం నేను! నేను! గోపాల్ కాదు. ఎంతమాత్రం కాదు. ఈ విషయం అక్కయ్యకెలా తెలుస్తుంది?"

మోహినిని జీవితమంతా ఆప్రశ్న వేధిస్తూనేవుంటుంది. సంవత్సరాలకు సంవత్సరాలే వృథాగాపోయే జీవితంలో ఒక్కొక్క క్షణం ఎంత అమూల్యమైనది అవుతుందో బాగా తెలిసి వచ్చింది.

గోపాల్ వంటి ప్రియుడికి దూరమైన అక్కయ్యేకాదు — గోపాల్‌లాంటి స్నేహితుణ్ణి — ఆప్తుణ్ణి దూరంచేసుకున్న తను కూడా ఎంతో దౌర్భాగ్యురాలు — మోహిని అంతరంగమంతా అశాంతిమయమై పోయింది.

మోహిని యథాప్రకారం మేడమీదికే నివాసం మార్చింది. ఉండాల్సిన రాక్షసత్వం అంతా తనగుండెల్లో వుంది — ప్రాణంలేని గోడల్ని గదుల్ని చూసి భయపడటం దేనికి?

మోహిని యథాప్రకారం కళాశిఖరంకూడా వెళ్ళ సాగింది.

* * *

"బాపూజీ హాల్‌లో ఫ్రాన్స్ కళాకారులు ప్రదర్శించ బోయే బాలే క్లాసికల్ డాన్సెస్‌కి హాజరైంది మోహిని.

సాధారణంగా మోహిని అలా అరుదుగా లభించే అవకాశాలు ఒదులుకోలేదు.

థియేటర్‌లో ఒక అపరిచిత యువకుడు మోహినిని విష్ చేశాడు - "నమస్తే! మోహినీదేవీ! మర్చిపోయారా?" అంటూ. తెల్లటి తెలుపు-పల్చటి కళ్ళద్దాలూ - ఆరూపం ఎక్కడో మస్తిష్కంలో అడుగుపొరల్లో కదలాడుతోంది... ఎంత ప్రయత్నించినా గుర్తుతెచ్చుకోవటం మోహిని వశం కాలేదు.

ఆయువకుడు నవ్వి కళజోడు చేతిలోకి తీసుకొంటూ - "అప్పటికీ యిప్పటికీ యిదే తేడా! అందుకే మీరు పోల్చలేక పోయారేమో! నేను...సుధాకర్‌ని. మీరు వియన్నా వచ్చినప్పుడు..." అంటూ గతాన్ని గుర్తుచేయబోయాడు.

మోహిని చాలా నొచ్చుకొంటూ — "వెరీ సారీ! ఎక్స్‌క్యూజ్ మీ! ... అబ్బ! ఎంత ట్రైచేసినా,...ఎక్కడో చూసి నట్టు వుందితప్ప...."

"అంత ఫీల్ కాకండి. దానికేముంది? ఎంతమందినో చూస్తూవుంటాం. గుర్తు నిలిచే ప్రత్యేకత ఎదటివారిలో వుండాలికదా?"

మోహిని చాలా షాక్ అయింది. ప్రదర్శన ప్రారంభం కావటంతో ఇద్దరూ రంగస్థలంకేసి చూస్తూ మూభావంగా కూర్చున్నారు.

నృత్యానికి గీతాలులేవు. నేపథ్యసంగీతం-చాలా సున్నితంగా లయకోసంమాత్రమే కొంచెం దోహదం చేస్తోంది. రంగాలంకరణ ఇతివృత్తంతాలూకు పరిసరాల్ని తెలియజెప్పటం

లేదు. డాన్సర్స్ దుస్తులలోకూడా ఏవిధమైన ఆడంబరాలూ లేవు. అలంకారాలూ ఆభరణాలూ అసలే లేవు. నృత్యానికి అనువుగా వుండటానికి బిగువైన దుస్తులు పురుషులూ - పెద్ద పెద్ద కుచ్చెళ్ళ పరికిణీలు స్త్రీలూ ధరించారు.

కథకు సంబంధించిన భావాలు ముఖాలలో ఎంత మాత్రం ప్రదర్శించబడటంలేదు. కథలో పాత్రలపోషణ కేవలం అంగవిన్యాసాలద్వారాను-కదలికలద్వారాను - వెల్లడిచేయటం చూస్తే 'బాలే' లో ఒక్క నృత్తానికి తప్పితే - మరి దేనికీ ప్రాధాన్యత లేదని తెలిసింది భారతీయ ప్రేక్షకులకు.

బాలేనృత్య సాంప్రదాయాలతో అంతగా పరిచయంలేక పోయినా - ఆ నృత్యాలలోని కళావైశిష్ట్యాన్ని అవగాహన చేసుకోవాలని ప్రయత్నించింది మోహిని.

"రోమియో జూలియట్"ల గాథ నృత్యరూపంగా జరిగింది. ప్రేక్షకులంతా చాలా ఆసక్తితో నృత్యాలు చూశారు. బాలెరినా జూలియట్‌గా విషాదాన్ని ఎంతో సహజంగా పోషించింది. మిగిలిన ఐటమ్స్‌లోని కథావస్తువులు అంతగా తెలిసినవి కాకపోయినా కళాభిమానంగల ప్రేక్షకులు అంతగా నిరుత్సాహం చెందలేదు. చక్కని అంగసౌష్టవం-ముఖసౌందర్యం గల బాలేనర్తకులు కొంగరెక్కల్లాంటి దుస్తులతో దూదిపింజెల్లా గాలిలోకి సునాయాసంగా ఎగిరిపోతూ నృత్యంచేస్తోంటే ప్రేక్షకులంతా ముగ్ధులై చూశారు.

మూడు గంటల ప్రదర్శన మూడు నిముషాల్లా గడిచిపోయింది.

ఐటమ్‌కీ ఐటమ్‌కీ మధ్య మధ్య సుధాకర్ మోహినితో

మాట్లాడాలని ప్రయత్నించి మోహిని చాలా ముభావంగా వుండటంతో వూరుకున్నాడు. ప్రదర్శనానంతరం మాత్రం చనువుగా అడిగాడు — "మీకేం అభ్యంతరం లేకపోతే నా కారులో మిమ్మల్ని డ్రాప్ చేస్తాను."

"థాంక్స్" చిరునవ్వునవ్వుతూ లేచి నిలబడుతూ అంగీకారం తెల్పింది మోహిని.

థియేటర్ దాటి జనంలోంచి బయటపడింది కారు.

"బాలే డాన్సస్ ఎలా వున్నాయి మీకు ?" కారు స్లో చేస్తూ అడిగాడు సుధాకర్.

గాలికి ఎగురుతోన్న జుత్తు ఎడంచేతితో సర్దుకొంటూ అంది మోహిని— "నేను వియన్నాలో ఓసారి చూశాగా! వాళ్లు చేసిందంతా మనకి అర్థంకాకపోయినా ... ఫర్వాలేదు. చాలా వరకు ఫాలో కావచ్చు."

"నాకుమాత్రం మన భరతనాట్యమే చాలా బాగుంటుంది."

నవ్వింది మోహిని—"అది మన అభిమానంలో వుంటుంది. కళ అంటే ఎవరిదైనా ఒకటే. మన అలవాట్లూ— అభిరుచులూ కొంచెం మార్చుకోగలిగితే అన్ని సాంప్రదాయాలూ విశిష్టంగానే కన్పిస్తాయి. వాటిలో అందాలు అర్థమౌతాయి - నిజానికి మన శాస్త్రీయ నృత్యాలన్నిటికీ సంగీతం ఎంతో సహాయకరంగావుంటుంది. సాహిత్యం కథనంతా విప్పి చెప్తూవుంటుంది. రంగాలంకరణద్వారా పరిసరాలేమిటో తెలుస్తూ వుంటాయి. దుస్తులూ - నగలూ - ముస్తాబులూ - ఇవన్నీ పాత్రతత్వాన్ని తెలియబరుస్తూనే వుంటాయి. ఇహపోతే అంగవిన్యాసం బాగా

లేకపోయినా ముఖ కవళికలద్వారా అభినయం బాగా చూపించ వచ్చు. ఇన్నిటి సహాయంతో నాట్యంచేయటం చాలా తేలిక. అప్పటికికూడా ఫెయిలౌతూనేవుంటాం మనం.

బాలేలో మనకున్న అవకాశం ఒక్కటికూడా లేదు కదా ! డాన్సర్ సంగీతంమీదా - సాహిత్యంమీదా - అభినయంమీదా - వేషమీదా ఆధారపడటానికి వీలు లేదు. గీతం - సంగీతం - అభినయం ఏమీ లేకుండా - కేవలం నృత్తంతో కథను ప్రదర్శించి ప్రేక్షకుల్ని మెప్పించగల్గటం చాలా కష్టం కదూ ? శాస్త్రీయమైన నృత్తం ఎంత నేర్చుకున్నా - దానితోనే రకరకాలపాత్రల్ని సృష్టించగలగటం డాన్సర్ శక్తి మీదా - విశిష్టమైన వ్యక్తిత్వంమీదా ఆధారపడివుంటుంది. బాలే డాన్సర్ గా పేరు తెచ్చుకోటానికి మాత్రం చాలా కళాత్మకమైన ప్రతిభ కావాలి."

"డాన్సర్ గా పేరు తెచ్చుకోవటం అలా వుంచండి. అసలు బాలే చూసి అర్థంచేసుకోవటానికే చాలా శక్తి కావాలి. ఎన్నిసార్లు చూసినా నాకా శక్తి కొరవడుతూనే వుంది." నవ్వుతూ చూశాడు సుధాకర్ - "నిజానికి బాలే డాన్స్ని ఎప్రిషియేట్ చెయ్యగలిగేవాళ్ళకి - మన డాన్సెస్ చూస్తే చాలా పేలవంగా తోస్తుందేమో !" అన్నాడు.

"ఏ రెండు సాంప్రదాయాలకీ ముడిపెట్టకూడదు, దేని అందాన్ని దానిలోనే అనుభవించాలిగానీ, ఒకదానితో ఒకటి పోల్చిచూడటం మనోవికాసంలేనివాళ్ళు చేసేపని. భరతంలో వున్న సౌందర్యం - ఆనందం బాలేలో కన్పించవు. అలాగే బాలేలో పొందే సుఖం - అనుభూతీ భరతంలో పొందలేం.

జీనితత్వం దానిదే. దేని విలువ దానిదే. వంకాయ పుల్లికారం లాగా అరటికాయపోపు లేదంటే ఎలా!" నవ్వుతూ అంది మోహిని.

సుధాకర్ కూడా నవ్వాడు – "రెండూ కూరలే కాబట్టి రెంటికీ సామ్యం కుదరాలని వాదిస్తారు నాలాంటివాళ్లు – అంటే మనోవికాసం లేనివాళ్లు."

సుధాకర్ అంత ఫ్రీగా నవ్వకపోతే – అతను తనమాటలకు నొచ్చుకున్నాడని మోహిని అనుమానించేదే!

సుధాకర్ నవ్వుతూ మళ్లా అన్నాడు— "నాకు అరటికాయకూర బొత్తిగా యిష్టం వుండదు. రుచీ పచీ లేకుండా చప్పగా చతుకులా వున్నట్టుంటుంది. నా పక్కన కూర్చున్న వాళ్లెవరైనా అరటికాయపోపు తింటోంటే నాకు వాళ్ళమీద పుట్టెడు జాలివేస్తుంది."

మోహిని నవ్వుతూ సుధాకర్ కేసి చూస్తూ మాటలు వింటూ కూర్చుంది.

"కానీ... రేపట్నుంచీ అప్పుడప్పుడూ అరటికాయకూడా తింటాను."

హాస్యంగా అంది మోహిని–"అరటికాయ కాదు. అరటికాయకూర తినండి. చిప్స్‌తో మొదలు పెట్టండి."

"తర్వాత ? పోపు తినమంటారా?"

"నేననటం ఏమిటి? రుచి తెలిస్తేసరి. మీరే తింటారు."

ఇద్దరూ నవ్వుకున్నారు.

సుధాకర్ చాలా ఫ్రీగా వున్నట్టుతోచింది మోహినికి.

"ఇంతకీ మీకు బాలే డాన్సెస్ ఎలావున్నాయో చెప్ప

లేదేం?" అంది మోహిని.

"ఏమిటో అక్కడ చూసినా అర్థంకాలేదు. మీరు వాటిగురించి చెప్పినా అర్థంకాలేదు. పోనివ్వండి. నాకే కళా హృదయం లేదనుకుంటాను."

మోహిని ఆశ్చర్యం ప్రకటించింది - "అంత ఇంటరెస్ట్ లేకుండా మీరీ ప్రదర్శన కెలావచ్చారు?"

"అర్థంకానివాటినే అన్వేషించటం సరదాగా వుంటుంది నాకు."

మోహిని మౌనంగా వూరుకుంది.

"ఇంకో కారణంకూడా చెప్పమంటారా? ఏదేశాలతో మన సాంస్కృతిక సంబంధాలు విస్తృతం కావాలని కోరుకునే వాళ్ళలో నేనూ వున్నాను. అందుచేత వాళ్ళ ప్రదర్శనలకు హాజరయ్యే బాధ్యత నామీదా వుందనుకున్నాను. బయల్దేరి వచ్చేశాను."

"గొప్పపని చేశారు" అందామనుకుంది మోహిని. నవ్వి వూరుకుంది.

సుధాకర్ స్వతహాగా చాలా ముభావంగా గంభీరంగా వుండే వ్యక్తి. ఏదో ఒక ప్రత్యేకత జరుగుతోన్నప్పుడూ- అది తనకు చాలా ఇష్టమైనప్పుడూ మాత్రం - తన ప్రయత్నం లేకుండానే తను ఎక్కువగా మాట్లాడుతాడు. మనసారా నవ్వు తాడు. ఎదటివాళ్ళతో కలిసిమెలిసి ప్రవర్తిస్తాడు. మోహిని స్నేహమాధుర్యాన్ని చవిచూడాలన్నకోరిక అతనికి చాలా కాలం క్రిందటే కల్గింది. అనుకోనివిధంగా హఠాత్తుగా మోహినిని కలుసుకుని తనకారులో తీసుకురావటం ప్రత్యేకతగల

విషయమే.

"మీరు బెనారస్ నుంచి ఎప్పుడు వచ్చారు ?" గాలికి రేగుతోన్న జుత్తు సరిదిద్దిపెట్టుకోటానికి పైటకొంగు పాపిడిమీదుగా కప్పుకొంటూ అంది మోహిని.

సుధాకర్ మోహినికేసి కుతూహలంగా చూశాడు. "మీరు మనసు చేసుకుంటే గమ్మత్తుగా వుంది" అన్నాడు కళ్ళజోడులోంచి తదేకంగా చూస్తూ.

మోహిని తెల్లబోయింది. సుధాకర్ మొహంలోకి చూసింది - "మీరు బెనారస్ నుంచి ఎప్పుడువచ్చారని అడిగానండీ !" అంది చిరునవ్వు నవ్వుతూ.

"విన్నాను." మొహం తిప్పుకుని కారు అద్దంలోంచి రోడ్డు పొడవునా ఓసారి చూశాడు. "నేనువచ్చి నాలుగు రోజులైంది. మీకు ఫోన్ చేసి - మీకు వీలైనప్పుడు కలుసుకోవాలని అనుకొంటూనే వున్నాను. అనుకోకుండా...ఇవ్వాళ..." మాటలు అపుజేసి మోహినికేసి చూశాడు.

కారు ఒక భవంతిముందు ఆగింది.

"ప్లీజ్ మోహినీదేవీ! మాయింట్లో కొంచెం టీ తీసుకుని వెళ్ళాలి మీరు."

మోహిని అభ్యంతరం చెప్పలేదు.

ఘూర్ఖా గేటు తీశాడు.

కారు తిన్నగా లోపలికి వెళ్ళింది.

ఇద్దరూ దిగి పోర్టికోలోకి వెళ్ళారు. భవంతి అంతా విద్యుద్దీపాలతో దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది.

సుధాకర్ మోహినిని చాలాగదులు దాటించి మేడ

మీద గదిలోకి తీసుకువెళ్ళాడు. కుర్చీలతో - మేజాలతో సోఫాలతో - తివాచీలతో భవంతి అంతా ఎంత ఆడంబరంగా వుందో ఆగది అంత నిరాడంబరంగా వుంది. ఒక వ్రాతబల్ల - రెండు పేముకుర్చీలూ పుస్తకాల షెల్ఫూ తప్పితే మరోవస్తువు లేదు.

"ఇక్కడ నేను అప్పుడప్పుడూ కూర్చుని రాసుకొంటూ వుంటాను." అన్నాడు సుధాకర్.

తర్వాత లైబ్రరీగదీ - పడకగదీ - భోజనంచేసే గది అన్నీ చూపించాడు. సుధాకర్ స్థితిగతులు చాలా అధికమైనవిగా తోచాయి మోహినికి. "మీ అమ్మగార్ని చూస్తాను." అంది కుతూహలంగా. "మా అమ్మ ఎస్టేట్ వదలి ఎప్పుడూ ఎక్కడికీ రాదు. ఆవిడ చాలా పూర్వకాలం మనిషిలెండి. నాన్నగారు అప్పుడప్పుడూ వచ్చి యిక్కడ వ్యవహారాలు చూసుకొంటూ వుంటారు. బెనారస్ నుంచి నేను శెలవుల్లోవస్తే అక్కడా యిక్కడా కూడా వుండేవాణ్ణి. ఇప్పుడు కొన్నాళ్ళపాటు యిక్కడే వుందా మనుకొంటున్నాను - ప్రస్తుతం ఈ యింట్లో నేనుతప్పితే ఎవ్వరూ లేరు."

సుధాకర్ తల్లిని చూడాలనుకున్న మోహినికి చాలా నిరాశ కలిగింది.

"అలా కూర్చోండి మోహినీదేవి! కొంచెం టిఫెన్ తీసుకోండి."

బట్లరువచ్చి బల్లమీద ఏవేవో అమర్చి వెళ్ళాడు.

"నేను ఇప్పుడేం తీసుకోలేను. క్షమించాలి" అంటూ మోహిని సింపుల్‌గా టీ కేటిల్ అందుకుంది. టీ కలిపి

కప్పులోపోసి ఒకటి సుధాకర్‌కి అందించింది. "మోహినీ దేవీ ! నాకో కోరిక వుంది. అది పెద్దదో చిన్నదో మీరు చెప్పాలి."

మోహిని నవ్వింది – "కోరిక ఎంత చిన్నదయినా తీరక పోవచ్చు. ఒక్కోసారి ఎంత పెద్దదయినా తీరిపోవచ్చు. కాబట్టి పెద్దదా ? చిన్నదా ? అని చూసేకన్నా తీరేదా ? తీరనిదా ? అని ఆలోచించండి" అంది హాస్యంగా.

"అది మీరే చెప్పాలి."

"ముందు మీ కోరికేమిటో చెప్పండి."

సుధాకర్ టీ కప్పు బల్లమీదపెట్టి మోహినివైపు గంభీరంగా చూస్తూ అన్నాడు – "మీ 'రాధహృదయం' గీతం మరొక్కసారి వినాలని వుంది."

మోహిని నవ్వింది – "ఒక్కసారేనా ?"

"నిజం మోహినీదేవీ ! ఒక్కసారి కాదు. వెయ్యిసార్లు విన్నా నా కోరిక కోరికగానే వుంటుంది."

"అంత నచ్చటానికి ఆ పాటలో ఏం వుంది ?"

"ఏం వుందా ? ఏం వుందని మీరు పాడారో మీకు తెలీదా ?"

"నాకేం తెలీదు." నవ్వుతూ అంది మోహిని — "కేడియోవాళ్ళెదో పాట యిచ్చారు. పాడమన్నారు. పాడాను. రికార్డు చేశారు. ఇప్పుడా సాహిత్యం కూడా సరిగ్గా గుర్తులేదు."

సుధాకర్ చాలా నిశితంగా చూశాడు. అతని మొహానికి కళ్ళజోడు చాలా అందంగా వుంది. మాటిమాటికీ అతని

మొహంకేసి చూడాలనిపిస్తోంది. కళ్ళజోడే లేనప్పుడు సుధాకర్‌లో యింత ఆకర్షణ లేదు.

"నిజం మోహినీదేవీ! ఆ పాట మీరు మర్చిపోయినా నాకు ప్రతీచరణం - ప్రతీపాదం - ప్రతీమాటా గుర్తున్నాయి. ఆపాటలో ఏం వుందో అర్థంచేసుకుని మరీ మీరు పాడితే..." ఎలా వుంటుందో వూహిస్తూ నిట్టూర్చాడు సుధాకర్.

మోహిని టీకప్పు బల్లమీద పెడుతూ అంది — "మీకోరిక తీరుతుందిలెండి. ఎప్పుడేనా మా యింటికివస్తే పాడి విన్పిస్తాను."

సుధాకర్ మొహంలో సంతోషం స్పష్టంగా కన్పించ లేదు. కానీ అతను సంతోషిస్తాడని మోహినికి తెలుసు - లేచి నిలబడుతూ అంది - "మీరచన లేమైనావుంటే యిస్తారా? చదివి యిస్తాను."

"నా రచనలు పెద్దపెద్దవి కావు. చిన్నచిన్న పాటలు, పద్యాలు. ఇంకా చెప్పాలంటే మీ విమర్శలకి ఆగలేనేమో! అయినా మీరు చదువుతానంటే తప్పకుండా యిస్తాను."

సుధాకర్ అల్మైరా తెరిచి అందంగా బైండ్ చేసివున్న పెద్దపుస్తకం తీసియిచ్చాడు- "కొత్తగా ఏదైనారాస్తే ఇందులో జతపరుస్తూవుంటాను. చదివి మీ అభిప్రాయంకూడా చెప్పండి."

"తప్పకుండా. కానీ సాహిత్యం గురించి నాకంతగా ఏం తెలీదండీ!"

"ఫర్వాలేదు. తెలిసిందే చెప్పండి." చిరునవ్వుతో చూశాడు సుధాకర్.

ఇద్దరూ క్రిందికి వచ్చారు. కారు భవంతి దాటింది.

సుధాకర్ యిచ్చిన పుస్తకం పేజీలు తిరగ వేస్తోంటే ఇంద్రజాలంలా తోచింది మోహినికి.

తెల్లగా మిసమిసలీనుతోన్న కాయితాలమీద పూసలు పేర్చినట్టు - ముత్యాలసరాలు అతికినట్టు - చేతివ్రాత కన్పించింది. ఆ రాతచూస్తే ఏదో ఆనందం ముంచుకు వచ్చింది.

అచ్చు ... అచ్చుకూడా అంత మనోహరంగావుండదు. ఎంత పొందిగ్గావున్నా అయాంత్రికత్వంలో అనుభూతి వుండదు.

ఈ అక్షరాలు ... ఇవి అక్షరాలా? అద్దంమీద చిందిన పాదరసంబొట్లు మల్లెరేకులమీద నిల్చిన మంచుబిందువులు! తెల్లని ఆకాశంలో మెరిసిపోతోన్న నక్షత్రాలమాలలు! - చేతివ్రాత యింత అందంగా వుండటం ఎంత అదృష్టం! - ఎక్కడో చదివింది మోహిని! - 'కుదురుగా - ముచ్చటగా సౌందర్యం వుట్టిపడుతోన్నట్టు వ్రాయగలిగేవాళ్ళ మనస్తత్వంకూడా అంత సౌందర్యవంతంగానూ వుంటుం'దని - పేజీకి నాలుగువైపులా పెద్ద పెద్ద మార్జిన్లు వదలి అక్షరాలూ - చరణాలూ - రెండువైపులా వరుసక్రమంలో తీర్చిదిద్దినట్టు రాయబడివున్నాయి గీతాలన్నీ. చాలాసేపు పేజీలన్నీ తిరగ వేసి చేతివ్రాతచూసి - తర్వాత వరుసగా —

సుధాకర్ కవితలన్నీ చదువుతూ కూర్చుంది, చదివిన కొద్దీ చదివించే మాధుర్యంవుంది ఆ కవితలలో. చక్కనిమాటల పొందికతో - సున్నితమైన భావాలతో - లయబద్ధమైన సంగీతంలావుంది ఆ కవనం.

కవిహృదయంలో చాలావరకూ గులాబీ పరిమళాలూ- పౌర్ణమి వెన్నెలలూ - అంబరంలో విహరించే అప్సరసలూ

నిండివున్నారనిపించింది.

అంతేగాక - కవిమనస్సులో నిర్వేదంకూడా కన్పించింది. సువాసన వెదజిమ్మలేని గడ్డిపువ్వునుచూసి జాలిపడ్డాడు కవి. వాడిపోతోన్న సన్నజాజికోసం కన్నీళ్ళు కార్చాడు. వయస్సు మళ్ళిన వృద్ధునిస్థితికి సానుభూతి కనిపించాడు.

మధురప్రవాహాలతో పాటు అర్థంలేని అశాంతీ-అసంతృప్తి కూడా ఆ కవితలలో కన్పించాయి. కవనంలోని తీపిని విడిచిపెట్టలేక పుస్తకంలో కవితలన్నీ ఎన్నోసార్లు చదివినట్లే చదివింది మోహిని.

"మీ కవితలు చదువుతోన్నంతసేపూ ఏదో అవ్యక్తమైన ఆనందం కల్గింది నాకు. కొన్నికొన్నిగీతాలు నామనస్సులో అలా కదలాడుతూనే వున్నాయి." అంది మోహిని తర్వాత సుధాకర్ని కలుసుకుని కవితలవిషయం ప్రసంగిస్తూ సుధాకర్కి సంతోషం కల్గినట్టు కన్పించింది —

"బావున్నాయంటారా ?" అన్నాడు మెరిసే కళ్ళతో.

"కానీ..." సందేహిస్తూ సుధాకర్ మొహంలోకి చూసింది మోహిని.

"ఏమిటీ? చెప్పండి."

"మీ కవితాపరిధి చాలా చిన్నదేమో ననిపించింది నాకు."

"అంటే?"

"మీ కవితా వస్తువులలో ఒక ప్రత్యేకతగానీ- ప్రయోజనంగానీ లేవేమో! వెన్నెల అందంగా వుందని సంతోషిస్తూ ఓ కవితా ... సువాసన లేదని విచారిస్తూ

ఓ కవితా —— ఇలా సర్వసామాన్యమైన విశేషాల గురించి మాత్రం కవితలల్లుతున్నారు వీరారు."

సుధాకర్ ఒక్కక్షణం మౌనంగా చూసి అన్నాడు — "మీరు చెప్పింది నిజమే. కానీ అవి సర్వసామాన్యమైన విషయాలని మీరనుకున్నారు. నే ననుకోలేదు."

"ఎవరు అనుకున్నా - అనుకోకపోయినా అవి సర్వసామాన్యమైనవే." నవ్వింది మోహిని.

"మోహినీదేవీ! ఆలోచనలకు మూలం ఏదో తపన — బాధఅని మీరు ఒప్పుకుంటారా? నా విషయంలో వాటివ్యక్తీకరణలే ఈ గేయాలు. చిన్నతనంనుంచీకూడా నాకు వెన్నెల రాత్రులంటే చాలా యిష్టం. ఎంత యిష్టమంటే పౌర్ణమిరోజు నేను నిద్రపోకుండా గంటలతరబడి చందమామనీ వెన్నెల వెలుగునీ చూస్తూ కూర్చుంటాను. చందమామ మబ్బుల వెనక దాక్కుని కనిపించకుండా అయిపోతే నా మనస్సంతా ఏమిటో తల్లడిల్లిపోతుంది. ఎంత సముదాయించుకున్నా చందమామ తిరిగి కన్పించేవరకూ క్షణం ఒక యుగంలా గడుస్తుంది. ఆ బాధలో ఏదో రాసెయ్యాలనిపిస్తుంది, నాకు తెలీకుండానే ఏదో భావం మనస్సులో మెదులుతుంది. కవితకు అదే ఆత్మ అవుతుంది. మిగిలిన భాగమంతా దానికదే గిజిగాని గూడులా అల్లుకుపోతుంది.

రకరకాల పువ్వులు విరిసిన వుద్యానవనాన్ని చూస్తోంటే చిత్రమైన పారవశ్యం కల్గుతుంది. నాకే అర్థంకాని మధురవూహాలతో కవితాకల్పన జరుగుతుంది. మానసికమైన ప్రేరణ లేకుండా నే నేదీ రాయలేదు. ఆ ప్రేరణ ఎప్పుడువస్తే అప్పుడు

రాయటం పొరపాటా ? అంత సామాన్యమైన విషయాల నుంచి నా కిలాంటి ప్రేరణ ఎందుకు జరుగుతోందో నాకు అర్థం కాదు."

మోహిని సుధాకర్ మాటలు వింటూ అతని ముఖ కవళికలు చూస్తూ ఆశ్చర్యపడింది. యుక్తవయస్సులో ఇంత పసితనం ఎలా వుంటుంది!

సుధాకర్ సంపన్నులబిడ్డ - సామాన్యుల బాధలూ - కష్టాలూ - కన్నీళ్ళూ అతనికి నుంచి పరిచితాలుకావు. అతను వెన్నెల చూచి ఆనందిస్తాడు. చీకటిని చూస్తూ విచారిస్తాడు. అతని బాధలుకూడా మధురంగా ఉంటాయి. అతనికి కన్నీళ్ళొస్తే కమ్మగా వుంటాయి. అతనిహృదయం గాలి తాకిడికి కూడా స్పందిస్తూ వుంటుంది. అతనిమేధ మృదు మధురంగా కావ్యసృష్టిచేస్తూ వుంటుంది.

సుధాకర్ ని అర్థం చేసుకోవాలని ప్రయత్నించిన మోహినికి చాలా అసంతృప్తి కలిగింది. ఇలా ఎదగని మనస్సులతో వ్యక్తులు జీవితాన్నెలా తీర్చి దిద్దుకుంటారు?

పెదవులువిచ్చి చిరునవ్వుచిందుస్తూ చూసింది మోహిని. సుధాకర్ చూపులు రెండూ మోహిని పెదవులమీద - ఆ మృదు త్వంమీద పారాడాయి. ఆ నవ్వు అతన్ని అతిగా ఆకర్షిస్తుంది.

"సుధాకర్ ! ఇలాంటి సెన్సిటివ్ నెస్ జీవితానికి పనికి రాదు. పైగా సమస్యలు కూడా తెచ్చిపెడుతుంది."

సుధాకర్ మోహిని చిరునవ్వులో లీనమై పోయాడు.

"అవునేమో ! దానికి నేనేం చెయ్యగలను ?"

"ఎందుకు చెయ్యలేరు ?" రెట్టించింది మోహిని-

"మొదట మీ దృక్పథం మారాలి. అన్ని విధాలా మీ పరిస్థితులు సామాన్య ప్రజానీకంనుంచి వేరు కావచ్చు. అయినా ఒక కళాకారుడిగా మీరు ప్రజలకోసం చెయ్యాల్సింది ఎంతో వుంది. కళలన్నిటిలోకీ సాహిత్యం చాలా వుత్తమ మైనది అంటాను నేను. నూటికి నూరుపాళ్లూ ప్రయోజనం సాధించే కళ సాహిత్యం. పాఠకుడి హృదయాన్ని ఆకట్టి అంతరంగాన్ని నిలవేసి చేష్టల్ని శాసించే శక్తి సాహిత్యానికి వుంది. నిజంగా నేను రైటర్‌ని కానందుకు విచారించే సందర్భాలు ఎన్నో చెప్పలేను. అంత ప్రయోజనాత్మకమైన రచనా నైపుణ్యం - కవితాశక్తి వున్నాయి మీకు. చదివే వాళ్ళకు పారవశ్యమే కాకుండా వుద్వేగం కూడా కల్గించే భాషాజ్ఞానం మీ కవిత. సామాన్యమానవుణ్ణీ- సంఘాన్నీ దృష్టిలో పెట్టుకుని- మానవత్వపు విలువలకోసం కళాకారుడు శ్రమించినప్పుడే కళలు సార్థకమాతాయి."

మోహిని మాట్లాడుతోన్న ప్రతీమాటా అపూర్వంగా విప్పించింది సుధాకర్‌కి; ఎప్పుడూ తనువినని కొత్తవిషయాలేవో మోహిని చెప్తోన్నట్టు విస్మయం కల్గింది.

"కానీ మోహినీదేవీ! నాకు తెలీని విషయాలగురించి నేనెలా రాయగలను ?"

కించిత్తు తిరస్కారభావంతో చూసింది మోహిని - "మీకు తెలీని విషయాలా ? ఏమిటి మీకు తెలీసు !... మన దేశం ఎలావుందో మీకు తెలీదా ? మన సంఘం ఎలావుందో మీకు తెలీదా ? మన సంస్కారం - మన నాగరికతా ఎలా వున్నాయో మీకు తెలీదా ? వాటిగురించి మీరు రాయటానికేమీ

కన్పడదా ! చంద్రుడు మబ్బులచాటుకు పోవటంతప్పితే మన జీవితాల్లో మీ కవితావస్తువులకు సమస్యలేలేవా ? మనమంతా సమస్యారహితంగా - సుఖంగా శాంతిగా బ్రతుకుతున్నామా? భూమి స్వర్గసీమలా అయిపోయిందా ? సుధాకర్! ఒక పేదవానికి కష్టం మీకు తెలియకపోవచ్చు. కాని దాన్ని గురించి ఆలోచించాలనే ఇచ్ఛ మీకు వుండాలి. మీ ఆలోచనాపరిధి విస్తృతం కావాలి. సాటిమానవుడి సమస్యల్ని మీ సమస్యలుగా ఆలోచించగలిగిననాడు - అమూల్యమైన మీ కవితాబలంతో సంఘానికి మహోన్నతమైన సేవ చేయగలుగుతారు. ఈ కాలానికి అనుగుణంగా మీరు మారినప్పుడు-ఆకాశంలో కాకుండా భూమి మీద బ్రతకటం మీకు యిష్టమైనప్పుడు - వెన్నెల అందానికే మీ హృదయం గంతులెయ్యదు. గడ్డిపువ్వునిచూసి మీ అంతరంగం నిట్టూర్చదు. అప్పుడు కవితాప్రేరణ ఎందులో దొరుకుతుందో మీకు స్వయంగా తెలుస్తుంది."

సుధాకర్ చాలా మౌనంగా కూర్చున్నాడు. కొంతసేపటికి మోహిని ప్రసంగం మార్చాలనే వుద్దేశంతో అంది — "మీకవితలను పత్రికలకు పంపించలేదా?"

సుధాకర్ కొంతసేపటికి మాట్లాడాడు. "లేదు. అవి నాకోసమే రాసుకున్నాను. చదువుతానని అడిగేవాళ్ళకి మాత్రం యిస్తాను."

మోహిని నవ్వుతూ అంది — "అంతస్వార్థం పనికిరాదు మీకు. మీ కవితానందాన్ని పదిమందికీ పంచిపెట్టండి. ఏదైనా పత్రికలకు పంపించండి. చక్కగా అచ్చవుతాయి. అందరూ చదువుతారు."

సుధాకర్ అయిష్టంగా మొహం పెట్టాడు - "బావున్నా యంటే సంతోషించగలనుగానీ — బావులేదంటే సహించ లేనేమో ! ఆ పరిస్థితి తెచ్చుకోవటం నాకిష్టం లేదు.

మోహిని విస్మయంగా చూసింది — అతని ... పసిహృదయాన్ని.

ఇద్దరూ చాలాసేపట్నుంచీ సముద్రపు ఒడ్డున కూర్చుని వున్నారు.

*          *          *

చాలాకాలానికి సుధాకర్ కోరికమీద వీణ తాకింది మోహిని. మనస్సంతా విషాదం ఆవరించింది.

వీణ వినటానికి కూర్చున్నవ్యక్తి.... అక్కయ్య.... పద్మి నిలా కన్పించింది.

వీణ వినమని అక్కయ్యని బలవంతంగా కూర్చోబెట్టేది తను. అక్కయ్య రుసరుసలాడ్తూ యిబ్బందిపడిపోతూ తనని మింగేసేలాచూస్తూ నోరువిప్పకుండా కూర్చునేది. అక్కయ్యని ఏడిపించటానికి గంటలకొద్దీ ఆలాపన సాగదీస్తోంటే అక్కయ్య భరించలేక చివరికి దెబ్బలాటకు దిగేది. సంగీత మాధుర్యం మీద తనోపెద్ద వుపన్యాసం యిస్తోంటే కర్ణకఠోరంగా విని విని హఠాత్తుగాలేచి పరిగెత్తేది. తను వీణ వదిలేసి పరుగు పందెంలో పాల్గొనేది. తాతయ్య అభయహస్తంలోంచి అక్కయ్యని లాక్కురావటం...ఊహూ ! తనవశం అయ్యేది కాదు.

అబ్బ ! వెళ్ళిపోయాయి. ఆరోజులన్నీ తియ్యటి కలలా గడిచిపోయాయి. కలలెప్పుడూ కల్లలే అవుతాయి. - మోహిని తల ఎత్తి శూన్యంగా ఎటో చూసింది.

"మోహినీదేవీ !" సుధాకర్ విస్మయం ప్రకటిస్తూ పిల్చాడు.

మోహిని తెలివిలోకి వచ్చింది - తన భావాలు కప్పి పుచ్చుకొంటూ ప్రయత్నంమీద చిరునవ్వు చిందిస్తూ చూసింది-
"చెప్పండి. ఏం వాయించమంటారు ?"

"ముందు మీరు మూడ్‌లోకి రండి. తర్వాత నాకిష్ట మైనవి చెప్తాను."

మోహిని దృష్టినంతా వీణమీద పెట్టుకుని తీగలమీద వ్రేళ్ళు ఆనించింది.

అది వీణా? కాదు. అమృతభాండం. సంగీతనిధి. ఆలాపన సాగుతోంటే సుధాకర్ గ్రహించాడు. ధన్యాసి రాగం ఎత్తుకుంది మోహిని.

"సంగీతజ్ఞానమూ - భక్తివినా
సన్మార్గమూ కలదే ? మనసా !-

నాద నిధులన్నీ మోహిని చేతివేళ్ళలో వున్నంత చాతుర్యం కన్పించింది.

"భృంగి నటేశ సమీరజ ఘటజను
తుగ నారదాదు లుపాసించే"—

—సంగీతజ్ఞానాన్ని పొందటంకన్నా సన్మార్గం ఏంవుం టుంది? న్యాయాన్యాయాలు తెలుసును త్యాగరాజుకి. జగము మాయామయమనీ తెలుసును. అందుకే-

"దుర్గుణ కాయజాదిషడ్రిపుల జయించు కార్యము."

కని పెట్టాడా సంగీతప్రియుడు.

సంగీత జ్ఞానమూ భక్తి వినా
సన్మార్గమూ కలదే ? మనసా !—

అంటూ తరతరాలుగా హెచ్చరిస్తోనే వున్నాడాయన.

కృతి ముగిసేసరికి మోహిని హృదయం చాలా తేలిక పడింది. అంతా భ్రమేగానీ జగత్తులో ఏది శాశ్వతం? జీవితమంతా ఇలా వీణ నారాధిస్తూ – సంగీతం పాడుకొంటూ గడపగలిగితే ఎంత ధన్యం!

సుధాకర్ అడిగిన పాటలన్నీ వాయించింది చాలాసేపు. అది అతన్ని సంతోషపెట్టటానికి మాత్రమే కాదు. వీణా నాదంలో అంతులేని శాంతి దొరికింది మోహినికి. విషాదాన్ని కూడా మధురానుభూతిగా అనుభవించ వచ్చునని అర్థమైంది.

చిట్టచివర వీణానాదంతో కంఠస్వరంకూడా జతచేసి సుధాకర్ కోరిన పాట ఎత్తుకుంది.

"రాధహృదయం! రాగనిలయం!
మాధవుని దేవాలయం!
.... .... ....
పరవశించే రాధ పిలుపు
ప్రేమజగతికి మేలుకొలుపు
సుధలు చిలికే రాధపలుకు
పృథ్వికే పన్నీటి చినుకు."

సుధాకర్ వుత్తేజమాతోన్న హృదయంతో శరీరమంతా చెవులుచేసుకుని వినసాగాడు.

"కథలు తెలిపే రాధకనులు
మధురమౌ భావాల గనులు
సోయగాల రాధహాసం
సృష్టికే నీరాజనం"

సుధాకర్ తనువంతా చిత్రమైన చలనం రేగింది. దీర్ఘంగా నిట్టూర్చి తమాయించుకొంటూ కూర్చున్నాడు.

"ప్రణయమంతా రాధ స్వంతం
రాధయే మాధవునిస్వంతం
సాటిలేనిది వారిబంధం
ప్రేమకే ఆదర్శగ్రంథం.
రాధహృదయం - రాగనిలయం - మాధవుని దేవాలయం"

కమనీయమైన ఆగీతం - సంగీతధ్వని మాధుర్యంతో కలిసి - రససుస్ఫురితమై శ్రోతహృదయాన్ని అలరించి రసప్రవాహం చేసింది.

అవ్యక్తమైన ఆత్మానందంతో వెలుగిపోతోన్న చూపులతో మోహిని తల ఎత్తి చూసింది - సుధాకర్ కళ్ళజోడు చేతిలోపట్టుకుని తెల్లని రుమాలుతో కళ్ళు ఒత్తుకుంటున్నాడు.

ఆశ్చర్యపడింది మోహిని- "ఏమైంది సుధాకర్ ?"

సుధాకర్ వెంటనే మాట్లాడలేక పోయాడు. మొహమంతా తుడుచుకుని తిరిగి కళ్ళద్దాలు పెట్టుకొంటూ నిస్తేజంగా నవ్వాడు ... "ఎప్పుడూ యింతే. సంగీతం వింటోంటే నాకెందుకో కన్నీళ్లు వచ్చేస్తాయి. ఆ మాధుర్యంలో ఎంతో విషాదం దాకున్నట్టు స్ఫురిస్తుంది. అబ్బ! నేను తమాయించుకోలేను." సుధాకర్ కంఠస్వరం భారంగా పల్కింది.

మోహిని మిలమిల లాడుతోన్న కళ్లతో సంభ్రమంగా చూసింది - సరిగ్గా సుధాకర్‌లాగే తనుకూడా అనుభూతి పొందింది. సంగీతంలో ఎంత సుఖంవుందో అంత దుఃఖంకూడా వుందేమో! అనుకొంది. ఎంత తీపి ఉందో అంత చేదుకూడా వుందనిపించింది.

సుధాకర్ శాంతివంతంగా నవ్వుతూ మళ్ళీఅన్నాడు— "అయినా సంగీతం వినకుండా వుండలేను. ఆ విషాదం భరిస్తోన్నకొద్దీ హాయిగా వుంటుంది."

మోహిని మౌనంగా కూర్చుంది.

"మీ సంగీతం వింటూ గడిపిన ఈ మధుర క్షణాలు అమృతబిందువులై ఈస్మృతిని చిరస్మరణీయంగా వుంచుతాయి మోహినీదేవీ!" — సుధాకర్ మాటల్లో మధురమైన ఆవేశం తల ఎత్తింది.

హఠాత్తుగా లేచి నిలబడ్డాడు—"మీ సంగీత స్వరాలు నా కాళ్ళని బంధిస్తోన్నా నేను వెళ్ళక తప్పదుకదా ? కానీ హఠాత్తుగా ఎప్పుడైనా వచ్చేస్తానేమో ? అలా ఎప్పుడైనా జరిగితే మీ రేమీ విసుక్కోకనని చెప్పండి మోహినీదేవీ !"

మోహిని నవ్వి లేచి నిలబడింది... "మీరు కవులుకదా? కవిత్వం మాట్లాడుతున్నారు." అంది హాస్యంగా.

సుధాకర్ తనను తను తమాయించుకున్నాడు — "మోహినీదేవీ! జీవితంవేరూ కవిత్వంవేరూ అవుతుందా? ఇలాంటి క్షణాలలోనే నేను రాసుకొంటూ వుంటాను."

"లేదులెండి. మీరు మనస్సువిప్పి మాట్లాడారు. నేను చాలా సంతోషిస్తున్నాను. మీరు ఎప్పుడువచ్చినా తప్పకుండా పాడి విన్పిస్తాను దానికోసం మీరు అర్థంలేని శంకలుపెట్టుకో వద్దు."

సుధాకర్ మొహంనిండా ఆనందం నాట్యంచేసింది.

"నేను వెళ్తాను మోహినీదేవీ !"

"ప్లీజ్ ! రెండునిమిషాలు ఆగండి, నేనూ వస్తాను. ఇప్పుడు యింట్లో కూర్చున్నా నాకేం తోచదు."

ఇద్దరూ మళ్ళా సముద్రపు ఒడ్డున కూర్చున్నారు.

* * *

అలా సముద్రపు అంచున మోహిని సుధాకర్‌తో కలిసి ఎన్నో సంధ్యాసమయాలు గడిపింది. అది షికారు కాదు. ప్రేమ విహారం అంతకన్నా కాదు. మోహిని అంతరంగం చిత్రమైన ప్రాయశ్చిత్తాన్ని కోరుతోంది. మగవాళ్ళమీద పెంచుకున్న ద్వేషంతో - మూర్ఖత్వంతో - జీవితంలో ఎప్పటికీ సరిదిద్దుకోలేని తప్పిదం చేసింది. తనను క్షమించే శక్తి ఒక్క భగవంతుడికి తప్ప ఎవ్వరికీ లేదు. కానీ భగవంతుడు న్యాయాన్యాయ విచక్షకుడు. ఆ న్యాయమూర్తి దగ్గిర తన కెలాంటి క్షమా లభించదు.

ఉన్నట్టుండి అడిగాడు సుధాకర్ — "మోహినీ దేవీ! మీరింకా... పెళ్ళెందుకు చేసుకోలేదు ?"

ఉలిక్కిపడింది మోహిని. "పెళ్ళా ! .... పెళ్ళి... లేదండీ! నాకా అభిప్రాయం లేదు."

సుధాకర్ ఆ ఒక్క చూపులోనూ చాలా ఆశ్చర్యం - ప్రకటించాడు— "అభిప్రాయం లేకపోవటం ఏమిటి ? వుండటం ఏమిటి మోహినీ దేవీ ? పెళ్ళి చేసుకోవటం మనిషికి అనివార్యం కాదా ?"

తన పెళ్ళి ప్రసక్తి ఎత్తి ఎవరు మాట్లాడినా మోహినికి నచ్చదు. చిరాకు కన్పించనీయకుండా చిరునవ్వు నవ్వుతూ — "మరి మీ రెందుకు చేసుకోలేదు ?" అంది.

సుధాకర్ దృష్టి మళ్ళించుకున్నాడు. సముద్ర తరంగాలలోకి చూస్తూ అన్నాడు — "ఒక మధురగాయని కోసం"

మోహిని నిర్లక్ష్యంగా నవ్వింది — "మధురగాయని అయితే చాలా ?"

"చాలదు. అందం-ఆకర్షణా - చదువూ - సంస్కారం -

అన్నిటినీ మించి రాధలా ప్రేమించే హృదయం - కావాలి"

"రాధలా ప్రేమించటమా ? అంటే ?"

సుధాకర్ మోహిని మొహం మీదికి ఆసక్తిగా చూస్తూ అన్నాడు - "తన హృదయాన్నే అనురాగానికి ఆలయంగా చేసి మాధవుడికోసం గుండెల్లో గుడికట్టింది రాధ. సుధలు చిందిస్తూ పరవశంతో రాధపిలిస్తే ఈ జగత్తంతా ప్రేమవాహినిలో జలక మాడుతుంది. మధురభావపరంపరతో కన్నులతో కథలు చెప్తుంది రాధ. అందచందాల మందహాసంతో ప్రకృతికి సింగారం వస్తుంది రాధ. ధరణిలోని ప్రేమనంతా తన స్వంతం చేసుకొంది రాధ. అలాంటి రాధని ప్రేయసిగా పొందగలిగిన మాధవుణ్ణి తల్చుకుంటే నాకు చాలా అసూయ."

మోహిని నిట్టూర్చింది సుధాకర్ పిచ్చిధోరణికి "అలాంటి రాధ మీకు కావాలా!" అంది జాలిగా.

"వద్దు. రాధ వద్దు. రాధ మాధవుడి స్వంతం. రాధని మించిన ప్రేమమూర్తి కావాలి. అలాంటి అనురాగమయి కోసం నిరీక్షించి...నిరీక్షించి...విసిగిపోయాను."

"అంతేనా ? ఓడిపోయారా ?"

"అది ఓటమే అయితే దాన్ని నేను సంతోషంగా ఆహ్వానిస్తాను. నేను జీవితాన్ని అనుభవించాలని కలలు కంటున్నాను మోహినీ దేవీ! జీవితంతో రాజీపడటం వృత్తి బ్రతుకటమే అవుతుంది."

సుధాకర్ని చూస్తోంటే మోహినికి పుట్టెడుజాలి కల్గింది. నిజంగా మతి గతితప్పినవాళ్ళకీ-ఈ స్వప్నచారికీ ఏమంత తేడా లేదు. ఒక్క నిట్టూర్పువిడిచి సానుభూతి కురిపిస్తూ అంది —

"కానీ సుధాకర్! ఊహాలు ఊహల్లాగే వున్నంతకాలం చాలా మధురంగా వుంటాయి. వాటినే వాస్తవంచేసుకోవాలని ప్రయత్నిస్తే చాలా విషాదం అనుభవించాల్సివస్తుంది. రాధ నిలా ఆదర్శప్రేయసికావటం చాలా బావుంది. కానీ ఆ కోరిక ఎంత సహజంగా నెరవేరుతుందో కూడా అర్థంచేసుకోవటం ఇంకా బావుంటుంది."

సుధాకర్ విక్షిప్తంగా చూశాడు — "నా కోరిక తీరేది కాదా మోహినీదేవీ?"

మోహిని వేదువిజాన్ని చెప్తోన్నట్టు నిర్లక్ష్యంగా నవ్వుతూ అంది — "మీరు కలలుకనే యువతీమణి ఈ భూమండలంలో వుండదు."

సుధాకర్ మొహం విస్మయంతో నిండింది. చూపుల్లో అంతులేని ఆరాటం చిందులుతొక్కింది — మోహిని కన్నుల్లోకి నిస్సందేహంగా చూస్తూ అన్నాడు—

"నా స్వప్నసుందరి భూమండలంలో వుండదా? ఎందుకు లేదు ... మీరు ... లేరా ... ?"

త్రుళ్ళిపడింది మోహిని. తన కలవరం కప్పిపుచ్చుకొంటూ నిదానంగా చూసింది.

సుధాకర్ అదేమీ గుర్తించే స్థితిలో కనిపించలేదు. "మోహినీదేవీ! మీరు కోయిలలా పాడుతారు. నెమలిలా ఆడుతారు. అప్సరసల్ని మించే సౌందర్యం మీ సొత్తు. ఇంత కన్నా నేను అధికంగా ఏం కోరుకున్నాను?"

అంత చొరవగా మాట్లాడుతోన్న సుధాకర్‌ని చూస్తూ నిర్ఘాంతపోయింది మోహిని — ముంచుకు వస్తోన్న

కోపాన్ని మందహాసంగా మార్చుకొంటూ చూసింది - "కానీ మీకు రాధలాంటి ప్రేయసికదూ కావాలన్నారు ?"

ఆ హాస్యం సుధాకర్ అంతరంగాన్ని అంటలేదు. "అవును మోహినీదేవీ ! మీకంఠంలో నేకాదు-మీహృదయంలో కూడా రాధ స్వరూపాన్ని నేను చూడగలుగుతున్నాను."

ఆ దిగ్భ్రమనుంచి తేరుకోవటానికి చాలాసేపు పట్టింది మోహినికి. తను సుధాకర్‌తో ఎన్నడూ అంత సన్నిహితంగా ప్రవర్తించలేదు. ఒక్క ప్రేమ వలుకుకూడా వుచ్చరించలేదు. తన గుండెల్లో వేదనని శాంతింపజేసుకోవటానికే అతని వెంట స్నేహపూర్వకంగా తిరుగుతోంది. దాన్నే అతను అపార్థం చేసుకుని పెళ్ళి మచ్చట్లుచెప్తే తను చెయ్యగలిగిం దేముంది ?

సుధాకర్ తన ధోరణిలో తను చెప్పసాగాడు ... "మోహినీదేవీ ! మీ దగ్గిర యింత తొందరగా ఈప్రసక్తి తీసుకు వచ్చే వుద్దేశ్యం లేదునాకు. కాని...అలా అయింది. అందుకే నా మనస్సంతా బైటపెడుతున్నాను. నేను మీవంటి మధుర గాయనికోసం — మీవంటి సౌందర్యరాశికోసం — మీవంటి కళాతపస్వినికోసం - ఆశతో నిరీక్షిస్తున్నాను. అదృష్టవశాత్తు నాకీ అపూర్వమైన అవకాశం లభించింది. భగవంతుడే మిమ్మల్ని ఇంత సన్నిహితంగా తెచ్చి చూపించాడు. ఆ పైన ప్రయత్నం నాది" క్షణకాలం ఆగి కళ్ళజోడు చేతిలోకి తీసుకుని చెమటలు పడుతున్న నుదురు ఒత్తుకున్నాడు.

మోహిని ప్రయత్న రహితంగానే సుధాకర్ కేసి తదేకంగా చూసింది. సుధాకర్ తెల్లని తెలుపు! గంధపు చెక్కలో వుండే

 

మార్దవం అతని శరీరంలో గోచరిస్తుంది. పల్లగా దట్టంగావున్న నొక్కులజుత్తూ - విశాలమైన నేత్రాలు - ప్రశాంతమైన చూపులూ - అతని సౌందర్యం స్త్రీ హృదయాన్ని బలహీనం చేస్తుంది.

అయినా మగవాడు అంత సుకుమారంగావుంటే ఏం బావుంటుంది ?

ఎందుకో తలదించుకుని ఇసకలో గీతలు గీస్తూ కూర్చుంది మోహిని.

సుధాకర్ నిస్సంశయంగా - ప్రాధేయతగా కూడా అన్నాడు— "మోహినీ! మిమ్మల్ని నాజీవిత సహచరిగా చేసుకోవాలని ఎంతో కోరుకుంటున్నాను. ఈ కోరికకు తేలిక విలువ కట్టకండి."

"సుధాకర్ !" అసహనంగా లేచి నిలబడింది మోహిని- "క్షమించాలి. నాకిలాంటి అభిప్రాయం ఎప్పుడూ లేదు" మెల్లిగా నడుచుకొంటూ వెళ్ళి కారు తలుపుతీసుకుని సీటులో కూర్చుంది.

సుధాకర్ చాలాసేపు అచేతనంగా యిసకలోనే కూర్చున్నాడు — ఎప్పటికో లేచి భారంగా అడుగులువేస్తూ కారు దగ్గిరికి నడిచాడు.

మోహిని పక్కనకూర్చుని కారు స్టార్ట్ చేశాడు.

ఇద్దరిమధ్యా మౌనం దారుణంగావుంది.

మోహిని క్రిందిపెదవి నొక్కిపట్టి కారు అద్దంలోంచి సూటిగా రోడ్డు కేసిచూస్తూ బొమ్మలా కూర్చుంది.

హృదయంలేని ప్రతిమలావున్న మోహిని సుధాకర్

హృదయంనిండా భారంగా నిండింది.

కళానిలయంముందు కారు ఆగింది.

డోర్ మీద చెయ్యి వేసింది మోహిని.

"ప్లీజ్ ! ఒక్కనిమిషం ఆగండి." సుధాకర్ వారించాడు. అతని మొహమంతా ఎరుపెక్కిన సూర్యబింబంలా వుంది - "నేను కోరరానికోరిక కోరలేదు. మీరంటే నాకు చాలా యిష్టం. మనం పెళ్ళిచేసుకుందాం అన్నాను."

మోహిని సూటిగాచూసింది - "మీరంటే నాకుకూడా యిష్టం వుందోలేదో తెలుసుకోవాల్సిన అవసరం మీకులేదా !"

తెల్లబోయాడు సుధాకర్ — వెంటనే మాట్లాడ లేక పోయాడు - "నిజమే. నిజమే. మీ యిష్టాలకు వ్యతిరేకంగా నాకోసం మీరు చెయ్యాలన్నా చెయ్యలేరు. అలాంటివ్యక్తి నాకు అవసరంలేదు. కానీ మీనుంచి అలాంటి తిరస్కారం వస్తుందని నేనెలా అనుకుంటాను మోహినీదేవీ ;"

"మీరు అనుకున్నా అనుకోకపోయినా అదిమాత్రం నిజం. నా అభిప్రాయం మీకు బీచ్‌లోనే చెప్పాను."

సుధాకర్ మతిభ్రమిస్తోన్నట్టు శూన్యంగా చూశాడు. అంతలోనే తృప్తిగా చూడటానికి ప్రయత్నించాడు — "మోహినీదేవీ ! మీరేం చెప్పినా నేను అమితంగా బాధపడతానని ఆలోచించి మరీ చెప్పండి. చాలు."

కారు స్టార్ట్ చేశాడు.

"ఒక్కమాట. మీకోసం నేను ఎంతకాలమైనా నిరీక్షించగలను. కానీ - మీనుంచి మళ్ళా పిలుపురాకపోతే నాకిది శాశ్వితమైన వీడ్కోలు." సుధాకర్ పెదవులమీద వేల

వంగా నవ్వుచిందింది. కంఠంలో తరతరాల తపన కొట్లాడింది. కన్నుల్లో అనురాగం ఏరై చిప్పిల్లింది.

కారు దూసుకుపోయింది.

మోహిని తడబడుతూ లోపలికి నడిచింది. మెట్లు ఎక్కి పైకి వెళ్తూ మధ్యమధ్య నాలుగుసార్లు ఆగింది. ఎప్పటికప్పుడే విస్తుబోతూ ఆలోచించింది.

సుధాకర్... తనను పెళ్ళిచేసుకుంటానని అడిగాడు. తను... తను... తిరస్కరించి వచ్చింది-భగవాన్!

తిన్నగా తనగదిలోకి వెళ్ళి తలుపులు మూసుకొంది. ఆ తలుపులు మర్నాడు వుదయాన్న తెరుచుకున్నాయి.

ఎరుపువనం చిందే కళ్ళతో - బడలిక స్ఫురించే నడకతో - తడబడుతూ మెట్లుదిగి ఫోన్ దగ్గరికి నడిచింది మోహిని.

రిసీవర్ తీసుకుని నెంబర్ డయల్ చేసింది. ఫోన్‌లో సుధాకర్ కంఠం వినిపించటానికి రెండునిముషాలు పట్టింది.

"హల్లో!" అంటూ ఆతృతగా పల్కిం బాస్వరం.

"నమస్తే! సుధాకర్! మీరు... మీరు... కళానిలయానికి రండి. తప్పకుండారండి." రిసీవర్ పెట్టేసి రెండుచేతులా చెంపలకు చేర్చుకుని నిశ్చలంగా నించుండి పోయింది.

*       *       *

మోహినీ సుధాకర్‌ల వివాహం మహోవైభవంగా జరిగింది — ఆశుభసమయంలో మోహిని మనస్సునిండా అక్కయ్యే నిండిపోయింది. తాతయ్యతో చెప్పి గోపాల్‌కి — తనకీ పెళ్ళి చేయించమని అక్కయ్యే మనస్సు విప్పిచెప్పింది. తనచేతులమీదుగా ఆ మంచిపని చెయ్యలేకపోయింది - కానీ

ఈనాడు గతానికంతా తిలోదకాలిచ్చి పెళ్లికి సిద్ధపడింది తను. ప్రపంచములో లేని అక్కయ్యే తన పెళ్ళిని చూడలేకపోయినా అక్కయ్యకి భర్త అయిన గోపాల్ అయినా పెళ్ళిపందిట్లో వుంటే బావుండునని మోహిని మనస్సు ఎంతో ఆశపడింది. కానీ గోపాల్ ఎక్కడ వున్నాడో ఎంత ప్రయత్నించినా తెలియలేదు.

నూతన వధువు మోహిని మనస్సునిండా గతమే తారట్లాడింది. పెళ్ళిపీటలమీదే భరించలేని దుఃఖం వచ్చింది.

కానీ - మాంగల్యధారణ జరిగి పెళ్ళిపీటలమీద నుంచి సుధాకర్‌తో నూతనమార్గం ప్రారంభమైనప్పుడు - సుధాకర్ సన్నిధిలో - సుధాకర్ స్పర్శలో - జీవితం అందమైన మలుపు తిరిగినప్పుడు - మోహిని మనస్సుకీ - తనువుకీ కూడా ఇంద్రజాలం జరిగింది.

నూతన వధూవరులు ఏకాంతవాసానికి ఎస్టేట్‌లో పల్లెసీమలకు ప్రయాణమై వెళ్లారు. ఇహలోకపు చింతలూ - సమస్యలూ - విస్మరించి ఆ ప్రకృతి అందాల మధ్య రతీ మన్మథులై విహరించసాగారు.

మనోహరమైన వుద్యానవనంలో - సర్వసౌఖ్యాలూ అమర్చబడే విశాల భవనంలో మోహినీ సుధాకర్‌ల నివాసం.

ఆ ఉద్యానవనంలో రమ్యమైన సరోవరం వుంది. సరోవరంనిండా తెల్లని పద్మాలు తామరతంపరగా విప్పారుతూ వుంటాయి.

భవనానికి దూరంగా ఎత్తైన కొండలూ—కొండల ప్రక్క నుంచి వుద్వేగంతో పరుగులెత్తే సెలయేరూ - సెలయేటికి

దికువగా రకరకాల పళ్ళతోటబూ - పచ్చిక బయళ్ళూ-ప్రకృతి దేవత వల్చని వల్లెవాటు ధరించి నృత్యం చేస్తూ వుంటుంది.

మోహిని సుధాకర్‌ల ఏకాంతం - సౌందర్యానుభవం తనివితీరనివి - నిద్ర లేచింది మొదలూ - నిద్రకోసం అలమటించే వరకూ రోజంతా మధురమైన ఆనందాలతో అనుభూతులతో గడుస్తుంది.

సుధాకర్ వీణావాదన ప్రియుడు!

మోహిని సంగీతంతో తేనెనదులు సృష్టించగల వైణికురాలు. అంతకన్నా సంగీతాస్వాదనకు యింకేం కావాలి?

ఉదయం కొన్ని గంటలకాలం వీణానాదంతో ఆ భవంతి సంజీవ మౌతుంది.

మోహిని వాయిస్తోన్నంతసేపూ సుధాకర్ ఆనందిస్తాడు. సుధాకర్ ఆనందిస్తోన్నంతసేపూ మోహిని వీణ వాయిస్తూనే వుంటుంది.

ఆ సంగీత స్రవంతి నిర్విరామంగా ప్రవహిస్తుంది. సుధాకర్ తన్మయత్వంతో మోహిని భుజాలచుట్టూ చేతులు చుడితే మోహిని హృదయం వుప్పొంగి చేతివేళ్లు వీణమెట్ల మీద ఆరాటంతో పరుగులు తీస్తాయి. సంగీతం వుద్వేగస్థితిని అందుకొంటుంది. ఆ నాదం తీయని వేదన కల్గిస్తోన్నా - వీణమెట్లమీదనుంచి వేళ్లు తీసుకోవటానికి పూర్తిగా అశక్తురాలై పోతుంది మోహిని.

మధుర సుధారస వాహినిగా ప్రవహించిన సంగీతాంబుధిలో తనివితీరా మునకలువేసి ఎప్పటికో — ఎప్పటికో

సుధాకర్ మోహిని చేతులు తనచేతుల్లోకి తీసుకుని హృదయా నికి హత్తుకుంటాడు. మోహిని తన్మయత్వంతో సుధాకర్ కన్నులలోకి చూస్తూ సుధలుచిందేలా నవ్వుతుంది. ఆ నవ్వుతో అతను ప్రేమరాజ్యాధిపతి అయిపోతాడు.

మధ్యాహ్నసమయాలలో ఆహ్లాదకరమైన విశ్రాంతి — సుధాకర్ సరదాలలో అతి ముఖ్యమైనది గ్రామఫోన్ రికార్డులు వినటం. అతనిదగ్గిర వందలాది రికార్డులు వున్నాయి. చిన్నతనం నుంచీ అతను వివిధ భాషలలో రకరకాల వ్యక్తుల రికార్డులు సేకరిస్తోనే వున్నాడు. అన్నీ సరికొత్తవాటిలా ఖరీదైన కవర్స్‌తో నిగనిగలాడుతూ వుంటాయి. సుధాకర్ రికార్డులు వేసి విన్పిస్తోంటే విన్నది వినకుండా వింటూ వుంటుంది మోహిని. సైగల్ _ పంకజ్ మల్లిక్ _ రాజేశ్వరరావు_నూర్జహాన్ భానుమతి_బాలసరస్వతి_వంటి కొన్నికొన్ని మృదుమధురమైన కంఠస్వరాలకోసం అతను ప్రాణాలుపెడతాడు. ఆ గొంతులు వింటూ అతను పొందే తన్మయత్వం చూస్తే మోహిని అసూయ దాచుకొంటూ నవ్వుతుంది. మోహిని కళ్ళలో రేగే ఎర్రదనం చూసుకుని సుధాకర్ ముగ్ధుడౌతాడు.

సంధ్యాసమయాలలో నూతన వధూవరులు స్వేచ్ఛా విహారానికి భవంతిదాటి బయల్దేరుతారు. సుధాకర్ కళాపిపాసి. ప్రకృతి అందాలు చూస్తూ అతను కరిగిపోతాడు. మోహినికి సామాన్యంగా కన్పించే దృశ్యాల్ని అతను బహు సుందరంగా వర్ణిస్తాడు. కవి దృష్టి అంబరాన్ని చుంబిస్తుంది. కొండల్ని కౌగలించుకొంటుంది. దూర దూర తీరాలలో విహరిస్తుంది. ప్రకృతిశోభచూసి పరవశిస్తుంది. సుందర దృశ్యాలన్నీ

స్వాగతం యిస్తాయి కవికి. కొండల మాటున సూర్యుడు అలసటతో ఎర్రబడిపోయి తొందర తొందరగా పోతున్నాడు.

"మోహినీ! ఆ దృశ్యం నీకు ఎలావుంది?"

"చాలా బావుంది."

"సూర్యుడు ఎందుకంత ఎర్రగా అయ్యాడు? "

"నాకు చెప్పలేదు మరి."

"కొండ అలా అడ్డం వచ్చిందని కోపం వచ్చిందేమో!" నవ్వుతుంది మోహిని.

"మోహినీ! ఇంత విశాలమైన వృక్షాల్ని చూస్తుంటే నీ కేమనిపిస్తోంది ?"

"చాలా అందంగా వున్నాయి. ప్రశాంతంగా వున్నాయి."

"అంతేనా ? మనకోసం పెళ్ళిపందిరి వేసినట్టు అనిపించటం లేదూ ?"

సిగ్గుపడుతుంది మోహిని.

"మోహినీ! ఆ సెలయేరు చూడు. ఎంత వుత్సాహంగా పురకలు పెడుతోందో !"

"అవును. కొండరాళ్ళమీద నుంచి దొర్లి పడుతోంది."

"నీ స్నేహంకోసం తహతహ లాడుతోంది. నిన్ను మెప్పించటానికి సంగీతం నేర్చుకుంటోంది."

ముగ్ధురాలౌతుంది మోహిని.

ఆ నూతన వధూవరులు దివారాత్రులూ క్షణక్షణాల్లాగ గడవసాగారు.

సరోవరం ఒడ్డున కూర్చుని మోహిని ముఖపద్మ సౌంద

ర్యాన్ని భ్రమరములవంటి చూపులతో వెంటాడుతూ వుత్తే జితమైన హృదయంతో ఎన్నో కవితలు అల్లాడు సుధాకర్!

చందమామ వెన్నెలవాన కురిపిస్తోన్న రాత్రులు పూల తోటలో ప్రేయసి ఒడిలో మేనువాల్చి మోహిని మధురాతి మధురంగా పాడిన పాట లెన్నో - ఎన్నెన్నో విన్నాడా గాన లోలుడు.

దివినుంచి భువికి దిగివచ్చిన దేవకన్యలా ప్రొద్దుకొక సింగారంతో సరాగాలు ఒలకబోసే అర్ధాంగిని తన స్వంతం చేసుకుని బ్రహ్మానందాలు అనుభవించాడా అదృష్టవంతుడు. సుధాకర్ సన్నిధిలో మోహిని జీవితానికే కొత్త అర్థాలు తెలుసుకుంది. కొత్తభోగాలు నేర్చుకుంది. తన నింత గాఢంగా- ఇంత అపూర్వంగా ప్రేమించే భర్తకోసం - తనేం చెయ్యగలదు? ఏదైనా చెయ్యగలిగితే ఎంత బావుండును!

* * *

ఆనాటి పోస్ట్ చూసుకొంటూ వుత్సాహంగా అంది మోహిని — "మనం యిక్కణ్ణుంచి తొందరగా వెళ్ళాలి సుధాకర్!"

"ఏం?"

"ఢిల్లీనుంచి కళాకేంద్ర వారు వార్షికోత్సవాలకి డాన్స్ పెర్ ఫామెన్స్ కావాలని అడుగుతున్నారు. అయినా నేను కళాశిఖరనుంచి వచ్చికూడా చాలా రోజులై పోయింది. సుధాకర్! మనం తొందరగా వెళ్ళిపోదామా?"

"మోహినీ!" సుధాకర్ కంఠం కంపించింది. మొహంలో విశేషమైన మార్పు గోచరించింది.

మోహిని ఆశ్చర్యపడింది. "ఏమిటి ? ఎందుకలా చూస్తున్నావు ?" వుత్తరం మడిచి బల్లమీద పడేసి సుధాకర్ దగ్గిరికి వెళ్ళి నిలబడింది.

సుధాకర్ మోహిని చుట్టూ చేతులువేసి దగ్గిరికి తీసుకున్నాడు — ఆతృతగా మొహంలోకి చూస్తూ అన్నాడు — "మోహినీ ! నువ్వు ఫెర్‌ఫామెన్సెస్ ఇస్తావా ?"

మోహిని చిలిపిగా నవ్వింది - "ఏం ? మన సరదాలకి అడ్డువస్తాయనా ? అదేం లేదుగా? మన మిద్దరం ఒక్కచోటే కలిసి వుంటామ్. కలిసి వెళ్తాం. కలిసి వస్తాం. నా నాట్యాలకు ప్రేక్షకులలో ముఖ్యులు మీరేకదా ? మీరు ఎదరగా కూర్చుంటే నేను స్టేజీమీద చేస్తాను. ఈసారి ఢిల్లీలో అలా అవుతుంది కదూ ?"

సుధాకర్ ముఖం చాలా గంభీరంగా మారిపోయింది. అసహజమైన మాటలు వింటోన్నట్టు అసహనంగా వున్నాయి చూపులు.

"అదేమిటి? మీరంత సీరియస్‌గా అయ్యారు?" కంగారుగా చూసింది మోహిని.

మోహినీ! నువ్వు ఫెర్‌ఫామెన్సెస్ యివ్వటం నా కిష్టంలేదు."

అమాయకంగా — అయోమయంగా — అర్థంకాని చూపులు చూసింది మోహిని- "అంటే? మనం యిప్పుడు ఢిల్లీ వెళ్ళద్దా?"

"ఇప్పుడు కాదు. ఎప్పుడూ వెళ్ళద్దు."

"ఏం? ఏమైంది?"

"మోహినీ! ఒక్కమాట చెప్పు. నువ్వు నాభార్యవి. అవునా?"

"అవును."

"అవునా? నువ్వు నాభార్యవి. నేను అపురూపంగా సంపాదించుకున్న అర్థాంగివి. నువ్వు ... నువ్వు ... వందలాది ప్రేక్షకుల ఎదట ... నాట్యం చేస్తావా?"

సుధాకర్ మాటలు మొదట విస్మయం కల్గించాయి మోహినికి. అర్థమౌతోన్న కొద్దీ కలవరం కల్గించాయి. "మీరంటున్నది .... నేను ... ఎప్పుడూ డాన్స్ చెయ్యకూడదనా?" భయం భయంగా అడిగింది.

"కాదు మోహినీ!" మోహిని మొహంలోకి వుద్వేగంతో చూస్తూ అన్నాడు సుధాకర్ — "నువ్వు నాట్యం చెయ్యాలి. పాటలుపాడాలి. కానీ నాకోసమే. నీ గానం నా కోసం. నీ నాట్యం నాకోసం. నీ అందం నాకోసం. నీసర్వస్వం నాకోసం. నీనుంచి పొందే ఏ ఆనందంలోనూ ఎవ్వరికీ చోటు లేదు. నాకు అపురూపంగాదక్కిన నిన్ను ఎవ్వరికీ పంచలేను."

"సుధాకర్!" దిగ్భ్రమతో పిచ్చివదుతోన్నట్టు చూసింది మోహిని. ఏమిటి? ఏమిటి అంటున్నాడు సుధాకర్ ? తనభర్త-తన కెన్నోవిధాల ప్రోత్సాహాన్నివ్వవలసిన వ్యక్తి - ఇలాంటి అభ్యంతరాన్ని వెల్లడిస్తాడని ఎన్నడూ శంకించలేదే ? భగవాన్ ?

"మోహినీ! మాట్లాడవ్ ?" ఆత్రుతగా అడిగాడు.

"ఏం మాట్లాడను ? ఏం మాట్లాడను !" భూమి కంపిస్తోన్నట్టే తోచింది మోహినికి. తన ఆవేశాన్నంతా అణుచు

కొంటూ భర్త కళ్ళల్లోకి సూటిగాచూస్తూ అంది-"మోహిని ఏమిటో నీకు తెలిసివుంటే యింత తేలికగా ఇలాంటి అభ్యంతరాలు వెల్లడించలేవు."

"మోహినీ!"

"నిజంగా నువ్వు చాలా పొరపడ్డావు. నా ఆశలూ - ఆశయాలూ నీకు తెలియవు. నేనొక కళాత్మురాలి కడుపున పుట్టాను. కళాభిమాని చేతుల్లో పెరిగాను. నాకు ప్రియమైన కళలు అభ్యసించాను. కళారాధనే నా ధ్యేయంగా ఎంచుకుంటున్నాను. ఇప్పుడు చెప్పు-నువ్వు వెల్లడించిన అభ్యంతరం విని నేనేమైపోవాలి?"

"మోహినీ! ఈ విషయం మన వివాహానికి ముందు మాటమాత్రంగానైనా తెలియజేశావా?" సుధాకర్ కంఠం కంపించింది.

మోహినీ నవ్వింది - ఆ నవ్వులో చిత్రమైన ధీరత్వం తొంగి చూసింది - "వివాహానికి ముందే తెలియజేస్తే ఈ వివాహం జరిగేది కాదా?"

"మోహినీ! అప్పుడే నేను ఆలోచించుకోవటానికి అవకాశం వచ్చేది. మన యిద్దరి మధ్యా యిప్పు డిలాంటి భేదాభిప్రాయం రాకుండా పోయేది."

మోహినీ సిగ్గుపడింది - సుధాకర్ మృదుత్వానికి - "కాని పెళ్ళయ్యాక కూడా గాలిపీలుస్తానని నేను నీకుచెప్పావా? నా కళాజీవితం అంత సహజమైందని నేను భావించాను. నిన్ను చూసి ఆ భావన పటిష్ఠం చేసుకున్నాను. ఇదే నేను చేసిన పొరపాటా?"

"మోహినీ! నువ్వు చాలా ఆవేశంగా మాట్లాడు తున్నావు. కొంచెం నిదానంగా ఆలోచించి చూడు. నీకు వివాహం అయింది. భర్త వున్నాడు. సమాజంలో నీకెంతో వున్నతస్థానం వుంది. నువ్వు - ఇప్పుడు కూడా ఒక సామాన్యురాలిలా పదిమంది ఎదట్టా నాట్యం చేస్తాననటం సమంజసంగా వుందా ?"

మోహిని సాధ్యమైనంత నిదానంగా అంది-" ఆ సమంజసాలూ అసమంజసాలూ నా దృష్టికి ఎప్పుడూ రావు. నేను మాత్రం ఆవేశంగా మాట్లాడటంలేదు. ఇంత దారుణం జరుగుతోంటే - నేనిలా నీతో - ఇంత శాంతంగా ఎలా మాట్లాడ గలుగుతున్నానో కూడా అర్థం కావటంలేదు. నా యిష్టాలకు వ్యతిరేకంగా నన్నిలా నిర్బంధించాలని చూడటం చాలా అన్యాయమని నీకు తోచటం లేదా ?"

"అన్యాయమా? నా భార్యని నా యిష్టాలకు అనుగుణంగా మలుచుకోవటం అన్యాయమా? ఎందుకిలా నిర్దయగా మాట్లాడుతున్నావు మోహినీ?"

మోహిని నిర్వికారంగా అంది - "ఇక్కడ భార్యాభర్తల సంబంధంలేదు. దయాధర్మాల ప్రసక్తి అంతకన్నా లేదు. వివాహానికి వ్యక్తిత్వాలను ధ్వంసంచేసే హక్కు ఎప్పుడూ లేదు. నేనొక కళాభిమానిగా కళారాధకురాలిగా నిన్ను అడుగుతున్నాను. నువ్వు కోటీశ్వరుడివి కావచ్చు. జమీందారువు కావచ్చు. కళల్ని స్వంతంచేసుకునే శక్తిమాత్రం నీ డబ్బుకి లేదు."

"మోహినీ !"

"అంతకోపం తెచ్చుకోకు. నిన్ను ప్రియుడిగా ప్రేమించ గలను. భర్తగా ఆరాధించగలను, దైవంగా పూజించగలను. నా సర్వస్వం నీకు అర్పించగలను. నేను నీమోహిని. కాదని ఎప్పుడూ అనుకోను. కానీ నాకళల్ని నీకోసం మాత్రమే స్వంతం చెయ్యలేను. నేను కళాభిమానులవ్యక్తిని. నా అను భూతులు ఎవ్వరికీ పంచిపెట్టకుండా నేను వుండలేను."

"మోహినీ !" సుధాకర్ చూపులనిండా విషాదం ఆవ రించింది – "నా హృదయాన్ని అర్థంచేసుకోకుండా యింత తిర స్కారంగా మాట్లాడటం నీకు ధర్మంకాదు. నీ కళాభివృద్ధికి నాశక్తికొద్దీ నేను దోహదంచేస్తాను. ప్రముఖ వాస్తు శాస్త్ర జ్ఞులు నిర్దేశించేవిధంగా నీకోసం దివ్యమైన నాట్యమందిరం కట్టిస్తాను. పాలరాళ్ళుపొదిగిన రంగస్థలంమీద నువ్వు నాట్యం చేస్తుంటే నేను ఆనందడోలికల్లో తేలిపోతూ ఆ ఆనందాన్ని అనుభవిస్తాను. నాకోసం నువ్వు పురివిప్పిన నెమలిలా నాట్యం చేస్తావు, మోహినీ ! ఇంతకన్నా మనకేం కావాలి ?"

సుధాకర్ మాటలు వింటోన్నకొద్దీ ఎన్నడూ ఎరగని జుగుప్స కల్గింది. దుఃఖం వచ్చింది. అవమానంతో తల్లడిల్లి పోయింది మోహిని – "వద్దు. వద్దు. నాకా బంగారు పంజరం వద్దు. మరో తాజ్ కోసం ప్రాణాలు పోగొట్టుకునే అమాయకు రాల్ని కాను నేను. మీరు నాకోసం కట్టించే నాట్యమందిరంలో నా నాట్యాలు మీతోపాటు గోడలు చూస్తాయి. నా పాటలు కవాటాలు వింటాయి" – మోహిని కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి– "సుధా ! ఇదేనా నీ ఔదార్యం? ఇదేనా నీఅనురాగం ? ఇదేనా నువ్వు నాకు చేసే సహాయం? ఇందుకేనా నన్ను పెళ్ళి

చేసుకున్నావు? చెట్లకుకాసే ఫలాలు చెట్లకోసం కాదని మన కందరకూ తెలిసిన సత్యమేకదా ? మన కళలు మనకోసమేనా? నీలోకూడా యింతస్వార్థం గూడుకట్టుకొందా?"

సుధాకర్ స్థాణువులా నించున్నాడు.

"నా సాధనకు నీ విజ్ఞత తోడ్పడుతుందనుకున్నాను. ఒక కళాకారుడిగా నీకు నాహృదయంలో స్థానం యిచ్చాను. భవిష్యత్తులో నీ కవితలతో నా నాట్య వస్తువులు ఏర్పరచుకుని ప్రజల ఎదట ఆడి పాడాలని కలలు కన్నాను. అదంతా మిథ్య అయిందా ? మిథ్య అయిందా?" వుద్వేగం ఆపుకోలేక మొహానికి చేతులు కప్పుకొంది మోహిని.

అంత వుద్వేగంతోనూ సుధాకర్ అన్నాడు —
"మోహినీ! నీ కోసం నేను ఏమైనా చెయ్యగలను కానీ — ఇలా...నిన్ను బహిరంగంగా...పదిమందిఆనందం కోసం-అబ్బ! నేను భరించలేను. నేను చాలా స్వార్థపరుణ్ణి! చాలా స్వార్థపరుణ్ణి.

ఇద్దరి మధ్యా నిశ్శబ్దం — భయపెట్టింది. ఆ నిశ్శబ్దం అలా భయంకరంగా రాత్రి అంతా సాగింది. ఎవరూ ఎవర్నీ పలకరించుకోలేదు. సుధాకర్ వేరే గదిలో పడుకుని మోహినికి పూర్తిగా ఏకాంతం యిచ్చాడు.

మోహిని ఆ ఏకాంతాన్ని దీర్ఘంగా నిట్టూర్చటానికి వుపయోగించుకొంది.

మర్నాటి వుదయం మోహిని వీణకేసి కూడా కన్నెత్తి చూడలేదు. సుధాకర్ ఆందోళనంతా గుండెల్లో దాచుకొంటూ చాలా ప్రశాంతంగా వుండాలని ప్రయత్నిస్తూ గది

లోకి వచ్చాడు.

స్నానంచేసి, దుస్తులుమార్చి పువ్వులావున్న మోహిని అంతరంగం ఆవేదనామయంగా అల్లాడుతోంది. సుధాకర్‌ని నిశ్శబ్దంగా చూసి కళ్లు దించుకొంది.

"మోహినీ!" మృదువుగా పిలుస్తూ దగ్గిరికివచ్చి నిల బడ్డాడు సుధాకర్ - "వీణ వాయించవూ?"

మోహిని అయిష్టంగా తల తిప్పింది - "నా మనస్సేం బాగా లేదు సుధాకర్! నేనేం చెయ్యలేను."

సుధాకర్ మోహిని దగ్గిర కూర్చుని మోహిని చేతిని చేతుల్లోకి తీసుకున్నాడు - "నీ మనస్సింకా కుదుటపడలేదా?"

మోహిని చురుగ్గా చూసింది. మనస్సు కుదుట పడు తుందా? ఏ మహాత్మ్యం జరిగిందని? నిస్పృహగా నవ్వుతూ - "మీ మనస్సు కుదుట పడిందా?" అంది.

"నువ్వు నాదగ్గిర వుంటే నామనస్సుకి వేరేప్రశాంతత అక్కర్లేదు మోహినీ! మనం చిన్నపిల్లలంకాదు. మనమధ్య ఎప్పుడూ ఎలాంటిస్పర్ధలూ రాకూడదు. వచ్చినా నిలవకూడదు." సుధాకర్ మాటల్లో పొంగి పొర్లే అనురాగం ధ్వనించింది. అది మోహినికి చాలా అశాంతి కల్గించింది.

"మోహినీ! నిన్నటివిషయం ఏమైనా ఆలోచించావా?"

"ఆలోచించాను. కానీ కొత్తగా తెలుసుకున్న దేమీ లేదు."

సుధాకర్ మాట్లాడ లేదు.

మోహిని లేచి కిటికీదగ్గిరికి వెళ్ళి నిలబడింది - "నన్ను క్షమించు సుధా! నీ మనస్సంతా నాకు తెలుసు. నీ అనురాగం

నాకు తెలుసు. కానీ – దానికోసం ఆత్మార్పణ చేసుకునే బలహీనత నాలో లేదు. మన అభిరుచులు సరిపడలేదు, అది మన దౌర్భాగ్యం అనుకుందాం."

"అభిరుచులు సరిపడలేదని అంత తేలిగ్గా అనేశావే! అసలు అవి ఎందుకు వేరుపడుతున్నాయో ఆలోచించావా? కళల్ని బహిరంగంగా పదిమంది ఎదటా ప్రదర్శించి తీరాలా? కళాభిమానంతో నువ్వు ఎన్నివిద్యలునేర్చినా వాటిని గుప్తంగా వుంచుకోవచ్చును. కళ కళకోసమే అని తెలియదా?"

"కాదు. కళ కళకోసమే కాదు." ఆవేశంగా అంది మోహిని — "కళ జీవితంకోసం. జీవిత వికాసంకోసం. కళలు గుప్తంగా దాచుకోవలసినవిద్యలు కావు. కళల్లో నేను అలౌకికమైన ఆనందాన్ని చూడను. లౌకికమైన జీవితాన్ని చూస్తాను. జీవితపు అనుభూతుల్ని చూస్తాను. అందుకే కళలు క్షీణించిపోతోన్న మనదేశంకోసం నేనేదో చెయ్యాలని ఆశలు పెట్టుకుంటున్నాను. కళోద్ధరణలో నేను అల్పురాలినేకావచ్చు - అణువునే కావచ్చు. అయినా నేను కళాభిమానిని. ఒక కళాకారుడు మరొక కళాకారుణ్ణి అర్థంచేసుకోగలడని గాఢంగా విశ్వసించాను. కానీ ... మీరు ... సరే! పోనివ్వండి. గతం తవ్వుకోవద్దు. నేను వెళ్తాను."

అదిరిపడ్డాడు సుధాకర్ —

"అవును. నేను వెళ్తాను. వెళ్లాలి. పెళ్ళికి ఎప్పుడూ నేను అధికమైన ప్రాధాన్యత యివ్వలేదు. అది జీవితావసరం కావచ్చు గానీ-నిండు జీవితం మాత్రం కాదు. మనం అతి సన్నిహితంగాచేరి విడిపోతున్నాం. ఈ దుస్థితికి నేను విచారిస్తున్నా

వని చెప్తే సరిపోదు. దయచేసి నాకు అనుమతి యివ్వండి, నేను వెళ్తాను."

"మోహనీ! నీకేం మతిపోయిందా? ఎక్కడికి వెళ్తావు?" కోపంగా అరిచాడు సుధాకర్.

దృఢంగా అంది మోహిని - "నాకు మతిపోలేదు. అందుకే కళానిలయానికి వెళ్తాను. ఊహ తెలిసినదగ్గిర్నుంచీ ఆడుతూ పాడుతూ పెరిగిన కళానిలయానికి వెళ్ళిపోతాను. అక్కడ నాకే అభ్యంతరాలూ లేవు. ఏ ఆటంకాలూ లేవు. నేను నిలుపుకోవలసిన ఏ హోదాలూ లేవు. అక్కడ ప్రతీ అంగుళానికీ నా అభిరుచులు తెలుసు. అణువణువుకీ నా కోరికలు తెలుసు. బండరాళ్ళకుకూడా నా ఆశయాలు తెలుసు. కళానిలయం ఎప్పుడూ నాకోసం నిరీక్షిస్తూవుంటుంది. అక్కడికే వెళ్తాను నేను." మోహిని కోరికకు వున్న బలం పూర్తిగా అర్థమైంది సుధాకర్‌కి. మోహినిని తను ఆమోదించలేడు. శాసించలేడు. మోహినిని నిలుపుకోలేడు-"మోహినీ!" దుఃఖపూరిత కంఠంతో మాట్లాడలేకపోయాడు చాలాసేపు - "మోహినీ! నాకోసం నీ నిర్ణయం మార్చుకోలేవా? నన్నువిడిచి నువ్వు వెళ్ళిపోగలవా? చెప్పుమోహినీ!" సుధాకర్ మోహినికి చాలా సన్నిహితంగావచ్చి నిలబడ్డాడు.

మోహిని కళ్ళెత్తి సుధాకర్ మొహంలోకి నిస్తేజంగా చూస్తూ అంది - "సుధా! నువ్విలాంటి నైచ్యానికి దిగకూడదు. ఎదటివాళ్ళ బలహీనతల్ని ఎత్తిచూపి బంధించాలని ప్రయత్నించకూడదు. ఇప్పటికైనా నీకు తెలిసివుంటుంది నేను రాధలాంటి అనురాగమయిని కానని. నాలో రాధ హృదయాన్ని చూశా

నని భ్రమపడ్డావు. నిజంగా భ్రమపడ్డావు. నీకు నేను స్వంతం కాలేకపోతున్నాను, క్షమించు క్షమించు."

సుధాకర్ మొహమంతా ఎర్రబారింది. తదేకంగా మోహినికేసి కొంతసేపుచూసి మారుమాట లేకుండా గదిలోంచి వెళ్ళిపోయాడు.

సుధాకర్ పాదాలకు అడ్డుపడాలనిపించింది క్షణం. మరుక్షణంలో అలా చెయ్యలేక పోయింది మోహిని.

విశాలమైన గవాక్షంలోంచి - తొందర తొందరగా పరుగులు తీస్తోన్న మబ్బుతెరలలోకి శూన్యంగా చూస్తూ నించుంది మోహిని.

"సుధాకర్! మోహిని నీకోసం - ఎంత సహనం తెచ్చుకుందో నీకెలా తెలుస్తుంది? ఎలా తెలుస్తుంది?"

* * *

"తాతయ్యా!" బలరామయ్య ఒడిలో మొహం దాచుకుని పసిపిల్లలా బావురుమంది మోహిని. తాతయ్య తలనిమురుతోంటే కించిత్తు ఓదార్పుదొరికింది.

"తాతయ్యా! నీకు తెలుసు నేను పెళ్ళంటే చిన్నతనంచుంచీ ద్వేషిస్తోనేవున్నాను. కానీ హఠాత్తుగా అక్కయ్య పోవటంతో - దిగులుతో కృశించిపోతోన్న నీకు ఎలాగైనా సంతోషం కల్గించాలనుకున్నాను. నా అపోహలకోసం జీవితాన్నే ద్వేషించటం మూర్ఖత్వం అని ఆలోచించి ఈ పెళ్ళికి అంగీకరించాను. కానీ ఏది మూర్ఖత్వమో నాకిప్పుడు అర్థంకావటం లేదు." తాతయ్య మొహంలోకి దీనంగాచూసింది మోహిని-"నువ్వుచెప్పు తాతయ్యా! నేను అవివేకంగా ప్రవర్తించానా?"

దీర్ఘంగా నిట్టూర్చాడు బలరామయ్య - "అమ్మా! మోహినీ! నీబాధ నాకు తెలుసు. మనస్సు దృఢం చేసుకో! నువ్వు ఎలాంటి పరిస్థితుల్లో కూడా కళాద్రోహం చెయ్యలేవు. మరే తప్పు చేసినా దానికన్నా అధికమైనది కాదు — వీణ వాయించుకుంటానని ఏడుస్తోన్న కళాబాల నా కళ్ళకు కన్పిస్తోందమ్మా! ఆత్మానందాన్ని చంపుకునే దౌర్భాగ్యం కళాకారుడికి ఎప్పుడూ సంభవించకూడదు. కవితా హృదయుడైన నీభర్తకి ఈ సత్యం తెలిసివుండవలసింది-"

మోహిని ధైర్యంగా చూసింది- "తాతయ్యా! నేను మూర్ఖంగా ప్రవర్తించలేదుకదూ?"

"మోహినీ! చేసుకున్న నిర్ణయాలగురించి పదే పదే తర్కించుకోవటం వివేకంకాదు. నువ్వు వ్యక్తురాలివి. నీజీవితం గురించి నువ్వు ఆలోచించుకోగలవన్న నమ్మకం నాది. నీ స్వార్థాన్నంతా విసిరిపెట్టి జీవితాన్నే కళలకోసం అంకితం చేస్తానంటే నిన్ను విమర్శించేశక్తి నాకులేదు. నువ్వు ఎవ్వరికీ ద్రోహంచెయ్యకు. నీకు ద్రోహం జరగదు. ఇంతకుమించి నేనేం చెప్పగలను తల్లీ!"

మోహిని హృదయభారం తగ్గిపోయింది. తాతయ్య సమర్థనే ఆశీర్వాదంగా స్వీకరించింది.

* * *

సాధనా - పరిశోధనా - కళాభివృద్ధికి మూలం. మోహిని కలలు కల్లలు కాలేదు, తన ఆశల్ని పండించుకోవటానికి మనస్సంతా ఒకేలక్ష్యంమీద కేంద్రీకరించి సంవత్సరాల తరబడీ శ్రమించింది.

భారతదేశపు సంస్కృతి ప్రతిబింబించే సంగీత నాట్య కళలను కరతలామలకం చేసుకున్న అదృష్టవంతులలో మోహినీదేవి ప్రఖ్యాతురాలు.

"కళ కళకోసం కాదు. కళ జీవితంకోసం. కళలు కథలు చెప్పాలి. కళల్లో జీవితాలు ప్రతిబింబించాలి. కళలు సమస్యల్ని పరిష్కారం చెయ్యాలి. కళలు జీవితవికాసానికి తోడ్పడాలి." అన్న విశ్వాసంతో — ధ్యేయంతో — కళామార్గాన్ని ఎన్నుకొంది మోహిని. గాయకుడు రాగాలు పలికిస్తాడు. చిత్రకారుడు రంగులు మేళవిస్తాడు. కవి పదసముదాయాన్ని పేర్చి కూర్చుతాడు. నర్తకి సహజానుభూతులతో అభినయిస్తుంది.

మోహిని జన్మతః నర్తకి, ఏకపాత్రాభినయంలో ఘటికురాలు. వివిధ మనస్తత్వాలను తన అనుభూతులతో సువ్యక్తం చెయ్యగలదు. కళాకారుడు ఎప్పుడూ కళాకారుడే

నవ్యనాట్యరీతులూ — కళా మెలుకువలూ మోహినీదేవిని మరింత ప్రఖ్యాతురాల్ని చేశాయి. ప్రజల అభిరుచులు గుర్తించి కాలానుగుణంగా కళాసాంప్రదాయాల్ని తీర్చిదిద్దుకోగలగటంలో నేర్పరి ఆమె.

ప్రతిభావంతులైన కళాకారులతో విశిష్టమైన బృందాన్ని ఏర్పరిచింది మోహినీదేవి.

సాంఘిక జీవితసమస్యలు ఎన్నో కథావస్తువులుగా తీసుకుని — ఆదర్శవంతమైన పరిష్కారాలతో ముగింపులు చూపిస్తూ-నృత్యరూపకాలు ప్రదర్శిస్తుందా బృందం కర్నాటక సంగీతంతోనూ - భరతశాస్త్రంతోనూ బొత్తిగా పరిచయంలేని ప్రేక్షకులుకూడా చూసి - అవగాహన చేసుకుని ముగ్ధులయ్యే

విధంగా - కమనీయమైన పదాలతోనూ - రమ్యమైన జావళీల తోనూ - హృదయాలను ఆకట్టే అభినయాలతోనూ - బహు సున్నితమైన సంగీతాన్నీ - నాట్యాలనీ ప్రదర్శిస్తుందా బృందం. కళాబృందం. కళాబృందం ప్రదర్శించే ప్రదర్శనలన్నీ మనోధర్మ సంగీతంతోనూ — మనోజ్ఞమైన నాట్యాలతోనూ కూర్చిన మాలికలలా వుంటాయి, శాస్త్రపాండిత్యంకన్నా లాలిత్యానికీ సహజత్వానికీ ఎక్కువ ప్రాధాన్యా యిస్తుంది మోహినీ దేవి.

మోహిని తరిచిచూడని జీవితంలేదు.

ఆమె పరిష్కరించని సమస్యలేదు.

ఆమె పరిష్కారాలను ఛాందసులు విమర్శిస్తారు అభ్యుదయవాదులూ - పురోగాములూ - సమర్థిస్తారు. కానీ - అందరూ కూడా ఆమె కళారాధనని ప్రశంసిస్తారు.

మోహినీదేవి కళాబృందం సాంఘిక చైతన్యం కల్గిస్తూ కళావుద్యమం లేవదీయగల్గింది.

తాను మించిన కళాకారుల్ని తయారు చేయాలనే పట్టుదలతో మోహినీదేవి నాట్యాలయాన్ని కూడా స్థాపించింది. ఆమె కళోద్ధరణకూ-దేశసేవకూ అది ఒక తార్కాణం కావచ్చు.

కళారంగంలో శిఖరాగ్రాన్ని అందుకోగలిగిన సాహసురాలు మోహినీదేవి. దేశం నలుమూలలా - పండితులకోసం-పామరులకోసం కూడా జనరంజకమైన ప్రదర్శన లిచ్చింది. స్వదేశంలోనే కాదు. విదేశాలలో కూడా అనేక పర్యాయాలు పర్యటించి - భారతీయ కళల్ని ప్రపంచానికి విశేషంగా పరిచయం చేసింది. భారతీయతలోని సౌందర్యాన్నీ - ప్రత్యేక

తనూ - ప్రపంచంలో ప్రచారంచేసి - ప్రపంచం దృష్టిలోనే భారతీయ కళల కొక విశిష్ట గౌరవాన్ని చేకూర్చగలిగింది. కళాకారిణి మోహినీదేవి కళాప్రియత్వానికి భారతదేశం నీరాజనలు పట్టింది.

ఎన్నడో పసివయస్సులో ఆమె చిన్నారి హృదయంలో చిగురించిన మొలక-బ్రహ్మాండమైన వృక్షమై పాంథులకు నీడ లిస్తోంది.

కానీ ఆ వృక్షానికి ఎండ తప్పలేదు.

* * *

ఆనాటి ప్రదర్శన ఒక పల్లెటూరిలో.

అక్కడి ప్రజల అభిరుచులకు అనుగుణంగా ఐటమ్స్ ఎంచుకొంది మోహినీదేవి.

ప్రదర్శన ప్రారంభమైంది.

ఎందుకో ఆరోజు మోహిని మనస్సంతా చాలా అశాంతి మయంగా వుంది. ఆ అశాంతి చాలా చిరపరిచిత మైనదిగాకూడా వుంది.

రంగస్థలానికి ఎదుట వందలాది ప్రేక్షకులు ఆసక్తితో నిరీక్షిస్తూ కూర్చుని వున్నారు. కానీ-వారిలో ఒకవ్యక్తి లేడు. తన హృదయారాటం గుర్తించగల్గే వ్యక్తి లేడు. తన కన్నులకు మహదానందం కల్గించే ప్రేక్షకుడు లేడు.

సంవత్సరం తరబడీ-ఈ వెల్తి వెల్తిగానే వుంది.— అప్రయత్నంగా నిట్టూర్చింది మోహినీదేవి.

"ఆడజన్మ నెత్తిన ఫలమేమి ?

అతివరో! వ్యర్థ మమ్మా!—"

పల్లవి అభినయం చేస్తోంటే మోహినీదేవి మనస్సు పండు టాకులా కంపించింది.

"అతివ మిక్కిలి రూపవతియైతేనేమి ?
సతతమూ పతిభక్తి సలిపితేనేమి ?
అతులిత వ్రతములు అచరించిన నేమి ?
పతితోడ హితవుగా పలుకు లేకపోతే—"

పతినుంచి ఎడబాటు పొందిన సతి దుఃఖాన్ని అనుభవిస్తోంది నాయిక.

మోహినీదేవి శరీరం ఆపాదమస్తకం కంపించసాగింది. చిరుచెమటలతో తనువంతా విలపిస్తోంది. కన్నులు చెమరించి ప్రేక్షక లోకం శూన్యంగా-శూన్యంగా గోచరించింది.

కలవరం అణుచుకొంటూ అభినయం సాగించింది.

"వెలవిరివి వస్త్రాలు వేయి కట్టిన నేమి ?
సలలిత నవరత్న సరులు పెట్టిన నేమి ?
కలిమి అందరికంటె కలిగియుంటేనేమి ?
ఫలకాలమునాడు పతిని కూడకపోతే—"

అది పదాభినయంకాదు. నర్తకి జీవిత వ్యధాభినయం. మోహిని ఎప్పుడూ కళతో లీనమైపోతుంది. కానీ ఆరోజు కళ జీవితంలో లీనమౌతోంది.

తన జీవితం – కళా – పరస్పరం భిన్నఅంశా లయ్యాయి. ఈ కళే తన జీవితాన్ని కలుషితం చేసిందో – తన జీవితమే కళకు ద్రోహంచేస్తోందో – అర్థంకావటంలేదా నర్తకికి.

మనోకలవరాన్ని సరిదిద్దుకోవటానికి మోహినీదేవి పూర్తిగా అశక్తురాలైపోయింది. హృదయాంతరాళాలలోని

వేదన అశ్రువుల రూపంలో పైపైకి వుబుకుతోన్న స్థితిలో నాట్యాన్ని ఆపివేసి తడబడుతోన్న అడుగులతో రంగస్థలం వెనక్కి వెళ్ళిపోయింది.

ప్రదర్శనమధ్యలో తెర పడింది.

మోహినీదేవి అభినయాన్ని-నృత్యాన్ని-మంత్రముగ్ధులై చూస్తోన్న ఆ పల్లెప్రజలు-నిరుత్సాహంతో నిరాశతో లేచి వెళ్ళిపోయారు.

మోహినీదేవి ఒంటరిగా కూర్చుని నిశ్శబ్దంగా కన్నులు ఒత్తుకుంది.

"ఎప్పుడూ యిలా కాలేదు. మనస్సుపూర్తిగా వశం తప్పింది." - తన అశక్తతకు సిగ్గుపడుతూ - సుదీర్ఘంగా ఆలోచిస్తూ వుండిపోయింది.

"అమ్మా! మీకోసం ఎవరో అడుగుతున్నారు" — ఎవరో వచ్చి చెప్పారు.

మోహినీదేవి తల అడ్డంగా తిప్పింది - "ఊహూ! ఇప్పుడు వీల్లేదని చెప్పు. నే నెవర్నీ కలుసుకోలేను." ఆవ్యక్తి రెండు నిముషాల్లో మళ్లావచ్చాడు—

"గోపాల్ బాబట. మీతో తప్పకుండా మాట్లాడా లంటున్నారు."

"గోపాల్ బాబు .... గోపాల్ బాబెవరు ?..." విస్మయంగా చూసింది మోహిని - మోహిని మస్తిష్కంలో ఓ మెరుపు మెరిసింది - వులిక్కిపడుతూ లేచింది - "గోపాల్... గోపాల్... అవును. ఆయన్ని రమ్మను. వెళ్లు-వెళ్లు-తొందరగా తీసుకురా!" కలవరపడుతూ లేచి గుమ్మం దగ్గిరికి వెళ్ళింది.

గోపాల్ - మోహినిని చూస్తూ చిరునవ్వు నవ్వాడు. అక్కయ్య మృత్యువార్తవిని శోకభారంతో వెళ్ళిపోయిన గోపాల్ - ఇన్నాళ్ళకి...ఇన్నేళ్ళకి...అబ్బ! గోపాల్ ఏమీ మారలేదు. నల్లటి నలుపు. తెల్లటి బట్టలు.

మొహంనిండా చేతులనిండా మచ్చలు.

గోపాల్ని చూస్తోంటే ఆప్తుణ్ణి చూసిన ఆనందంతో నోరువిప్పి ఏమీ మాట్లాడలేకపోయింది మోహిని.

"బావున్నావా మోహినీ?" అన్నాడు గోపాల్ సంభాషణ ప్రారంభిస్తూ.

"రా గోపాల్ రా! లోపలికి రా!

గోపాల్ని ఆప్యాయంగా ఆహ్వానించింది మోహిని— "ఇన్ని సంవత్సరాలకు ఇప్పుడు మాత్రం ఎందుకు గుర్తు వచ్చాను బావా?" చాలా నిష్ఠూరంగా అడిగింది.

గోపాల్ నిర్మలంగా నవ్వాడు - "గుర్తురావటం ఏమిటి? నిన్ను నేను మర్చిపోతేకదా గుర్తురావటానికి?"

"అయితే నువ్వు ఎక్కడవున్నావో తెలీకుండా ఇంత అజ్ఞాతవాసం ఎందుకు? నా మీద యింకా కోపమేనా నీకు?"

"కోపంవంటి దేదైనా వుంటే అది భగవంతుడిమీదే; ఇతరులమీదెందుకు?"

ప్రసక్తి మారుస్తూ అంది మోహిని - "నీ చిత్రాలుకొన్ని ప్రదర్శనలకు పంపించాను. కొన్నిటికి బహుమతులుకూడా వచ్చాయి. నువ్వు ఎక్కడున్నావో తెలియక తాతయ్యా నేనూ ఎంతో విచారించాం."

నా చిత్రాలకు బహుమతులు రావటం - అంతా నాకు

తెలుసు మోహినీ! ఊరూ పేరూ లేని చిత్రకారుణ్ణి గురించి పత్రికలన్నీ బ్రహ్మాండంగా రాయటం కూడా చూశాను."

"అన్నీ నీకు తెలుసా?" విస్మయంగా చూసింది మోహిని - పోనీ బహుమతులు తీసుకోవటానికైనా నువ్వు వచ్చి వెళ్ళకూడదా?"

గోపాల్ నిర్వికారంగా అన్నాడు—"నా చిత్రాలకు బహుమతులు యివ్వటం జరిగిన తర్వాత అవి తీసుకున్నా లేక పోయినా - నావే అవుతాయి కదా? నా కా తృప్తిచాలు మోహినీ! అంతకు మించిన కీర్తి కాంక్ష లేదు. పదిమంది మధ్యా నిలబడి నేనంటూ చాటుకోవాలన్న కోరిక నాకెప్పుడూ కలగ లేదు."

మోహిని గోపాల్ మొహంలోకి సూటిగా చూసింది. గోపాల్ తనని విమర్శిస్తున్నాడా? తన కీర్తి కాంక్షను పరిహ సిస్తున్నాడా?

"నీకు కీర్తి అవసరం లేక పోవచ్చు. కానీ నీవంటి కళాకారుణ్ణి సత్కరించాలనే కోరిక కళాభిమానులకు వుంటే?"

"వుండనీ! నా యిష్టాలకు వ్యతిరేకంగా నేనేం చెయ్య గలను? ఎందుకు చేయాలి? నేను బహుమతులు స్వీకరించక పోతే ఎవ్వరికీ జరిగేనష్ట మేమీ లేదు."

"అసలునువ్వు బొమ్మలు గీయకపోయినా దేశానికి జరిగే నష్టమేమీవుండదు. అందుకని బొమ్మలు గీయటం మానేస్తావా?"

"నేను దేశంకోసం ఈ బొమ్మలు గియ్యటం ప్రారంభించ లేదు మోహినీ! ఇప్పుడు దేశానికి నష్టం రాదన్నంత మాత్రాన

గియ్యటంమానను. నాచిత్రాలనుంచి దేశం ఏమైనా తెలుసుకుంటే తెలుసుకోనీ! ఆనందిస్తే ఆనందించనీ! అది కళకుచేసే ఆరాధన అవుతుంది. కళకుయిచ్చే గౌరవం అవుతుంది. వ్యక్తిగతంగా నాకు మాత్రం ఎలాంటి సత్కారాలూ - సన్మానాలూ అవసరం లేదంటున్నాను. నేను కళను వ్యాపారం చెయ్యను కళను కీర్తికి సోపానం చెయ్యను"— గోపాల్ హృదయపు వైశాల్యానికీ-సంస్కారానికీ ముగ్ధురాలైంది మోహిని —"గోపాల్? ఇప్పుడు నువ్వేం చేస్తున్నావు?" ఆసక్తిగా అడిగింది.

"ఈపల్లెటూళ్లో ఒకచిన్న పాఠశాల ప్రారంభించాను. అభిరుచిగల కుర్రవాళ్లకి బొమ్మలు గియ్యటం నేర్పిస్తున్నాను. నా చిన్నతనంలో ఇలాంటి పల్లెటూళ్లోనే నాజీవితం గడిచింది మోహినీ! ఆరోజుల్లో బొమ్మలు గీయటం నేర్చుకోవాలని నా మనస్సు తహతహ లాడేది కళాభిమానం వున్నవాళ్లకి శిక్షణ లోపిస్తుంది. శిక్షణ పొందగలిగేవాళ్ళకి కళాభిమానం లేకుండాపోతుంది. రెండూ కలిసినప్పుడు చాలా గొప్ప కళాకారుడు కావటంలో సందేహం లేదు. ఈ పల్లెటూరి పిల్లలకు నావిద్య నేర్పుతోంటే ఎంతో ప్రశాంతంగా గడుస్తోంది కాలం."

గోపాల్ గురించి ఇంకా విశేషాలు తెలుసుకోవాలని ఆదుర్దాపడింది మోహిని మనస్సు. సాహసంగా అడిగేసింది - "నువ్వు పెళ్ళిచేసుకున్నావా గోపాల్ ?"

గోపాల్ నవ్వాడు - ఆ నవ్వులో విషాదానికి మోహిని కంపించింది - "పెళ్ళిచేసుకోకుండా తండ్రికూడా అవుతారా ఎవరైనా ? అందులో ఒక కళాకారుడు - ప్రేయసిని మోసం చేసి భార్యని చేసుకుంటాడా ? అదంతా నీకు తెలుసు మోహినీ!

నేను పెళ్ళి చేసుకున్నాను, కానీ నా భార్య...చచ్చిపోయింది. ఏంచేస్తాం? నేనుమాత్రం చచ్చిపోవలసినవాణ్ణి కాదా? ముందు... వెనకా... అంతే. ఎప్పటికైనా తిరిగి కలుసుకో గలిగితే చాలు. అదే శాశ్వతం. ఇది కాదు."

మోహిని దుఃఖంతో మాట్లాడలేక పోయింది.

రెండునిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"మాట్లాడు మోహినీ! నా సొద వెళ్ళబోయటానికి రాలేదు నేను. నీ విశేషాలు విందామనే వచ్చాను."

"ఏంమాట్లాడను? నిస్పృగా చూసింది."

"ఏదో మాట్లాడు. ఇలా మౌనంగా కూర్చోవటం ఎందుకూ?"

మోహిని ప్రయత్నపూర్వకంగా నవ్వు తెచ్చుకొంది—

"అందరి పెళ్ళిళ్ళనూ ద్వేషించిన నేను పెళ్ళి చేసుకున్నాను. తెలుసా నీకు?"

"తెలుసు. చాలా అదృష్టవంతురాలివి."

"తర్వాత కొత్తదనమైనా మాయకుండా మేమిద్దరం విడిపోయాం. అదికూడా తెలుసా?"

"తెలుసు. నాకంతా తెలుసు మోహినీ!"

"అంతా తెలిసే నన్ను అదృష్టవంతురాల్ని అంటున్నావా?" ఆశ్చర్యంగా చూసింది.

"ఎందుకు్కాదు? ఎప్పటికైనా మీరిద్దరూ కలుసుకో గలిగే అవకాశం వుంది."

"గోపాల్!"

"పద్మినిలాగా శాశ్వతంగా విడిచి వెళ్ళిపోయిన వాళ్ళ

మాటేమిటి ?"

మోహిని వెంటనే మాట్లాడ లేక పోయింది—"మేమిద్దరం మళ్లా కలుసుకుంటామనే అనుకోంటున్నావా బావా ?" అంది ఆవేదన స్ఫురించే కంఠంతో.

గోపాల్ నిర్లిప్తంగా నవ్వాడు—"ఇప్పటికి నీకు జీవితంలో చాలా నిజాలు తెలిసి వుండాలి. అవునా ?"

"ఏమిటి ?"

"నీ అనుభవం నాకెలా తెలుస్తుంది మోహినీ ! నీ కల లన్నీ ఫలించాయి. భవిష్యత్తునంతా శాసించినట్టు జరిపించు కున్నావు. కళాకారిణిగా శిఖరాగ్రాలు అందుకున్నావు. ఇంకా నీ కెందుకీ దిగులు ? ఇందాక ప్రదర్శనలో నువ్వు అద్భుతంగా అభినయిస్తున్నావని అంతా అనుకున్నారు. కానీ నీమూడ్ దాచుకోవటానికి ఎంత ప్రయత్నించావో నేను కనిపెట్టలేదను కున్నావా ?"

మోహినికి ఆపుకోలేని దుఃఖం వచ్చేసింది. తన మన స్సంతా విప్పి గోపాల్‌కి చెప్పేసుకోవా లనిపించింది. కానీ.... ఇక్కడ ...

"నువ్వు నాతో కళానిలయానికి రావాలి బావా !" అంది అర్థిస్తోన్నట్టు.

"కళానిలయానికా ? నేనెందుకు."

"ఎందు కేమిటి ? నీయింటికి నువ్వు రావటానికి ఎందు కని అడుగుతున్నావా? కాదనకు బావా! నువ్వు కొన్నాళ్లపాటు కళానిలయంలో వుండు. నీకు కూడా శాంతిగా వుంటుంది."

నిరాశగా అన్నాడు గోపాల్ — "శాంతి శాంతి ఎక్కడిది

మోహినీ నాకు? అశాంతి. అశాంతి మాత్రమే నాగుండెల నిండా వుంది. అయినా నువ్వు రమ్మంటే వస్తాను. కానీ అక్కడ ఒక్క క్షణం కూడా వుండలేనేమో అని ఆలోచిస్తున్నాను."

"ఎందుకు వుండలేవు? అక్కయ్య స్మృతినుంచి పారిపోవటం నీకు సుఖంగా వుంటుందా? అక్కయ్య తిరిగిన పరిసరాల్లో తిరుగుతూ గతమంతా గుర్తుచేసుకొంటూ వుంటే హాయిగా వుండదూ?"

"ఆగతం మాసిపోయిందని తెలియగానే హాయి అంతా ఏమౌతుందో ఆలోచించావా?" అపరాధిలా మాట్లాడలేక పోయింది మోహిని.

"నీతో నేను కొన్ని విషయాలు మాట్లాడాలి బావా! పోనీ నాకోసం రాకూడదా?"

"వస్తానమ్మా! తప్పకుండా వస్తాను. నువ్వేమీ దిగులు పడకు."

మోహిని నిష్ఠూరంగా అంది— "నేనీవూరు రాకపోతే నువ్వు నన్నెప్పటికీ కలుసుకునే వాడివి కావుకదూ?"

"ఎందుకు కలుసుకోను? నిన్ను కలిసి మాట్లాడే అవకాశం కోసమే నేనూ చూస్తున్నాను. నువ్వు రాకపోయినా నేనే ఎప్పుడో కళానిలయానికి వచ్చేవాణ్ణి."

గోపాల్ వాత్సల్యానికి కన్నీళ్ళు తిరిగాయి మోహినికి.

* * *

మోహిని దిగులు భూతంలా క్షణక్షణానికీ అధికమవ్వసాగింది.

గోపాల్ అన్నట్టు కళాకారిణిగా శిఖరాగ్రాలు అందు

కున్న తన కి వేదన ఎందుకు ? ఎందుకు ?—తన అంతరాత్మని తను మభ్యపెట్టలేదు. కొన్ని సంవత్సరాలుగా తను తన భర్తని కలుసుకోలేదు. కనీసం కంటితోనైనా చూడలేదు. వివాహం అయిన కొత్త అప్పటికీ యిప్పటికీ కొత్తగా నేవుంది. ఆ రోజులు...అవి రోజులుకావు...నిమిషాల్లా గడిచాయి. మధురక్షణాల్లా గడిచాయి. కొండల్లో కోనల్లో విహరించటం. విశాలమైన వృక్షాలక్రింద విశ్రమించటం—శుభ్ర జలాలలో జలకాలాడటం — పూపొదల్లో పవ్వళించటం—...అబ్బ! ... స్మృతి వీచికలతో మనస్సు మత్తెక్కుతుంది. శరీరమంతా తేనె నదులు ప్రవహిస్తాయి. గతం గుండెల్లో దాగి ఝల్లు ఝల్లు మనిపిస్తుంది.

అలాంటి మధురజీవితాన్ని తియ్యటి అనుభూతుల్ని — స్వర్గసుఖాలను తిరస్కరించి వచ్చింది తను — అపురూపంగా ప్రేమించే భర్తని త్యజించి వచ్చింది. ఎందుకు ? ఎందుకు ?— కీర్తికాంక్ష కోసమా ? కాదు కాదు. కళారాధనకోసం. కళాభిమానంకోసం.

అయితే ఈ దిగులు ఎందుకు? ఈ అశాంతి—ఈ అసంతృప్తి ఇదంతా ఎందుకు ?

ఈ కళాభిమానం మనస్సునిండా నిండింది.

కళారాధన నిర్విరామంగా జరుగుతోంది. ఇదేగా తను కోరుకుంది ?

ఆలోచనలు సాగని అయోమయస్థితి ఆవరించింది.

*　　　　*　　　　*

"నువ్వే చెప్పుబావా ! నా గతమంతా నీకు తెలుసు.

నా లక్ష్యాన్ని సాధించి ఈనాడీస్థితికి చేరుకోవటానికి నే నెంత కృషిచేశానో-ఎంత శ్రమించానో-ఎన్ని కష్ట నిష్ఠూరాలు ఓర్చానో నీకు తెలుసు. ఇలాంటి జీవితాన్ని నాశనంచేసి నన్ను తనకోసం ఒక పంజరంలో పెంచుకోవాలని చూడటం భావ్యమంటావా ? నా కళాభిమానాన్ని అర్థంచేసుకోవటానికి ప్రయత్నించని అతనితో నా జీవితం సరిపడదని బయల్దేరి వచ్చేశాను. నేను తప్పుచేశానా చెప్పు బావా !"—మనస్సంతా తెరిచి గోపాల్ ముందు బయటపెట్టింది మోహిని.

"నీ ఆశలునాశనంచేసే ప్రయత్నం నీభర్తయితేమాత్రం ఎందుకు చేయాలి మోహినీ? అది అమానుషమే."అన్నాడు గోపాల్.

మోహినికి ధైర్యం వచ్చింది-"సుధాకర్ ని నేను తిరస్కరించటం తప్పంటావా ?"

"ఇంత ఖచ్చితంగా అడిగితే నే నెలాచెప్పను మోహినీ? ఏంచెప్పినా నువ్వు విశ్వసించకపోవచ్చు."

"బావా ! ఇంకా గతాన్ని తవ్వీపోస్తూ నన్ను బాధ పెడతావా ?"

"నిన్ను బాధపెట్టటంకాదు. పద్మిని బ్రతికివుంటే పద్మిని కళాభివృద్ధికి నేను ఎన్నోవిధాల తోడ్పడగలిగేవాణ్ణి. పద్మిని నాట్యాలు చూస్తూ పదిమందితోపాటు నేనూ ఒకడినై ఆనందించగలిగేవాణ్ణి. కానీ ఈ అభిరుచి నీ భర్తకు లేదు. అయినా అతన్ని నేను విమర్శించలేను. సమర్థించనూలేను. ఒక్కటి చెప్పు మోహినీ! నన్నొక సోదరుడిగా భావించి చెప్పు. నీ భర్తంటే నీకు అనురాగంవుందా ?"

మోహిని సిగ్గుపడినా నేలచూపులు చూస్తూ అంది.

"సుధాకర్‌ని నేను పెళ్ళికి ముందు ప్రేమించలేదు. బావా ! సహృదయుడనీ - సౌందర్యవంతుడనీ — నన్ను అమితంగా ప్రేమిస్తున్నాడనీ - పెళ్ళికి ఒప్పుకున్నాను. ఆ పెళ్ళి జరిగాక అతన్ని నేను కూడా మనస్ఫూర్తిగా ప్రేమించ గలిగాను. అతని సహృదయంలో ఎప్పుడూ ఎలాంటిలోపమూ కన్పించలేదు. అతనితో గడిచిన కొద్దికాలం చాలా అమూల్య మైనదిగా తోస్తుంది. ఎప్పుడూ - కానీ మా అభిప్రాయాలు వేరుపడ్డాయి. నా ఆశలన్నీ అంత దారుణంగా నాశనంకావటం నేను సహించలేక పోయాను. కళనీ — వివాహాన్నీ వేరు చెయ్యాల్సి వచ్చినప్పుడు కళేనాకు ముఖ్యం అనుకున్నాను." మోహిని కొంతసేపు ఆగింది. నిర్లిప్తంగా చూస్తూ అంది — "కానీ చిత్రమేమిటంటే - నేను సాధించినదంతా నాకిప్పుడు వ్యర్థంగా కన్పిస్తోంది. దేశవిదేశాల్లో ప్రదర్శనలిస్తూ - కళా ప్రచారంచేస్తూ - సంఘాన్ని సంస్కరిస్తున్నాననుకొంటూ - అంతులేని ప్రశంసలూ - ఎనలేని బహుమతులూ-మహోన్నత మైన బిరుదులూ పొందుతున్నాను. కానీ నాకు సుఖంలేదు శాంతిలేదు, సంతోషంలేదు. జీవితమంటే విరక్తి ఎక్కువౌ తోంది. కళలకోసం జీవితాన్నే అంకితం చేస్తాననుకున్న నేను- ఎందుకింత వ్యథపొందుతున్నానో అంతుచిక్కటంలేదు." దీర్ఘంగా నిట్టూర్చింది మోహిని.

"మోహినీ ! నువ్వెందుకింత బాధపడుతున్నావో నేను చెప్పనా ?"

"ఎందుకు ?"

"అనురాగాలకోసం ఆత్మార్పణ చేసుకోవటం చేతకానందుకు."

అయోమయంగా చూసింది మోహిని.

"మోహినీ! మహోన్నతమైన కళాశిఖరాలు అధిష్ఠించిన నీకూ - ఒక సామాన్యమైన స్త్రీకీ పోలికకూడా కుదరదు. కానీ - ఆ సామాన్యురాలు కళ అనే మాటకూడా వినని స్త్రీ గురించి నీ అభిప్రాయం ఏమిటి?"

"కళాభిమానం లేనివారు మనుషులు కారని నేననుకోలేదు బావా! కానీ ఒక లక్ష్యంలేని జీవితంమాత్రం జీవితం కాదంటాను."

"లక్ష్యం అనేది ఒక్కో వ్యక్తికి ఒక్కోరకంగా వుండచ్చు. నీకు గొప్పగా నాట్యాలు చేయటంలో వున్న అభిరుచి — మరో స్త్రీకి యింటిని తీర్చి దిద్దుకోవటంలో వుండచ్చు. చక్కగా సంగీతం పాడి పదిమందినీ తన్మయుల్ని చేయటంలో నీకున్న కోరిక - మరో స్త్రీకి కమ్మగా వంటలు వండి యింట్లో అందరికీ సుష్టుగా తినిపించటంలో వుండచ్చు. జీవితమంతా భర్తనీ-బిడ్డల్నీ ప్రేమిస్తూ-వారి కష్టసుఖాలు చూసుకొంటూ గృహాన్ని స్వర్గసీమలా చేసుకు బ్రతికే స్త్రీకి లక్ష్యం లేదనీ-ఆమె జీవితం జీవితం కాదనీ నువ్వనగలవా"

"సరే! ఆ స్త్రీకే మరో అభిరుచికూడా వున్నప్పుడు? ఆమె యిష్టాల్ని భర్త పూర్తిగా వ్యతిరేకించినప్పుడు? ఆమె కర్తవ్యం ఏమిటి?"

"మోహినీ! ఇక్కడ స్త్రీ పురుషుల వ్యక్తిత్వాల

ప్రసక్తి-భార్యాభర్తల హెచ్చుతగ్గుల ప్రసక్తి తీసుకురాకు. అభిరుచులు చాలావరకు అవకాశాలమీదే మొలుస్తాయి. అనుకూలతల మీద పెరుగుతాయి. పరిస్థితులు దోహదం చెయ్యనప్పుడు ఏ అభిరుచులూ కలకాలం నిలువలేవు. నిలువకూడదనే నా అభిప్రాయం. తీరని కోరికలతో కృశించి పోవటం వివేకం అవదు. జీవితాన్ని రాజబాటలో సుఖశాంతులతో గడపటానికి ఏవిధం అనుకూలంగా వుంటే దాన్ని అనుసరించటం తెలివిగలపని.

నీభర్త నిన్ను మరేవిధంగానూ ద్వేషించలేదు. అపారమైన విలువలుయిచ్చి ప్రేమించాడు. నిన్ను తనసుఖంకోసం - తన ఆనందంకోసం స్వంతం చేసుకోవాలనుకున్నాడు. అది ఒకరకమైన బలహీనతేకావచ్చు. కానీ నీభర్తతో గడిపే జీవితంలో మాధుర్యం నీకు కన్పించలేదా ?''

"ఎంత మాధుర్యంవున్నా - ఎంత సుఖశాంతులున్నా - వాటికోసం పూర్తిగా జీవితపు విలువలన్ని పోగొట్టుకోగలనా?''

"మోహినీ ! సుఖశాంతుల్ని నిర్లక్ష్యంచేసే నువ్వు - జీవితంలో వేరే పొందే విలువలేమిటి? అది నీకళారాధనేనా? కళలు జీవితంకోసం - జీవిత వికాసంకోసం అని నువ్వు ప్రచారంచేస్తున్నావే ! ఎవరి జీవితంకోసం? ఎవరి జీవిత వికాసం కోసం? అందులో నీజీవితంలేదా! నీజీవిత వికాసం లేదా? ఇదెక్కడి అన్యాయం మోహినీ!కళలు ప్రచారంచేసే కళాకారిణి జీవితం మోడులా వుండాలా? మోహిని విస్మయంగా చూడసాగింది.

"కళలు ఎందుకు సృష్టించబడ్డాయో - కళారాధనికి

అర్థం ఏమిటో - అసలు కళగురించి నీకు తెలిసింది చాలా తక్కువని నేను ఘంటాపథంగా చెప్పగలను. నాట్యాన్నే తీసుకో. నాట్యం నేర్చేవ్యక్తి సర్వాంగాలూ సుందరంగా - సౌష్ఠవంగా-పెరుగుతాయి. నాట్యాభ్యాసం చేస్తోన్నంతకాలం ఆ వ్యక్తి ఆరోగ్యవంతుడై వుంటాడు. 'వ్యాయామం చెయ్యండి. శరీరాన్ని ఆరోగ్యంగా వుంచుకోండి' అంటే ఎవ్వరూ వినరు. ఆ వ్యాయామాన్నే-శాస్త్రబద్ధంగా అందమైన పద్ధతిలో తీర్చిదిద్ది-హస్తాలూ - ముద్రలూ - అడవులూ - భంగిమలూ-కరణాలూ-అంటూ నాట్యకళను సృష్టించారు ఎప్పుడో. ఈ నాట్యం చెయ్యటం కేవలం తన శరీరాన్ని అందంగా ఆరోగ్యంగా వుంచుకోవటానికేగానీ - యితరులకోసం కాదు. అలాగే సంగీతం కూడా ఒకరకమైన శారీరక వ్యాయామం. చిత్రలేఖనం-సాహిత్యం-మేధ వికాసానికి సంబంధించినవి. అంతేగాక కళలను ఆరాధించే మనస్సులు వుత్సాహాన్ని పుణికిపుచ్చుకుని మనోహరమైన భావాలతో అలరారుతూ వుంటాయి. కళారాధకుడికి చుట్టుపట్ల పరిసరాలూ-పరిస్థితులూ-కళాత్మకంగా-రమణీయంగా కానవస్తాయి. తను వాటిని అనుభవిస్తూ-ఆ అనుభవాలు యితరులకు పంచిపెట్ట గలుగుతాడు-ఒక గృహంలో చిత్రకారుడు వుంటే అతను బొమ్మలు గీస్తూ ముందు తను మానసికానందం పొందుతాడు. తర్వాత తన యింట్లో వారికి ఆ ఆనందం చవిచూపిస్తాడు. అలాగే పాటలు పాడే వ్యక్తి వుంటే తను ఆనందిస్తూ తన వాళ్ళని ఆనందింపచేస్తాడు. కళాకారుడు ఎప్పుడూ తన జీవితాన్ని ఆనందమయం చేసుకొంటూ-ఇతరుల జీవితాలను ఆనందింప జేస్తాడు-అదే కళాసృష్టికీ-కళారాధనకీ అర్థం. మూలం. ఈ కళారాధన నీ

గృహంలో జరిగితే లేదనీ-ఎక్కడో జరిగితే వుందనీ నువ్వు భావించటం పూర్తిగా పొరపాటు."

"..............."

"మోహినీ ! నువ్వు కమ్మగా కంఠం ఎత్తి పాడితే ఇతరులు విని ఆనందిస్తారు. కానీ ఎవ్వరూ ఆనందించకపోయినా నీకే మానసికమైన ఆనందం కల్గుతుంది. నీ కర్ణపుటాలకు కూడా కొంత సంగీత సుఖం కావాలి. అది నీ పాటలోనే నీకు దొరుకుతుంది. ఎవ్వరూ వినటం లేదని నువ్వు పాడుకోవటం మానకూడదు. నీ ఆనందం నీకు కావాలి, మోహినీ ! ఒక్కటి చెప్పు. నువ్వు మధుర గాయనివి మయూర నర్తకివి. ఈ కళలు నీ స్వంత జీవితానికి ఎంతవరకూ ఆనందం చేకూర్చుతున్నాయి ?"

"నాకు స్వంత జీవితం ఏమిటి ? నేను ఏవిధమైన జీవితం గడిపితే అదే నా జీవితం."

"కాదు. ఎప్పుడూ కాదు. రోజుకు పదిగంటల కాలం రంగస్థలం మీద వివిధ పాత్రల్ని పోషిస్తూ గడిపితే అది నీ స్వంత జీవితం అవుతుందా ?"

"అదంతా నా జీవితమే అనుకొంటున్నాను బావా ! ఆత్మానందాన్ని పొందటమే కళలధ్యేయం అన్నావుకదూ ? అలాంటి ఆత్మానందం-నా స్వంత జీవితంలో లేదనేగా దాన్ని విస్మరించి వచ్చాను ? ఆ ఆత్మానందం కోసమేగా ఈ కళా జీవితం సాగిస్తున్నాను?"

"నువ్వు భ్రమపడుతున్నావు. మోహినీ ! కళారాధన కచ్చేరీలు చెయ్యటంలోనే వుండదు. నీ పెరట్లో ఒక పూల

మొక్కని పెంచుకోవటంలో కూడా వుంటుంది. కళాభిమానం ఎనలేని కీర్తి ప్రతిష్ఠలు గడించటంలో కాదు. నిజ జీవితానుభూతుల్లో వుంటుంది. అవిరామంగా అనివార్యంగా సాగే జీవితానికి కళలు అమృత బిందువులవంటివి. సంజీవి పుడకల వంటివి.

సృష్టి క్షణక్షణం అభివృద్ధి చెందుతూ వుండాలి. అందుకు స్త్రీ పురుషుల సమైక్యత జరగాలి. ఆ సమైక్యతకు ముందు స్త్రీ పురుషుల మధ్య పరస్పరం ఆకర్షణ రేగాలి. ఆ ఆకర్షణ కోసమే సౌందర్యం సృష్టించబడింది. సౌందర్యాన్నీ-ఆకర్షణనీ ప్రసాదించే కళలుకూడా సృష్టించబడ్డాయి. స్త్రీ పురుషుల సమైక్యతకు విలువే యివ్వకుండా-స్త్రీని పురుషుడూ-పురుషుణ్ణి స్త్రీ ద్వేషించి-విస్మరించి చేసే కళారాధన బొత్తిగా అర్థరహితం అవుతుంది. కళల సృష్టినే అపార్థం చేసుకోవటం అవుతుంది. ప్రకృతి సృష్టించిన జీవితాన్ని అర్థంచేసుకుని-సహజమైన జీవితానుభూతుల్ని అనుభవిస్తూ-జీవితాన్ని ఆనందమయం చేసుకొంటూ బ్రతకటంకన్నా కళారాధన ఏంవుంటుంది?

మోహినీ! కళారాధన నువ్వు పదిమంది ఎదటా ఆడటంలోనూ — పాడటంలోనూ మాత్రమే పరిమితం కాకూడదు. ప్రతీ కదలికలోనూ - ప్రతీ పలుకులోనూ - ప్రతీ భావంలోనూ - ప్రతీ అనుభూతిలోనూ కళాదృష్టి వుండాలి. అదే నీలో లోపించిందని నేననుకుంటున్నాను - నీ ఆటాపాటా నీ జీవిత ధర్మాల్లో ఒకానొక భాగమేకానీ అదే పూర్తి జీవితం కాదు. పెళ్ళి జీవితానికి ఒక అవసరమేకానీ అదే నిండు జీవితం కాదన్నావు నువ్వు. అలాగే కళకూడా జీవితానికి ఒక

అవసరమే. కానీ నీ కళావ్యామోహమే జీవితమంతా ఆవరించి నీ ఇతర సుఖాల్ని దోచుకుంటోన్నప్పుడైనా ఈ నిజాన్ని నువ్వు గుర్తించటం తెలివైనపని. మోహినీ! సాంప్రదాయాన్ని పాటించటం వూపిరి పీల్చినంత అనివార్యం అవుతుంది ఒక్కో-సారి. సాంప్రదాయం కోసమే పెళ్ళి చేసుకున్నావు. సాంప్రదాయం కోసమే ఆజీవితం సాగించాలి. అది సంఘశాంతి చేకూరుస్తుంది."

మోహిని దీర్ఘంగా నిట్టూర్చింది – "వివాహాన్నే అంటి పెట్టుకుని ఇతర అభిరుచులు లేకుండా బ్రతకటం పూర్తిజీవితం కాదని నేనన్నాను. కళల్ని అంటిపెట్టుకుని మిగిలిన ధర్మాలు విస్మరించటం కూడా పూర్తిజీవితం కాదని నువ్వన్నావు. కానీ నా భర్తకి వైవాహిక జీవితం కావాలి. అదే అతనికి ముఖ్యం. నాకు కళా జీవితం కావాలి. ఇదే నాకు ముఖ్యం. ఇలాంటి పరిస్థితుల్లో మా యిద్దరికీ ఎలాపొత్తు కుదురుతుంది?"

"ఈ రెండు జీవితాలకూ సమన్వయం సాధించి పరిపూర్ణ జీవితంగా చేసుకోవాలి. ఆ బాధ్యత నీ ఒక్కదానిమీదే వుందని నేననటంలేదు. నీకు సంబంధించినంత వరకూ నువ్వు జీవితాన్ని గురించీ – కళలగురించీ తెలుసుకో – ఆ తర్వాత కూడా యింకా ఏమైనా లోటు మిగిలితే అందులో నీ పొరపాటు వుండదు.

'కళ జీవిత వృక్షానికి పూసే పువ్వులాంటిది.' అన్నాడొక గొప్ప రచయిత. ఉత్త పువ్వు కాదు, సువాసన గల పువ్వులాంటిది అంటాను నేను. పువ్వుని ప్రేమించే వాళ్ళు చెట్టుకోసం – దాని అభివృద్ధికోసం ముందు శ్రద్ధ తీసుకోవాలి. పువ్వుకన్నా వృక్షానికే ఎక్కువ విలువ

యివ్వాలి. సువాసనగల పుష్పాలు పూసినా లేకపోయినా ఆ చెట్టువల్ల ఇంకా ఎన్నో ప్రయోజనాలు వున్నాయి. ఆ ప్రయోజనాలతో తృప్తిపడటం – వాటిలోనే ఆనందాన్ని వెదుక్కోవటం తెలుసుకోవాలి పువ్వు పూయలేదని చెట్టుని నరికి వేయటం ధర్మం అని నే ననుకోను.

తలదువ్వుకుని పువ్వులు పెట్టుకుంటే చాలా అందంగా వుంటుంది. పువ్వులులేవని తల దువ్వుకోవటం మానేస్తావా ? తల పరిశుభ్రంగా – అందంగావున్న మీదటే పువ్వులు మరింత అందాన్ని తెస్తాయి. జుత్తుకి అందం తేవటానికే పువ్వులు వుపయోగించాలిగానీ – పువ్వులకోసమే తల సృష్టించబడిందనుకో కూడదు. ఏ కళానుభవమూ లేకపోయినా జీవితం నిశ్చింతగానే గడుస్తుంది గానీ – కళలు కొల్లలుగావుండి – సహజ జీవితం లేకపోతే బ్రతుకు శూన్యమౌతుంది. జీవితధర్మాలు సక్రమంగా సాగుతోన్నమీదటే కళోపాసనా — కళారాధనా — వర్గాలు. నీ ఆత్మానందం నీ కళాజీవితంలోనే వుందన్నావు. కానీ ఎప్పుడైనా నీ ఆత్మానందం ఆ కళాజీవితంలో లేదనిపిస్తే నీ లక్ష్యాన్ని మార్చుకోవటమే వివేకం. కళ సహజజీవితానికి మెరుగులు పెడుతుంది. జీవితానందాల్ని అధికం చేస్తుంది. నిజమే. ముందు జీవితం వుంటే కదా కళని ఆరాధించేది ?

జీవితం తర్వాతనే కళ.

కళ కే ప్రాధాన్యతయిచ్చి జీవించటం కాదు. జీవితానికే ప్రాధాన్యతయిచ్చి దానికోసం కళను వినియోగించుకోవాలి.

కళకోసం జీవితంకాదు, జీవితంకోసమే కళ."– మోహిని మంత్రముగ్ధలాగాకూర్చుంది. అంధకారమయమైన హృద

యంలో ఆశాకిరణం జొరబడినట్లయింది - "కళకోసం జీవించటం కాదు. జీవితంకోసం కళని వినియోగించుకోవాలి." పండు ఒలిచి అరచేతిలో పెట్టినట్లయింది. ఎంత చక్కని సత్యం! - అప్రయత్నంగా అంది - "ఇన్నాళ్ళూ నేను మూర్ఖంగా ప్రవర్తించనా గోపాల్?"

"నీ ప్రవర్తనను నేను విమర్శించను మోహినీ! ఒక్కమాటచెప్తాను. కళ అంటే ఏమిటి? అది ఎందుకు సృష్టించబడింది? కళల ప్రయోజనంఏమిటి? జీవితంలో కళలకు యివ్వాల్సినస్థానం ఎలాంటిది? అన్న విషయాలు బాగా అర్థంచేసుకో. నిజాలు తెలుసుకో. ఆ నిజాలను భద్రంగా నీ హృదయంలో దాచుకో - వాటిని గుర్తు తెచ్చుకొంటూనే కళాజీవితాన్ని గడుపు. అంధురాలిగా మాత్రం కళారాధన చెయ్యకు. జీవితాన్ని కళాదేవతకు అంకితం చేస్తున్నానని మూర్ఖంగా గర్వించకు. ఇదే నేను చెప్పేది."

మోహిని కొంతసేపు మౌనంగా కూర్చుంది — "బావా! నువ్వు చెప్పిన విషయాలు నాకు చాలా జ్ఞానోదయం కల్గించాయి. నువ్వు మాట్లాడిన ప్రతీమాటతోనూ నేను ఏకీభవిస్తాను. కళా జీవితమే పరిపూర్ణమైన జీవితం అన్న అంధ విశ్వాసం నాకిప్పుడు లేదు. కానీ ఈనిజం నన్ను మార్చలేదు. నా అభిరుచులు నీకు తెలుసు; సుధాకర్ ఈకళాజీవితానికి ఒప్పుకోడు. ఏదో ఒక అసంపూర్తి జీవితాన్నే ఎన్నుకోవాల్సివచ్చినప్పుడు నేనీ కళాజీవితాన్ని ఎన్నుకుంటాను. రసహీనమైన ఆ జీవితంకన్నా — అశాంతిమయమైన ఈ జీవితమే బాగుంటుంది నాకు."

గోపాల్ ఆశ్చర్యంగా చూశాడు - మనిషికి కొంత స్వార్థం వుండాలి మోహినీ! అదే జీవితాన్ని గాడితప్పకుండా నడిపిస్తుంది."

"ఉంది బావా! నాకూ స్వార్థంవుంది. ఆ స్వార్థం నాకీ కళాజీవితంలోనే వుంది."

గోపాల్ కొంతసేపు మాట్లాడలేక పోయాడు — "మోహినీ! నీవంటి కళాత్మురాలిని పొందగల్గిన భారతదేశం ధన్యమైంది."

మోహిని మనస్సు చాలా తేలికపడింది.

"బాధనే భరించాలి" అని తెలిసి భరించటం చాలా తేలిక.

* * *

"సుధాకర్‌గారు మీరేననుకుంటాను. నన్ను గోపాల్ అంటారు. మోహినీదేవికి అన్నవరస అవుతాను. ఒక్కసారి మిమ్మల్ని చూడాలని..."

"చాలా సంతోషం, రండి రండి..." వికసించిన మొహంతో సుధాకర్ లేచి గోపాల్‌ని సంతోషంగా ఆహ్వానించాడు - "నేనే సుధాకర్‌ని - రండి. అలాకూర్చోండి." అంటూ సోఫా చూపిస్తూ మర్యాద చేశాడు.

గోపాల్ సోఫామీద కూర్చున్నాడు. దృష్టి అంతా సుధాకర్ మీద వుంది. మొగవాళ్ళలో అంత అందంగా వుండటం చాలా అరుదు. అతని సౌందర్యం అతనిలో నేకాకుండా చుట్టూ పరిసరాల్ని సౌందర్యమయం చేస్తోందేమోనన్పిస్తోంది. సుధాకర్ కదలికలలో - ప్రవర్తనలో - పలుకుల్లో సౌంద

ర్యాన్ని మించిన దర్జా హోదా వున్నాయి. అవే అతన్ని అంతగా బంధించి సంకుచితంగా వుంచగలుగు తున్నాయేమో!

"కొంచెం కాఫీ తీసుకోండి, ప్లీజ్."

బట్లర్ కాఫీకలిపి యజమానికీ అతిథికీయిచ్చి వెళ్ళి పోయాడు.

సుధాకర్ చదువుతూ చదువుతూ మేజామీద విడిచిన బైండుపుస్తకాన్ని గోపాల్ కాలక్షేపంగా చేతుల్లోకి తీసు కున్నాడు.

"మీరిప్పు డేమైనా రాస్తున్నారా సుధాకర్ ?"

"లేదండీ! మానుకుని చాలాకాలమైంది."

పేజీలు తిప్పిచూస్తే ముత్యాల కోవల్లాంటి చేతివ్రాత కన్పించింది. గోపాల్ చిరునవ్వునవ్వుతూ - "ఇది మీ రైటింగ్ కదూ ?" అన్నాడు.

"అవును. మీ కెలా తెలుసు ?"

"మోహిని చెప్పింది. నీ వ్రాత చాలా బావుంటుందని చెప్పింది. ఉత్త బావుండటం కాదు, అద్భుతంగా వుంటుందని చెప్పింది. చూడండి, ఆడవాళ్ళు భర్తలవిషయం వచ్చేసరికి చాలా పక్షపాతంగా మాట్లాడతారని అనుకున్నాను గానీ - మోహినిమాత్రం చాలా యదార్థంగానే చెప్పింది. మీచేతి వ్రాత చాలా విశేషంగావుంది."

సుధాకర్ నుదుటినిండా చెమటపట్టింది. రుమాలుతో మొహం ఒత్తుకొంటూ ఏమంత ఆసక్తి కన్పరచకుండా అడి గాడు - "మీ సిస్టర్ బావున్నారా?"

"ఎవరు ? మోహినేనా ? బావుండటం అంటే ?"

"అంటే ఏముంది ? ఆనందంగావుండటం ... "

గోపాల్ నిర్లిప్తంగా చూస్తూ అన్నాడు - "జీవితంలో అగాధాలువున్న వాళ్ళకి ఆనందం ఎలావుంటుంది? ఆ అనుభవించే ఆనందంకూడా నామమాత్రమే."

ఒక్కక్షణం ఆగి మళ్ళా అన్నాడు గోపాల్ - "సుధాకర్! మీరు సావధానంగా వినగలనంటే రెండుమాటలు చెప్పి వెళ్దామని వచ్చాను."

సుధాకర్ గంభీరంగానవ్వుతూ - "అంత ఆశ్చర్యంగా మాట్లాడుతున్నారేమిటి ? మీరు మా అతిథిగావచ్చారు. ఏం మాట్లాడినా నేను సంతోషంగావింటాను. నిస్సంకోచంగా చెప్పండి." అన్నాడు.

గోపాల్ సుధాకర్ మొహంలోకి చూశాడు.

"మోహిని చాలా అశాంతి పాలౌతోంది."

"అశాంతి! మోహినీదేవికి ; ఎంతమాట !"

అపహాస్యంతో కూడిన ఆశ్చర్యాన్ని ప్రకటించాడు సుధాకర్ - "మీరు భ్రమపడుతున్నారండీ బావగారూ! ఆ అదృష్టవంతురాలికి అశాంతి ఏమిటి ?"

"మోహిని అదృష్టవంతురాలే అయితే - అంతకు మించిన దురదృష్టవంతురాలుకూడా - అశాంతిలో కూడా అదృష్టాన్ని వెదుక్కోవటం మోహినికి చేతకావటం లేదు."

విస్మయంగా చూశాడు సుధాకర్ -"అశాంతి! ఎందుకు? కోరుకున్నదంతా సాధించింది. దేశం ఆమె కళా ప్రతిభకు జోహారు లర్పిస్తోంది. ఇంకా ఆమెకు అశాంతి ఎందుకు ? నేను నమ్మలేను. మోహిని తన ఆశయాలకోసం మమకారాలు

తెంపుకు పోగలిగిన ధైర్యవంతురాలు. ఆమె అశాంతి పాలౌ తుందని నే నెప్పుడూ అనుకోను."

"మీకు అపార్థం చేసుకోనంటే నేను మనస్సు విప్పి మాట్లాడుతాను. మీరన్నట్లు మోహిని ధైర్యవంతురాలే. కానీ ధ్యేయం తెలిసిన వాళ్లకే ఆ ధైర్యం వస్తుంది. అయినా వెల్తిజీవితాలు గడిపేవాళ్ళకి అశాంతి లేకుండా పోతుందా ?"

"భర్తతో గడిపే జీవితానికన్నా - కళాజీవితాన్నే - వుత్తమంగా వున్నతంగా ఎంచుకుని మోహిని వెళ్ళిపోయింది. అలాంటి మోహిని వెల్తి జీవితం గడుపుతోందని మీరెలా భ్రమ పడుతున్నారు ?" నిస్పృహగా నవ్వాడు సుధాకర్ - "అది నా వంతు. ఆ వెల్తిజీవితం గడుపుతోన్న దౌర్భాగ్యుణ్ణి నేను బావగారూ!" సుధాకర్ హృదయమంతా ఆ రెండు మాటల్లో బయటపడి పోయింది. గోపాల్‌ని చూడగానే అతని కెంతో విశ్వాసం కుదిరింది, ఆత్మీయత కన్పించింది. ఇద్దరికీ సంబంధించిన ఆ వ్యక్తి ఎదట తన మనస్సు బైటపెట్టటంలో పొరపాటు లేదనిపించింది.

గోపాల్ ఆర్ద్రస్వరంతో అన్నాడు - "భార్యాభర్తల జీవితంలో సంభవించే దురదృష్టం ఒక్కరికే పరిమితం కాదు. అది యిద్దరివంతూ అవుతుంది. మీరు బాధపడుతోంటే మోహిని సుఖంగా వుందనుకోవటం మీ భ్రమ."

"ఎందుకండీ ? మోహినికికూడా బాధ ఎందుకూ ?"

"ఎంత అమాయకంగా అడుగుతున్నారు? మీకే మీ అర్థాంగిని అర్థంచేసుకోలేకపోతే నేను చెప్పగలిగే దేపాటి ? కానీ - మోహినిగురించి నాకు తెలిసింది చెప్తాను. మోహిని కళా

రాధనకన్నా వివాహానికి అధికమైన విలువ యివ్వలేక పోవటానికి చాలా చరిత్రవుంది వెనక. మీకు తెలిసేవుంటుంది. మోహినీదేవి తల్లిగారుకూడా గొప్ప వైణికురాలు. కానీ భర్త మూర్ఖతవల్ల ఆమె వీణ వాయించటానికి వీల్లేని దురదృష్టవంతురాలైంది. చివరికి ఆమె మరణంకూడా ఆ భర్త అహంకార ఫలితంగానే సంభవించింది. ఆ విషయాలన్నీ ఆలోచించటానికి కూడా చాలా జుగుప్సాకరంగా వుంటాయి. పుట్టుకతోనే కన్న తల్లిని గోల్పోయి - తండ్రి ప్రేమకూడా పొందలేక సంసార జీవితంమీద ఒక రకమైన విముఖతలు పెంచుకొంటూ పెరిగి పెద్దదైంది మోహినీదేవి.

వివాహానికి ఆమె అధికమైన ప్రాముఖ్యత యివ్వదు. స్వార్థపూరితమైన మగవాడికోసం ఆమె ఆత్మార్పణ చేసుకోదు. ఈ భావాలు చిన్నతనంనుంచీ ఆమె మనస్సులో మొలకలెత్తి పెరిగి పెద్దవయ్యాయి. స్వతహాగా ఆమె కళాభిమాని. తన స్వంత సుఖాలకన్నా అధికంగా కళలకోసం ఆరాటపడే రసికురాలు. కేవలం అభిమానంతో వూరుకోవటం కాకుండా - కళోద్ధరణా - కళారాధనా తన ఆశలుగా - ఆశయాలుగా ఎంచుకొంది. ఆమె ఎంచుకున్న ఆశయం కోసం - దేన్నయినా త్యాగం చేయటానికి సిద్ధపడింది. తన తల్లికి సంభవించిన దుస్థితికే - తనుకూడా బలికావటం సహించలేక పోయింది. అందుకే ఆమె ప్రాణపథంగా ప్రేమించిన భర్తనికూడా తిరస్కరించి వెళ్ళిపోగలిగింది. ఆమె వెళ్ళిపోవటంతో మీకు జరిగిన ఆవేదనకన్నా - కళలకూ - దేశానికీ జరిగిన మంచిని మీరు నిస్వార్థ హృదయంతో ఆలోచించగలిగితే బావుంటుంది

సుధాకర్!"

సుధాకర్ సూటిగా చూస్తూ అన్నాడు— "మహా మహా కళాకారు లెందరో తమ కళాప్రతిభనంతా భగవంతుడికే అర్పించారు. జీవితమంతా దైవారాధనలో గడిపేశారు. కళల సార్థకతకు అదిచాలదా? అంతకన్న ఘనమైనదా దేశసేవ?"
గోపాల్ చాలాసేపు మాట్లాడలేక పోయాడు.

"దైవారాధన గురించి మనం మాట్లాడుకుంటే పర స్పరం విమర్శించుకోవాల్సి వస్తుంది. ఎవరిభావాలు వారికి వుండనివ్వండి. కానీ ఒక్కటి మాత్రం మనకి తేటతెల్లముగా తెలుస్తుంది. జీవితాన్ని యిచ్చిన భగవంతుడు - ఆజీవితాన్ని గడపటానికి ఎన్నో అనుకూలతలు ఎన్నో అవకాశాలు కల్పిం చాడు. బ్రతుకంటే విసుగెత్తకుండా ఆహ్లాదంకల్గించటానికి కళల్ని సృష్టించాడు. ఈ కళలు మనకోసమే. మన ఆనందం కోసం— మన ఆనందం వెనక్కిపెట్టి ఈ కళలతో తనని ఆరా ధించాలని సృష్టికర్త అంటాడా? మనం అలాచేస్తే మెచ్చు కుంటాడా?

సుధాకర్! మనిషి కేవలం విగ్రహారాధనకి బానిస అయ్యేకన్నా - మానవత్వసాధననే ధ్యేయంగా ఎంచుకుంటే ఎక్కువ శాంతిగా - తృప్తిగా - పవిత్రంగా బ్రతకగలడు. భగవంతుడు మానవత్వంతో చేసే హృదయారాధననే కాంక్షిస్తాడు.

మోహిని ధ్యేయమే అదికదా? దేవుడి విగ్రహాలముందు ప్రార్థన నృత్యాలుచేస్తూ కాలం గడపటంకన్నా ప్రజల జీవిత వికాసం కోసం తన కళల్ని వినియోగించాలని లక్ష్యం ఏర్పచు

కుంది. కానీ కళారాధకులు దేవుడి పూజలకుతప్ప - సాటి ప్రజలకోసం ఏమీ చేయనవసరం లేదని మీరంటే... నా వరకూ నేను మీతో ఏకీభవించలేను సుధాకర్."

సుధాకర్ మౌనంగా వూరుకున్నాడు.

"మోహిని ఆశయాలు అతిశయాలు కాలేదు. కళా దారిద్ర్యం అనుభవిస్తోన్న భారతావనికి ఆమె ఒక మహావరం. ఒకప్పుడు కళలు కేవలం దైవారాధనకే నిర్దేశింపబడేవి, కానీ యిప్పుడు కళ మానవతారాధనకి. కళ ఎక్కడవున్నా - ఎవరిలో వున్నా దాన్ని పదిమందికీ పంచిపెట్టటం ధర్మమే కానీ అధర్మం కాదు. ఈ నాడు మోహినీదేవికి దేశదేశాలలో లభించే మన్ననలు చూస్తోంటే ప్రజలు కళాకారుల్ని ఎంత గౌరవాభిమానాలతో సత్కరించగలరో అర్థంచేసుకోవచ్చు. మోహినీ దేవి కళాబృందం ఎంత సాంఘిక చైతన్యం కల్గిస్తోందో - ప్రజల సమస్యాపరిష్కారాల కెంత సేవచేస్తోందో - మానవజీవితంలో కళ ఎలా కలిసిపోతోందో - జీవితానికి కళానుభవం అనివార్యం అన్న భావం ఎంత పెంపొందుతోందో - ఇదంతా మీకు తెలుసు. ఇలాంటి ప్రత్యేకతకోసం మోహిని జీవితసుఖాల్ని త్యాగం చెయ్యటంలో అర్థంలేకపోలేదని మీరు ఆమోదించలేరా ?"

సుధాకర్ ఆవేశంగా అన్నాడు.

"మోహినికి ఆశలున్నట్టే నాకూ కొన్ని ఆశలున్నాయి. నా భార్యద్వారా అన్ని ఆనందాలూ నేను అనుభవిస్తూ స్వర్గ సుఖాల్ని తలపింపజేసే జీవితాన్ని సాగించాలని నేనూ ఎన్నెన్నో కలలుకన్నాను. కానీ అవన్నీ కల్లలుచేసుకోక తప్పలేదు. మోహినిని నేను ఆమోదించినా - లేకపోయినా

జరిగేది జరుగుతూనేవుంది. నా విషాదం నాకు మిగిలింది"

"సుధాకర్! భావుకత కవికి జీవంకావచ్చు. కానీ జీవితానికి పూర్తిగా భావుకత పనికిరాదు. పరిస్థితుల్ని మీరు అర్థం చేసుకోవటానికి యిష్టపడాలి మొదట. భార్యాభర్తల అభిరుచులు వేరుపడ్డప్పుడు వాటికి సమన్వయం సాధించటానికి ప్రయత్నించాలి. అలాంటిసందర్భాలలో మనదిస్వార్థంఅయితే దాన్ని నాశనంచేసుకుని హృదయాన్ని విశాలం చేసుకోవాల్సివస్తుంది. కాలంతోపాటు సాంప్రదాయాల్ని మార్చుకు తీరాల్సివస్తుంది. మీ కుటుంబాలలో ఒక స్త్రీ రంగస్థలంఎక్కి నాట్యంచేయటం కూడని విషయంకావచ్చు. "ఇది అవును. ఇది కాదు" అనటానికి దేనికీ ఎక్కడా రికార్డులేదు. సాక్ష్యంలేదు. కాలప్రవాహంలో ఎన్నో పద్ధతులు మారుతూవుంటాయి. ఎన్నో విశేషాలు జరుగుతూవుంటాయి. మనిషి అన్నివిధాలా ఎంతో పరివర్తన చెందుతూవుంటాడు. మానవ మస్తిష్కానికి అతీతం కానంతవరకూ ప్రతీదీ మనం ఆలోచించి అర్థంచేసుకోవటానికే ప్రయత్నించాలి — ఒక్కటి చెప్పండి సుధాకర్! మోహినీదేవి కీర్తిలో మీకేమైనా కళంకం కన్పించిందా ?"

సుధాకర్ మాట్లాడలేదు.

''సుధాకర్! మీకు తెలియదని ఇదంతా నేను బోధించటంలేదు. కష్టసాగరంలో ఈదే వాడికన్నా - ఒడ్డునకూర్చుని చూసేవాడికి పరిస్థితులు తేటతెల్లంగా కన్పిస్తాయి. కొంచెం మీ మనోవేదన వెనక్కి పెట్టి ఆలోచించటానికి ప్రయత్నించండి. విద్యలూ - కళలూ - ప్రకృతే ప్రసాదించింది. కంఠంలోపాట — కన్నులలోభావం - చేతులలో అర్థం - పాదాలలో తాళం —

అన్నీ ప్రకృతే సృష్టించింది — కళ రసానందం కల్గిస్తుంది. బ్రతుకుపట్ల ప్రీతి చెదరకుండా వుంచుతుంది. జీవితానికి అవసర పడే నీతిని పోషిస్తుంది - కళోపాసనకి - మానవశరీరాన్ని మన స్సునీ ప్రకృతే అనుకూలంగా తీర్చిదిద్దింది. ప్రకృతిప్రసాదించిన అలాంటి కళల్ని అభివృద్ధిచేసుకుని - వాటి ఆనందాన్ని — ప్రయోజనాన్ని - కళాకారుడు అనుభవిస్తూ - మిగిలినవారికి కూడా అనుభవించ చేయటం - ప్రకృతి విరుద్ధంకాదు. కళా రాధనలో అసహజత్వమేమీ లేదు.

వివాహానికి ముందే మోహినిని నర్తకిగా మీరు అభి మానించారు. అప్పుడు ఆమెకళాభిమానం చూపిన పవిత్రతని యిప్పుడెందుకు చూడలేకపోతున్నారు. వివాహమేనా దీనికి అడ్డు! మనస్సులను యింత సంకుచితంచేసే వివాహానికి మీరు ఎలా ప్రాముఖ్యత యివ్వగలుగుతున్నారు? మన సౌలభ్యం కోసం - మనశాంతికోసం ఒక సమాజవ్యవస్థని సృష్టించుకున్నాం మనం - కానీ ఆ సమాజం జడ పదార్థం కాదు. సజీవమైన మానవ మూర్తులతో నిండినది. తరాలు మారుతోన్నకొద్దీ - మనిషిలో శారీరకంగా మానసికంగా పరివర్తన కల్గుతోన్న కొద్దీ — పరిస్థితులకు అనుగుణంగా సమాజాన్ని మనం మార్చుకోవాలి.

వివాహం అయినంతమాత్రాన అది ఎలాంటి ప్రయ త్నమూ లేకుండా సుఖశాంతులు ప్రవహించదు. వివాహానికి ప్రాధాన్యతయిచ్చి - దాన్నుంచే సుఖజీవితం పొందాలీ అంటే - ఆ వివాహంలో భాగస్వామిని అయిన మీ అర్ధాంగి అభిరుచులు మీరు గుర్తించితీరాలి. అవి ప్రకృతి విరుద్ధమూ - నీతి బాహ్యమూ

కానంతవరకూ వాటికి మీరుపూర్తి సహకారం యివ్వాలి. ఇది ఎందుకో - ఎవరికోసమో చేస్తున్న త్యాగంకాదు. మీకోసం - మీ జీవిత సుఖంకోసం - మీ వివాహ స్థిరత్వంకోసం - ఆచరించ వలసిన ధర్మం. మీ బాధ్యతలు మీరు విస్మరించి — కేవలం వివాహకార్యాన్ని ఆధారంగా పెట్టుకుని స్వర్గాన్ని తలపింప జేసే జీవితం అనుభవించాలని కలలుకనటం న్యాయమేనా ?"

"..............."

"సుధాకర్! ఒక్కటి ఆలోచించండి. మీరు మోహినిని ఏనాడో యిక్కడ బంధించివుంటే ఆమెలో పెంపొందిన ఈ కళాప్రతిభ - శాఖోపశాఖలై పెరిగిన ఈ కళావృక్షం-ఇదంతా ఏమయ్యేది ? ఎలా జరిగేది ? మీ భార్య ఒక అనామకురాలై పోవటం మీరు సహించగలరా ? కవితాహృదయులు మీరు! కళలవిలువ మీకు తెలుసు. ఒక కళాహృదయమే మరోకళా హృదయాన్ని గుర్తించగలదని మోహిని గాఢంగా నమ్మింది. దాన్ని అబద్ధంచేసి జీవితాన్ని అశాంతిమయం చేసుకోకండి. ఈనాడు మోహినికూడా కళాజీవితంతోపాటు - సహజ జీవితాన్ని అర్థంచేసుకోగలిగింది పరిపూర్ణ జీవితాన్నిగడపాలని కాంక్షిస్తోంది. మోహినీదేవి వివాహంతోనే మీజీవిత సహచరి అయింది. ఆమె ఎప్పుడూ మీ అర్ధాంగే. ఆమె హృదయంలో ఎప్పుడూ ఎవ్వరికీ స్థానంవుండదు - మోహినిని భార్యగానే గాక ఒక కళాకారిణిగా కూడా మీరు గుర్తించగలిగితే - మీ జీవితం నిజంగా స్వర్గతుల్యం అవుతుంది. జీవితం దైవప్రసాదితం. దాన్ని అనుభవించటమే మనధర్మం.

మోహిని కళాజీవితాన్ని కోరుతోంది. ఆమె కది

యివ్వండి. ఆమెనుంచి వైవాహికజీవితాన్ని తీసుకోండి. సమన్వయం చేసుకున్న జీవితం పరిపూర్ణం అవుతుంది." గోపాల్ మాటలు ఆపి సుధాకర్ కేసి ఆశాపూరితంగా చూశాడు.

సుధాకర్ స్థాణువులా కూర్చున్నాడు.

అసలు తను మాట్లాడిందంతా అతను విన్నాడో లేదో అనుమానంవచ్చింది గోపాల్‌కి.

సుధాకర్ ఎటోచూస్తున్నాడు. ఆ చూపులనిండా మోహినిరూపం నిండవుంది. ఉత్త మోహినికాదు. అతని మానసంఏలే మోహిని! మధుర సుధారసవాహిని! ఆ మోహిని అతని అణువణువులోనూ నాట్యం చేస్తోవుంది. అతని స్మృతినిండా చిక్కగా పేరుకునివుంది. అతనిగుండెల్లో బలంగా శిక్ష వేసుకునివుంది. వీణవాయిస్తూ - నాట్యంచేస్తూ - పాటలు పాడుతూ - సరాగాలాడుతూ - నవ్వుతూ - తృళ్ళుతూ - తన్మయత్వం చెందుతూ ... మోహిని! మోహిని! — మోహినిస్మృతి పచ్చిపచ్చిగావుంది. మధురమధురంగా వుంది. మోహిని వెళ్ళిపోయాక జీవితం స్థంభించింది. కవితారసం ఇంకిపోయింది. బ్రతుకు మోడయింది, శాంతిసుఖాలు దూరమయ్యాయి. మోహినిలేనిజీవితం జీవితమే కాదనిపించింది. మోహినికోసం ఎలాంటి సాంప్రదాయాలనైనా ధిక్కరించాలనిపించింది - మూర్ఖపుమనసు ఓడిపోవటానికి ఒకంతట ఒప్పుకోదు. ఈ మూర్ఖత్వాన్ని విస్మరించి ఆలోచించటం చేతనైతే ఎంత బావుంటుంది! పూర్ణానురాగాలకు అంకితమైపోయే మోహినిని స్వార్థంతో బంధించాలనుకోవటం.... ఎంతనైచ్యం? కానీ యింతకాలానికి .... ఈ ఎడబాటు విస్మరించి —

ఆ మోహినిని తిరిగి ఆహ్వానించగలడా ? - ఎలా సాధ్యం ? — సుధాకర్ దీర్ఘంగా నిట్టూర్చాడు - "గోపాల్ ! నా జీవిత సుఖంకోసం మీరెంతో అభిమానంతో చెప్పారు. మీరు చెప్పిన దంతా నేను ఆమోదించగలను. మీ మాటలబలంతో నా భావాలన్నీ మంత్రించినట్టే అయ్యాయి. అయినా నా బల హీనత నన్ను వదలటంలేదు. మోహినికి నేను సరైనన్యాయం చేకూర్చలేను ! ఆమె నొక కళాకారిణిగానే వుండనివ్వండి. అందరితోపాటూ నేనూ ఆరాధిస్తాను."

గోపాల్ నిర్లిప్తంగా లేచి నిలబడ్డాడు.

"సరే ! ఇంతసేపూ మిమ్మల్ని విసిగించాను. కానీ ఒక్కమాట. ఆరాధనా - అనురాగం కలిసివుండటానికి వీల్లేని భావాలుమాత్రం కావు."

సుధాకర్ నిస్తేజంగా చూస్తూ వూరుకున్నాడు.

*          *          *

వీణకు తెగిన తీగలు తీసి కొత్తవి వేస్తూ - ఆలోచిస్తూ కూర్చుంది మోహిని. గోపాల్ వుత్తరం చాలా కలవరం కలిగిస్తోంది మనస్సుని ఆశీస్సులతో ప్రారంభించి - నాలుగైదు పేజీలనిండా మందలింపులు రాసి - చిట్టచివర చిత్రమైన వాక్యాలు రాశాడు.

— "విత్తనం భూమిలో వేసిన మరుక్షణంలోనే మొక్కరాదు. బలమైన విత్తనం కొన్నాళ్ళకి తప్పకుండా మొలుస్తుందన్న నమ్మకం నాకుంది. మోహినీ ! నా ప్రాణాధిక మైన నెచ్చెలిని - పద్మినీని నాకు దూరంచేసిన నువ్వంటే నాకు

అంతులేని ద్వేషం. ఆ గతం నాకు ఎప్పుడూ మనసుపురాదు. నీ మీద ప్రతీకారం తీర్చుకోవాలనే ఇన్ని సంవత్సరాలుగా ఎదురు చూశాను నేను. నా ప్రతీకారాన్ని నువ్వు కూడా ఎప్పుడూ మర్చిపోలేవు. నాకు తెలుసు, నేను పేదవాణ్ణి, కానీ దుర్మార్గుణ్ణి కాను. గోపాల్."

ఒక్క గంట క్రిందటే వచ్చింది ఆ ఉత్తరం. ఎన్ని సార్లు చదివినా విషయం అంతుపట్టలేదు. గోపాల్‌కి ఇంకా కోపమేనా తనంటే? ప్రతీకారం కూడా చెయ్యాలనుకుంటున్నాడా?

ఒకందుకు చాలా ఆనందం కల్గుతోంది. అక్కయ్య చచ్చిపోలేదు. గోపాల్ అనురాగంలో సజీవిగావుంది గోపాల్ వున్నంతకాలం పద్మిని వుంటుంది. మరణించలేదు - గోపాల్ అంతరంగంలో పద్మిని చిరంజీవి!

"అమ్మా! అమ్మా!" హడావుడిగా ఆయాసపడుతూ వచ్చాడు నాగరాజు - "బాబుగారొచ్చారమ్మా! తాతయ్యగారితో మాట్లాడుతున్నారు."

"ఎవరు? గోపాలా?"

"కాదమ్మా! బాబుగారు! మన బాబుగారు."

"మన బాబుగారెవరు? సరిగా చెప్పూ! చంపక." విసుక్కుంది మోహిని.

నాగరాజు మొహమంతా నవ్వు ప్రదర్శిస్తూ — "జమిందారు బాబుగారమ్మా! అల్లుడు బాబుగారు."

బొమ్మలా నిలబడి పోయింది మోహిని. మరుక్షణంలోనే ఆనందం - దుఃఖం ముప్పిరి గొన్నాయి. "నిజంగానా?... సుధాకర్ బాబుగారా? నిజంగా ... వచ్చారా? చెప్పు

నాగరాజూ!"

"నిజంగానే చిన్నమ్మాయ్! ఆ బాబు అలా కార్లోంచి దిగగానే నేనిలా పరిగెత్తుకొచ్చా."

"మరి చెప్పవేం!" మోహిని మెట్లదగ్గిరికి పరిగెత్తింది. అంతలోనే సిగ్గుపడిపోయింది. "ఊహూ! నేనిక్కడే వుంటాను నువ్వు వెళ్ళు. నువ్వు వెళ్ళు నాగరాజు! బాబుగార్ని వెంట బెట్టుకురా! జాగ్రత్తగా తీసుకురా!"

అప్పటికే మెట్లెక్కి పైకివచ్చాడు సుధాకర్. నాగరాజు తప్పుకున్నాడు.

మోహిని కంపిస్తోన్న శరీరంతో గబగబా గదిలోకి పరిగెత్తింది.

సుధాకర్ వెనకాలే గదిలోకి వెళ్ళాడు.

మోహిని ఏంచెయ్యాలో - ఎక్కడ నిలబడాలో తోచక వీణ మీదికి మొహం పెట్టుకుని కూర్చుండిపోయింది. సుధాకర్ కూడా వీణదగ్గిర తివాచీమీద కూర్చున్నాడు.

ఇద్దరిమధ్యా కొత్తతీగలతో వీణ ధగధగా మెరుస్తోంది.

మోహిని అంతరంగం అశ్రువుల రూపంలో ప్రవహించింది. సుధాకర్ అర్ధాంగి చెక్కిలిమీద కన్నీటిబొట్లు తుడిచేసి ప్రియంగా అక్కున చేర్చుకున్నాడు.

* * *

నాట్యమందిరం ప్రేక్షకులతో కిక్కిరిసివుంది.

ప్రథమ శ్రేణిలో వేదికకు ఎదురుగా ముగ్గురువ్యక్తులు ఆసీనులైవున్నారు.

రంగస్థలంమీద నృత్యంచేస్తోన్న నర్తకి మోహినీదేవి

మాటిమాటికీ ఆముగ్గుర్నీ చూసి చిరునవ్వులు చిందిస్తోంది.

మోహినీదేవి వివిధమైన అలంకారాలతో - పట్టుబట్టలతో - కలకలలాడే వదనంతో — అపూర్వంగా మెరిసిపోతోంది. ఆమె మందహాసాలలో జీవకళ వుట్టిపడుతోంది. కన్నులు కాంతిగోళాలై ప్రకాశిస్తున్నాయి. ఆనందోత్సాహాలతో శరీరమంతా తేలికై - గాలిలో ఎగిరి పోతుంది. వర్షాగమనానికి పురివిప్పిన నెమలిలా ఆనందనాట్యం చేయసాగింది.

ఆనాటి ప్రదర్శనంలో—సుధాకర్ రాసిన - "ప్రకృతీ-పురుషుడూ-" అనే నృత్యరూపకాన్ని ముఖ్యమైన ఐటమ్‌గా ప్రదర్శించింది బృందం.

ప్రకృతీ పురుషులమధ్య అంతఃకలహం రేగింది.

ఫలితంగా ఇద్దరూ వేరయ్యారు.

సృష్టి ఆగిపోయింది.

చైతన్యం నశించింది.

ప్రకృతి అందాలు వ్యర్థమయ్యాయి.

భూమండలం నిర్జీవం అయింది.

సృష్టికర్త కలవరపడ్డాడు.

ప్రకృతినీ - పురుషుణ్ణీ సమావేశపరిచాడు.

పరస్పరం ప్రేమించుకోవలసిన ధర్మాలు వ్యక్తపరిచాడు. నిర్విరామంగా సాగాల్సిన సృష్టి రహస్యాన్ని వెల్లడి చేశాడు. మానవజీవితానికి అన్నికోణాలనుంచీ వుపయోగపడాల్సిన కళాసృష్టి ధ్యేయాన్ని తెలియజెప్పాడు.

స్తంభించిన సృష్టిని కొనసాగించాల్సిన భారం స్త్రీ పురు

షులమీద మోపి ఆశీర్వదించి అదృశ్యుడయ్యాడు.

ప్రకృతీ పురుషుల అపార్థాలు చెదిరిపోయాయి.

జీవితలక్ష్యాన్ని అవగాహన చేసుకున్నారు.

పరస్పరాకర్షణతో సమైక్యత పొందారు.

సృష్టి కలకళ్లాడింది – అదే కథావస్తువు.

ఆ ప్రదర్శన చాలా అపూర్వమైనది.

ప్రకృతిగా తన వ్యక్తిత్వాన్నీ – పురుషుడిపట్ల అనురాగాన్నీ – సృష్టిలో తన ధర్మ నిర్వహణనీ – సహజ మనోహరంగా పోషించింది మోహిని.

ప్రేక్షకులలో ఒకే ఒక అదృష్టవంతుడిమీద ఆమె దృష్టి కేంద్రీకృతమై వుంది. ఆ వ్యక్తికోసం ఇప్పుడు తన సర్వస్వం అర్పించగలదు.

స్త్రీ పురుషుల అలౌకికానురాగాన్ని గానంచేసిన సుధాకర్ కవితల అనంతరం మోహిని మధురమైన స్వరంతో పాడుతూ లలిత గీతాభినయం చేసింది,

"రాధా సమేతా కృష్ణా !
సమేతా కృష్ణా !
నందకిశోరా ! నవనీతచోరా !
బృందావన—గోవింద మురారే॥
రాధా సమేతా కృష్ణా !
సమేతా కృష్ణా !
గోపీ మనోహరా ! గోకులవాసా !
కోపిత మురళీగాన విలాసా !
సుందర మన్మథకోటిప్రకాశా॥

రాధా సమేతా కృష్ణా !

సమేతా కృష్ణా !

సమేతా కృష్ణా !

రాధా సమేతుడైన శ్రీకృష్ణుడు - ఆదర్శపూరితమైన అనురాగాన్ని అనుభవించే కృష్ణుడు-ప్రకృతి పురుషుల ఐక్యతను ఆశీర్వదిస్తోన్నట్టుగా అందరికీ అనుభూతి కల్గింది.

మృదువైన మందహాసంతో నర్తకి కన్నుల్లోకి చూశాడు ఆమె ప్రియమైన ప్రేక్షకుడు - సుధాకర్ !

నర్తకి ఉత్సాహంతో తిల్లానా ఆడసాగింది, అర్ధాంగి కదలికలతో సరిసమానంగా సుధాకర్ మనస్సు ఆనందనాట్యం చేయసాగింది. అతనికి ప్రపంచం చాలా విశాలమైనదిగా - జీవితం చాలా అమూల్యమైనదిగా గోచరించింది. నర్తకి కను సన్నలలో అతను బంధీ అయిపోయాడు.

"నాజీవితం ధన్యమైంది తల్లీ!" అంటూ బలరామయ్య ఆనందభాష్పాలు ఒత్తుకున్నాడు. సంగీత వాయిద్యాల సుఖానికి ప్రేక్షకులు తన్మయత్వంలో మునిగారు.

తెర జారిపడుతోంటే మృదంగం ముచ్చటగా తీర్మానం పల్కింది.

తదిగిణతోం !

తదిగిణతోం !

తదిగిణతోం !

కళ జీవితానికి !

కళ జీవితానికి !

కళ జీవితానికి !

